# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి : 34 సంచిక : 4 జూలై - ఆగస్టు 2011

వెల : రు 20 (287) పేజీలు : 100



## జీతన్, అతని సహచరులు నిర్దోషులు, వారికి విధించిన ఉరిశిక్షలు రద్దు చేసి వారిని వెంటనే విడుదల చేయాలి

# ఉరిశిక్షలు రద్దయ్యే దాకా ఉద్యమిద్దాం!

## మేరే పాపా నిర్దోష్ హై, మేరే పాపాకో రిహా కరో!







287 సంపుటి : 34 ◆ సంచిక : 4 ◆ జూలై-ఆగస్టు, 2011


సంపాదకుడు

**చలసాని ప్రసాద్**

❖ ❖ ❖

వర్కింగ్ ఎడిటర్

**డి.వి. రామకృష్ణారావు**

ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ - 500040

* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా రచనలు పై చిరునామాకూ,

* ఇ-మెయిల్ ద్వారా

arunatara1977@gmail.com

కూ రచనలు పంపవచ్చు

❖ ❖ ❖

కొరియర్, రిజిస్టర్డ్ పోస్ట్ ల ద్వారా రచనలు పంపితే...

**టి. కృష్ణాబాయి**

9-19-3, సి.బి.ఎం. కాంపౌండ్

విశాఖపట్నం - 530 003

❖ ❖ ❖

**చందాలు పంపాల్సిన చిరునామ**

**మేనేజర్**

**ఎస్. రవికుమార్**

5-1307, దొరసానిపల్లె రోడ్, ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360

సెల్ : 9866021257

❖ ❖ ❖

**విరసం కార్యదర్శి చిరునామా**

**పాణి**

50-348, L 19 B II, అరోరా నగర్, బి క్యాంప్, కర్నూల్ - 2


ఈ సంచిక వెల : రు. 20

## సంపాదక లేఖ...

'అనేకులింకా, అభాగ్యులంతా, అనాథులంతా, అశాంతులంతా, దీర్ఘశుతిలో, తీవ్ర ధ్వనితో, విప్లవ శంఖం వినిపిస్తారోయ్!' - అన్న శ్రీశ్రీ మాటలు ఇప్పుడు రాష్ట్రంలో, దేశంలో, మొత్తంగా ప్రపంచ వ్యాప్తంగా చోటుచేసుకుంటున్న పరిణామాలను చూస్తే అక్షర సత్యాలుగా అర్థమవుతాయి. అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ మొత్తంగా యూరప్ దేశాలలో ఆర్థిక సంక్షోభాలు, ట్యూనీషియా, ఈజిప్టులతో మొదలై మొత్తంగా అరబ్ పరిణామాలు, ఆక్యుపై వాల్‌స్ట్రీట్ పరిణామాలు సామాజిక అశాంతికి, సామ్రాజ్యవాద సంక్షోభానికి చిహ్నాలుగా ఉన్నాయి. కాశ్మీర్, నొయిడా, జైతాపూర్, జగత్సింగ్ పూర్, నారాయణపట్నం, నందిగ్రాం, సోంపేట, దండకారణ్య పరిణామాలు పాలకుల విధానాలకు వ్యతిరేకంగా దేశంలోని ప్రజల నుంచి వ్యక్తమవుతున్న ఆకాంక్షలలో భాగమే. రాష్ట్రంలో మళ్ళీ లేచి నిలబడి, కలబడి రెండేళ్ళుగా వ్యక్తమవుతున్న నాల్గు దశాబ్దాల తెలంగాణ ఆకాంక్ష బద్ధలై సకల జనుల సమ్మెగా నడుస్తోంది. పోలీసులతో, సైన్యాలతో రాజ్యం ఆ ఆకాంక్షను అణచివేయాలనుకుంటున్నదే తప్ప రాజకీయ పరిష్కారం చూపించడం లేదు. 'ఆక్యుపై వాల్‌స్ట్రీట్' నిరసన ప్రదర్శనలు న్యూయార్క్‌లో మొదలై అమెరికా, యూరప్‌లంతటా కార్పోరేట్ శక్తులను తమ ప్రశ్నలతో ముచ్చెమటలు పట్టిస్తున్నాయి. మన దేశంలోనూ పాలకులు లక్షల కోట్ల రూపాయల అవినీతిలో కూరుకపోయారు. యు.పి.ఎ. ప్రభుత్వంలోని మంత్రిగా ఉండిన రాజా ఇప్పుడు జైల్లోంచి 2జి స్పెక్ట్రం నేరం తనొక్కడిదే కాదని దేశ ప్రధానికీ, హోంశాఖ మంత్రికీ కూడా బాధ్యత ఉందని గగ్గోలు పెడుతున్నాడు. పాలకుల చర్మం మొద్దుబారి పోయింది. ఇక్కడ ఏ చిన్న మార్పు కూడ పిన్ను సూదులతోనూ, గుండు సూదులతోనూ ఇంకెంత మాత్రం సాధ్యం కాదు. గునపాలు, బల్లాలతో తవ్వి పోయాల్సిందే. పద్మనాభ ఆలయ ఆరో తలుపును తెరచి 'దేవుడి' సంపదనూ ప్రజలపరం చేయాల్సిందే. ప్రజలను అభద్రతకు గురి చేసి, అజ్ఞానంలో ఉంచి, విశ్వాసాలలో బంధించి, వారి అత్యవసర స్థితిమీద, భయాలమీద, బలహీనతలమీద, వెనుకబాటుమీద పాలకులు స్వారీ చేస్తున్నారు. ప్రజలను సృజనాత్మక ఉత్పత్తి శక్తులుగా కాకుండా తమకు ఓటు బ్యాంకులుగానూ, తాము ఇచ్చే పథకాలకు లబ్ధిదారులుగానూ చూస్తున్నారు. మానవ జాతి నడిచి వచ్చిన సమష్టి క్రమాన్ని, సామూహిక చైతన్యాన్ని విభజించి ముక్కలు చేసి రాజ్యం పబ్బం గడుపుకోవాలని చూస్తోంది. ఆదిమ కమ్యూనిజం నుంచి కమ్యూనిజం వైపుకి మనిషి ప్రయాణించగలడనే సత్యానికి మసి పూయాలని రాజ్యం విఫలయత్నం చేస్తూనే ఉంది. రాజకీయ ప్రత్యర్థులను, పోరాడుతున్న అట్టడుగు వర్గాల ప్రజలను, ముస్లిం, మైనార్టీలను భౌతికంగా నిర్మూలించడమో, ఉరిశిక్షలు విధించడమో చేస్తోంది.

ఒక పక్క రాజరికాలు, జమీందారీలు పోయాయనీ, ఉన్నదంతా ప్రజాస్వామ్యమేనని అంటూ మరో పక్క అన్యాయాన్ని ప్రశ్నించే వారిపై 'రాజద్రోహ' నేర చట్టాలు అమలుచేస్తున్నారు మన పాలకులు. మనమంతా ఇప్పుడు ఈ రాజద్రోహ నేర చట్టాలకూ, మొత్తంగా ఉరిశిక్షలకూ వ్యతిరేకంగా ఉద్యమించాల్సిన అవసరం రోజు రోజుకూ పెరిగిపోతోంది. ఇప్పటికే 137దేశాలు ఉరిశిక్షలను రద్దు చేసాయి. 34దేశాలు మరణ శిక్షలు అమలు చేయవద్దని నిర్ణయించుకున్నాయి. మన దేశం మాత్రం వలస కాలపు చట్టాలనూ అన్ని దుర్మార్గమైన విధానాలను పదను పెట్టి మరీ ఈ దేశ ప్రజలపై, మరీ ముఖ్యంగా పోరాడే ప్రజలపై, రాజకీయ ప్రత్యర్థులపై ప్రయోగిస్తోంది.

ప్రజలు తమకు తామే ఒక వర్గం అయినప్పటికీ, తమకోసం తాము ఒక వర్గంగా' పరిణతి చెందుతున్న క్రమం రోజురోజుకు బలపడుతోంది. చెరసాలలు, ఉరికొయ్యలు మాకడ్డంకి కాదంటూ జీతన్ మరాండీలు 'వహ్ సుభా కభీతో ఆయేగి' పాటను ఈ గాలిలో పరివ్యాప్తం చేస్తూనే ఉన్నారు. గ్రీన్ హంట్ ఆపరేషన్‌లను, మనుషులను చంపడానికి ఉద్దేశించిన మానవ రహిత విమానాలను ఎదుర్కొంటూ మనకు ఆశ్వాసనను ఇస్తున్నారు. కొత్తదారులు వేస్తున్నారు. బుద్ధిజీవులుగా మనం చేయగలిగేదే ఏముంది? వారితో గొంతు కలపడం తప్ప...



# ఈ సంచికలో...



*గమనిక :* అనివార్య కారణాల వలన గుమ్మెటమోత నవల సీరియల్‌ను ఈ సంచికలో అందించలేకపోతున్నాం.

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.
విడి సంచిక వెల : రు. 10; సంవత్సర చందా : రు. 100; జీవితచందా : రు. 1000

**కవర్‌పేజీ :** జీతన్ మరాండీ సహచరి అపర్ణ మరాండీ, వాళ్ళబాబుల ఫోటోలు; **రెండవ కవర్ పేజీ:** జీతన్ మరాండీ కళాబృందం ఉరిశిక్ష రద్దు కమిటీ ఆధ్వర్యంలో జరిగిన బహిరంగ సభ దృశ్యాలు; **నాల్గవ కవర్ పేజీ :** 30 సంవత్సరాల దండకారణ్య ఉద్యమ సదస్సు దృశ్యాలు
**ఫోటోలు :** రాంకి

సంపాదకీయం

# అవినీతి సరే... దోపిడీ మాటేమిటి?

- పాణి

అన్నాహజారే అవినీతి వ్యతిరేక ఉద్యమానికి దేశ వ్యాప్తంగా విస్తృత ప్రచారం లభించింది. మరో స్వాతంత్ర్య పోరాటమనే గుర్తింపు లభించింది. అన్నాహజారేను అపర గాంధీగా కీర్తిస్తున్నారు. ఆయన పన్నెండు రోజుల నిరసన దీక్షా కాలంలో దేశంలో అదే ఏకైక అంశంగా మీడియా, పత్రికలు ప్రచారం చేశాయి. చాలా ఉన్నత స్థాయి అధికారులు, పెద్ద మనుషులు ఆ ఉద్యమం చుట్టూ తిరిగారు. పార్లమెంట్ ఉభయ సభల్లో దాని గురించే తీవ్రస్థాయి వాద వివాదాలు నడిచాయి. చివరికి ఏదో ఒక పద్ధతిలో ప్రభుత్వం హామీ ఇవ్వడంతో అన్నా దీక్ష విరమించారు. ఈ విజయోత్సాహంలో అహింసా పోరాట రూపానికి ఉన్న శక్తి గురించి పెద్ద పెద్ద విశ్లేషణలు జరుగుతున్నాయి. దీన్ని ఆగస్టు విప్లవంగా కూడా ప్రశంసిస్తున్నారు. ఇతర రూపాల్లో జరుగుతున్న ప్రజాపోరాటలు అన్నా నుంచి నేర్చుకోవాలని బోధించేవారు కూడా తయారయ్యారు.

అన్నాహజారే దేశ ప్రజల ముందు ఇంత హటాత్తుగా ఎలా సాక్షాత్కరించారు? అవినీతి ఈనాటిదేమీ కాకపోయినా అన్నాహజారే ఈరోజే ఎందుకు ముందుకు వచ్చారు? ఆయన పోరాటం ద్వారా గాంధేయవాదం తిరిగి ఎలా ఊపిరిపోసుకుంది? ఇంతకూ ఈ అవినీతి వ్యతిరేకపోరాటం స్వభావం ఏమిటి? అనే ప్రశ్నలు చాలా కీలకమైనవి.

అధికార మార్పిడి జరిగిన తొలినాళ్లలోనే, స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తి ఎంతో కొంత మిగిలి ఉన్న కాలంలోనే దేశంలో కుంభకోణాలు మొదలయ్యాయి. రాజకీయ అధికారాన్ని అడ్డం పెట్టుకొని అవినీతికి పాల్పడడం మన దేశంలో మొదటి నుంచీ ఉన్నదే. గాంధీల ప్రభావం రాజకీయాల్లో, సమాజంలో బలంగా ఉండేదని చెప్పుకొనే రోజుల్లోనే అవినీతి మొదలైంది. ఇప్పుడది భయంకరంగా వ్యాపించింది. రెండు దశాబ్దాలుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో అవినీతి ఆరోపణలు ఎదుర్కోని మంత్రి మండలి లేదు. ప్రజా ప్రతినిధులుగా ఎంపికై అధికారాన్ని వెలగబెట్టి, పదవి నుంచి వైదొలిగిన మరునాడే అవినీతి ఆరోపణలు ఎదుర్కొని కోర్టుల చుట్టూ తిరిగినవాళ్లున్నారు. అధికారంలో ఉన్నప్పుడే తీవ్ర ఆరోపణలు వచ్చినా అధికారాన్ని అడ్డంపెట్టుకొని నెట్టుకొచ్చి, ఆ మరునాడే జెయిలుపాలైనవాళ్లూ ఉన్నారు. ఏకంగా కేంద్ర మంత్రిమండలిలో ఉంటూనే అరెస్టయినవాళ్లూ ఉన్నారు.

అంటే మన రాజకీయ వ్యవస్థలో అవినీతి అతి మామూలు విషయమన్నమాట. అయితే అవినీతి అనగానే... ప్రభుత్వ కార్యాలయాల ద్వారం దగ్గర పది పరక కోసం చేతులు సాచే బంట్రోతులను కూడా ఈ అవినీతి పరంపరలో చేర్చేవాళ్లున్నారు. అవినీతి ప్రధానంగా రాజకీయాధికారాన్ని అడ్డం పెట్టుకొని లక్షల కోట్ల రూపాయల ప్రజాధనంతో తమ బొక్కసాలు నింపుకోవడమే అతి పెద్ద సమస్య. రాజకీయ వ్యవస్థతో సంబంధం లేకుండా అవినీతి మనుగడలో లేదు.

ఇప్పుడా అవినీతి పెచ్చరిల్లిపోయి, దాని మీద తీవ్రంగా గూడుకట్టుకొని ఉన్న నిరసన అనేక రూపాల్లో వ్యక్తమవుతోంది. మన రాజకీయ వ్యవస్థ తెల్లారినప్పటి నుంచి వల్లించే సూక్తులకూ, దాని సారాంశానికి మధ్య ఉన్న అనేకానేక వైరుధ్యాల్లో అవినీతి ఒకటి. ఏ దాపరికం లేకుండా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం బట్టబయలైపోయి దాని లుకలుకలన్నీ తెలిసిపోతున్న ఈ తరుణంలో అవినీతి కూడా నగ్నంగా బైటికి వచ్చేసింది. ఇది ఈ వ్యవస్థకు చాలా ప్రమాదకమైన సంకేతం. ఏ సజీవ వ్యవస్థ అయినా తన సంక్షోభాన్ని పరిష్కరించుకొనే ప్రయత్నం చేయకుండా చేతులు కట్టుకొని కూచోదు. లేకపోతే మొదటికే మోసం వస్తుంది. కాబట్టి ఈ అవినీతి చీడ పురుగు పుట్టి పెరగడానికి కారణమైన వ్యవస్థే తన జీవిత కాలాన్ని కొనసాగించుకోడానికి తనదైన పరిష్కారాన్ని వెతుక్కుంటుంది. సకల దుర్మార్గాలతో, దోపిడీ దౌర్జన్యాలతో, హింసలతో, అసమానతలతో రోగగ్రస్తమైపోయిన వ్యవస్థకు అవినీతి వ్యతిరేక ఉద్యమమనే మందుబిళ్ల వేసి బతికించే ప్రయత్నమే అన్నాహజారే ఆందోళన. ఈ తరుణంలో అన్నాహజారేలాంటి వ్యక్తి ఈ వ్యవస్థకు ఒక తక్షణ అవసరం. ప్రజాప్రాతినిధ్యం అనే ప్రక్రియ ద్వారా రాజకీయ అధికారాన్ని సంపాదించుకున్న వారి అవినీతి అంతిమంగా ఈ ప్రజాస్వామ్యం మీదే తీవ్రమైన వ్యతిరేకతను పెంచుతున్న సమయంలో అన్నాహజారేను వ్యవస్థ ముందుకు తీసుకొని వచ్చింది. పాముల పుట్టలా మారిపోయిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మీద పూర్తి అవిశ్వాసం ప్రబలకుండా దాని కాపాడడమే అన్నాహజారే ఉద్యమ లక్ష్యం.

అందుకే ఆయన అవినీతి గురించి తప్ప మరే సామాజిక సమస్యా మాట్లాడరు. అసలు అవినీతికి కారణాలేమిటని ఆయన ఏనాడైనా ఆలోచించారా? మనకు తెలియదు. ఆ వైపు నుంచి ఆయన మాట్లాడరు. మన దేశంలో గాంధీలకు, సాధుసంతులకు ఉన్న ప్రాబల్యం ఎలాంటిదంటే ఎవరైనా సింపుల్ లైఫ్ గడపడం ఒక్కటి చాలు.. అందరూ మోకరిల్లుతారు. సాధుసంతులకు అతార్కికరంగా లోబడిపోయే సంస్కృతికి అదనంగా విలువల కోణం కూడా దాపురించాక ఇక అలాంటి వాళ్లకు తిరుగుండదు. ఎవరైనా సింపుల్‌గా బతుకుతూ ఉంటే అది వాళ్ల ప్రత్యేకత, అభిరుచి.. గౌరవనీయం... అది అంత వరకే ... అనే చైతన్యం

మన సామాజిక సంస్కృతిలో పెరగనంత కాలం గాంధీలు, అపర గాంధీలు పదే పదే పుట్టుకొస్తునే ఉంటారు. వాళ్ల ప్రవచనాలకు లోకం మత్తెక్కి ప్రవర్తిస్తుంటుంది. అవినీతి అనే ఒక వాస్తవ సమస్యపట్ల ప్రతిస్పందన వచ్చినందుకు ఆనందించాలా? లేక ఈ అపర గాంధేయవాద, సాధు సంతుల సంస్కృతికి ఇంతగా స్పందన వచ్చినందుకు విచారపడాలా?

అసలు ఆ ఉద్యమానికి ఏ తరహా ప్రజలు స్పందించారు, ఎలాంటి సమీకరణలు, పూనికలు జరిగి అంత ప్రచారమైందనే ముఖ్యమైన ప్రశ్నలు వేసుకోవాల్సిందే. ఎందుకంటే అన్నాహజారే ఉద్యమంలో పాలుపంచుకున్నవాళ్లూ, సంఘీభావంగా ఆందోళన చేసినవాళ్లు ఉన్నత, ఉన్నత మధ్య తరగతి వాళ్లని టీవీల్లోని దృశ్యాలనుబట్టే అర్థం చేసుకోవచ్చు. ఆ ఉద్యమం యావత్తు కార్పొరేట్ ముఖాలు తప్ప... నల్లగా, పీక్కుపోయిన పల్లెటూరి బడుగు ముఖాలు మనకు కనిపించలేదు. వ్యవస్థ వాళ్ల ముందు కూడా ఒక ప్రబలమైన సమస్యను పెట్టినందు వల్ల ఈ ప్రతిస్పందన వచ్చిందని, మరే పోరాట శక్తి వాహిక కాలేదు కాబట్టి ఇట్లా వ్యక్తమైందని సర్దిచెప్పుకుందామన్నా ఆ ప్రశ్నలు మిగిలే ఉంటాయి. పార్లమెంట్‌లో ప్రజలకు ఏ కొంచెం మేలు చేసే చట్టాలు తయారైనా మంచిదే. వాటిని అంత వరకే చూడాలి. ఆ మేరకే ఫలితాలుంటాయని ప్రజలకు చెప్పాలి. కానీ అన్నాహజారే ఉద్యమానికి ఉన్నత, ఉన్నత మధ్య తరగతి వర్గం మితిమీరిన స్థాయి కల్పిస్తున్నాయి. అన్నా ఉద్యమం భూతల స్వర్గాన్ని నిర్మించబోతోందని ఊదరగొడుతున్నారు. నీతి- అవినీతి అంటే ఏమీ తెలియని స్కూల్ పిల్లలను రోడ్ల మీదికి తేవడమేగాక, అవినీతికి నిలువెత్తు ఉదాహరణలైన పార్లమెంటరీ నాయకులందరూ ఈ ఉద్యమంలో భాగమయ్యారు. అనేక అవినీతి ఆరోపణలు, కేసులు ఎదుర్కొంటున్న రాజకీయనాయకులు, ఉన్నతాధికారులు అందరూ ఈ ఉద్యమానికి నాయకులయ్యారు. మద్దతుదారులు అయ్యారు. ఇదేదో అన్నాహజారేతో నిమిత్తం లేని ప్రతిస్పందన కాదు. ఆయన ప్రారంభించిన ఉద్యమమే ఇలాంటిది. అందులో అవినీతిపరులందరూ నిర్భీతిగా పాల్గొనవచ్చు. వారందరూ అవినీతికి వ్యతిరేకంగా, అన్నాహజారేకు మద్దతుగా చక్కగా ఉద్యమాలు చేయవచ్చు. అవినీతిరహిత సమాజాన్ని నిర్మిద్దామని ప్రసంగించవచ్చు. ప్రపంచీకరణ తర్వాత బలిసిపోయిన కొత్త సంపన్నవర్గం సైతం దేశంలో పెరిగిపోయిన అవినీతి వల్ల అభద్రతకు గురై ఈ ఉద్యమానికి సంఘీభావం ప్రకటించింది. ఆ వర్గం అన్నాహజారే ఉద్యమంలో ఎంత హడావిడి చేసిందో అందరూ చూసే ఉంటారు. నిత్యం అవినీతి కార్యక్రమాల్లో అలసి సొలసిపోతున్న వర్గం కూడా అవినీతి గురించి ఇల్లెక్కి అరవడానికి ఈ ఉద్యమం గొప్ప అవకాశం ఇచ్చింది.

అవినీతిని నిర్మూలించాల్సిందేగాని, మరి దోపిడీ సంగతి ఏమిటి? అన్నాహజారే కాని, పౌరసమాజం పెద్దలుగాని, ఈ ఉద్యమానికి సంఘీభావం ప్రకటించిన రాజకీయ పార్టీలుగాని దోపిడీ గురించి పొరపాటున కూడా దోపిడీ గురించి మాట్లాడడం లేదు. లోక్‌పాల్ బిల్లు పరిధిలోకి ఎవరెవరిని తీసుకురావాలనే చర్చలు చూస్తే నిజంగానే ఇదేదో ఉద్ధరించే వ్యవహారమనిపిస్తుంది. కానీ మన దేశంలోని రాజకీయ ప్రక్రియను కార్పొరేట్ సంస్థలు, పెట్టుబడిదారీ కుటుంబాలు నడిపిస్తున్నాయనే సంగతి అందరికీ తెలిసిందే. అవినీతి పెచ్చరిల్లడానికి అతి ముఖ్యమైన కారణం ఈ శక్తులే. ఎన్నికల గెలుపు ఓటములు, చట్టాల తయారీ, ప్రభుత్వాలను నిలబెట్టడం కూలదోయడం అనే తతంగమంతా కార్పొరేట్ సంస్థల క్రీడగా మారిపోయాక రాజకీయాల్లో అవినీతిని ఎక్కడి నుంచి చూడాలి? ఎక్కడి నుంచి నిర్మూలించాలి? అనే కీలక ప్రశ్నలు తలెత్తుతాయి. ఈ మొత్తం కేవలం కార్పొరేట్ క్రీడ మాత్రమేనా? ప్రజా చైతన్యం ఈ ప్రక్రియల్లో వెల్లడి కావడం లేదా? ప్రశ్న కూడా ఎదురు కావచ్చు. ప్రజా చైతన్యం పార్లమెంటరీ పద్ధతులకు వెలుపలే కాదు, వాళ్లకు అవకాశం వచ్చినప్పుడు పార్లమెంటరీ పద్ధతుల్లో కూడా ఎంత వీలైతే అంత వ్యక్తం చేస్తున్నారు. కానీ పార్లమెంటరీ చట్రంలో పూర్తిగా ఈ శక్తులదే నిర్ణాయక పాత్ర. ప్రజా ప్రాతినిధ్యం, రాజ్యయంత్రాంగం మీద వర్గ ఆధిపత్యం అనే రెండు ముఖ్యమైన విషయాలను పరిగణనలోకి తీసుకోకుండా బూర్జువా వ్యవస్థను అర్థం చేసుకోవడం కుదరదు. ప్రజా ప్రాతినిధ్యం అనేది చారిత్రకంగా ప్రగతిదాయకమైందే. అయితే రాజ్యవ్యవస్థ మీద బూర్జువా వర్గ ఆధిపత్యం ఉన్నందు వల్ల ప్రజా ప్రాతినిధ్యం అనే దాని పాత్ర చాలా పరిమితమైపోయింది. కానీ ఇప్పుడు అంత మాత్రమే కాదు. ప్రజాప్రాతినిధ్యం అనే ఎన్నికల ప్రక్రియ కార్పొరేట్ శక్తుల పెరటి వ్యవహారంగా మారిపోయింది. కాబట్టి ప్రజా ప్రాతినిధ్యానికి చారిత్రకంగా ఉన్న ప్రగతిదాయక పాత్ర అంటూ ఏమీ మిగలకుండా పోయింది.

ఈ పరిస్థితుల్లో రాజకీయాలతో సంబంధం లేకుండా అవినీతి గురించి మాట్లాడడం అర్థరహితం. ఏ శక్తుల దోపిడీ దాహానికి వ్యవస్థ బొగిలిపోయిందో ఆ శక్తుల ఊసు లేకుండా అవినీతిని నిర్మూలించాలనడం, ఆ ఒక్క పని చేయగానే స్వర్గం ఊడిపడుతుందనడం వంచన అవుతుంది. ఈ అవినీతి వ్యతిరేక ఉద్యమం కార్పొరేట్ శక్తుల గురించి, పెట్టుబడిదారీ శక్తుల గురించి పల్లెత్తు మాట కూడా మాట్లాడదు. పైగా అలాంటి వారితో రాసుకొని పూసుకొని తిర్గుగుతోంది. వారి ఆధ్వర్యంలో నడుస్తోంది. వ్యవస్థ కుళ్లిపోవడానికి అవినీతి ఒక్కటే కారణం కాదు. మరే ఇతర సమస్యల గురించి మాట్లాడ కుండా, దేశీయ, విదేశీ పెట్టుబడిదారీ శక్తుల దోపిడీ గురించి, వారి ఆధ్వర్యంలో సాగుతున్న ఈ ప్రజాస్వామ్య ప్రహసనం గురించి మాట్లాడకుండా అవినీతి మీద పోరాడుతామనడం ఒట్టి బూకరింపు మాత్రమే. కాకపోతే గాంధీయిజానికి ఇంకా ప్రభావం మిగిలే ఉందని ఈ ఉద్యమ ప్రతిస్పందనలనుబట్టి అర్థమవుతోంది. అయితే గాంధీయిజం ఏ మౌలిక సమస్యను పరిష్కరించజాలదని అధికార మార్పిడి తర్వాత అర్థవంతమైన రాజకీయ సామాజిక వ్యవస్థను నిర్మించలేకపోవడం వల్ల ఎట్లా రుజువైందో, మరో స్వాతంత్ర్య సంగ్రామంగా కీర్తించబడుతున్న ఈ అవినీతి వ్యతిరేక ఉద్యమంలో కూడా అట్లాగే రుజువు అవుతుంది.



వ్యాసం

# మా తెలంగాణ మాగ్గావాలె

- టేక్మాల్ లక్ష్మన్

అపారమైన వైవిధ్యం ఉన్న ప్రాంతం, ప్రకృతి సహజ వనరులు పుష్కలం. గోదావరీ, కృష్ణానదీ ప్రవాహాలతో పులకితమయ్యే ఘనమైన చారిత్రక ప్రభావం. ఆధునిక, సాంకేతిక వైభవం కలగలసిన జీవనయానం, ఈ నేల విశిష్టతకు తార్కాణం. అనేక అనుకూలతల మధ్య అనేకానేక ఆక్రమణల మధ్య తన తనాన్ని నిలబెట్టుకుంటున్న ప్రాంతం తెలంగాణ. రకరకాల సవాళ్ళని ఎదుర్కొంటూ తన అస్తిత్వాన్ని కాపాడుకునేందుకు తండ్లాడుతున్న నేల ఇది. పోరాట సాంప్రదాయం ఈ నేలలో అంతర్భాగం. ఈ క్రమంలోనే తెలంగాణ ఒక చర్చనీయాంశం. అనుకూలంగానో, ప్రతికూలంగానో ప్రతి ప్రాంతం వారు తెలంగాణ గురించి మాట్లాడుతున్న సందర్భమిది. ఇక్కడే కాదు దేశదేశాల్లో ఉండే వారు సైతం తెలంగాణ గురించి మాట్లాడుతున్నారు. వెబ్‌సైట్లు నిర్వహిస్తున్నారు. తెలంగాణకు సంబంధించిన సకల అంశాలని చర్చిస్తున్నారు. ఈ చైతన్యమంతా తెలంగాణ విలక్షణతకు సంకేతం. ఇక్కడి సామాజిక, సాంస్కృతిక, జీవితంలోని వైవిధ్యానికి చిహ్నం. భౌగోళికంగా, చారిత్రకంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, సాహిత్యపరంగా ఒక ప్రత్యేకతని కలిగి ఉన్న ప్రాంతం తెలంగాణ. ఈ ప్రత్యేకతల్నీ విలక్షణతల్నీ వైశిష్ట్యాన్నీ వివరించే కథనమిది.

గాలి, నీరు, వనరులు అన్నీ ఉన్నా బీడువారిన భూములు సరి అయిన పంటలు పండక, పనిచేద్దామంటే కూలి దొరకక, పూట గడవడం కష్టమైపోయింది. ఉన్న భూమిని అమ్మినా పైసలు సరిపోక అప్పుచేసి పుట్టిన నేలను విడిచి, పొట్ట చేతబట్టుకొని కానరాని దేశాలకు పయనమైయ్యారు. అమ్మ, నాన్న, భార్య పిల్లలకు, ఆత్మగల్ల ఊరుకు దూరమై గుండెను బండరాయిగా చేసుకుని అష్టకష్టాలు పడ్డా తెచ్చిన అప్పులు తీరక, గల్ఫ్ ఏజెంట్ మోసాలకు ఎందరో వలస జీవులు తిరిగివచ్చి, తెచ్చిన అప్పులు తీర్చలేక వాళ్ళుపెట్టే బాధలను తట్టుకోలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

తెలంగాణ ప్రజల గుండే గాయమై ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి ప్రధాన కారణమైన తెలంగాణ ప్రజల ఆకాంక్షలు ప్రజాస్వామికమైనవి, న్యాయమైనవి. వెయ్యేళ్ల ప్రత్యేక అస్తిత్వాన్ని రాజకీయ ప్రతిపత్తిని అనుభవించిన నేల తెలంగాణ. పెద్ద మనుషుల ఒప్పందంతో అనేక షరతుల, ప్రజల నిరసనల మధ్య ఆంధ్ర రాష్ట్రంలో బలవంతంగా కలపబడి ఆంధ్రప్రదేశ్‌గా పిలువబడుతోంది. విలీనం జరిగిన నాటి నుంచే పెద్ద మనుషుల ఒప్పందాన్ని సీమాంధ్రులు ఉల్లంఘించడం ప్రారంభించారు. తెలంగాణ ప్రాంత భూముల అమ్మకాలు తెలంగాణ ప్రాంతీయ సంఘం అనుమతితోనే జరగాలన్న ఒప్పందాన్ని కూడా పాటించలేదు. తత్ఫలితంగా ఆంధ్ర ప్రాంతీయులు లక్షల ఎకరాల భూములను కారుచౌకగా సొంతం చేసుకున్నారు. తెలంగాణ యువతలో నిరాశా నిస్పృహలు నెలకొనడానికి వారికి కేటాయించబడిన లక్షలాది ఉద్యోగాలను దొంగ ముల్కీ సర్టిఫికెట్లతో కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతం వాళ్లు నిధులు - ఉద్యోగాలను ఆక్రమించుకోవడమే. అంతే కాకుండా తెలంగాణ భాష, యాసలను కూడా వెక్కిరిస్తూ ప్రజల ఆత్మగౌరవానికి తూట్లు పొడిచారు. అధికారాన్ని పంచుకునే పాలనా రంగంలో కూడా కోస్తాంధ్ర, రాయలసీమ పాలకులు తమ కుటిల నీతిని ప్రయోగించి తెలంగాణ వారికి తీరని అన్యాయం చేసారు. ఉదాహరణకు హోం మినిష్టర్ సబితా ఇంద్రారెడ్డి కావచ్చు కానీ లా అండ్ ఆర్డర్ పరిపాలనా పోలీస్ వ్యవస్థపై పట్టుమాత్రం సీమాంధ్ర కనుసన్నల్లో మెదులుతుంది. తెలంగాణకు ప్రతి విషయంలో తీరని అన్యాయం జరుగుతూనే ఉన్నది. తెలంగాణ అస్తిత్వాన్ని ఎత్తిపట్టే చరిత్ర వీరులను కొమురం భీం, చాకలి ఐలమ్మ, షోయబుల్లాఖాన్, దొడ్డి కొమురయ్య, బందగిలతో సహా, తెలంగాణ కోసం ఎందరో వీరులు ప్రాణ త్యాగాలు చేసినా వారి చరిత్రను, సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకురాకుండా మరుగున పడేశారు. కోస్తాంధ్ర, రాయలసీమ నాయకుల వీరోచిత గాథలు, చరిత్ర పాఠ్య పుస్తకాల నిండా ప్రచురించారు. ఈ వివక్ష ఫలితంగా నేటి యువతకు అల్లూరి సీతారామరాజు, ఆంధ్ర కేసరి, వావిలాల గురించి మాత్రమే తెలుసు కాని, తెలంగాణ చరిత్రను మాత్రం తొక్కి పెట్టినారు.

తెలంగాణ ప్రజల ఉమ్మడి కార్యాచరణ పోరాట ఫలితంగా కేంద్ర హోంమంత్రి చిదంబరం గత 9 డిసెంబర్ 2009న తెలంగాణ రాష్ట్ర ప్రక్రియను ప్రారంభిస్తున్నామని ప్రకటించారు. దీన్ని జీర్ణించుకోలేని సీమాంధ్ర నాయకులు మూకుమ్మడి రాజీనామాలు చేసి, ప్రజలను రెచ్చగొట్టి కృత్రిమ ఉద్యమాన్ని లేవదీశారు. దీంతో ప్రభుత్వం వెనక్కి తగ్గి, 2010 జనవరి 5న రాజకీయ పార్టీలతో సంప్రదింపుల పేరుతో కాలయాపన కార్యక్రమానికి పథకాన్ని రూపొందించింది. వారి ఆలోచనల కార్యరూపమే శ్రీ కృష్ణ కమిటీ.

గతంలో కూడా ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల ఫలితంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పలు జీవోలు జారీ చేశాయి, హామీలు ఇచ్చాయి. అయితే ఏవీ అమలు కాలేదు. 1969లో జీవో 36, 1973లో వచ్చి ఆరు సూత్రాల పథకం. 1975లో రాష్ట్రపతి ఉత్తర్వులు, 1985లో 610 జి.ఒ, 2001లో గిర్‌గ్లాని కమిషన్ సిఫారసులు తెలంగాణ ప్రజల ప్రయోజనాల పరిరక్షణకు ఎన్నో హామీలు ఇచ్చాయి, అయితే ప్రభుత్వాలు వాటిని చిత్తశుద్దితో అమలు పర్చలేదు. తత్ఫలితంగానే ప్రస్తుత ప్రత్యేక తెలంగాణ ఉద్యమం.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని కోస్తాంధ్ర, రాయలసీమ పెట్టుబడిదారులు వ్యాపార సరుకుగా మలుచుకోగా రాజకీయ నిరుద్యోగులు తమ రాజకీయ పునర్జన్మకు వేదికగా మలుచుకొంటున్నారు. తమ ఆధిపత్య రాజకీయాలకు వనరుగా వాడుకొంటున్నారు. నాటి నుంచి నేటి వరకు వివిధ పాలక పార్టీలు అవకాశ ఉద్యమ నేతలు చేస్తున్న ద్రోహాలను క్లుప్తంగా చూద్దాం.

చరిత్ర సాక్షిగా తెలంగాణ ప్రజలకు ద్రోహం చేసిన ప్రధాన పార్టీ కాంగ్రెస్ పార్టీయే. 1946 జూలై 3 నుంచి 1948 సెప్టెంబర్ 17 వరకు నిజాం సైన్యాలు, రజాకార్లు చేసిన హత్యలకంటే 1948 సెప్టెంబర్ 18 నుంచి 1951 అక్టోబర్ వరకు భారత సైనిక బలగాలు చేసిన హత్యలే అధికం. బలైనవారు వీర తెలంగాణ సాయుధ పోరాట యోధులు, నిజాం ప్రభుత్వానికి, వ్యతిరేకంగా పోరాడి సాధించుకున్న ప్రయోజనాలన్నింటిని భారత ప్రభుత్వ సైనిక జోక్యంతో తెలంగాణ ప్రజలు తమ అస్తిత్వాన్ని కోల్పోయారు.

తెలంగాణలో దేశ్‌ముఖ్‌ల, దొరల దోపిడీ దౌర్జన్యాలకి తెలంగాణ సాయుధ పోరాటం చరమ గీతం పలికింది. 1952లో సాయుధ పోరాట విరమణ అనంతరం కూడా ఇక్కడ పోరాట చైతన్యం నిలిచిపోలేదు. ఆంధ్రప్రదేశ్‌లో విలీనం అనంతరం తెలంగాణకు జరుగుతున్న అన్యాయాలకు వ్యతిరేకంగా గొంతు విప్పారు. వీథుల్లోకి వచ్చారు. 1969లో ఉధృతంగా సాగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నాటి విద్యార్థులది. ఉద్యోగుల విభిన్న వర్గాల ప్రజల పోరాట పటిమకు నిదర్శనం. మరోవైపున కాంగ్రెస్ పార్టీ కుటిల రాజకీయ చతురతతో ఉవ్వెత్తున నడుస్తున్న ఉద్యమాన్ని కొందరు తెలంగాణ ద్రోహులు నట్టేట ముంచారు.

ఆంధ్ర నాయకుల ఆధిపత్యంలో కొనసాగే తెలుగుదేశం పార్టీ తెలంగాణ ప్రజల పాలిట నయవంచన పార్టీయని చరిత్రలో అనేక సార్లు రుజువైంది. చంద్రబాబు పాలనలో తెలంగాణ వ్యతిరేకుల దురహంకారంతో తెలంగాణ అనే పదం సభలు, సమావేశాల్లోనూ చివరకు అసెంబ్లీలోనూ కూడా ఉచ్చరించబడలేదు. చరిత్రలో తెలంగాణ ప్రజలకు తీరని ద్రోహం చేసినవాళ్లుగా కమ్యూనిస్టు పార్టీల నాయకులు నిలిచిపోయారు. తెలంగాణ ప్రజల ఆకాంక్షలు కులపరమైనవో? మతపరమైనవో? కార్మిక వర్గాలకు భంగకరమైనవో కానపుడు ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి మద్దతును ఇవ్వకపోవడం కమ్యూనిస్టు పార్టీల నాయకుల దివాళాకోరుతనానికి నిదర్శనం.

మౌలిక సామాజిక మార్పుకోసం పనిచేస్తున్న ఉద్యమాల పట్ల సానుభూతి లేకపోవడం ఈ పార్టీలు విస్తృతి చెందకపోవడానికి ఒక కారణం. వాస్తవానికి తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలని చేస్తున్న ఉద్యమాల వెనుక ఉన్న రాజకీయార్థిక అవగాహనలో ఇది ఒక బలమైన అంశం, నాడు నేడు సాయుధ పోరాట విరమణ చేసి తెలంగాణ ప్రజలకు తీరని ద్రోహం చేసిన కమ్యూనిస్టులు నేడు ఆ తప్పులను సరిదిద్దుకోవాలంటే ఆ ప్రాంత ప్రజల ఆకాంక్షలను గౌరవించాలి. ఇక బిజెపి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన కోసం ఇంతవరకు చిత్తశుద్ధితో ఒక కార్యక్రమమూ చేపట్టలేదు. చేసింది ఏమైనా ఉంటే తెలంగాణ పేరుతో ఆందోళన చేసినప్పుడల్లా ప్రజలకు నిజాం పట్ల ఉన్న వ్యతిరేకత ముస్లిం ప్రజల పట్ల రావడానికి కృషి చేయడమే.

ఎం.ఐ.ఎం. విషయానికి వస్తే ఈ పార్టీ ఏనాడు కూడా తెలంగాణ ప్రజల ఆకాంక్షలను గౌరవించలేదు. తెలంగాణ రాష్ట్ర సమితి ఆవిర్భావం ఏ విధంగా జరిగినా దశాబ్దాల కాలం తరువాత రాష్ట్ర సాధన కోసం ప్రత్యేకంగా ఏర్పడిన పార్టీ అది. దశాబ్దాల కాలంగా కోస్తాంధ్ర, రాయలసీమ పాలకుల దోపిడీ దౌర్జన్యాలకు బలైపోయిన తెలంగాణ ప్రజలు రాష్ట్రసాధనే లక్ష్యంగా రాజీలేని పోరాటం చేస్తూనే ఉన్నారు. తమకు బాసటగా నిలిచేవారిని తమ ఆత్మబంధువుల్లాగా భావిస్తూ ప్రాణాలను ఫణంగాపెట్టి చైతన్యవంతమైన ఉద్యమాన్ని విద్యార్థులు, ఉద్యోగులు, కార్మికులు, కర్షకులు నిప్పు కణికలై ముందుకు తీసుకుపోతున్నారు.

మా నీరు, మా సంపద, మా భూమి, మా వనరులు, మా చదువులు, మా ఉద్యోగాలు, మా ప్రాంతం మాగ్గావాలె. ఆకలి అసమానతలు లేని వ్యవస్థ మాగ్గావాలె, అయితే ఎక్కడైనా అసమానతలు లేని శ్రామిక వ్యవస్థ విప్లవకరమైన ప్రజా ఉద్యమం ద్వారానే సిద్ధిస్తుంది. చైతన్యవంతమైన పోరాటాలతో ప్రజలు చైతన్యవంతమైనపుడే స్వార్థరహితమైన సమాజం నెలకొనడానికి ఆస్కారం ఉంటుంది. ఇప్పుడు జరుగుతున్న రాష్ట్ర సాధన ఉద్యమం వల్ల రాష్ట్రం సిద్ధించినా అన్ని రాష్ట్రాల్లో ఉండే అసమానతలు, అవినీతి ఇక్కడ కూడా రాజ్యమేలుతాయి. రాష్ట్ర పాలకులు హఠాత్తుగా తమ సంపదనంతా సమాజపరం జేసి శ్రామికులలో ఒకరుగా జీవించరు. అయితే ఏ సమస్యల పునాదుల మీదయితే రాష్ట్ర సాధన కోసం ప్రజలు ఉద్యమిస్తున్నారో ఆ సమస్యలు పరిష్కరించబడే అవకాశం ఉంటుంది. నీళ్ల, నిధులు, ఉద్యోగాలు, ప్రకృతి వనరులను పరిరక్షించుకునే పరిస్థితి ప్రజలకు కలుగుతుంది. ప్రజల జీవన ప్రమాణాలను పెంచే ఉద్యమాలకు మద్దతునివ్వాల్సిన బాధ్యత ప్రతి ఉద్యమ సంస్థ మీద ఉంది.



విశ్లేషణ



# పాఠకులతో మాటల మల్ల యుద్ధం చేసిన కవి అర్థంగాని కవిగా అందరికీ అర్థమైన 'మో'

- వి. చెంచయ్య

"కవిత్వం అర్థం కాకపోవడం అన్న సమస్య నిజంగా ఉందా?"

"ఉంది. నా కవిత్వమే నాకర్థం కాదు."

"ఎందుకు అర్థం కాదు?"

"నేను నాకు కాని స్థితిలో, సమాజానికి ఎవరికీ కాని స్థితిలో ఓ శూన్య గోళాన్ని ఊహించుకుంటూ అనుభవిస్తున్న స్థితిలో భాషని సంభాషణ కోసం కాక, డైలాగ్‌గా కాక, Duelogue గా ఉపయోగించుకున్నప్పుడు ఈ అక్షరాలను నేనేం చేసుకోను అనుకునేప్పుడు నేను కవిత్వం లాంటి అక్షరాల్నేవో రాస్తాను. అవి నాకూ అర్థం కావు. అంచేత క్షమించండి."

8 ఆగస్టు 1988న ఆంధ్రజ్యోతి సాహిత్య వేదిక కోసం 'మో'తో అఫ్సర్ చేసిన ఇంటర్వ్యూలో ఒక భాగం ఇది.

'మో' కవిత్వం అనగానే అర్థంగాని కవిత్వమని అందరికీ ఉన్న ఏకాభిప్రాయం. అర్థంగాని కవిగా అందరికీ అర్థమైన కవి 'మో'. అర్థంగాని కవిత్వం ఇక వేగుంట నుంచి రాదు. ఎందుకంటే ఆయన లేడు గనక.

"త్యాగానికీ సత్యానికీ, ప్రేమకీ సౌందర్యానికీ, సహాయానికీ సానుభూతికీ సాంఘిక చైతన్య స్ఫూర్తికీ నానాటికీ దూరం అవుతున్న సమకాలికతను రక్షించేదీ దగ్గర చేసేదీ కవిత్వం ఒక్కటే నేటికీ, ఏనాటికీ" అర్థంగాని కవిగా ముద్రపడ్డ వేగుంట, అర్థమయ్యేట్టుగా ఈ మాటలు కూడా అన్నాడు.

అందరూ పదాలకు అర్థాలు వెదుక్కుంటుంటే, వేగుంట అర్థాలకు పదాలు వెదుక్కుంటూ ఉంటాడు. పైగా ఆ అర్థాలు మామూలు అర్థాలు గావు, 'అలౌకిక' అర్థాలట.

సమాజంతో సంఘర్షణ పడీ పడీ అలసిపోయి, బహుశా ఇప్పుడు ప్రశాంతంగా ఉంటాడు వేగుంట. వ్యక్తులతో అతను ఘర్షణ పడకపోయినా, అతని కవిత్వం చదివిన ప్రతి వ్యక్తీ అతనితో ఘర్షణ పడకుండా ఉండలేదు. పాఠకులకు అర్థంగానిది వేగుంట కవిత్వం అయితే, అతనికర్థంగానిది అసలు కవిత్వం అర్థంగాకపోవటం ఏమిటనేది.

రచన చేసింతర్వాత ఆ రచనలో రచయిత ఉండడని వేగుంట అభిప్రాయం. రచన నుంచి రచయిత నిష్క్రమించిన తర్వాత దాన్ని పాఠకుడు ఆక్రమిస్తాడట. పాఠకుడే ఆ రచనకు అర్థం చెప్పుకుంటాడట. అంతేగాని, రచన దానంతటది ఏ అర్థాన్నీ ఇవ్వదట. పాఠకుడి స్థాయిని బట్టి ఆమేరకు ఆ రచనను అర్థం చేసుకుంటాడన్న మాట. రచన పూర్తయింతర్వాత, పాఠకుడికి ఆ రచన అర్థంగావడానికి రచయిత సహకరించే అవకాశం లేదు. రచన జరిగేటప్పుడే ఆ అవకాశం ఉంటుంది. పాఠకుడే రచనకు అర్థం చెప్పుకోవడం నిజమేగాని, సరైన అర్థం చెప్పుకోడానికి పాఠకుడికి సహకరించవలసిన బాధ్యత కూడా రచయితపై ఉంటుందనే విషయం మరువకూడదు. తనను తప్పుగా అర్థం చేసుకునే విధంగా రచన చెయ్యడం రచయిత వైఫల్యమే అవుతుంది. అందుకని రెండు రెళ్ళు నాలుగన్నట్టు కవిత్వం ఉంటుందనీ కాదు, ఉండాలనీ కాదు. వేగుంట అన్నట్టు కవిత్వంలో ధ్వని ఉంటుంది. ఆ ధ్వని అయినా పాఠకుల మనసుకు తట్టాలి. సూటిగా చెప్పడం కవిత్వం కాకపోవచ్చు, కవి చేసే సూచన పాఠకులకు అందాలి.

"ఇండియాలో సంతానం పండును
అమెరికాలో డాలర్లు పండును"

అన్న తిలక్ మాటల్లో కూడా ధ్వని ఉంది. అయితే ఆ ధ్వని పాఠకులకు అందుబాటులో ఉంటుంది. "పదాల సమాహారంలో అర్థాన్ని కాక ధ్వని (suggestion) ని వినగలగాలి" అనే వేగుంట అభిప్రాయంతో విభేదించాల్సిన అవసరం లేదు. ఆ ధ్వనిని వినిపించే కవికి ఎదురుగా పాఠకులుంటారన్న స్పృహ ఉండాలి. బహుశ వేగుంట కవిత్వానికి పాఠకులుండరు, విమర్శకులే ఉంటారు. విమర్శకులే పాఠకులుగా ఉంటారు.

వేగుంట రచనలతో పేచీ పడే ముందు, రచన పట్ల వేగుంట కున్న అభిప్రాయాలతో పేచీ పడాల్సి వస్తుంది. రచయితకీ, పాఠకుడికీ మధ్యన ముందుగా కుదుర్చుకున్న ఒప్పందం లేదు కాబట్టి, ఇద్దరి మధ్యా రాజీ ప్రసక్తి ఉండదంటాడు. శ్రోత లేకుండా వక్త లేనట్టే, పాఠకుడు లేకుండా రచయిత ఉండడు, రచనా ఉండదు. వక్తకూ శ్రోతకూ మధ్య ఉన్న సంబంధమే భాషణం. అలాగే రచయితకూ పాఠకుడికీ మధ్య ఉన్న సంబంధమే రచన. అందుకని రచన చెయ్యడమే రచయిత పాఠకుల మధ్య ప్రత్యేకంగా కుదుర్చుకోని ఒప్పందం అవుతుంది.

వేగుంట దృష్టిలో రచన రెండు రకాలు. ఒకటి పాఠక పక్షపాతి. రెండు రచయిత పక్షపాతి. పాఠక పక్షపాతి అయిన రచనలో పాఠకుడు ఆలోచించవలసిందేమీ ఉండదనీ, రచయిత పక్షపాతి అయిన రచనలో పాఠకుడి ఆలోచనా శక్తికి ఎక్కువ శ్రమ కలిగించే విషయం ఉంటుందనీ ఆయన అభిప్రాయం. పాఠకుల ఆలోచనాశక్తిని పెంచే విధంగా రచన ఉండడం ఎప్పుడూ సమర్థనీయమే. రచయిత చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా గాక పరోక్షంగా సూచించడం, పాఠకుల ఊహకు కొంత వదలడం అవసరం. అప్పుడే ఆ రచన ఉత్తమ రచన అవుతుంది. అయితే

ఆలోచనాశక్తిని ఉపయోగించవలసింది రచనా నిర్మాణంలోని సంక్లిష్టతను అర్థం చేసుకోడానికి కాదు, రచయిత సూచించిన భావాన్ని మరింత సమగ్రంగా తన అనుభవంలోనికి తెచ్చుకోడానికి. పాఠకుడు ఆసక్తితో, ఆలోచనతో, తన ఊహాశక్తిని జోడించి రచనను అర్థం చేసుకొని, అనుభవించి, స్ఫూర్తిని పొందే అవకాశం రచయిత కూడా కల్పించాలి. తాంబూలాలిచ్చాను, తన్నుకు చావండన్నట్టు రచయిత ఉండడం బాధ్యతారాహిత్యమే అవుతుంది. తన రచనకు పాఠకులెవరు అన్న విషయంలో కొన్ని భేదాభిప్రాయాలుంటే ఉండవచ్చుగాని, అసలు పాఠకులే అక్కరలేదనుకుంటే రచన అవసరమే లేదు. రచయిత తన మనసులోనే రచన చేసుకొని ఆనందించవచ్చు. లేదా కలంతో కాగితం మీద పెట్టదల్చుకుంటే డైరీలాగా రాసుకొని సంతృప్తిపడవచ్చు. (ఆ డైరీ కూడా ఎప్పుడో ఒకప్పుడు పాఠకుల ముందుకు వస్తుంది.) ఒక పండితుడు రామాయణ కల్ప వృక్షంపైన ఒక వ్యాసం రాసుకొని పోతే, విశ్వనాథ సత్యనారాయణ అన్నాడట నా కావ్యం నీకొక్కడికే అర్థం అయిందని. పాఠకుల పట్ల రచయిత దృష్టి ఇలా ఉండకూడదు. "The only demand I make of my reader is that he should devote his whole life to reading my works" అని జేమ్స్ జాయ్స్ అనుకున్నట్లుగా పాఠకుడు తన జీవితాన్నంతా ఒక రచయితని అర్థం చేసుకోడానికి కేటాయించడం జరగదు. చాలా అరుదుగా ఒక విమర్శకుడు అలా ఉంటే ఉండొచ్చు.

వేగుంట అన్నట్టు కవిత్వం క్లుప్త లిపిలో ఉండొచ్చు. ఆ క్లుప్తతకూ ఒక పరిమితి ఉంటుంది. రచయితకూ, పాఠకుడికీ మధ్య సంబంధాన్ని తెంచేసే విధంగా ఆ క్లుప్తత ఉండకూడదు. "మోకి అంతిమ లక్ష్యం రచనే, రచయిత కాదు, పాఠకుడూ కాదు" అని 'సాంధ్య భాష' ముందుమాటలో తిరుపతిరావు అంటాడు. కాబట్టి రచయితకు పాఠకుడు లక్ష్యం కాకపోవడం అనేది కొంతమందికున్న ఒక పాలసీగానే కనిపిస్తుంది. ఈ పాలసీని కొందరు విమర్శకులు స్పష్టా స్పష్టంగా గుర్తించారు. 'బతికిన క్షణాలు' పూర్తిగా అర్థం కావడానికి తగిన తాళం చెవులు వేగుంట దగ్గరే ఉన్నాయి. కానీ అతను బయటపెట్టడని ఎ.బి.కె. ప్రసాద్ అన్నాడు. "వీడి మాటలకు విఠలాచార్య సినిమాలో మంత్రాలు గజగజా వణుకుతాయి" అని జూలూరు గౌరిశంకర్ అన్నాడు. "అర్థం కాకపోయినా నేను రాసేది నిజం. అంచేతే సత్యం అంత తొందరగా అర్థం కాదు" అని వేగుంట స్వయంగా అన్నాడు. ఇది సరదాగా అన్నాడో, కోపంతో అన్నాడో, నిజంగా నమ్మి అన్నాడో మనం చెప్పలేకపోయినా, ఇలాంటి ధోరణి వేగుంటలో ఉందని మాత్రం చెప్పగలం. పైగా అక్షరం ఓంకారం అంటాడు. అక్షరం అబద్ధం కాదంటాడు. తన అక్షరాన్ని సమర్థించుకోడానికి ఇలాంటి సాధారణీకరణలూ, సూత్రీకరణలూ చెయ్యడం వేగుంటను అర్థం చేసుకోవడంలో మరింత గందరగోళానికి తావిస్తుంది.

అస్పష్టత గురించి మాట్లాడితే వేగుంటకు కూడా కోపం వస్తుంది, "నేనేదన్నా కవిత్వంలాంటి బ్రహ్మ పదార్థం రాసి ఉంటే, అది నాకే అర్థం కాకుండా ఈనాటికీ ఉంటే .... దాన్ని అచ్చేసుకున్న ఎడిటర్లు ఎప్పుడో తన్ని ఉండేవారు... నేనున్నూ సామాజికుడినే. మీ 'అస్పష్టత' తగలబడ!" అని 1988లో శివలెంక రాజేశ్వరీదేవి ఆంధ్రజ్యోతికి చేసిన ఇంటర్వ్యూలో ఆగ్రహాన్ని ప్రదర్శించాడు. అంతేకాదు, చందు సుబ్బారావు రాసిన మో జ్ఞాపకాలలో "కవిత్వం అన్నివేళలా అర్థం కానక్కరలేదురా బాబూ.... నీ గతితార్కిక సామ్రాజ్యవాద నయా వలసవాద కళ్ళజోడు తీసి చూడు... అవ్యక్త నిద్రావస్థలో అగుపిస్తుంది కవిత్వం" అని 'మో' తనతో అన్నట్టూ, దాంతో తనకు జ్ఞానోదయం అయినట్టూ ఆయన చెప్పుకున్నాడు. 'గతితార్కిక సామ్రాజ్యవాద నయావలసవాద కళ్ళజోడు' అన్న సుదీర్ఘ శబ్దార్థ 'దుష్ట సమాసం' ద్వారా తన ఆక్రోశాన్ని వెళ్ళగక్కాడు వేగుంట. చందు సుబ్బారావు గతితర్కం సంగతి మనకక్కర్లేదుగానీ, కవిత్వంపట్లనేగాక, మార్క్సిజం పట్ల కూడా వేగుంట దృక్పథం ఏమిటో అర్థమవుతోంది. జనజీవనం సంకీర్ణమైనప్పుడు కవిత్వం అందరికీ అందుబాటులో ఉండాలనీ, అర్థమయ్యేలా ఉండాలనీ మాథ్యూ ఆర్నాల్డ్ అంటే, ఎలియట్ కాదు, దానికి వ్యతిరేకంగా ఉండాలన్నాడట. వేగుంటకు ఆదర్శం ఎలియట్, మాథ్యూ ఆర్నాల్డ్ కాదు.

వేగుంట విదేశీ కవుల్ని చెత్త చెత్తగా చదివేశాడు. 1930ల నాటి యాంగ్రీ యంగ్‌మెన్ కవులు, మార్క్సిజం నుండి తప్పుకున్న 1950ల నాటి యాంగ్రీస్ కవులు, బాధ్యతలకు ఆశలకు అతీతులమై పోయామనుకున్న బీట్ కవులు, భయాన్నీ వైఫల్యాన్నీ అనుభవిస్తూనే జీవితానికి సమగ్రమైన అర్థం కోసం అన్వేషించే న్యూ బార్బేరియన్ కవులు, ప్రేమని మృత్యువుని తెలుసుకొనేందుకు రచన చేస్తూ జీవించిన 'అమెరికా ఆత్మ' కార్ల్ శాండ్ బర్గ్, ఎందరో కవుల్ని ప్రభావితం చేసిన ఇజ్రాపౌండ్, ఆధునికాంగ్ల కవుల్లో గుర్తింపు పొందిన ఎలియట్, నా ప్రపంచంలో నేనే బాటసారిని అన్న వాలెస్ స్టీవెన్స్, మాంత్రిక మానవతావాది సంతర్‌గ్రాస్, విలక్షణ కవి జాన్ బెరిమన్, విచిత్రకవి యాక్సెల్రాడ్, మృత్యువును ఆరాధించిన కవయిత్రి సిల్వియాప్లాత్, తమాషా కవి అప్‌డైక్, కవితాద్వేషి వారెన్ స్టీవెన్సన్, ఇంకా అమెరికా కవులు, యూరపు కవులు, ఫ్రెంచి కవులు - ఒకరేమిటి వందల సంఖ్యలో విదేశీ కవుల్ని, రచయితల్ని చదివాడు. ఇంతమందితో 'కరచాలనం' చేసిన వేగుంట తెలుగు పాఠకులపై కర్రచాలనం చేశాడు. విదేశీ సాహిత్యాన్ని ఇంత ఎక్కువగా బహుశ శ్రీశ్రీ కూడా చదవలేదేమో అనిపించేంతగా చదివాడు. పాపినేని శివశంకర్ అన్నట్టు జ్ఞానమే అతని సమస్య కావచ్చు. తాను చదివిన వివిధ దేశాల రచయితల్ని 'కరచాలనం'లో బాగానే పరిచయం చేశాడు. అయితే ఆ వివిధ దేశాల రచయితల పాజిటివ్ ప్రభావం కాకుండా, నెగటివ్ ప్రభావం పడ్డట్టుంది. జ్ఞానం మన మార్గాన్ని సుగమం చేసి, పదిమందికీ మార్గదర్శకత్వం వహించేలా చెయ్యాలిగాని, అది గుదిబండలా తయారు కాకూడదు. "క్యూజ్ మి...." పేరుతో 'కరచాలనం' వ్యాస సంపుటికి రాసుకున్న ముందుమాటలో "ఈ వ్యాసాలు పాఠకులకు అర్థం అవుతాయని

ఆశిస్తాను, స్వీకరిస్తారని ఆశపడుతున్నాను" అన్నాడు. ఇది వేగుంటలో వచ్చిన పరిణామమే అయితే తప్పక ఆశించదగింది. తనకూ పాఠకులుండాలనీ, తన పాఠకులకు తానర్థంగావాలనీ రచయిత కోరుకోవడం ఆరోగ్యకర లక్షణం.

స్పష్టత గురించి చాలామందిలో అస్పష్టమైన అభిప్రాయాలున్నాయి. స్పష్టత అనగానే అదేదో పనికిమాలిందనీ, కవిత్వానికి అసలు పనికి రాదనీ, అందులో సృజనాత్మకత అసలుండదనీ - ఇలా ఏవేవో అభిప్రాయాలుంటాయి. వాచ్యంలోనే స్పష్టత ఉంటుందనుకోవడం పొరబాటు. వ్యంగ్యంలో, ధ్వనిలో కూడా స్పష్టత ఉంటుంది. భాష భావ వ్యక్తీకరణకు సాధనం అయినట్టే, కవిత్వ భాష కవి భావ వ్యక్తీకరణకు సాధనం అవుతుంది. "obscurity can be found in every book except the telephone directory" అని షా లాంటి వాళ్ళు అనడం స్పష్టత, అస్పష్టతల పైన దురభిప్రాయం కలగడానికి ఆస్కారం కలిగిస్తుంది. కవిత్వం ఎక్కాల పుస్తకం లాగా ఉండాలని ఎవరూ అనేరు, అనుకోరు.

కవిత్వ పాఠకులకు కనీసపు సాహిత్య పరిజ్ఞానం ఉండాల్సిందే. అంతేగాని కవిత్వ పాఠకులందరూ ఉద్దండ పండితులు కానక్కరలేదు. అది సాధ్యం కావడానికి ఇంకా చాలా కాలం కావాలి. ఆ స్థితి రావడానికి సమాజంలో చాలా మార్పులు రావాలి. సమాజం అలా పరిణామం చెందడానికి రచయితలు కూడా తమ వంతు పాత్రని నిర్వర్తించాలి. ప్రస్తుతానికి కనీసపు సాహిత్య పరిజ్ఞానం ఉన్న వాళ్ళందరూ సాహిత్య పాఠకులే. ప్రస్తుత సమాజంలో రచయితలు దృష్టిలో పెట్టుకోవల్సింది వీళ్ళనే. పాటయితే అశేష ప్రజానీకాన్ని ప్రభావితం చేస్తుంది. వచన కవితకు అంత శక్తి లేదు. కానీ వచన కవితను కూడా ప్రజల్ని ప్రభావితం చేసే స్థాయికి తీసుకెళ్ళొచ్చు. 1970 దశకంలో చెరబండరాజు వేలమంది ప్రేక్షకులున్న బహిరంగ సభల్లో తన పాటల్ని పాడడంతో బాటు తన వచన కవితల్నీ చదివి వినిపించేవాడు. వచన కవితలకు కూడా మంచి స్పందన వచ్చేది. అప్పుడప్పుడూ మొక్కుబడిగా జరిగే కవి సమ్మేళనాలలో తప్ప వచన కవితలు నేరుగా పాఠకులకు / శ్రోతలకు అందే సందర్భాలు లేవు. పాటకు శ్రోతలు, వచన కవితకు పాఠకులు అనే అనుకోనక్కరలేదు. వచన కవితకు కూడా శ్రోతలు ఏర్పడితే, దాని ప్రయోజన వైశాల్యం పెరుగుతుంది. పాఠకుల్ని దృష్టిలో పెట్టుకుని రాసేటప్పుడు వచ్చే అస్పష్టత, క్లిష్టత శ్రోతల్ని దృష్టిలో పెట్టుకుని రాస్తే తగ్గిపోతాయి. శ్రోతల ముందు చదవాలనే ఉద్దేశంతో రాసే వచన కవిత సహజంగానే సరళంగా ఉంటుంది. ఎందుకంటే, ఎవరైనా తాను చెప్పే మాటలు (కవిత్వం అయినా సరే) ఎదుటివారికి అర్థం గావాలనే కోరుకుంటారు. వారి అనుకూల స్పందనను ఆశిస్తారు. ఇలా ఆశించడానికి శ్రోతలు ఉపయోగపడతారు. పాఠకుల పట్ల కవులకు కొంత నిర్లక్ష్య భావం ఉంటుంది. కవితను ఒంటరిగా కూర్చొని ఎప్పుడో రాసిన కవితను అచ్చేసి, పుస్తకాల షాపుల్లో పెట్టి, అది పాఠకుడి దగ్గరకు చేరి, అతను చదవడానికి చాలా కాలం పడుతుంది. ఆ చదివే పాఠకుడెవరో కూడా రచయితకు తెలియకపోవచ్చు. అందువల్ల కవి పాఠకుల ప్రమేయం లేకుండా కవితలు రాసే క్రమంలో తన పాండిత్య ప్రదర్శనకు ఎక్కువ అవకాశం ఏర్పడుతుంది. పాండిత్య ప్రదర్శనలో అస్పష్టత, క్లిష్టత వచ్చే అవకాశాలున్నాయి. వచన కవితా ప్రక్రియలోనే కొంత ఈ సమస్య ఉండగా, వేగుంట లాంటి కవులు దాన్ని మరింత జటిలం చేశారు.

శబ్ద పరిజ్ఞానం కవికి ఎంతైనా ఉండొచ్చు. కాని శబ్దం మీద అధికారం ఉండాలి. శబ్దాలు కవిని తమ ఇష్టప్రకారం నడిపించకూడదు. కవి శబ్దాలను తన ఇష్టప్రకారం నడిపించాలి. కవి శబ్దాలకు బానిస కాకూడదు. కవి శబ్దాలను ప్రేమించాలి, శబ్ద సౌందర్యాన్ని అనుభవించాలి. భావాలకు తగిన శబ్దాల్ని ఎంపిక చేసుకోవడంలో తగిన జాగ్రత్త వహించాలి. శబ్దలౌల్యం పనికి రాదు. శబ్ద నిగ్రహం కావాలి. శబ్ద పరిజ్ఞానం వికటిస్తే కవిత్వంలో అస్పష్టత, సంక్లిష్టత అనివార్యంగా వస్తాయి. కవి చేతిలో శబ్దాలు సైనికుడి చేతిలోని ఆయుధాలు, మందుగుండు సామాగ్రిలాంటివి. ఉపయోగించడం చేతగాకపోతే తన చేతిలోనే పేలిపోతాయి. కవికే ప్రమాదాన్ని తెచ్చి పెడతాయి.

వేగుంట సాహిత్య సంబంధమైన అపరిమిత జ్ఞానాన్ని సంపాదించాడు. ఈ అపరిమితజ్ఞానం అటు రచయితకుగానీ, ఇటు పాఠకులకు గానీ భారం కాకూడదు. ఎంత జ్ఞానమైనా, అది జీర్ణమై సారాన్ని అందించగలిగితే సమస్య ఉండదు. ఈ ప్రక్రియలో వేగుంట ఎక్కడో దెబ్బ తిన్నట్టు కనిపిస్తుంది.

1969లో 'చితి-చింత' వచ్చేనాటికి తిరుగబడు కవులు, దిగంబర కవులు వచ్చారు. నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలు సాహిత్య లోకాన్ని అతలాకుతలం చేస్తున్నాయి. అభ్యుదయ రచయితల సంఘం ఉలిక్కిపడి తన ఉనికి ఎక్కడో వెతుక్కుంటోంది. 1970 జూలై 4న విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. సాహిత్య లోకంలో కనిపిస్తున్న ఈ అలజడికి దూరంగా ఉండగలిగాడు వేగుంట. సమాజానికీ, సాహిత్యానికీ ఒక దారి కనిపిస్తుండగా వేగుంట 'ఏదీ దారి నాకు' అని ప్రశ్నిస్తున్నారు.

"ముఖ్యంగా నన్ను అడక్కు
సౌఖ్యసంతోషానందోత్సాహోత్సవాల సంగతి
భావ నైశ్చల్య సమాధిలో ఉన్నవాణ్ణి"

అంటూ తన లోకం తనదే అంటున్నాడు. ఈ సంపుటిలోనే 'నిరీహ' అని ఒక కవిత ఉంది. ఈహ అంటే కోరిక. నిర్ + ఈహ = నిరీహ అంటే కోరిక లేకపోవడం. ఏ కోరికా ఎందుకు లేదని ఎవరైనా వేగుంటను అడిగితే ఏ కోరికా లేకపోవడమే నా కోరిక అనగలడు. ఒక ఇంటర్వ్యూలో తనకు 'నిర్' అనే ఉపసర్గ చాలా ఇష్టమంటాడు. నిర్మానుష్యం, నిరీక్షణ, నిరానంద్, నిరపేక్ష, నిర్మమత, నిర్నిద్ర, నిర్వీర్యం ఇలాంటి మాటలు తన 'నెగటివ్ కేపబిలిటీ'ని పెంచుతాయంటాడు. పైగా ఆ నెగటివ్ కేపబిలిటీ మనల్ని సత్యతేజోమయుల్ని చేస్తాయంటాడు. ఈ విషయంలో మాత్రం ఆయనకు నిరాశ లేదు. నెగటివ్ కేపబిలిటీ అంటే ఏమిటి?

ఒక వస్తువును లేదా భావాన్ని చూసి కవిత్వానుభూతిని పొందినప్పుడు కవి తనను తాను అభావం చేసుకొని ఆ వస్తువుగా లేదా భావంగా మారిపోవడం అంటే, తనను తాను మర్చిపోయి ఆ వస్తువు లేదా భావంలో లీనమవడం. దీన్ని నటనకు అన్వయించి చూస్తే, నటుడు పాత్రలో లీనమైపోవడం. ఈ నెగటివ్ కేపబిలిటీ ఏ కళాకారుడికైనా ఉండొచ్చు. అయితే ఇందులో ఒక ప్రమాదం ఉంది. కళాకారుడు లీనమైనట్టు కనిపించాలేగాని, నిజంగా లీనం కాకుడదు. అలా లీనం కావడమంటే అనుభూతి తదాత్మ్యత శృతి మించిపోవడం. ఆ స్థితిలో కవి తన కంట్రోల్‌లో ఉండడు. అప్పుడు కవి పరిస్థితి అతివేగంతో ప్రయాణించి అదుపు తప్పిన వాహనంలా తయారవుతుంది. ప్రయాణికులు కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకున్నట్టు, ఒక్కోసారి ప్రాణాలే కోల్పోయినట్టు తయారవుతుంది పాఠకుల పరిస్థితి. సరిగ్గా వేగుంట విషయంలో ఇదే జరిగింది. నెగటివ్ కేపబిలిటీ ఉన్న కవి సక్రమ మార్గంలో వెళ్ళలేడు. అందుకే వేగుంట 'ఏదీ దారి నాకు' అని ప్రశ్నిస్తున్నాడు. ఇతర కవులందరికంటె భిన్నంగా కనిపిస్తున్నాడు.

అలా అని వేగుంట సమాజాన్ని వదిలిపెట్టి కవిత్వం రాయలేదు. సమాజాన్ని చూసి స్పందిస్తున్నాడు. ఆధునిక సమాజంలోని నిరాశ నిస్పృహల్నీ, దుఃఖంతో కూడుకున్న సంఘర్షణనూ చిత్రించడానికే ప్రయత్నించాడు. అయితే ఆ దుఃఖం నివారింపబడుతుందన్న నమ్మకం అతనికి లేదు. "నువ్వు వెయ్యి చెప్పు / చివరికి మనందరం చింతాక్రాంతులమయ్యే ఉంటాం" అన్నది అతని విశ్వాసం. సమాజాన్ని చూస్తాడు. దగ్గరి నుంచి కాదు, దూరంగా ఉండి చూస్తాడు. నిర్లిప్తంగా చూస్తాడు. పట్టీపట్టనట్లు చూస్తాడు. అసలు పట్టించుకోకుండా వదిలేస్తాడా? అలా వదలడు. అంతర్మథనానికి లోనవుతాడు. తాను బాధ పడతాడు. పాఠకుల్నీ బాధపెడతాడు.

పాఠకుల్ని బాధ పెట్టడం వేగుంటకు ఒక సరదా అనుకుంటాను. 'బతికిన క్షణాలు'లో ఇలా అంటాడు -

"నేనింకా తలుపులు తీయలేదు. తీయను. అసలు తాళం చెవి ఎక్కడో పోయింది. దొరికినా గాని తీయను. తాళం కప్పకంటే విలువైనదేమీ లేదు. లోపల.... నేనే తాళాన్ని, నేనే చెవిని. నా చెవి 'కీ' ఇచ్చినా తాళం తీయను."

ఇవి తన కవిత్వం గురించి, తన స్వభావం గురించి చెప్పుకున్న మాటల్లా ఉన్నాయి. ఇదయినా అర్థమయ్యేలా చెప్పినందుకు సంతోషించాలి.

వేగుంట కవిత్వాన్ని వ్యాఖ్యానించడానికి ప్రయత్నించిన విమర్శకుల్లో చేరా ఒకడు. 'ఆత్మాశ్రయం' అనే కవితలోంచి ఒక భాగాన్నిచ్చి దాన్ని వ్యాఖ్యానించిన తీరు ఈ కింద ఇస్తున్నాను :

"మన మనఃక్లేశాన్ని కోసి, నిమ్మ, నారింజ, బత్తాయి
పళ్ళుగా రసం తీస్తే పులుపు రొడ్డు
చెడుగుడాడేవాడికి పాలిపోయేవాడికి
పండు ముదుసలికీ
ఇస్తె కూతపట్టి రక్తం వచ్చి యౌవనం
తొంగి చూస్తింది
పొగచూరిన కళ్ళల్లో ఆయాసపు గుండెల్లో
అంటుకుపోయిన పాండురంగడి నరాల్లో,
మాసిన గడ్డంతో
'సి' వైటమిన్ కళ్ళల్లోంచి ముత్యాలల్లోంచి
పుల్లని రక్తం పిండుతోంటే
పాటలు ఒక్కొక్క బొట్టు పడుతూ
తడబడుతూ
పులుపు రొడ్డు వాక్యాలవుతాయ్, కావ్యాలవుతాయ్"

దీనికి చేరా వివరణ -

"ఈ పై భాగంలో ఎన్ని అసంబద్ధతలున్నాయో! మనఃక్లేశాన్ని కొయ్యటమేమిటి, వాటి రసం తియ్యడమేమిటి?

అది పుల్లగా ఉండటమేమిటి? ఒక రకం రూపకాలు, మామూలు రూపకాల అన్వయం ఉండదు. మన బుర్ర పగలు కొట్టుకుని వాటికి అన్వయం కల్పించుకోవాలి.

మోహన్ ప్రసాద్ కవిత్వంలో విషాదచ్ఛాయలెక్కువ. ఆ దృష్ట్యా మనఃక్లేశాన్ని గుర్తించాలి. ఈ క్లేశాలు 'పులుపు రొడ్డు' అయితే నారింజ పులపయినా అందులో వైటమిన్ 'సి' ఉంటుంది. అది ఆరోగ్యకరం. మనఃక్లేశాలు, మనిషి మాటలు, వాక్యాలు, క్రమంగా కావ్యాలు అవుతాయ్. మానవుల క్లేశాలే మాటల రూపంలో కావ్యాలవుతాయ్. ఇంత వ్యాఖ్యానమూ నిదానంగా చేసుకొంటే తప్ప మనకు కవి పంచి చెపుతున్నది తోచదు. చెడుగుడు ఆడేవాడికి కూతపెట్టే దమ్ము కావాలి. పాలిపోయిన వాడికి రక్తం కావాలి. ముదుసలికి శక్తి కావాలి. ఇవన్నీ సిట్రస్ జాతి పండ్ల రసం వల్ల సిద్ధిస్తాయి. మనక్లేశానికి ఈ పండ్లను ఆరోపించాడు. ఈ భాగంలో పాండురంగడు అనే మాటలో పాండురోగిని చమత్కారంగా సూచించాడు.

పళ్ళల్లోంచి అనే మాటతో రసం ఇచ్చే పళ్ళూ, దంతాలూ సూచించాడు. దానిమ్మ గింజలు, ముత్యాలు, దంతాలతో పోల్చదగినవి. పళ్ళు అనేమాటతో ఈ రెండూ గుర్తు రావాలి. అప్పుడు రసమూ, మాటలూ సమస్థాయికి వస్తాయి. కావ్యమూ, రసమూ అనే మాటల జంట చప్పున స్ఫురిస్తే ఈ పద్యంలో భావం మనకు తళుక్కున మెరుస్తుంది. ఈ కవిత్వానికి ఇంత వ్యాఖ్యానం అవసరమా అని మీరడగవచ్చు. ..... ఆధునిక కవిత్వంలో ఏముందో తెలుసుకోదలుచుకున్న జిజ్ఞాసువులకే ఈ అవస్థలన్నీ."

వేగుంట కవిత్వాన్ని అర్థం చేసుకోవడానికి చేరాలాంటి పండితుడే ఇన్ని అవస్థలు పడాలన్న మాట! జిజ్ఞాసులైన విమర్శకుడు కాబట్టి ఆయనకు తప్పదు. మనిషికి ఒక్క తలే ఉంటుంది. ఎన్ని సార్లని దాన్ని బద్దలు కొట్టుకోగలడు!

వేగుంట కవితా నిర్మాణం విశిష్టమూ, విలక్షణమూ

అనడంలో సందేహం లేదు. తన కవితా నిర్మాణం గురించి చాలా సందర్భాల్లో ఆయన చర్చించాడు. కవిత్వంలోని భావ తీవ్రతకు తగినది సంక్లిష్ట వాక్య నిర్మాణం కావడం వల్ల అదే తననాకర్షించిందన్నాడు. 'సాంధ్యభాష' కవితా సంపుటిలో చివర 'విన్నపాలు' పేరుతో కొన్ని కవితలున్నాయి. వీటిలోని వాక్య నిర్మాణం మరీ సంక్లిష్టమైనది. ఈ 'విన్నపాలు' ఎవరికీ చేరలేదని కవే స్వయంగా గుర్తించాడు. పైగా వీటిలో భాషని కావాలనే ఇంకా సంకీర్ణం, సంక్లిష్టం, సంలీనం చేశానని చెప్పుకున్నాడు. 'రహస్తంత్రి'లో తన పాండిత్యాన్నంతా ప్రదర్శించుకునే కృతక ప్రయత్నం కూడా చేశానన్నాడు. పాఠకుల సౌకర్యం కోసమని ఈ సంపుటిలో పాదసూచికలు కూడా ఇచ్చాడు. ఈ చేసిన ప్రయత్నం గురించి మళ్ళీ తనే "ఇదంతా ఎగ్జిబిషన్‌లో భాగమే. ఉత్తినే పెద్ద ఫోజు... ఆ ఇంగ్లీషు కొటేషన్లు లేకపోతే... ఎందుకు లెండి!" అనంటాడు.

వేగుంటలో ఒక విచిత్రమైన స్వభావం ఉంది. తనపైన ఇతరులు చెయ్యదగిన విమర్శల్ని ముందుగానే ఊహించి తనపైన తానే ప్రయోగించుకుంటాడు. ఇతరులకు ఆ అవకాశం లేకుండా చేస్తాడు. ఎగ్జిబిషన్‌లో భాగం అనడం, పెద్ద ఫోజు అనడం, పాండిత్యాన్ని ప్రదర్శించుకునే కృతక ప్రయత్నం అనడం వగైరాలు ఇందులో భాగమే. తన భాషకు సంబంధించి సంకీర్ణం, సంక్లిష్టం, సంలీనం అని మూడు పదాలు వాడాడు. సంకీర్ణం అన్నది భావాలకు సంబంధించిందిగా, సంక్లిష్టం అన్నది వాక్య నిర్మాణానికి సంబంధించిందిగా, సంలీనం అన్నది కవి స్వభావానికి చెందిందిగా కనిపిస్తాయి. ఒక భావం పూర్తిగాకుండానే ఇంకో భావంలోకి వెళతాడు. దాన్నీ అసంపూర్తిగానే వదిలిపెడతాడు. దీనివల్ల భావసంకీర్ణత ఏర్పడుతుంది. పద్యాల నడుముల్ని విరగదంత తానన్న పఠాబి ఆ పని చేశాడో లేదో తెలియదు గానీ, వేగుంట మాత్రం వాక్యాల నడుముల్ని నిజంగానే విరగదన్నాడు. ఈ సంక్లిష్ట వాక్య నిర్మాణాన్ని చేరా కవి అనుసరించిన ఒక టెక్నిక్‌గా చెప్పాడు. కలలలోని అసంబద్ధతను అనిబద్ధమైన సింటాక్స్ ద్వారా కవి సూచించాడని చేరా అభిప్రాయం. కలలు ఎక్కువ భాగం అసంబద్ధంగా ఉంటాయని అందరికీ తెలిసిందే. వాటిని అనిబద్ధమైన వాక్య నిర్మాణం (సింటాక్స్) ద్వారానే సూచించాల్సిన అవసరం లేదు. విషయం అసలే అసంబద్ధమైనది. దాన్ని అసంబద్ధమైన భాషలోనే చెప్పడం మితిమీరిన సంక్లిష్టతను ఆహ్వానించడమే. కవి ఇతరుల లాగా వాచ్యంగా చెప్పకూడని మాట నిజమే. దానర్థం సంక్లిష్టంగా చెప్పడం కాదు. భావాన్ని దానికి తగిన శక్తివంతమైన భాషలో చెప్పడం కవిత్వం అవుతుంది. ఒక భావాన్ని కవిత్వీకరించే పద్ధతులు ఎన్నైనా ఉండొచ్చు. భావ తీవ్రతకు సంక్లిష్ట వాక్య నిర్మాణమే ఏకైక మార్గం అని వేగుంట భావించడం సరైనది కాదు. "ముందు దగా, వెనుక దగా, కుడి ఎడమల దగా దగా" అన్నప్పుడు కూడా భావ తీవ్రత ఉంది. "ఆగస్టు పదిహేను ద్రోహాన్ని చెప్పకపోతే అన్నం సహించదు నాకు" అన్నప్పుడూ భావ తీవ్రత ఉంది. భావతీవ్రతకూ, సంక్లిష్ట భాషకూ ప్రత్యేకమైన అవినాభావ సంబంధం ఏమీ లేదు. వేగుంట కవిత్వం గురించి ఒక్క మాటలో చెప్పాలంటే - భావ సంకీర్ణతను భాషా సంక్లిష్టత ద్వారా, పాఠకులున్నారన్న విషయం మర్చిపోయి తన కవిత్వాన్ని తనలో సంలీనం చేసుకున్నాడు. కాబట్టి వేగుంట కవిత్వానికి తానే రచయిత, తానే పాఠకుడు, తానే విమర్శకుడు అనడం సబబుగా ఉంటుంది.

పఠాబి సన్మాన సంచికలో వేగుంట తాను రాసిన వ్యాసానికి "కవిత్వ ప్రయాణంలో నా హిచ్ హైకింగ్" అనే శీర్షిక పెట్టాడు. hitch అంటే Jerk అని అర్థం. hike అంటే work vigorously or laboriously అని అర్థం. hitchhike అంటే travel by begging lifts from passing motor vehicles అని అర్థం. తన కవిత్వానికి ఈ పదాల్ని సరిగ్గానే ఉపయోగించాడు. వివిధ దేశాల కవుల నుండి అనేక పదాలనూ, భావనలనూ తీసుకోవడం ఇతరుల వాహనాలను ఆపి లిఫ్ట్ అడగడం లాంటిది. సంకీర్ణ భావతా, సంక్లిష్ట వాక్య నిర్మాణతా ఉండడం శ్రమతో కూడిన నడకలాంటిది.

'బతికిన క్షణాలు' గ్రంథం చదివింతర్వాత ఆనందించిన వాళ్ళకంటే, భయపడినవాళ్ళే ఎక్కువని తనకు తర్వాత తెలిసిందని చెప్పుకున్నాడు. అందులోని నార్సిసిజమ్, మాసోకిజమ్ పాఠకులకు భీతిని గొల్పాయని అన్నాడు. నార్సిసిజమ్ అంటే తన అందాన్ని, తన గొప్పదనాన్ని చూసి తాను ఆనందించడం. గ్రీకు పురాణాల్లో నార్కిసస్ అని మన మన్మధుడిలాంటి అందగాడున్నాడు. అయితే అతనికి ఇతరుల అందం నచ్చదు. అందుకే ఒక పెద్ద నీటి గుంటలో తన ప్రతిబింబాన్ని చూసుకుని, ఆ అందానికి మురిసిపోయి, ఆ అందాన్ని పొందడం కోసం అందులో దూకి చనిపోతాడు. తర్వాత అతడు ఒక అందమైన పువ్వుగా మారిపోతాడు. ఆ పువ్వు పేరు కూడా అతని పేరు మీదే నార్కిసస్ అనే పేరుతో ఉంది. వర్డ్స్‌వర్త్ 'డాఫోడిల్స్' కూడా ఇలాంటి పువ్వులే. ఇవి శరత్కాలంలో బాగా పూస్తాయి. తన రూపాన్నీ, తన ప్రతిభనూ చూసి మురిసిపోయే భావానికి సంకేతంగా అతని పేరు మీద నుంచి 'నార్సిసిజమ్' అనే మాట వచ్చింది. మాసోకిజమ్ అన్నది ఇంకా భయంకరమైన మాట. తనకు తాను కావాలని కష్టాలను కోరుకొని, హింసను అనుభవిస్తూ, ఆ హింస నుండి ఆనందాన్ని పొందే స్వభావాన్ని మాసోకిజమ్ అంటారు. ఈ హింస ప్రధానంగా లైంగిక సంబంధమైనదిగా ఉంటుంది. శాడిజమ్ అనే దానికి సరిగ్గా ఇది వ్యతిరేకమైంది. ఇతరుల్ని హింసించి తద్వారా ఆనందాన్ని పొందేవాడు శాడిస్టు. ఇతరుల చేత హింసింపబడుతూ ఆనందాన్ని పొందేవాడు మాసోకిస్టు. ఈ నార్సిసిజమ్, మాసోకిజమ్ అనేవి తన కవిత్వంలో ఉండడం వల్ల పాఠకులు భయపడిపోయారని కవి స్వయంగా గుర్తించాడు.

వేగుంట కవిత్వం మోనో లాగ్ కాదు, డైలాగ్ కాదు, అది

డ్యూయెలాగ్ అంటాడు పాపినేని శివశంకర్. తన కవిత్వ భాషను డ్యూయెలాగ్ అని కవి కూడా అన్నాడు. డ్యూయెలాగ్ అనేది ప్రత్యేకంగా ఏమీ లేదు. Duel అంటే మల్లయుద్ధం "డైలాగ్‌లాంటిదే డ్యూయెయలాగ్ కూడా. డైలాగ్ అంటే మాట్లాడుకోవడం అయితే, డ్యూయెలాగ్ అంటే మాటలతో పోట్లాడుకోవడం, మాటలతో మల్లయుద్ధం వేగుంటకు ఇష్టమైనదే గదా! విచిత్రం ఏమిటంటే ఆ మాటల మల్లయుద్ధం వేగుంటకూ, మరొకరికే మధ్య కాదు, ఆయనే ఇద్దరుగా విడిపోయి పోట్లాడుకోవడం.

"కవిత్వం భాష యొక్క భాష" అని వేగుంట సిద్ధాంతం. "భాష యొక్క భాష" అనడంలోనే కొంత గందరగోళం ఉంటే, దానికి ఆర్. సీతారామారావు ఇచ్చిన వివరణ మరికొంత గందరగోళాన్ని సృష్టిస్తుంది. ఆయన ఇలా అంటాడు - "సంకేతమయిన భాషతో సంకేతించి చెప్పడమే కవిత్వం అన్నది 'మో' అర్థం... భాషకి భాష - సంకేతానికి సంకేతం. సంకేతంలో సంకేతం. సంకేతం యొక్క సంకేతం." చిత్ర విచిత్రంగా కనిపించే ఈ నిర్వచనాల నుండి మనం గ్రహించవలసిన విషయం ఏమయినా ఉందా అన్నది ముఖ్యం. భాష సంకేతాల మయం. ఈ ప్రపంచంలోని వస్తువులకూ, భావాలకూ సంకేతాలే పదాలు. ఈ సంకేతాలు మనం ఏర్పరుచుకున్నవే. అయితే ఆ సంకేతాలు ఏర్పడడానికి సాంఘిక జీవితం దోహదం చేసింది. కాబట్టి ఈ సంకేతాత్మకమైన భాష ద్వారా మనం భావ ప్రకటన చేస్తున్నాం. భాష భావ ప్రకటన సాధనం అన్నమాట. ఈ భాష మనిషికి సంబంధించిందయితే, మరి భాష యొక్క భాష ఏమిటి? భాషే ఒక సంకేతం అయితే ఆ సంకేతానికి మరొక సంకేతం ఉందా? ఉంటుందనే ఈ కవి అభిప్రాయం.

సాధారణ భావ ప్రకటనకు ఉపయోగించే భాష కంటే కవిత్వానికి ఉపయోగించే భాష కొంచెం భిన్నంగా ఉంటుంది. "కొండలు పగలేసినం, బండలనూ పిండినం" అన్నది కవిత్వ భాష. డైనమైట్లు పేల్చి కొండల్ని పగలేసినట్లు అనుకున్నా బండలను పిండడం అన్నది సాధారణ భావ ప్రకటనకు భిన్నమైనది. దీన్నే కవిత్వ భాష అనొచ్చు. కొండల్ని పగలెయ్యడం, బండల్ని పిండడం అనే మాటలు శ్రమ జీవుల శ్రమకు సంకేతాలు. మేం శ్రం చేస్తున్నాం అంటే అది కవిత్వం కాదు. అదే అర్థాన్ని స్ఫురింపజేస్తూ, "కొండలు పగలేసినం, బండలనూ పిండినం" అంటే కవిత్వం అవుతుంది. ఇక్కడ సాధారణ భాష, కవిత్వ భాష అని రెండు భాషలు కనిపిస్తున్నాయి. ఈ సందర్భంలో కూడా కవిత్వాన్ని భాష యొక్క భాష అనొచ్చు. సాధారణ భాష కవిత్వం కాదు కాబట్టి, దాని యొక్క భాషను కవిత్వ భాషగా చూపిస్తున్నాం. ఈ అర్థంలో ఏ కవిత్వ భాష అయినా భాష యొక్క భాష అవుతుంది. కాని వేగుంట ఈ అర్థంలో 'కవిత్వం భాష యొక్క భాష' అని ఉండడు. ఎందుకంటే ఊరంతా ఒక దారైతే, ఉలిపికట్టెది మరొక దారి గదా! ఒక ఉదాహరణ చూద్దాం - 'రహస్తంత్రి' కవితా సంపుటిలో ఒక కవితా భాగం -

"నీ కోసం ఆపిల్ పళ్ళు కోస్తూ చెయ్యి
కోసుకొన్న రక్తపు బాధా హిమకిరణపు
అంచున కళ్ళు జారిపోతూ కన్నీటి బొట్లు రాలిపోతున్నట్లు
విద్యుత్తు ప్రాకుతొన్న తీగల మీద వాన తడి"

ఆపిల్ పళ్ళు కోస్తూ చెయ్యికోసుకోవడం అర్థమయిందే. 'రక్తపు బాధా హిమకిరణపు అంచున కళ్ళు జారిపోతూ కన్నీటి బొట్లు రాలిపోవడం' ఏమిటి? (ఇక్కడ చేరా గారి వ్యాఖ్యానాన్ని సహాయంగా తీసుకుంటున్నాను) పండు కోస్తున్నప్పుడు కలిగే బాధను కవి హిమకిరణంతో పోల్చాడు. వేడి, చలి రెండూ బాధను కలిగించేవే. అందువల్ల బాధను వేడితోనూ, చలితోనూ పోల్చవచ్చు. చలిదేశపు అనుభవాన్ని సూచించడం కోసం 'హిమకిరణం'తో పోల్చాడు. కళ్ళు ఆర్ద్రమయినయ్ అనే భావాన్ని 'కళ్ళు జారిపోతూ' అనే మాటల ద్వారా సూచించాడు. అంటే కళ్ళు ఆర్ద్రం కావడం అన్నమాట. ఈ కవిత్వపు భాష, ఇంతకుముందు అనుకున్న 'కొండలు పగలేసినం, బండలనూ పిండినం' లాంటి కవిత్వభాష కాదని అర్థమవుతూనే ఉంది. వేగుంట దృష్టిలో రచన చెప్పే అర్థం ప్రధానం కాదు. "అర్థం లేని కవిత్వం ఎంత వ్యర్థమో, కేవలం అర్థమే ఉన్న కవిత్వమూ అంత వ్యర్థమే. పదాల అర్థం కంటె కవిదర్శనం, చైతన్యం ముఖ్యమైనవి." వేగుంట చెప్పిన భాషయొక్క భాష ఈ దర్శనానికి, చైతన్యానికీ సంబంధించినదై ఉండాలి. కవిత్వంలో ఎవరూ పదాల అర్థాన్ని కేవలం పదాల అర్థంగా తీసుకోరు. 'బండలనూ పిండినం' అనే మాటలో పిండడం అనే పదానికి గల వాచ్యార్థాన్ని కవితా పాఠకులెవరూ స్వీకరించరు. బండల్ని పిండడం అనేది బట్టల్ని పిండడంలాంటిది కాదని అందరికీ తెలుసు. దీనికి మించిన కవి దర్శనాన్ని వేగుంట చెప్తున్నట్టు అనిపిస్తుంది. ఈ దర్శనం గురించి పాఠకులూ, విమర్శకులూ ఎవరి అర్థం వాళ్ళు చెప్పుకోవలసిందే.

కవిత్వంలో తన వ్యక్తీకరణ పద్ధతిని వేగుంట వినిర్మాణ విధానం అని పేర్కొన్నాడు. ఆంగ్లంలో దీన్ని deconstruction అన్నారు. వినిర్మాణ సిద్ధాంత ప్రవక్త జేక్స్ డెరీడా కవిత్వాన్ని 'వాచకం' అన్నాడు. దీన్ని ఆంగ్లంలో text అన్నారు. ఇది లాటిన్ పదం texitus అనే పదం నుండి వచ్చింది. దీనర్థం 'అల్లబడినది' అని ('సాంధ్యభాష'కు తిరుపతిరావు రాసిన ముందుమాట ఆధారంగా) వాచకంలో అంతర్గత వాచకత్వం ఉంటుందట. అంటే ఏ వాచకం కూడా స్వతంత్రం, సంపూర్ణం కాదు కాబట్టి ఇతర వాచకాల నుండి పదాలనూ, ప్రతీకలనూ ఏ వాచకం అయినా తీసుకుంటుంది. సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యడం అంటేనే అంతర్గత వాచకత్వాన్ని అధ్యయనం చెయ్యడమని వినిర్మాణ వాద విమర్శకుడు Hilles Millers చేసిన సిద్ధాంతాన్ని తిరుపతిరావు వేగుంట కవిత్వానికి అన్వయించే ప్రయత్నం చేశాడు. వాచకం పాఠకుణ్ణి మోసం చేస్తుందనీ, పాఠకుడు స్వీకరించగలిగే ఒకే ఒక

నిశ్చితార్థాన్ని భగ్నం చేస్తూ ఏకకాలంలో అనేకానేక అర్థాల్ని సూచించగలదనీ, వాచకం చెప్తున్నట్టు కనిపించే విషయం కంటే చెప్పని విషయమే ఎక్కువగా ఉంటుందనీ 'నిషాదం' అనే తన చివరి కవితా సంపుటానికి రాసుకున్న ముందుమాటలో వేగుంట చెప్పుకున్నాడు.

వినిర్మాణం అంటే ఒక విధంగా వికేంద్రీకరణ. అయితే వికేంద్రీకరణ లక్షణాలు కూడా దీనికి పూర్తిగా ఉండవు. ఒక కేంద్రం, దాని బాధ్యతల్ని పంచుకునే కొన్ని ఉపకేంద్రాలు కలిసి ఉంటాయి వికేంద్రీకరణలో. కాని ఈ వినిర్మాణవాదులు చెప్పే వికేంద్రీకరణ లేదా వినిర్మాణంలో ఉపకేంద్రాలుంటాయేగాని, వాటిని అనుసంధించే కేంద్రం ఉండదు. అంటే ఒక కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చించడంలాంటిది. ఆ చించిన ముక్కల్ని మళ్ళీ అతికించడంలాంటిది. అయితే ఈ అతికించడంలో కళాత్మకత ఉంటుందంటారు వినిర్మాణవాదులు. ఈ వినిర్మాణం ఇంకో విధంగా విధ్వంసంలా కనిపిస్తుంది. అయితే దాన్ని విధ్వంసం అని వాళ్ళు ఒప్పుకోరు. అదొక పునర్నిర్మాణం అంటారు. ఈ ప్రపంచంలో అన్నీ అతార్కికంగా, అక్రమబద్ధంగా ఉంటాయనీ, వాటిని మరో రూపంలో తార్కికంగా, క్రమబద్ధంగా చెయ్యడమే వినిర్మాణమనీ అంటారు. మొత్తం మీద పాశ్చాత్యుల సర్రియలిజం, పోస్ట్‌మోడర్నిజంలాంటి సిద్ధాంతమే ఈ వినిర్మాణం కూడా. పెట్టుబడిదారీ సమాజంలోని వైయక్తిక పోకడలకి ఇవన్నీ ఉదాహరణలే. పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్రాజ్యవాద దశకు చేరుకున్న ఈ తరుణంలో సమాజంలో సంఘటిత శక్తి చాలా అవసరం. దీన్ని దెబ్బ తీస్తూ వెర్రితలలు వేసే ఇటువంటి అపసవ్య సిద్ధాంతాల ప్రభావం వేగుంటపై చాలా ఉంది. ఈ సిద్ధాంతాల ప్రభావంలో ఉన్న వాళ్ళు విడివిడి వ్యక్తులుగా ఉంటారు. ఒకవేళ కలిసినా, కలవకూడదనే విషయాన్ని గుర్తు చేసుకోవడానికే కలుస్తారు. వీళ్ళకు చరిత్ర క్రమంపైన నమ్మకం లేదు. మానవ జాతి పరిణామ క్రమంలో మధ్యలో ఎన్ని ఆటుపోట్లు, ఒడిదుడుకులు ఎదురైనా అది పురోగామి స్వభావం కలిగిందనే నమ్మకం వీరికుండదు. వీళ్ళు సమాజంలో వ్యక్తులు. సమూహంలో సన్యాసులు. ప్రజల మధ్య ఏకాకులు. ఇది నింద కాదు, వాస్తవం. పదాల అర్థం కంటే కవి దర్శనం, చైతన్యం ముఖ్యం అని ఒకవైపు అంటూనే, మరోవైపు వ్యక్తివాద పోకడలను ప్రత్యక్షంగా, పరోక్షంగా సమర్థిస్తారు. నిజానికి సామాజిక జీవితంతో సంబంధం లేకుండా చైతన్యం ఉండదు. చైతన్యానికి మూలం మనుషుల మధ్య ఉన్న సామాజిక సంబంధాలే. వర్గ సమాజంలో మనుషుల మధ్య వర్గ సంబంధాలే ఉంటాయి. చైతన్యానికీ, కవిత్వానికీ కూడా వర్గ స్వభావం ఉంటుంది. తమకు ఏ వర్గంతో సంబంధం లేదనుకునే వాళ్ళు కచ్చితంగా అంతిమంగా దోపిడీ వర్గానికే ఉపయోగపడతారు. మనిషి గురించి, మానవత్వం గురించి ఎన్ని వినూత్న ప్రతిపాదనలు చేసినా, అవి సామాన్య ప్రజలకు ఉపయోగపడేవిగా ఉండవు.

ఒక వ్యక్తి కవి కావడానికి సమాజమే మూలాధారం. ప్రజల పట్ల బాధ్యత గల కవి కావడానికి అతను ప్రయత్నించాలిగాని, అంతర్ముఖుడై తనలో తాను ముడుచుకు పోకూడదు. ఈ సమాజంలో ఉద్భవించిన కవి దాని పురోగతికి తోడ్పడాలి. ఈ వర్గ సమాజంలో అందరికీ అన్ని అవకాశాలూ ఉండవు. ఒకరికి కవి అయ్యే అవకాశం కన్పించినందుకు ఈ సమాజానికి కృతజ్ఞతా బద్ధుడై ఉండాల్సిన సామాజిక బాధ్యత అతనిపై ఉంటుంది. అతని జ్ఞానం, అతని విద్య, అతని సంస్కారం, అతని నైపుణ్యం, అతని కవిత్వం ఆ వ్యక్తికి మాత్రమే సంబంధించినవని అనుకోవడం, మిగతా ప్రపంచంతో ఏ సంబంధాలూ లేవనుకోవడమే. మనం తినే ఆహారం, మనం కట్టుకునే గుడ్డ, మనం నివసించే ఇల్లు, మనం సంపాదించుకున్న జ్ఞానం ఏవీ కేవలం మన సొంతం కావు. వీటన్నిటితో ఇతరుల శ్రమ నిబిడీకృతమై ఉంది. అలాంటపుడు ఒక్క కవిత్వం మాత్రం కవి సొంతం ఎలా అవుతుంది? వ్యక్తవాదాన్ని ఆశ్రయించిన కవికి ఈ స్పృహ ఉండదు.

వేగుంట దృష్టిలో కవిత్వం ఒక పజిల్. ఒక క్రీడ. దైవలీలా వినోదంలాంటిది. అది అర్థం కావడం, కాకపోవడం పాఠకుడి కర్మ. తన కవిత్వం తనకు అర్థమైతే ఆనందిస్తాడు. తనకూ అర్థం గాకపోతే అందుకు మరింత ఆనందిస్తాడు. 'మో' హఠన్మరణానికి స్పందిస్తూ ఒక కవి -

"అప్పుడు నీ కవిత్వ సంక్రమణానికి / అర్థం తెలిసింది గనుకనా, ఇప్పుడు నీ హఠాన్నిష్క్రమణానికి / అర్థం తెలీడానికి"

అని అనడంలో చమత్కారంతో బాటు ఔచిత్యం కూడా ఉంది.

"వ్యక్తి (వ్యక్తివాదం) అంటే వీళ్ళకున్న అంచనా అల్లా స్వీయ ఆలోచన నశించిన మందబుద్ధి, మందలో కలిసిపోలేని వాడూనని, వాడొట్టి నిరాశావాది అని," 2002లో 'ప్రస్థానం' ఇంటర్వ్యూలో వేగుంట అన్నమాటలివి. పురాతన రివిజనిస్టుల నుంచి ఈనాటి విప్లవకారులదాకా కమ్యూనిజం గురించి మాట్లాడే అన్ని రకాల కమ్యూనిస్టులూ ఈయన దృష్టిలో సోకాల్డ్ వామపక్షీయులు. పై మాటల్లోని 'వీళ్ళు' వీళ్ళే. కమ్యూనిస్టులు సాహిత్యానికి స్వయం ప్రతిపత్తి లేకుండా చేశారనీ, మానవుడికి మరొక సగభాగమైన మానసిక ప్రపంచమంటూ లేకుండా చేశారనీ అక్కసు వెళ్ళగక్కేంత కమ్యూనిస్టు వ్యతిరేకత వేగుంటలో ఉంది. సందర్భం వచ్చినా, రాకపోయినా అవకాశం కల్పించుకొని ఈ వ్యతిరేకతను వ్యక్తం చేస్తుంటాడు. గ్లోబలైజేషన్ వల్ల దేశీయ సంస్కృతిలోని ఆరోగ్యకరమైన అంశాలు నాశనమవడం లేదా అనే ప్రశ్నకు సమాధానం ఇస్తూ, వ్యక్తికి స్వీయ వ్యక్తిత్వాన్ని సామ్యవాదం కాలరాసినపుడే ఈ నాశనం మొదలయిందంటాడు. గ్లోబలైజేషన్ కన్నా, సామ్యవాదమే ప్రమాదకరం అని ఇతని అభిప్రాయం. శ్రమ దోపిడి మూలాల్ని కనిపెట్టి, అన్ని అసమానతలకూ, అన్ని అవలక్షణాలకూ వ్యక్తిగత ఆస్తి హక్కే మూలకారణం అని చెప్పిన

సామ్యవాదం గొప్పదనం వేగుంటకు అర్థం కాలేదు. సామ్యవాదం, మార్క్సిజం, కమ్యూనిజం అనే మాటలు వింటేనే ఎలర్జీతో గుడ్డి వ్యతిరేకతను వ్యక్తం చేసే ఈ కవి పైకి కనిపించేంత డెమోక్రెట్ కాదూ, సున్నితమనస్కుడూ కాదు. వ్యక్తిని సమాజం నుండి వేరు చేసి వ్యక్తుల్ని నిర్వీర్యం చేసే సంప్రదాయానికి చెందిన కవి ఇతను. కమ్యూనిస్టుల్ని 'మంద' అన్నాడంటేనే వేగుంట ఉద్దేశం అర్థమవుతోంది. ప్రపంచ సాహిత్యాన్ని బాగా చదివిన మేధావిగా, రచయితగా గుర్తింపు పొందిన వేగుంటకు అన్ని రాజకీయాలూ 'రాజకీయాలు'గానే కనిపిస్తాయి. రాజకీయాల్లో కూడా కమ్యూనిస్టు రాజకీయాలే ఆయనకు పడనివి. ఈ కవి అంతరంగాన్ని గుర్తించకుండా మార్క్సిస్టు విమర్శకులు సైతం ఇతని గురించి అటూ ఇటూ గాకుండా మాట్లాడడం బాధాకరం. వేగుంట పైకి నాన్ మార్క్సిస్టు, లోపల యాంటీ మార్క్సిస్టు.

వేగుంట మట్టి గురించి మాట్లాడతాడు. నేటివిటీ గురించి మాట్లాడతాడు. పల్లె వాతావరణం గురించి మాట్లాడతాడు. ఇంకా గిలకబావి గురించీ, గిలక సవ్వడి గురించీ, పిల్లలతో ఆడుకోవడం గురించీ, కాలువగట్టున భోజనం చెయ్యడం గురించీ, చెట్ల చిగుళ్ళను కమ్మేసిన దుమ్ము గురించీ, నులకమంచం మించి లేవలేని ముసలమ్మ గురించీ, 'జొన్నరొట్టెల్లో వేరు సెనక్కాయి పప్పుల్ని నంజుకు' తింటం గురించీ మాట్లాడతాడు. పల్లె వాతావారణానికి దూరమైన పట్టణవాసులకు పల్లె వాతావరణం గురించి అందంగా వర్ణిస్తే ఆనందంగానే ఉంటుంది. పల్లె వాతావరణం హాయిగా ఉంటుంది. అయితే ఏమిటి? పల్లెకు వెళ్ళి పల్లె జీవితాన్ని తృప్తిగా అనుభవించొచ్చు. ఎవరికి అభ్యంతరం ఉంటుంది? పల్లె జీవితాన్నీ, బాల్య జ్ఞాపకాల్నీ గుర్తు చేసుకోవడం తప్పు కాదు. కానీ అరవై యేళ్ళ నాటి పల్లెలు ఇంకా అలాగే ఉన్నాయా? పల్లె జీవితాల్లో వచ్చిన మార్పులేమిటి? పాలక వర్గాలు పల్లెల్నీ, వ్యవసాయాన్నీ ఎలా విచ్ఛిన్నం చేస్తున్నాయి? వందల వేల ఎకరాల భూముల్ని సెజ్‌ల కోసం బహుళ జాతి కంపెనీలకు అప్పజెపుతూ, గ్రామాలకు గ్రామాలనే ఖాళీ చేయిస్తూ, ఎందరో సామాన్య ప్రజల్ని నిర్వాసితుల్ని చేస్తూ, వారి జీవితాలతో చెలగాటమాడుతున్న పాలకవర్గ స్వభావం గురించి మాట్లాడకపోతే ఎలా? పల్లెల్నీ, ప్రకృతినీ, వాటి సహజ సౌందర్యాన్ని చూసి ఆనందించడం ఒక్కటే కాదు, ఆ సౌందర్యాన్ని ఎవరు, ఎందుకు విధ్వంసం చేస్తున్నారో కూడా ఆలోచించడం కవి బాధ్యత. సమాజమూ, సమస్యలూ, రాజకీయాలూ, ఉద్యమాలూ అంటరాని వస్తువులనుకోవడం కొందరు కవులకు ఒక ఫ్యాషన్. వీటితో కవిత్వం కలుషితం అయిపోతుందని వాళ్ళ బాధ.

కవిత్వం అస్తిత్వంలో ఉన్న అన్ని అరల్నీ, పొరల్నీ వెలికి తియ్యాలంటూనే, ఆ అరలూ, పొరలూ సెక్టేరియన్‌గా ఉండకూడదంటాడు. అంటే ఒక ప్రత్యేకమైన సిద్ధాంతానికి సంబంధించినవిగా ఉండకూడదని అర్థం. మార్క్సిజాన్ని దృష్టిలో పెట్టుకుని అన్నమాట ఇది. ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికీ, మార్చడానికీ ఉపయోగపడే శాస్త్రం, శస్త్రం మార్క్సిజం. అంతేగాని వాస్తవాలని వక్రీకరించే అశాస్త్రీయ సిద్ధాంతం కాదది. తర్కం ఒక విషయాన్ని ఒక కోణం నుంచి మాత్రమే చూస్తే, గతితర్కం అన్ని కోణాల నుంచీ సమగ్ర దృష్టితో చూస్తుంది. చేరా అన్నట్టు వేగుంటలో కవిత్వం ఎంత ఉందో తిక్క అంతకంటే ఎక్కువే ఉంది. ఆ తిక్క వదిలేస్తే అంతకంటే గొప్పకవి ఉండడట. తిక్క వదిలేస్తే ఈ ప్రత్యేకత రాదు గదా! ఆయన అభిప్రాయాలు చూడండి : కవిలో నిరాశావాదం ఉంటుందట, కానీ ఏ కవీ నిరాశావాది కాడట! వచన కవిత అన్న పదంలో విరోధాభాస ఉందట, కావలసింది కవిత్వ వచనం అట! రచయిత ఒక వాహిక మాత్రమేనట, రచన ఒక ఉత్సవ విగ్రహమట! కవి రోగి అట, కవిత మాత్రం రోగిష్టిది కాదట! ఇలాంటి సూత్రీకరణలు చేసి, పాఠకుల్ని గందరగోళంలో పడేసి ఏం సాధించాలని?

ఆధునికత గురించీ, ఆధునిక కవి గురించీ వేగుంట అభిప్రాయాలు స్వీయానుభవం నుంచి మాత్రమే వచ్చినవి. ఆధునిక కవి ఏకాకి అంటాడు. సమాజాన్నించి దూరమై పోయాడంటాడు. ఆధునికతకు మారుపేరు అన్వేషణత్వం అంటాడు. ఆ అన్వేషణలో అన్నీ అనుమానలే, సందేహాలే, సంఘర్షణలే అంటాడు. నిజానికి ఇవన్నీ తనలో ఉన్న లక్షణాలు. తనలో ఉన్న ఈ లక్షణాల్నే ఆధునిక కవికి అన్వయించి, సాధారణీకరించి చెప్పాడు.

అసలు ఆధునికత అంటే ఏమిటి? ఆధునికత అనేది కొంత వరకు కాలాన్ని సూచిస్తుంది. 19వ శతాబ్ది చివరి భాగం నుండి మనకు ఆధునిక కాలం ప్రారంభమైందని చెప్పుకోవచ్చు. రాజకీయంగా ప్రజాస్వామ్య విలువలు, సామాజికంగా అసమానతల పట్ల వ్యతిరేకత, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మొదలైనవి ఆధునిక భావాలు. ఆంగ్ల విద్యవల్ల మనకు ప్రపంచం పరిచయమైంది. దాంతో కొత్త భావాలు, విలువలు ఏర్పడ్డాయి. సాహిత్య స్వభావంలో సమూలమైన మార్పు వచ్చింది. సాహిత్య ప్రయోజన దృష్టి ఏర్పడింది. ఈ నేపథ్యంలోనే కందుకూరి వీరేశలింగం తన సంఘ సంస్కరణకు సాహిత్యాన్ని ఒక ఆయుధంగా వాడుకున్నాడు. బ్రిటిష్ పాలన ప్రభావంతో వచ్చిన నూతన సామాజిక విలువలు గురజాడ రచనల్లో తలెత్తాయి. గిడుగు వ్యవహారిక భాషా ఉద్యమం భాషపరంగా ఆధునిక దృష్టిని అలవర్చింది. సాహిత్యానికి సామాజిక పునాది ఉందన్న స్పృహ కలిగింది. ఈ స్ఫూర్తితోనే అభ్యుదయ రచయితల సంఘం, ప్రజా నాట్యమండలి ముందుకొచ్చాయి. ఆధునిక కవి జాతీయోద్యమంతో స్ఫూర్తిని పొందాడు. అంతటితో ఆగక అంతర్జాతీయంగా కూడా అనేక ఉద్యమాల ప్రభావానికి గురయ్యాడు. ప్రధానంగా సోవియట్ బోల్షివిక్ విప్లవం మంచి స్ఫూర్తిని కలిగించింది. శ్రీశ్రీ మహా ప్రస్థానం ప్రభంజనం కొంతకాలం వీచింతర్వాత కొన్ని వైయక్తిక స్వరాలు కూడా వినిపించాయి. ఈ స్వరాలలో ముఖ్యమైనవి అజంతా, బైరాగి, వేగుంట మోహన ప్రసాద్, ఇస్మాయిల్‌లాంటి వాళ్ళవి. ఇంకో వైపున తిరుగబడు కవులు, దిగంబర కవులు తెలుగు కవిత్వాన్ని మలుపు

తిప్పే ప్రయత్నం చేశారు. ఈలోగా నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలు సమాజ పరిణామ క్రమానికి ఒక స్పష్టమైన మార్గాన్ని చూపాయి. విప్లవ రచయితల సంఘం, జన నాట్యమండలి కవులకు, కళాకారులకు మార్గనిర్దేశం చేశాయి.

స్థూలంగా ఆధునిక కవిత్వ పరిణామం ఇదీ అనుకుంటే ఆధునిక కవి ఏకాకి అనడం ఎంతవరకు సమంజసం? ఆధునిక కవి సమాజానికి దూరం ఎలా అయ్యాడు? ఆధునిక కవి దేన్ని అన్వేషిస్తున్నాడు? తెలుగు కవిత్వంలోకి సర్రియలిజం (అధివాస్తవికతా), ఎగ్జిస్టెన్షియలిజం (అస్తిత్వవాదం) మొదలైన ధోరణులు వచ్చాకనే కొందరు ఆధునిక కవులు ఏకాకుయ్యిండాలి. సామాజిక దృక్పథం ఉన్న ఏ కవీ ఏకాకి అయ్యే అవకాశం లేదు. మన భావకవులు కొంతవరకు ఏకాకులుగా కనిపించినా, వాళ్ళకు కనీసం ఊహా ప్రేయసి అయినా తోడుంటుంది. సమాజం గురించి ఆలోచించే కవి ఏ పరిస్థితిలోనూ ఒంటరి కాడు, కాలేడు. ధనస్వామ్య వ్యవస్థకు కవుల్ని ఏకాకుల్ని చేసే లక్షణం ఉంది. సమాజం పట్టని బూర్జువా కవి వ్యక్తివాదంలో మునిగిపోతాడు. ఒకవేళ ప్రజా ఉద్యమాలు బూర్జువా కవిని స్పృశించినా, ఆ ఉద్యమాలను వ్యక్తి స్వభావంతోనే చిత్రిస్తాడు. ఉద్యమాలకుండే సమిష్టి స్వభావాన్ని విస్మరిస్తాడు. 'సంభవామి యుగే యుగే' పద్ధతిలో ఒక మహాపురుషుడు పుట్టుకొచ్చి సమాజాన్ని ఉద్ధరించినట్టు చెబుతాడు. అప్పుడు సమాజానికీ కవికీ ఉన్న బంధం అదృశ్యమైపోతుంది. కవి ఒంటరిగా మిగుల్తాడు. కవిత్వం కవికి కాలక్షేపం వస్తువుగా మారిపోతుంది. బూర్జువా వ్యవస్థ కబంధ హస్తాల్నుండి బయటపడే ప్రయత్నం చేసే కవే ఏకాకి గాక, సమూహంలో భాగం అవుతాడు. తన కవిత్వాన్ని సమాజపరం చేస్తాడు. సమాజం చేత ప్రభావితుడైన కవి మళ్ళీ సమాజాన్ని ప్రభావితం చేస్తాడు. కవి తాను ఏ వ్యవస్థలో ఉన్నాడో, ఆ వ్యవస్థ ప్రభావానికి లోనైపోయేంత బలహీనుడుగా ఉండకూడదు. పాఠకుల్ని ప్రభావితం చెయ్యగల కవి ఏటికి ఎదురీదే మనస్తత్వం కలిగి ఉండాలి. అంతేగాని తన బలహీనతల్ని సిద్ధాంతాల చాటున సమర్థించుకోకూడదు.

వేగుంటపైన అధివాస్తవిక, అస్తిత్వవాద ప్రభావాలుండడం వల్ల కవి ఏకాకి కావడానికీ, సమాజానికి దూరం కావడానికీ అవకాశం ఏర్పడింది. ఉపచేతనలోని అస్తవ్యస్త భావాల్ని యథాతథంగా వర్ణించడం, తర్కంతో గాక వితర్కంతో ఆలోచించడం, తన జీవితంలో నెరవేరని కోరికలను విపరీత వ్యక్తీకరణతో చిత్రించడం, దేశకాలలకతీతంగా అసంబద్ధ ఆలోచనలు చేయడం అధివాస్తవిక కవిత్వ లక్షణాలు. ఇక అస్తిత్వవాదులు మానవ జీవితంలో చీకటికి ఇచ్చే ప్రాధాన్యం వెలుగుకు ఇవ్వరు. వీరి దృష్టిలో మానవ అస్తిత్వం హేతురహితంగా ఉంటుంది. సమాజంలో ప్రతివ్యక్తికీ ఒక నీతి ఉంటుంది. సమాజానికంతటికీ ఉన్న ఒక నీతిని అనుసరించాల్సిన అవసరం లేదు. ఒకవేళ సామాజిక నీతి అశాస్త్రీయమైతే దాన్ని మార్చాల్సిన అవసరం లేదు. అస్తిత్వం అర్థరహితంగానూ, మానవ ప్రయత్నం నిరంతర వైఫల్యంగానూ వీరికి కనిపిస్తుంది. వీరు మృత్యువును ఆహ్వానిస్తారు. నిరాశ, నిస్సహాయత వీరిని ఆవహిస్తుంది. ఎంతయినా వీళ్ళూ సమాజంలో ఉంటారు కాబట్టి అప్పుడప్పుడూ సామాజిక స్పృహతో కూడా రాస్తుంటారు. మెదడును అస్తిత్వవాద, అధివాస్తవిక పురుగులు తొలిచినపుడు దేన్ని గురించి అయినా, ఏ పద్ధతిలోనయినా రాస్తారు. నిరంతరం దేన్నో అన్వేషిస్తుంటారు. అన్వేషిస్తున్నట్టు కనబడతారు. తమ కళ్ళ ముందు ఎన్నో సమస్యలుండగా, ఎన్నో ఉద్యమాలు జరుగుతుండగా వాటిని వదిలేసి, అర్థంగాని అన్వేషణలో కొట్టుకుపోతుంటారు. వేగుంట స్వయంగా అన్నట్టు ఆ అన్వేషణలో అన్నీ సందేహాలే, అన్నీ ప్రశ్నలే. ఆ సందేహాలు తీరవు, ఆ ప్రశ్నలకు సమాధానాలు దొరకవు. "ఆధునిక కవితలో పదాల పొహళింపు బదులు పదాల నిష్ఫలత కనిపిస్తుంది" అని 'పునరపి' గ్రంథంలో అంటాడు. పదాల నిష్ఫలతే కాదు, అన్ని విషయాలలోనూ నిష్ఫలతే లక్ష్యంగా ఉంటుంది. వేగుంట కవిత్వంలో కనిపించే కదలని గడియారం, రాని రైలు లేని కళ్ళు లాంటి పద ప్రయోగాలు ఈ నిరాశా నిస్పృహల నుండి వచ్చినవే. అస్తమిస్తున్న సూర్యుణ్ణి కమలాపండుతో పోలుస్తాడు. ఇటువంటి పోలికను గతంలో ఎవ్వరూ చెయ్యలేదు. అయితే ఆయనకు అస్తమిస్తున్న సూర్యుడు తప్ప, ఉదయిస్తున్న సూర్యుడు కనిపించడు. ఉదయించే సూర్యుడు కూడా కమలాపండులాగే ఉంటాడు గదా! ఆధునిక మానవుడి జీవితం అస్తవ్యస్తంగా తయారయిందని, దాన్ని చిత్రించడానికి అస్తవ్యస్త, అపసవ్య, అసంబద్ధ విధానాన్నే ఎన్నుకోవాలా? వేగుంట కవిత్వం గురించి రాసిన ఒక వ్యాసంలో - సర్రియలిజం అంటే ఒక మాటలో పచ్చి నిజాలని ఎ.బి.కె. ప్రసాద్ అంటాడు. మనిషి మనసులో ఎంత హేతుబద్ధత ఉంటుందో, అంతు హేతురాహిత్యం ఉంటుంది. ఎంత శాస్త్రీయత ఉంటుందో, అంత అశాస్త్రీయత ఉంటుంది. ఎంత మంచి బుద్ధి ఉంటుందో, అంత చెడు బుద్ధి ఉంటుంది. వర్గ వ్యవస్థలో ఇవన్నీ పచ్చి నిజాలే. మంచి చెడుల విచక్షణ లేకుండా, ఏది అవసరం ఏది అనవసరం అనే ప్రయోజన దృష్టి లేకుండా, అన్ని సలక్షణ, అవలక్షణాలను ప్రదర్శించడానికి కవులే కావాలా?

"ఏ కవితలోనైతే వస్తువు ఫలానా అనేది కాంక్రీట్‌గా ఉండదో ఆ కవితకు కవిభావం బలాన్నిస్తుందని, ఈ భావమే వస్తువుగా మారగలదని కవి చెప్పాడు. మోహన్‌ప్రసాద్ విషయంలో చాలామంది దారితప్పడానికి కారణం ఈ క్లూని అందుకోలేక పోవడమేనని నాకు అనిపిస్తుంది" అని సీతారం అంటాడు. వేగుంట కవితా ధోరణిని సమర్థించే కొద్దిమంది విమర్శకుల్లో సీతారాం ఒకరు. ఇందులో గమనించవలసినవి రెండు విషయాలున్నాయి. వేగుంట కవిత్వంలో స్పష్టమైన వస్తువు లేదనేది మొదటి విషయం స్పష్టమైన వస్తువు లేనప్పుడు ఆ కవిత్వానికి కవిభావం బలం చేకూరిస్తుందనేది రెండో విషయం. వేగుంట కవితలలో స్పష్టమైన వస్తువులు కూడా అక్కడక్కడా కనిపిస్తాయి. అయితే ఒక వస్తువులోంచి హఠాత్తుగా మరో వస్తువులోకి వెళ్ళడం అతని ధోరణి. అలా ఎందుకు వెళుతున్నాడో తెలియకపోవడం వల్ల పాఠకుల్లో

అస్పష్టత వస్తుంది. స్పష్టమైన వస్తువు లేనప్పుడు కవి భావం బలంగా ఉండడమేమిటి? వస్తువు లేకుండా భావం ఉంటుందా? ఏ భావం అయినా ఏదో ఒక వస్తువును అంటి పెట్టుకునే ఉంటుంది గదా? ఒకవేళ వస్తువుతో సంబంధం లేకుండా భావం ఉన్నా, అది మాత్రమే బలంగా ఎలా ఉంటుంది? వస్తువుతో సంబంధం ఉన్న భావం బలంగా ఉండదా? ఇదేనా వేగుంట తన దగ్గరుందని చెప్పుకున్న తాళం చెవి? ఇదేమి చిదంబరం రహస్యం? ఒక తాళం చెవితోనో, ఒక క్లూతోనో ఒక కవి కవిత్వం అర్థం కావడం అనేది కవిత్వ లక్షణమేనా? వేగుంట 'అన్వేషణ'లో లాగా నాకూ అన్నీ ప్రశ్నలే, సందేహాలే!

'కాంక్రీట్' అంటే 'విజువల్' అనే అర్థం ఇచ్చాడు వేగుంట. 'existing in material form' అని నిఘంటువులోని అర్థం. భౌతిక రూపంలో ఉండడం అని. విజువల్ అంటే దృశ్యరూపం. "వస్తువు ఫలానా అనేది కాంక్రీట్‌గా ఉండదో" అని సీతారాం అనడంలో కొంత అర్థ భేదం కనిపిస్తుంది. 'ఫలానా అనేది' అనేమాట 'స్పష్టంగా' అనే అర్థాన్నిస్తుంది. ఇంకా చెప్పాలంటే నిర్దిష్టంగా అని ఒక వేళ సీతారాం అభిప్రాయం కూడా విజువల్ అనే అనుకున్నా వేగుంట కవిత్వంలో అనేక సందర్భాల్లో దృశ్యరూపంలో ఉన్న వర్ణనలు కనిపిస్తాయి.

"ఝంగు ఝంగుమని దగ్గుతోన్న ఇనుప మ్రోతలో
జుట్టు పైకెగ దువ్వుకొని పోతోన్న రైలుబండీ" (చితి-చింత)

"కాలం ప్రవహిస్తుంది
మన మానసిక భావజాలం కాలజలంలోకి
కాగితప్పడవలా కదలిపోతుంది" (రహస్తంత్రి)
"చరిత్ర చొక్కా కాలర్ పుచ్చుకొని అడుగుతోంది
ఇక్కడొక సముద్రం ఉండాలి ఏం చేసావ్" (సాంధ్యభాష)

మొత్తం మీద వేగుంట కవిత్వంలో వస్తువున్న కవితలూ, అనేక వస్తువులు కలగాపులగంగా ఉన్న కవితలూ, వస్తువు విజువల్‌గా ఉన్న కవితలూ, వస్తువు అస్పష్టంగా ఉన్న కవితలూ, అసలు వస్తువు ఉందో లేదో తెలియని కవితలూ అన్ని రకాలా ఉన్నాయి. ఎక్కడో తప్ప సంక్లిష్టత తరచుగా కనిపిస్తుంది. భాషని దృశ్యకళగా మార్చే ప్రయత్నంలో స్పష్టత వస్తుందనీ, అప్పుడు కవిత్వం ఫోటోగ్రఫీగా మారి కవిత్వం కాకుండా పోతుందనీ, కాబట్టి కవిత్వాన్ని ఆ కవిత్వపు ఛాయల నుండి కాపాడే క్రమంలో సంక్లిష్టత అనివార్యంగా వస్తుందే తప్ప, కవులు కావాలని సృష్టించేది కాదనీ తిరుపతిరావు అంటాడు. మొత్తం కవిత్వంలోని సంక్లిష్టతకు ఇది సమర్థన. ఒట్టి సమర్థన కాదు, సిద్ధాంతపరమైన సమర్థన. ఇక్కడ దృశ్యకళ అనే మాటని పైన వేగుంట ఉపయోగించిన కాంక్రీట్ - విజువల్ - అనే అర్థంలోనే వాడాడని అనుకుంటున్నాను. ఫోటోగ్రఫీ అనేమాట యథాతథంగా - ఉన్నదున్నట్లుగా అనే అర్థాన్నిస్తుంది. కానీ ఇందులో ఒక పేచీ ఉంది. ఫోటోగ్రఫీ కూడా ఒక కళే అనే అభిప్రాయమూ ఉంది. కళ అన్నప్పుడు అందులో సృజనాత్మకత ఉంటుంది. కవిత్వంలో కూడా సృజనాత్మకత ఉంటుంది. అలాంటప్పుడు సృజనాత్మకత లేనిది అనే అర్థంలో ఫోటోగ్రఫీ అనే మాటను ఉపయోగిస్తే అభ్యంతరం కూడా కావచ్చు. దీన్నిలా ఉంచితే, దృశ్యకళగా మార్చబడిన కవిత్వంలో అకవిత్వపు ఛాయలుంటాయనడం విడ్డూరంగా ఉంది. మొత్తం మీద సంక్లిష్టంగా ఉంటేనే కవిత్వం కవిత్వంగా ఉంటుందని ఈ సిద్ధాంతం. ఇటువంటి కవిత్వానికి పదుల సంఖ్యలో కూడా పాఠకులుండడం జరగదు. స్పష్టం, అస్పష్టం అనే పదాలకి 'పునరపి'లో వేగుంట ఇచ్చిన అర్థాలను చూడండి - "స్పష్టం అంటే చెప్పేందుకిక ఏమీ లేకపోవటం. అస్పష్టమంటే ఏమీ ఎందుకని చెప్పటానికి ఏమీ లేదని ఎందుకని చెప్పటం లేదనో తెలియక పోవటమే." ఇది చదివిన సాధారణ పాఠకుడు పిచ్చాసుపత్రికి పోవడం స్పష్టం.

కవిత్వంలో అస్పష్టత, సంక్లిష్టత గురించి మాట్లాడే వాళ్ళకు ఆ రెండింటికీ అర్థ భేదం తెలియదని ఒక విమర్శ ఉంది. అస్పష్టత అంటే obscurity (not clear) లేదా అనేకార్థాలు వచ్చే విధంగా చెప్పడం. సంక్లిష్టత అంటే complicated structure ఈ రెండిటి ఫలితం సాహిత్యాభిమాని అయిన పాఠకుడు కవిత్వాన్ని అర్థం చేసుకోవడంలో కష్టాల్ని ఎదుర్కోవడం. దాన్నే అర్థం కావడం లేదనీ, అస్పష్టంగా ఉందనీ, సాధారణ భాషలో అంటుంటారు. పామరులకు పండితుల భాష తెలియకపోవచ్చు. కాని పండితులకు పామరుల భాష కూడా తెలియాలి. మా కవిత్వానికి పండితులే పాఠకులు అనుకుంటే - ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు!

వేగుంటకు అసలు సామాజిక విషయాలే పట్టవనుకోవడం పొరబాటు. ఆయన కవిత్వంలోని వస్తు సామాగ్రిలో ఇది కూడా ఒకటి. నిజానికి తానున్న సమాజంలో జరిగే సంఘటనలను ఎవరూ నిర్లక్ష్యం చెయ్యరు. ఏదో ఒక రకంగా పట్టించుకుంటారు. ఏదో ఒక రకంగా పట్టించుకోవడాన్నే సామాజిక స్పృహ అంటారు. పట్టించుకోవలసిన పద్ధతిలో పట్టించుకుంటే దాన్ని సామాజిక చైతన్యం అంటారు. ఇది అలవడటానికి ఎంతో కొంత మార్క్సిస్టు దృక్పథం అవసరం. మార్క్సిజం తెలియకుండా, దాన్ని అన్వయించడం తెలియకుండా ఎంత జ్ఞానం సంపాదించినా, అది పర్వతంలా పేరుకుపోతుందే తప్ప ఉపయోగంలోకి రాదు. సాహిత్యానికి సంబంధించి వేగుంట సంపాదించిన జ్ఞానం అపారమైనది. అందులో సందేహం లేదు. అయితే అది తగిన విధంగా వినియోగంలోకి రాలేదు. అందుకు కవిత్వం పట్లా, పాఠకుల పట్లా ఆయనకున్న దృక్పథమే కారణం.

'మనసులోని మాయను మాపేది కవిత' అనీ, 'కవిత శాంతిదూత' అనీ 'పునరపి'లో అంటాడు. అదే గ్రంథంలో 'కవి మృత్యువు గురించి చెప్పాలి. చావు కబురు చల్లగా చెప్పేవాడే కవి' అని కూడా అంటాడు. ఆయన అభిప్రాయాలలో ఇలాంటి వైరుధ్యాలు అనేక సందర్భాల్లో కనిపిస్తాయి. కవిత్వంలో కవి అన్ని విషయాలనూ చెప్పకూడదనీ, కొన్నిటిని దాచిపెట్టాలనీ, పాఠకుల ఊహలకు వదిలెయ్యాలనీ అనే వేగుంట అభిప్రాయం సరైనదే.

సమస్యంతా ఆయన దాచిపెట్టకుండా చెప్పిన వాటిలోనే.

వేగుంట ఎంత క్లిష్టంగా రాయగలడో, అంత సరళంగానూ రాయగలడు.

"పొద్దున్నే లేచి చద్దన్నం తింటానిక్కడ
నాలుగెకరాలు కేలుక్కూడ చేస్తున్న
అరక్కెళ్లాను ఛూఛా అని
కుప్ప నూర్పుళ్ళప్పుడు మరీ ఆకలేస్తుంది
పొలంలో రెండు చేతుల్తో తింటాం అన్నం
మీకంటే మాకు ఆకలెక్కువ (వేకానీ అన్నం తక్కువ)"

- ('చితి-చింత'లో రహస్తంత్రి అనే కవితలోంచి)

మొదటి నాలుగు చరణాలు వాచ్యంగానే ఉన్నాయి. చివరి రెండు చరణాల్లో కవిత్వం ఉంది. అయితే మొదటి నాలుగు చరణాల కొనసాగింపుగా చివరి చరణాలలోని భావానికి బలం వచ్చింది. పొలాల్లో పని చేసేటప్పుడు శ్రమజీవులు దోసిళ్ళతో అన్నం తింటారు. రెండు చేతుల్తో తినడం ఆకలెక్కువ కావడం వల్లే అనే చమత్కారం ఉంది. ఆకలెక్కువే గానీ, అన్నం తక్కువ అనడంలో శ్రమదోపిడీ స్ఫురిస్తుంది.

"మూర్ఛలో
ఉన్నాడో ఏమోగాని నోటినిండా చొంగ
దేనినీ చూడలేక లోపలికి తిరిగిపోయిన కళ్ళు
ఆకలిని
బండబూతులు తిట్టి ఆగిపోయిన పెదాలు
చెడ్డీలో ఎండి ఆరిపోయిన దేహమాలిన్యం

- ('రహస్తంత్రి'లో చచ్చిన శవం అనే కవితలోంచి)

ఎంత అద్భుతమైన కవిత ఇది! ఎంత సహజమైన చిత్రణ ఇది! ఎంత కాంక్రీటీ (విజువల్) వర్ణణ ఇది! సంక్లిష్టత లేకుండా ఎంత బాగా అర్థమవుతున్న కవితి ఇది! సీతారాం, తిరుపతిరావుల దృష్టిలో, బహుశా వేగుంట దృష్టిలో కూడా ఇది గొప్ప కవిత కాదేమో!

వరవరరావు జైల్లో ఉన్నప్పుడు 1988లో 'వరవరరావు కోసం' అని ఒక కవిత రాశాడు.

"నీ కవిత్వం వెలకట్టలేని వెల్తుర్లా ఉన్నది
కాని చివరికి అమ్ముకోలేని నెత్తుర్లా ఉన్నాది
డార్క్ రూం లోంచి వెళ్ళిన సూర్యుడివి
రిమాండయిన శిశిర చంద్రుడివి
ఖైదీలను పలకరిస్తూ బందీల
స్వేచ్ఛని పులకరిస్తూ
లాకప్ నించి
అన్ లాకప్ చేస్తోన్న నిను
చూచిన్నూ నేను
'సబ్ ఠీక్ హై' అంటోన్నాను!"

- ('రహస్తంత్రి' లోంచి)

సాటికవి నిర్బంధానికి స్పందించడం సాహిత్యరంగంలో ఆరోగ్యకర లక్షణం.

"నిజానికి నీళ్ళు లేని సముద్రాన్ని లక్షా ఇరవై వేల చేతుల్తో తిప్పుతున్నాను.

దప్పిక గొన్న నాలుకల చేతుల్ని అనంతపూర్ ఎడారి మీద పరుస్తోన్నాను"

- ('సాంధ్యభాష'లో 'అలీనం' కవిత)

"పౌరహక్కుల నరమాంసాల్ని ఎంతగా నంజుకుతిన్నా
ఎందుకనింకా నా గుండెలో ఏ ఖగోళమూ పగలదు"

- ('సాంధ్యభాష'లో 'అన్వేషణ' కవిత)

"ఏది పర్వతోన్నతమో
ఏది లోయలాలిత్యమో
తెలీక ఒక్కసారిగా పగిలి
కొంపాగోడుల మీద పొగిలి
పైరుపంటల మీద రగిలి
ఆకాసం బోర్లా, నదులు వెల్లకిలా"

- ('నిషాదం'లో 'దయాహీన నదులు' కవిత)

మన సమాజంలో జరుగుతున్న సమకాలీన సంఘటనల పట్లే కాదు, అంతర్జాతీయ రాజకీయ దుశ్చర్యల పట్ల కూడా వేగుంట స్పందించిన సందర్భాలున్నాయి. ఇరాక్‌పై అమెరికా దుర్మార్గ దాడి జరిగిన తర్వాత 'ఇక పునర్నిర్మాణం' అనే కవిత రాశాడు.

"ఓ ఘనకార్యమై పోయింది కదా
పునర్మిర్మాణం కార్యక్రమంలో
ఇక మిగిలిన వల్లా ఒకటా రెండా
పాలెస్తీనా జోర్డాన్ సిరియాలు
కొరియాలక్కూడ కొరివి పెట్టాలికదా
ఇక భారత్ భరతం పట్టాలి కదా
చరిత్ర పుటల్ని చింపేయాలి కదా!"

- ('నిషాదం')

నైజీరియన్ ప్రజాకవీ, ఉద్యమకారుడూ అయిన కెన్‌సారో వివాను 1995 నవంబరు 10న ఉరితీశారు. తమ చమురు నిక్షేపాలలో తమకు సముచితమైన వాటా కోరిన ఒగోనీ జాతీయుల పక్షాన "ఒగోనీ ప్రజా పరిరక్షణ ఉద్యమం" నడిపినవాడు కెన్ సారో వివా. అతనితో పాటు మరో ఎనిమిది మందిని కూడా ఉరితీశారు. దీనికి స్పందించి రాసిందే "సారో సారో" అనే కవిత.

"సైనిక న్యాయహత్యల్ని
మా అరక్షిత అరచేతుల్తోనైనా అడ్డుకుంటాం
చూస్తూనుంచున్న వాడూ హంతకుడే
చేతులెత్తేసిన రాజ్యాలూ హంతకిలే
ఒగోనీ నేలా పుష్పించు / భోపాల్‌రాత్రీ స్వప్నించు
షెల్ మయ్యా తగలడు / కార్బైడ్ విషగళం పగిలిపో
మళ్ళీ ఓ మాటు
సాకొటో అంతర్జాతీయ రన్‌వే మీదకి
రొమ్ము విరుచుకు చొచ్చుకు పోవాలనుంది
రారా నా కొడకా

సానీ అబాచా
సారో హంతకుడా"

- ('సాంధ్య భాష')

ఇంకా లాతూర్ భూకంపం గురించీ (కలాజ్), ఆయేషా కేసు గురించీ (ఏది న్యాయం), నావికాదళ ఉద్యోగి మురళీధరన్ లాకప్ డెత్ గురించీ (రశ్మి) కూడా సాధారణ పాఠకుల్ని సైతం స్పందింపజెయ్యగల కవితలు రాశాడు. "ప్రతి పౌరుడూ పరతంత్రుడే" అని గుర్తుచేసుకోవాల్సిన సందర్భం "పంద్రాగస్టు ప్రమాదం" గురించి రాసాడు. "పన్ను కట్టనివాడే సంపన్నుడు" అని సంపదను కూడబెట్టే చిట్కాలలో ఒకదాన్ని బయటపెట్టాడు. వేగుంట కవితా సంపుటాలన్నిటిలోంచీ ఇలాంటి కవితల్ని ఏరి ఒక సంకలనంగా తెస్తే ఆ ఒక్క సంకలనంతోనే ఆయన మంచి కవిగా, అర్థమయ్యే కవిగా, ప్రజల కోసం రాసిన కవిగా నిలుస్తాడు.

"అసలు నీ ఫిలాసఫీ ఏమిటి గురూ?
తెలియదు కానీ కాస్తంత ఇది కాదని, కాస్తంత అది కాదని,
కాస్తంత ఏదీ కాదని శ్వాసించే జీవితపు నిశ్వాసపు ఆఖరి
ఆవులింత, అంతమాత్రాన అది అంతము కాదు
మేల్కొనే నిద్రలా నిద్రించే స్వప్నంలా స్వప్నించే
మెలకువలా ఒక చావబోయే మృత శిశువు చన్ను
చీకిన పాలబిందువు శాశ్వతత్వపు సమాధి యోగ నిద్ర."

- ('పునరపి')

ఈ 'మాటల మయసభ'లో వేగుంట 'మాయలాంతరు' కూడా మనకు దారి చూపించలేదు. సింబల్స్ తెలిసినవే అయ్యుండాలని ఇజ్రాపౌండ్ ఇచ్చిన సలహా కూడా పాటించని మొండివాడు.

వేగుంటలో సంఘర్షణ ఉంది. మథన పడడం ఉంది. బాధ ఉంది. ఆవేదన ఉంది. వీటన్నిటినీ కవిత్వీకరించగల శక్తి ఉంది. దీనికి తోడు ఆవగింజంత కాదు, తాటికాయంత వెర్రి ఉంది. వర్తమాన వ్యవస్థను బలంగా నిరసిస్తాడు. భవిష్యత్తులోకి చూడకుండా గతంలోకి పారిపోతాడు. వేమన, ఇలియట్, విశ్వనాథ, సార్త్రే, రవీంద్రుడు వీరందరి భావ మార్గాల కూడలిగా వేగుంట తాత్విక చింతన కె.వి.ఆర్.కు కనిపించింది. కె.వి.ఆర్. మర్యాదగా అన్నాడుగానీ, అది భావ మార్గాల కూడలి గాదు తాత్విక గందరగోళం అనాలి.

వర్తమాన వ్యవస్థను నిరసించినవాడు తనకు నచ్చిన పద్ధతిలో మార్పు కోరుకోవాలి గదా! కవులు కోరుకున్నంత మాత్రాన సమాజంలో మార్పు రాదు. కానీ రావలసిన మార్పు గురించిన ఆశ ఉండాలి. దాని గురించిన అవగాహన ఉండాలి. ఆ అవగాహనను పాఠకులలో కలిగించాలి. కవి ఈ బాధ్యతను నిర్వర్తించి తీరాలి. దానికి సిద్ధాంతం ఉండాలి. అది మార్క్సిజమై ఉండాలి.

ప్రతి సమాజానికీ ఒక యుగ చైతన్యం ఉంటుంది. ఆ యుగ చైతన్యం ఛాయలో కవి తన వ్యక్తిత్వం కోల్పోయి బతకాల్సిన అవసరం లేదు. ఆ వెలుగులో తన వ్యక్తి చైతన్యాన్ని తనదైన పద్ధతిలో వ్యక్తీకరించుకోవడంలోనే కవి గొప్పదనం ఉంది.

ఒక సందర్భంలో వేగుంట అంటాడు - తన అన్వేషణ అస్తిత్వం యొక్క అర్థాన్ని గురించి అని. సమాజానికొక అస్తిత్వం ఉంది. సమాజానికొక పరిణామం ఉంది. సమాజానికొక చైతన్యం ఉంది. అన్వేషణ సాగవలసింది ఇక్కడ. వ్యక్తిగా మానవుడి మనోక్లేశాల్ని ఎవరూ పట్టించుకోవడం లేదని బాధపడే ఈ కవి, ఆ మానవుణ్ణి విడిగా వ్యక్తిగా చూస్తున్నాడే తప్ప సమాజంలో భాగమైన మానవుడిగా చూడ్డం లేదు. ఇక్కడే ఆయన దారి వేరై పోయింది. 1964లో వచ్చిన 'రాత్రి' కవితా సంకలన కవి బృందంలో ఎలా చిక్కుకున్నాడో తెలియదు గానీ, వెంటనే 'మేలుకొని' తనదారి తాను చూసుకున్నాడు. తిరుగబడు కవులు, దిగంబర కవులు, విప్లవ రచయితలు - ఎక్కడా తన అడ్రసు లేకుండా చేసుకున్నాడు. 1969లో 'చితి-చింత' కవితా సంపుటి రావడంతో ఒక నైరాశ్య కవిగా మిగిలాడు. సంక్లిష్ట కవిగా ఎదిగాడు. తన చితిని తానే పేర్చుకుంటున్నానన్న చింత లేకుండా తన గదిలో ఒంటరిగా ఉండిపోయాడు. "మనం మాట్లాడేదంతా మౌనం కోసం" అంటూ చివరకు మౌనంగా వెళ్ళిపోయాడు.

వేగుంట మోహన ప్రసాదే అన్నట్టు "ప్రేలాపన అంతా కవిత్వం అనలేం, ఆలాపనే కవిత్వం."



వ్యాసం

# ఆధిపత్య క్రీడలో పావులు దళితులు రెండు సందర్భాలు..

- పి.వరలక్ష్మి

ఒకటి: కడప జిల్లా జమ్మలమడుగు ఎం.ఎల్.ఏ. ఆదినారాయణ రెడ్డి తన అనుచరునిపై అక్రమంగా కేసులు పెట్టారని పోలీస్ స్టేషన్ ముందు ధర్నాకు దిగారు. ఇదివరకైతే ఆదినారాయణ రెడ్డి మనిషి మీద కేసు పెట్టడమా అని జిల్లా ప్రజలు ఎవరైనా ఆశ్చర్యపోతారుగాని ఇప్పుడు మారిన రాజకీయ సమీకరణల్లో దానికి సమాధానం వెతుక్కుంటారు. రాష్ట్ర రాజకీయాల్లో , మీడియాలో హాట్ టాపిక్ అయిన కాంగ్రెస్ చీలిక, దానికి కేంద్రమైన కడప జిల్లాలోనూ కొన్ని పరిణామాలకు దారి తీసింది. ఏనాడూ ఎవరూ చేయని సాహసం జమ్మలమడుగు పోలీసులు చేయడానికి బహుశా ఇదే కారణం కావొచ్చు. అధికార వర్గం నుండి అసమ్మతి వర్గం చీలిక వర్గానికి మారిపోయిన నాయకుడు తన ఆధిపత్యం రవ్వంత జారినపుడు కాస్త ఎక్కువగానే ఉలిక్కిపడ్డాడు. అతని ఆధిపత్య నిరూపణలో ఒక దళిత కుటుంబం బలైపోయింది.

ఇంతకూ జరిగిందేమిటంటే ఆదినారాయణ రెడ్డి అనుచరుడు కొండయ్యకు చెందిన తోటలో ఇద్దరు పిల్లలు పచ్చిటెంకాయలు దొంగిలించారని తోటయజమాని కొడుకు మల్లికార్జున, అతని ట్రాక్టర్ డ్రైవర్ వాళ్ళను వాతలు తేలేలా కొట్టి బట్టలూడదీసి ట్రాక్టర్‌పై ఊరంతా తిప్పారు. జిల్లా పేపర్లలో ఈ వార్త ప్రముఖంగా వచ్చింది. 10, 11 ఏళ్ళ చిన్నారులపై జరిగిన ఈ దారుణం చూసి జాలిపడడం, తిట్టుకోవడం మినహా జనం ఏమి చేయగలరు? కడప జిల్లా కదా. ఎప్పుడైనా ప్రతిపక్షాలు వాళ్ళకవసరమైతే ఉనికి చాటుకుంటూ ఉంటాయి. పత్రికల్లో వార్త వచ్చిన మరుసటి రోజు పోలీసులు జరిగిన సంఘటనపై వాళ్ళ పద్ధతిలో స్పందించారు. ఉదయాన్నే నిందితుల ఇంటికి వెళ్ళి మల్లికార్జునను, బాధిత పిల్లలను, వారి తల్లిదండ్రులను పోలీస్ స్టేషన్‌కు తీసుకొచ్చి రాజీ ప్రయత్నాలు మొదలు పెట్టారు. ఈలోగా మల్లికార్జున అనుచరులు 50మందికి పైగా పోలీస్ స్టేషన్‌పై పడ్డారు. ఇంతలో అక్కడికి చేరుకున్న సిఐ మల్లికార్జునను రెండు దెబ్బలు కొట్టాడు. అతని అనుచరులు ఘర్షణకు దిగారు. మధ్యాహ్నానికి ఎం.ఎల్.ఏ. రంగంలోకి దిగాడు. ఎవరేమనుకుంటారోనన్న లెక్క లేకుండా నిందితుడి కోసం నిస్సిగ్గుగా ధర్నాకు దిగాడు. అనవసరంగా తన కార్యకర్తలను ఇబ్బంది పెడుతున్నారని, తనపై రాజకీయ కక్షతోనే కొంతమంది ఇలా చేయిస్తున్నారని గొడవ చేశాడు. పనిలోపనిగా సాక్షితో సహా కవరేజి కోసం వచ్చిన విలేకర్లపై డబ్బులు తీసుకొని వార్తలు రాశారని ఎం.ఎల్.ఏ. అనుచరులు తిట్లకు దిగడం, నువ్వెప్పుడైనా మాకు డబ్బులిచ్చావా? అని విలేకర్లు నిలదీయడం అన్నీ బహిరంగంగానే జరిగాయి జమ్మలమడుగులో! అంతాకలిసి నిందితులు పిల్లల్ని కాస్త మందలించారని, అది కూడా తల్లిదండ్రులు చెప్పిన మీదటే అలా చేశారని స్వయంగా పిల్లల తల్లిదండ్రులతో చెప్పించాడు. పెద్దోళ్ళతో మేం పెట్టుకోలేమని, మాకంత శక్తిలేదని, మమ్మల్ని వదిలేయండని వాళ్ళు విలేకర్లతో వాపోయారు. ఇంతవరకే అయితే కొత్తగా చెప్పుకునేదేముంది?

ఇక్కడ పోలీసులు నిందితులపై ఎస్.సి./ఎస్.టి. అట్రాసిటీ కేసు పెట్టి జమ్మలమడుగులో తొలిసారిగా వాళ్ళ ఉనికి చాటుకున్నారు. కాని ఆదినారాయణ రెడ్డి ఆగ్రహానికి అది నిలవలేక పోయింది. అది జరిగిన తీరు మరుసటిరోజు ప్రజాసంఘాలు బైటపెట్టవలసి వచ్చింది. మేము బాధిత పిల్లవాడు విజయ్ ఇంటికి పోయి అతని తల్లిని పలకరించాము. మొదట్లో ఏదడిగినా 'నాకు తెల్దు' అంటూ వచ్చినా చివరికి తన బాధను, భయాన్ని వెళ్లబోసుకుంది. పోలీస్ స్టేషన్ నుండి వచ్చాక సాయంకాలం నాలుగు గంటల ప్రాంతంలో ఏడెనిమిది మంది గుంపుగా ఇంట్లోకి జొరబడి ఎవరు మీరు అంటే పోలీసులం అన్నారట. (వాళ్ళలో రెవెన్యూ సిబ్బందిని అక్కడి వాళ్ళు గుర్తుపట్టామని చెప్పారు.) గోడకు ఏసు క్రీస్తు పటాలు తగిలించి, వాటి ముందర తల్లి, పిల్లల్ని నిలబెట్టి ఫొటోలు తీసుకుని, ఏదో కాయితం మీద విజయ్ తల్లి, పిల్లల సంతకాలు, దారిన పోయేవాళ్లవి కొన్ని సంతకాలు తీసుకుని ఎవరైనా మీరే కులం అని అడిగితే మాలోళ్ళం అని కాదు, క్రిష్టియన్లం అని చెప్పమని బెదిరించారు. ఎవరు మా ఇంటికొచ్చినా భయంతో వణుకు పుడ్తాందని, మమ్మల్ని చూసి కూడ భయపడిపోయిందని ఆమె చెబుతుంటే రెండు రోజులుగా వాళ్ళను ఎంత హింస పెడుతున్నారో ఊహించగలిగాం. ఎస్.సి./ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం కింద పెట్టిన కేసుల్ని కొట్టేయడానికి ఇదొక పద్ధతన్నమాట. దళితులైనా క్రైస్తవ మతాన్ని అవలంబిస్తే వాళ్ళు బిసి(సి) కిందికొస్తారని, రూల్సు అలా ఉంటే మేం చెయ్యగలిగిందేముంది అంటాడు ఎం.ఆర్.ఒ. అంతే కాదు, ఈ రూల్ మార్చాలని మీరు పోరాటం చేయండని సలహా ఇస్తాడు. ఉన్నట్టుండి వాళ్ళు క్రిష్టియన్స్ అని ఎలా తేలుస్తారు అంటే ఆమె పేరు మేరీ అని, తండ్రి విలియమ్స్ అని, ఆమె, ఆమె తల్లిదండ్రులు చర్చిలోనే పెళ్ళిళ్ళు చేసుకున్నారన్న సంగతి స్వయంగా ఆమె చెప్పిందని ఆయనంటాడు. (విజయ్ తల్లి పేరు మేరీ అయితే, తండ్రి పేరు రాములు. అక్కలు కల్పన, మణితేజ) నిజానికి ఆ కాలనీలో చాలా ఏళ్ళుగా కుల ధృవీకరణ పత్రాలు ఇవ్వలేదని

స్థానిక దళిత సంఘం నాయకుడు సింగరయ్య చెప్పాడు. అతని కూతురు ఎస్.సి. సర్టిఫికెట్‌తో చదువుకుంటుంటే అతనికి మాత్రం ప్రభుత్వ రుణం దరఖాస్తు చేసుకోడానికి ఎస్.సి. సర్టిఫికెట్ ఇవ్వలేదని కూడ చెప్పాడు. వాటి కోసం కాలనీ ప్రజలు వివిధ స్థాయిల అధికార్లకు వినతి పత్రాలు ఇచ్చారు, ఎన్నో ధర్నాలు చేశారు. వీరంతా మైలవరం డ్యాం ముంపు ప్రాంతం నుండి ఇక్కడికి వలస వచ్చిన వాళ్ళు.

విజయ్ ఇంటిపై దాడి చేసిన రోజు ఆదివారం. ఆ రోజు ఎం.ఆర్.ఒ. కులధృవీకరణ పత్రం ఇస్తాడు. అది కూడ పోలీసు విచారణలో భాగంగా బాధితుల కులం గురించి ఎం.ఆర్.ఒ. అడిగిన రెండు గంటల్లోనే. ఇవన్నీ ఎం.ఎల్.ఎ. "ధర్నా" తర్వాత చకచకా జరిగిపోయాయి. ఆదినారాయణ రెడ్డికి ఊడిగం చేయడానికి నీకు ఉద్యోగం ఇచ్చారా అని జయశ్రీ(మానవ హక్కుల వేదిక) అంటే ఆగ్రహించిన ఎం.ఆర్.ఒ. శివరామయ్య తన నిజాయితీని నిరూపించుకోడానికి మేరీని పిలిపించాడు. కచ్చితంగా ఆమె నిజం చెప్పలేదని మాకు తెలుసు. ఆదినారాయణ రెడ్డి ముందు ఆమె ప్రాణమెంత? ఎలా నిజం చెప్తుంది అన్నాం. కాని ఆమె బిడ్డల మీద ప్రమాణం చేసి జరిగిందంతా చెప్పింది. మా పిల్లోని కొడ్తే నేనేమీ అనలేదు. మా కర్మలే అనుకున్నా. పోలీసోల్లే మమ్మల్ని పిలిపిచ్చి కేసు రాసుకున్నారు. ఆపొద్దు నుంచి మా ఇంట్లోకి గుంపులు గుంపులుగా ఎవరెవరో వస్తున్నారు, రాస్కుంటున్నారు, ఫొటోలు తీస్కుంటున్నారు. నాకు ఒకటేమైన భయమైతాంది. మా పిల్లోల్లు సదూకుంటున్నారు. మకన్యాయం సేయబాకండి సార్ అని కన్నీళ్ళు ధారాపాతంగా కారుస్తూ చెప్పిందామె. ఈలోగా విషయం తెలుసుకున్న దళిత సంఘాలు అక్కడికి చేరుకున్నాయి. విలేకర్లతోనూ, ప్రజా సంఘాలతోను రెవెన్యూ కార్యాలయం కిక్కిరిసింది. వాళ్ళను చూసి ఆమె బెదిరిపోతే వాళ్ళంతా నీకోసమే వచ్చినార్లే అని చెప్పాం. ఒక విద్యార్థి ఇంటర్వ్యూ ఉందన్నా తనకు సర్టిఫికెట్ ఇవ్వలేదని, ఎప్పుడుబడితే అప్పుడు ఇవ్వడం కుదరదని చెప్పి ఇప్పుడు ఆదివారం రోజు ఎలా ఇస్తావని నిలదీస్తే, నా కూతురు ఎస్.సి. అయితే నేను ఏమైతాను సార్ అని సింగరయ్య తగులుకున్నాడు. ఒక దళిత నాయకుడు ప్రవేశించి ఇటీవల ఎస్సీ ఎస్.టి. కేసుల్ని నీరుగార్చడానికి ఇలాంటి దురాగతాలు జరుగున్నాయని, దీన్ని సహించి ఊరుకునేది లేదని ఎం.ఆర్.ఒ. ఆఫీసును ముట్టడిస్తామని ఓ పది నిమిషాలు ఆవేశంగా ఉపన్యాసం ఇచ్చినంత పని చేసి వెళ్ళిపోయాడు. ఏం చెప్పాలో దిక్కు తెలీక నాకు వేరే పనుందని చెప్పి ఎం.ఆర్.ఒ. అక్కడి నుండి జారుకున్నాడు.

జరిగిన అల్లరికి ఎం.ఆర్.ఒ.ను బదిలీ చేశారు. సింగరయ్యకు ఎస్.సి. సర్టిఫికెట్ ఇస్తామన్నారు. పిల్లల్ని హింసించి, అవమాన పరచిన మల్లిఖార్జునతోపాటు మరో ముగ్గురిపై ప్రొటెక్షన్ ఆఫ్ సివిల్ రైట్స్ కింద సులభంగా బెయిల్ దొరికే కేసు నమోదు చేశారు పోలీసులు. మేరీ కుటుంబాన్ని క్రైస్తవులుగా గుర్తిస్తూ వాళ్ళని ప్రభుత్వం బిసి(సి) కింద నమోదు చేసుకుంది.

రెండు: 2008 ఆగస్టులో మైదుకూరు మండలం నక్కలదిన్నె గ్రామం జగన్ సభను బహిష్కరించి వార్తల్లోకెక్కింది. జగన్ మీటింగ్ నాటికి దాదాపు ఊరంతా ఇళ్ళకు తాళాలేసి వెళ్ళిపోయారు. జగన్ బైటి జనాన్ని రప్పించి మీటింగ్ జరిపించాడు. మరుసటిరోజు ఇళ్ళకు తిరిగొచ్చిన జనం జగన్ వచ్చివెళ్ళాడని ఊరిని శుద్ధి చేశారు. అప్పటిదాకా మాజీ ఎం.ఎల్.ఎ. రఘురామిరెడ్డి ఆధిపత్యంలో ఉన్న గ్రామంలోకి జగన్ ప్రవేశించాడు. పాతికేళ్ళ తర్వాత మళ్ళీ ఆ ఊళ్ళో ఫ్యాక్షన్ రాజుకుంది. ఆధిపత్యపోరు రెండు హత్యలకు దారితీసింది. పంటలు వాశనం చేసుకున్నారు. ఊర్లోకి పోలీస్ పికెట్ వచ్చింది. ఈ ఉద్రిక్తతలోనే 2009 అసెంబ్లీ, లోకసభ ఎన్నికలు జరిగాయి. ఇంత ఫ్యాక్షన్‌లోనూ ఎం.ఎల్.ఎ. ఓట్లు రఘురామిరెడ్డికి, ఎంపి ఓట్లు జగన్‌కు అని ఒప్పందం చేసుకున్నారు. ఆ ప్రకారమే ఓట్లు పోలయ్యాయి. ఈ ఒక్క ఊర్లోనే కాదు, వైరి పక్షం ఏ పార్టీ వారైనా సామదానబేధ దండోపాయాల్ని ఉపయోగించి తనకు రావాల్సిన ఓట్లకు ఒప్పందం కుదుర్చుకోవడం రాజశేఖరరెడ్డి విధానం. జగన్ ఇంకొంచెం ముందుకు పోయి తన తండ్రి అడ్డాలో (కడపజిల్లా ఇప్పుడు వై.ఎస్.ఆర్. జిల్లా చేశారు కూడా) ఇంకో పాలెగాడు ఉండకూడదని అంగబలం, అర్థబలంతో లోబరచుకోవాలని చూస్తాడు. అయితే ఎంత ఆధిపత్య పోరు ఉన్నా (ఉన్నట్లు కనిపించినా), ఆదాయాన్ని పంచుకోవడంలో సర్దుబాట్లు ఉంటాయి. వాటిల్లో తేడాలు వచ్చినప్పుడు ఘర్షణ పడతారు. ఆ కొట్లాటల్లో పాల్గొనేది మాత్రం పేదవాళ్ళు, ముఖ్యంగా దళితులు. ముఠానాయకులు దళితులను ఉపయోగించుకోడానికి వాళ్ళను తమ దయాదాక్షిణ్యాల కింద ఉంచుకుంటారు. దొమ్మీలు, దౌర్జన్యాలు చేయిస్తారు. వీళ్ళు ఆ ముఠానాయకుడిని కొలుస్తూ అరాచకాలు చేస్తూ రౌడీలుగా బతుకుతారు. పాలెగాళ్ళు పెద్దమనుషులుగా చెలామణీ అవుతారు. కేసులు, శిక్షలు వీళ్ళకు. ఆస్తులు, అధికారాలు పాలెగాళ్ళకు.

చాపాడు మండలం ఎన్ ఓబాయపల్లె పంచాయితీ లోని ఒక గ్రామం నక్కలదిన్నె. ఒకప్పుడు చాపాడు ప్రొద్దుటూరు నియోజకవర్గంలో ఉండేది. నియోజకవర్గాల పునర్విభజనలో అది మైదుకూరులోకి వెళ్ళింది. నక్కలదిన్నె రఘురామిరెడ్డి సొంత ఊరు. ఈ ఊర్లో 1978 నుండి రఘురామిరెడ్డికి జయరామిరెడ్డికి మధ్య ఫ్యాక్షన్ ఉండేది. అయితే రఘురామిరెడ్డి ఆధిపత్యమే కొనసాగుతూ వచ్చింది. 1981లో సమితి ఎన్నికల్లో రాజశేఖరరెడ్డి ప్రోద్బలంతో రఘురామిరెడ్డికి పోటీగా వైరి వర్గానికి చెందిన సుబ్బరామిరెడ్డి నిలబడ్డాడు. అందుకు రఘురామిరెడ్డి వర్గీయులు జయరామిరెడ్డి వర్గం వారికి చెందిన కొన్ని మిద్దెలు పీకారు. ఇక్కడ మిద్దెలు పీకడం గురించి చెప్పుకోవాలి. పాతకాలపు ఫ్యాక్షన్‌లో మిద్దెలు పీకడం అంటే ఆధిపత్యానికి చిహ్నం. దంతెల ఇళ్ళపైకప్పు నుండి ముందుకు

చొచ్చుకొని వచ్చేలా బండలు (వర్షపు నీరు పడడానికి అనువుగా) ఉంటాయి. వాటిని చుంచు బండలు అంటారు. ఇళ్ళ మీదికి దాడి చేసి చుంచు బండలు పీకాడంటే మొనగాడని లెక్క. దాన్నే ఇళ్లు పీకడం అంటారు. అది అవతలి పక్షం ఓటమికి చిహ్నంగా చూస్తారు. భయపడి ఇళ్ళు వదిలి పారిపోయినా లేక ఇంట్లో ఎదిరించే వాళ్ళు లేకపోయినా వాళ్ళ ఇళ్ళు పీకి వస్తారు. ఇది ఆర్థికంగా పెద్దగా నష్టం కలిగించే పని కాదు. పంటలు నాశనం చేసుకోవడం తర్వాతి కాలంలో వచ్చింది. సమితి ఎన్నికల్లో జరిగిన ఘర్షణ తర్వాత ఆ ఊర్లో చెప్పుకోదగ్గ సంఘటనలు లేవు. ఆ తర్వాత జయరామిరెడ్డి కమలాపురం ఫ్యాక్షనిస్టు వీరశివారెడ్డి కుటుంబంతో బంధుత్వం కలుపుకున్నాక అతని బలం పెరిగింది. జయరామిరెడ్డి కూతురిని వీరశివారెడ్డి తమ్ముడికిచ్చి వివాహం చేశారు. తర్వాత జయరామిరెడ్డి మనవరాలిని జగన్ పర్సనల్ సెక్రెటరీ సునిల్‌కిచ్చి వివాహం చేశారు. సునిల్ జగన్‌కు బంధువు కూడ. మామూలుగా ఒక పాలెగాడి ఊరిలోకి ఇంకొక పాలెగాడు ప్రవేశించకుండా ఉండడం ఫ్యాక్షన్ నీతి. వారి బలాబలాల మేరకు కొన్ని సర్దుబాట్లు, ఒప్పందాలు ఉంటాయి. అయితే గ్రామాల్లో వ్యతిరేక వర్గాన్ని ప్రోత్సహిస్తూ తన అనుయాయులతో జిల్లాలో రాజశేఖరరెడ్డి పట్టు సాధిస్తూ వచ్చాడు. ఆయన ముఖ్యమంత్రి అయ్యాక జగన్‌కూ పట్టపగ్గాల్లేకుండా పోయాయి.

నక్కలదిన్నె జగన్ పి.ఎ అత్తగారి అమ్మగారి ఊరు కాబట్టి రఘురామిరెడ్డికి వ్యతిరేకంగా గుంపు కట్టమని ప్రోత్సహించాడు జగన్. ఆ క్రమంలో జయరామిరెడ్డి, మరికొందరు కలిసి జగన్‌ను పిలిపించి మీటింగ్ పెట్టించారు. ఆయన ఊర్లోకి జగన్ ప్రవేశించడం సహించలేని రఘురామిరెడ్డి ఆ ఊరి జనం జగన్ సభను బహిష్కరించేలా చేశాడు. ఆ బహిష్కరించిన వాళ్ళు ప్రధానంగా దళితులు. వీళ్ళు రఘురామిరెడ్డి కోసం దౌర్జన్యాలు చేస్తూ భయోత్పాతాన్ని కలిగిస్తారు. దాన్ని ఎంజాయ్ చేస్తారు. దళిత మహిళలు కూలిపనులు చేస్తే, మగవాళ్ళు అరాచకాలు చేస్తూ తిరుగుతారు. సహజంగా కుటుంబభారం ఆడవాళ్ళే మోస్తారు. నక్కలదిన్నె దళితులంటే చాపాడు మండలంలో హడల్. అటువైపు పోయే బస్సులపై పడి దోచుకున్న సంఘటనలున్నాయి. రైతుల పొలాల్లో మోటర్లు పీక్కుపోతారు. పశువుల్ని ఎత్తుకుపోతారు. రఘురామిరెడ్డి చూసీచూడనట్లు ఉంటాడు. ఆయన దళితులకు దేవుడు. తన భూమిని దళితులకు కౌలుకిచ్చి వాళ్ళను తన దయాదాక్షిణ్యాల కింద ఉంచుకున్నాడు. కాని ఇందిర ప్రభ పథకం కింద ప్రభుత్వం 30 ఎకరాల ప్రైవేటుభూమిని కొని దళితులకు కేటాయిస్తే ఆరేళ్ళుగా అది బీడుపడి ఉంది. అట్లని అది పనికిరాని భూమి కాదు. కెసి కెనాల్ కింద ఏడాదికి మూడు కార్లు పండే భూమి. వాళ్ళకు పట్టాలిచ్చారు కాని స్థలం చూపలేదు.

పంచాయితీ నీళ్ళ ట్యాంకు నిర్మించి పైపుల ద్వారా ఆ ఊరికి మంచి నీళ్ళు సరఫరా చేస్తుంది. ఆ పైపులు దళితవాడ గుండా ఊళ్ళోకి పోతాయి కాని ఆ నీటిని దళితులు వాడడానికి లేదు. ఆ ఏర్పాటు చేయమని వీళ్ళు అడగరు కూడ. 150 దళిత కుటుంబాలకు కలిపి ఒకే బోరింగ్ ఉంది. ఇంకో బోరింగ్ పెట్టించమని వాళ్ళ విన్నపం. ట్యాంకు నీటిని సరఫరా చేయమని అడగొచ్చుకదా అని మాబోటివాళ్ళు అడిగితే దానికి రెడ్డిగారు ఇష్టపడరు అని వాళ్ళ సమాధానం!

జగన్ మీటింగ్ తర్వాత ఆయన వర్గం వాళ్ళను రఘురామిరెడ్డి మనుషులు సతాయించడం మొదలు పెట్టారు. శ్రీరామనవమి రోజు జరిగిన సంఘటనతో ఒక్కసారిగా కక్షలు భగ్గుమన్నాయి. ఆ ఊర్లో అప్పుల లెక్కలన్నీ శ్రీరామనవమి రోజు చూసుకోవడం ఆనవాయితీ. దాని ప్రకారమే జగన్ వర్గానికి చెందిన కొందరు తమకు చెల్లించాల్సిన బాకీ జమచేసుకోవాలనుకున్నాడు. వీళ్ళకు బాకీ పడ్డవాళ్ళు ఆ రోజు ఊర్లో ఉండకుండ బాలకృష్ణ (తెలుగుదేశం) మీటింగ్‌కు పోయారు. అది మెల్లగ కొట్లాటకు దారితీసింది. రఘురామిరెడ్డి వర్గీయులు జగన్ వర్గానికి చెందిన వ్యక్తిని ఆ ఊరి దళితుడిచేత చెప్పుతో కొట్టించారు. ఇంకొకరి కాళ్ళు విరగ్గొట్టించారు. కాళ్ళువిరిగిన వ్యక్తి కేసుపెడితే రివర్స్‌లో అతనిపై ఎస్.సి./ఎస్.టి. కేసు పెట్టించారు. ఆ ఊర్లో రైతులెవరైనా రఘురామిరెడ్డి అనుయాయులతో ఘర్షణ పడితే వాళ్ళ పై దళితులతో తప్పుడు ఎస్.సి./ఎస్.టి. కేసులు పెట్టిస్తారు. ఆ ఊరి రైతులనెవరినైనా కదిలిస్తే వాళ్ళు దళితుల పట్ల విపరీతమైన ద్వేషం ప్రకటిస్తారు.

ఈ సంఘటనలు జరుగుతుండగా ఒక రోజు అర్ధరాత్రి రఘురామిరెడ్డి వర్గానికి చెందిన అన్నదమ్ములు మహేశ్వరరెడ్డి, విశ్వనాథరెడ్డిలు హత్యకు గురయ్యారు. మామూలు ఫ్యాక్షన్ హత్యల్లా కాకుండ ఇక్కడ నిద్రపోతున్న వాళ్ళను నరికి చంపారు. జగన్ వర్గం వారే కిరాయి హంతకుల చేత ఈ హత్య చేయించారని చెప్తారు. జయరామిరెడ్డి, మరికొందరి మీద కేసు పెట్టారు. జయరామిరెడ్డి అనారోగ్య కారణం చెప్పి ఆసుపత్రిలో చేరాడు. ఊర్లో పోలీసు పికెట్ పెట్టారు. జయరామిరెడ్డి ఆసుపత్రిలో ఉండగా అతని భార్య వ్యవసాయం చేయించడానికి ప్రయత్నిస్తే దళితులు మోటర్ పగలగొట్టారు. మా వాళ్ళను చంపి సేద్యం ఎలా చేసుకుంటారో చూస్తాం అని ఆడవాళ్ళు బూతులు తిట్టారు. అయితే చనిపోయిన అన్నదమ్ములకు జయరామిరెడ్డి భార్య పెద్దమ్మ అవుతుంది. ఈ ముఠాకక్షల్లో చీలిపోయిన కుటుంబంలో ఆమె విపరీతంగా నలిగిపోతోంది.

ఈ కొట్లాటలు, కేసులు అట్లా ఉండగానే ఉపఎన్నికల సందర్భంలో రఘురామిరెడ్డి జగన్ పార్టీలో చేరిపోయాడు. దీని గురించి మీరేమనుకుంటారు అని ఆ ఊరి రైతునొకరిని అడిగితే (అతని మీద కేసు ఇంకా ఉంది) ఇకనైనా ఊరు ప్రశాంతంగా ఉంటాది కదా అన్నాడు. నాయకుల పంపకాలు కుదిరి ప్రశాంతత రావడానికి ఇంత హింస జరగాలి! అయితే ఇద్దరూ కలిసి చేసే పెత్తనం కింద నిశ్శబ్దంగా కొనసాగే హింస మాటేమిటి?



వ్యాసం

# ఆదివాసులను నిర్వాసితులను చేయడానికే అబూజ్‌మాడ్‌లో సైనికశిబిరం

- ఎం.శ్రీనివాసరావు

విస్థాపన్ విరోధి జనవికాస్ ఆందోళన్

దేశవ్యాప్తంగా నిర్వాసితసమస్య తీవ్రతరమవుతూ ఉంది. దీనికి వ్యతిరేకంగా ప్రజలు పోరాడుతున్నారు.ఈ పోరాటాలు ప్రధానంగా కోస్టల్ కారిడార్‌లో భాగంగా థర్మల్ పవర్ ప్లాంట్లు, రసాయన పరిశ్రమలు, నౌకాశ్రయాల వలన ఇంకా నీటిపారుదల ప్రాజెక్టులు, రోడ్లవిస్తరణ, ప్రత్యేక ఆర్థికమండలాలు వంటి వాటివల్ల నిర్వాసితులయ్యే ప్రజలు చేస్తున్నారు. అంతేగాక ఆదివాసులు ప్రధానంగా జీవిస్తున్న మధ్య, తూర్పుభారతంలోని అటవీప్రాంతాల్లో ఖనిజ తవ్వకాలకు వ్యతిరేకంగా కోట్లాదిమంది ఆదివాసులు కూడా పోరాటాలు చేస్తున్నారు. ఈ పోరాటాలకు పాలకులు పరిష్కారాలు వెతుకుతున్నారు. ఈపరిష్కారంలో భాగంగా జాతీయ భూసేకరణ-పునరావాసబిల్లు- 2011ను రూపొందించారు. ఈపార్లమెంటు సమావేశాల్లో దీని ఆమోదంకోసం ప్రయత్నం చేస్తున్నారు. నిజానికి ఈ బిల్లు వల్ల నిర్వాసితులయ్యే ప్రజలకు ఒరిగే ప్రయోజనం ఏమీలేదు. రైతుల నుండి భారీఎత్తున భూములను లాక్కోడానికి ప్రైవేటువ్యక్తులకీ, సంస్థలకే ఉపయోగపడుతుంది. నిజానికి ఇదిఒక తేనేపూసినకత్తి. ఈ మధ్యకాలంలో ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాల్, మహారాష్ట్ర, చత్తీస్‌గఢ్, ఒడిశా, గుజరాత్‌వంటి రాష్ట్రాల్లో చట్టపరిధిలో పోరాడిన ప్రజలపై ఆయాప్రభుత్వాలు చట్టవ్యతిరేక అణిచివేతను ప్రయోగించాయి తప్ప నిర్వాసితుల పునరావాసం, సంక్షేమం గురించి ఆలోచించలేదు.

ఇక మధ్య, తూర్పు భారతంలోని ఆదివాసులపైకి సైన్యంతో యుద్ధానికి కేంద్రప్రభుత్వం సన్నద్ధమైంది. చత్తీస్‌గఢ్‌లోని నారాయణపూర్‌జిల్లా అబూజ్‌మాడ్ ప్రాంతంలో సైనిక శిక్షణాశిబిరం ఏర్పాటు చేసింది. ఈ సైనిక శిక్షణాశిబిరం కేవలం సైనిక శిక్షణ కోసమే అని చెబుతున్నారు గాని, అందులో నిజం పాలు ఎంత అనేది అర్థంకానిది కాదు. నిజానికి నిర్వాసితులవుతున్న ప్రజలు చట్టపరిధిలో పోరాడినా, చట్టానికతీతంగా పోరాడినా ప్రభుత్వ పరిష్కారం అణిచివేతే అనేది ఆచరణలో కన్పిస్తున్న విషయం. చట్టపరిధిలో జరుగుతున్న పోరాటాలగురించి చాలా చర్చ జరుగుతూఉంది. కాని చట్టానికతీతంగా జరుగుతున్న పోరాటాల గురించి చర్చలేదు. చట్టబద్ధపోరాటాలైనా, చట్టానికతీతమైన పోరాటాలైనా ప్రభుత్వాలు చట్టబద్ధంగానే వ్యవహరించాలి. కాని కేంద్ర ప్రభుత్వం రాజ్యాంగస్ఫూర్తికి భిన్నంగా, చట్టవ్యతిరేకంగా అబూజ్‌మాడ్ ప్రాంతంలో సైనిక శిక్షణాశిబిరం ఏర్పాటుచేసింది. ఈ సైనిక శిక్షణాశిబిరం ఏర్పాటు చేయడం ద్వారా మధ్య, తూర్పుభారతంలో అంతర్యుద్ధానికి నాంది పలికినట్లయింది. ఇది దేశంలోని కోట్లాదిమంది ఆదివాసుల జీవితాలను అల్లకల్లోలం చేస్తుంది. జమ్మూకాశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల్లో సైన్యం చేస్తున్న అరాచకాలు నిత్యంచూస్తూనే ఉన్నాం. ఇపుడు సరిహద్దుల నుండి దేశం మధ్యలోకి వచ్చిన సైన్యంవల్ల ఆదివాసులు ఎదుర్కొనబోయే సమస్యల గురించి, అంతర్యుద్ధ ప్రమాదం గురించి ప్రజలు, ప్రజాస్వామిక వాదులు ఆలోచించాలి.

సైన్యం శిక్షణకేనా?: సరిగ్గా వందసంవత్సరాల క్రితం అబూజ్‌మాడ్ కొండల్లో బ్రిటిష్ ఇండియా సైన్యాలు దిగాయి. ఆనాడు తెల్లవారి ఆధిపత్యానికివ్యతిరేకంగా మాడియా ఆదివాసీ ప్రజలు మాడియా రాజ్యస్థాపనను ప్రకటించుకున్నందుకు గాను అవి దిగాయి. ఈనాడు వలస ప్రభుత్వ వారసులైన ఈ పాలకులు ఆదివాసులను అక్కడినుండి తరిమేసి బహుళజాతి గుత్తసంస్థలకు ఆ ప్రాంతాన్ని అప్పజెప్పడం కోసం 2011, మే 31న సైన్యాన్ని దింపారు. మొత్తం మాడ్ ప్రాంతవిస్తీర్ణం 4000 చ.కి.మీ. అయితే ఈ సైన్యం ఆక్రమించినప్రాంతం 600-800 చ.కి.మీ. వరకు ఉంటుందంటున్నారు. ఇది మాడ్ విస్తీర్ణంలో ఐదో వంతు అంటే 1,34,000 ఎకరాలు. ఇది సుమారు భారత రాజధాని నగరమైన ఢిల్లీ విస్తీర్ణంతో సమానం. ఇది ప్రపంచంలోకెల్లా అతిపెద్ద సైనికశిబిరం. దీనినిబట్టి ఇక్కడ ఎంతమంది ఆదివాసీప్రజలు నిర్వాసితులౌతారో, ఎంత అటవీప్రాంతం నాశనమవుతుందో, ఎంత పర్యావరణ విధ్వంసం జరుగుతుందో ఊహించకోవచ్చు. అంతేగాక ఇక్కడ ఒక్కటి మాత్రమే కాక చత్తీస్‌గఢ్, ఒడిశా సరిహద్దులలోని రాయగడవద్ద ఇదే విస్తీర్ణం గల సైనికశిబిరం ఏర్పాటుకానుందని సైనికవర్గాలే చెబుతున్నాయి.

ఇక్కడ జరుగుతున్న ఏర్పాట్లను చూస్తే సైనికశిక్షణ మాత్రమే జరుగుతుందిఅనుకోవడానికి వీలులేదు. వస్తున్న వేలాదిమంది సైనికులు, వారినివాసాలు, ఆయుధసామాగ్రి, వాహనసామాగ్రి, హెలికాప్టర్లు దిగడానికి సదుపాయాలు అన్నీ ముందుగానే ఏర్పాటు చేస్తున్నారు. దీనినిబట్టి ముందు ముందు ఇక్కడి విప్లవోద్యమంపై ప్రత్యక్షసైనిక జోక్యంకోసమే ఈ సన్నాహాలన్నీ అనేది అర్థమవుతుంది. వాస్తవానికి గత చాలాకాలంనుండి ఇక్కడి స్థానిక పోలీసు, పారామిలటరీ బలగాలకు భారతసైన్యం, వాయుసేన పరోక్ష సహాయ సహకారాలు అందిస్తూనే ఉన్నాయి. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా పోలీసు, పారామిలటరీ బలగాలకు భారత సైన్యమే శిక్షణ ఇచ్చింది. ఎన్‌కౌంటర్ వంటి సంఘటనలు జరిగినపుడు సైనిక, వాయుసేనలు తమ హెలికాప్టర్ తదితర సహకారమందించాయి. ప్రస్తుత సైనికాధికారులు, పదవీ విరమణ చేసిన సైనికాధికారులు ఆదివాసుల అణిచివేతకుగాను తగిన ప్రణాళికలు రచించడం, ఎత్తుగడలపరమైన సహకారమందించడం

చేశారు. పదవీ విరమణ చేసిన బ్రిగేడర్‌పొన్వర్ చత్తీస్‌గఢ్‌లోని కాంకేర్‌లో జంగిల్‌వార్‌ఫేర్ స్కూలు ఏర్పాటు చేయడానికి తీవ్రమైన కృషి చేశాడు. గత ఐదు సంవత్సరాలకాలంలో షుమారు 47,000మంది భద్రతా దళాలకు భారతసైన్యం శిక్షణ ఇచ్చింది. ఇలా ఈమొత్తం ప్రభుత్వ చర్యలన్నీ చత్తీస్‌గఢ్ నుండి ప్రారంభమై మధ్య, తూర్పుభారతంలోని ఆదివాసీ ప్రాంతాలను ఆక్రమించి, ఆదివాసులకు అండగా ఉన్న మావోయిస్టు ఉద్యమాన్ని అణిచివేసి, ఆదివాసులను నిర్వాసితులను చేయడానికి కేంద్రప్రభుత్వం అడుగులు వేస్తున్నదని తెలియజేస్తున్నాయి.

భారతదేశ ఆదివాసులు: మధ్య, తూర్పుభారతంలోని అటవీ ప్రాంతంలో 10కోట్లమంది ఆదివాసులు జీవిస్తున్నారు. వారు తమ స్వతంత్ర అధికారం కోసం బ్రిటిషు వారికి వ్యతిరేకంగా పోరాడారు. అంతకన్నాముందు ముస్లింలకు వ్యతిరేకంగా, అంతకన్నాముందు ఆర్యులకు వ్యతిరేకంగా పోరాడి తమ సార్వభౌమాధికారాన్ని నిలబెట్టుకున్నారు. ఈ క్రమంలోనే వలసపాలనకాలంలో కొమరంభీం, బిర్సాముండా వంటివారు అమరులయ్యారు, అదే విధంగా 1825 ప్రాంతంలో పలు ఆదివాసీ తిరుగుబాట్లుకు నాయకత్వం వహించిన గేందీసింగ్, సక్మెక్ బాబూరావు, గుండాదూర్, ప్రవీర్‌చంద్రభాంజ్‌దేవ్‌లు కూడా ఆదివాసుల సార్వభౌమాధికారంకోసం అమరులయ్యారు. ప్రపంచంలో మెక్సికో తర్వాత భారతదేశంలోనే ఆదివాసులు అత్యధికంగా ఉన్నారు. ఈ ఆదివాసులు నివసించేప్రాంతంలోనే లక్షలకోట్ల రూపాయల విలువచేసే ఖనిజసంపద నిక్షిప్తమై ఉంది. దండకారణ్యంలోనే దాదాపు 30 రకాలకుపైగా ఖనిజాల నిల్వలు నిక్షిప్తమై ఉన్నాయి. ముడి ఇనుము, బాక్సైట్, బొగ్గులాంటి ఖనిజాలు చత్తీస్‌గఢ్, ఒడిశా, జార్ఖండ్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో అత్యధిక నిల్వలున్నాయి. ఇంకా జంగల్‌మహల్ తదితర ఆదివాసీప్రాంతాల్లో లక్షలకోట్ల రూపాయల విలువచేసే ఖనిజ సంపద ఉంది. దీనికోసమే దేశీయ, విదేశీ బహుళజాతి గుత్తసంస్థలు వెంపర్లాడుతున్నాయి. ఈసంస్థలతో ఆయా రాష్ట్రప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వం వందలాది అవగాహన ఒప్పందాలు కుదుర్చుకున్నాయి.

నిజానికి కేంద్రప్రభుత్వం సైనికశిబిరం ఏర్పాటు చేస్తున్న ఈఅబూజ్‌మాడ్ ప్రాంత మాడియా ఆదివాసులను 1975లో కేంద్రప్రభుత్వం ప్రాచీన గిరిజనతెగ (Primitive Tribal Group)గా గుర్తించింది. ఈ తెగ అంతరించిపోకుండా, దీని అభివృద్ధికిగాను ప్రత్యేక రక్షణ చర్యలు, జాగ్రత్తలు తీసుకోవాలని నిర్ణయించింది. ఇప్పుడు ఇక్కడ ఈ సైనికశిబిరం ఏర్పాటు చేయడం అంటే ఈమాడియా ఆదివాసులకు ఇచ్చిన ప్రత్యేక గుర్తింపును, వారి సహజమైన హక్కులను ప్రభుత్వం ప్రత్యక్షంగా ఉల్లంఘించడమే.

వాస్తవానికి ఆదివాసులకు ఉద్దేశించిన ప్రత్యేకచట్టాలను ఏ ప్రభుత్వాలు కూడా అమలు చేయడం లేదు. రాజ్యాంగంలోని 5,6 షెడ్యూళ్ల ప్రకారం పార్లమెంటుకాని, అసెంబ్లీగాని చేసిన సాధారణ చట్టాలను గిరిజన ప్రాంతాలకు అన్వయించకూడదు. ఆ ప్రాంతంలోని భూమి, నీరు, అటవీ, ఖనిజ సంపదల వంటి సహజవనరులను ప్రైవేటు వ్యక్తులకు అప్పగించరాదు. అబూజ్‌మాడ్ ప్రాంతంలో ఏ ప్రయోజనం రీత్యానైనా భూసేకరణ చేయాలంటే స్థానికప్రజల ఆమోదం తప్పనిసరి. ఇప్పుడు కూడా అక్కడ సైనికశిబిరం ఏర్పాటు చేయాలంటే స్థానికమాడియా ఆదివాసుల, వారి ప్రాతినిథ్య సంస్థల సమ్మతి తప్పనిసరిగా ఉండాలి. కాని ఇవేవి అక్కడ అమలు జరగడం లేదు.

13 సెప్టెంబరు 2007న ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో ఆదివాసి ప్రజల హక్కులపై వెలువరించిన ప్రకటన పై భారతదేశం సంతకం చేసింది. ఇందులోని ఆర్టికల్ 25 ప్రకారం: ఒక ప్రాంతంలోని స్థానికులైన ఆదివాసీ ప్రజలు వారి సంప్రదాయబద్ధమైన లేక ఆక్రమించి సాగు చేసుకుంటున్న భూములు, నీరు, సముద్ర తీర ప్రాంతాలు ఇతర సహజ వనరులన్నింటితో విలక్షణమైన వారి ఆధ్యాత్మిక సంబంధాన్ని పెంపొందించుకొనే హక్కును వారు కలిగి ఉన్నారు. అంతేకాక వారి భవిష్యత్ తరాలకు వీటిని అందించే హక్కును కూడా వారుకలిగి ఉన్నారు.

ఆర్టికల్ 30 ప్రకారం: 1. స్థానికఆదివాసీప్రజలకు అవసరం, ఆమోదం, అంగీకారం కలిగి ఉంటే తప్ప ఆ భూభాగాల్లోగాని, ఆయాప్రాంతాల్లోగాని సైనిక కార్యకలాపాలు నిర్వహించరాదు.

2. ప్రాథమికంగా రాష్ట్రాలు ఆయాప్రాంతాల్లో సైనిక కార్యకలాపాలు నిర్వహించాలంటే తగిన కార్యాచరణ పద్ధతులు అనుసరించడం ద్వారా స్థానిక ఆదివాసులతో సంప్రదించి వారి అంగీకారం తీసుకోవాలి. నిర్దిష్టంగా వారి ప్రాతినిథ్య సంస్థల ద్వారా ఇది జరగాలి.

అంతేకాక భారతదేశం ఆదివాసీ ప్రాంతాల్లో వారిఅధికారాన్ని గౌరవిస్తానని అంతర్జాతీయ కార్మిక సంస్థ సమావేశాల్లో సంతకం చేసింది. అంతర్జాతీయ కార్మికసంస్థ సమావేశాల్లోని ముఖ్యమైన అంశాలను రాజ్యాంగంలోని దిప్రొవిజన్స్ ఆఫ్ పంచాయత్స్ యాక్టు 1996 (PESA) చట్టంలో చేర్చారు కూడా.

కాని ఐక్యరాజ్య సమితి నుండి ఆంధ్రప్రదేశ్ వరకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన సంతకాలు, చేసినచట్టాలు అన్నీ కాగితాలకే పరిమితమయ్యాయనేందుకు ప్రభుత్వాల పైచర్యలన్నీ సజీవ సాక్ష్యాలే. ఎన్నో వీరోచితమైన పోరాటాల ఫలితంగా వచ్చిన 1/70, 2006 షెడ్యూళ్ తెగలు, ఇతర సంప్రదాయక అటవీ హక్కుల గుర్తింపు చట్టం, అటవీ సంరక్షణ చట్టం, వడ్డీ వ్యాపార నిషేధ చట్టం అన్నీ అపహాస్యం పాలైపోయాయి.

ఇదంతా ఒక ఎత్తైతే 1947తర్వాత దేశంలో వివిధ ప్రాజెక్టుల కింద సుమారు 3 కోట్లమంది ప్రజలు నిర్వాసితులయ్యారు. వీరిలో 40 శాతం ఆదివాసులే. గత నాలుగున్నరదశాబ్దాల్లో ఖనిజ సంపద వెలికితీత వల్ల రెండున్నర కోట్ల మంది ప్రజలు నిర్వాసితులయ్యారు. వీరిలో 25 శాతం మందికే పునరావాసం కల్పించబడింది. నిర్వాసితులైన వారిలో సగం మంది ఆదివాసులే. ఇతర అభివృద్ధి ప్రాజెక్టుల కంటే ఖనిజ సంపద వెలికితీత వలన నిర్వాసితుల సంఖ్య మూడు, నాలుగురెట్లు ఎక్కువగా ఉంది. ఇప్పటివరకు దాదాపు 1.64 లక్షల హెక్టార్ల అటవీ భూమి ఈ ఖనిజాల వెలికితీత వల్ల

నాశనం అయింది. దేశవ్యాప్తంగా 2006 నాటికి ఒక్క ఇనుప ఖనిజం వెలికితీయడానికి 77 మిలియన్ టన్నుల నీటి వాడకం జరిగింది. ఈ నీటితో దేశంలో 30 లక్షల మంది నీటి అవసరాలు తీరుతాయి. అలాగే ఖనిజాలు వెలికితీసే క్రమంలో వచ్చే దుమ్ము, ధూళి 1.84 బిలియన్ టన్నులని అంచనా. కాని ఈ దుమ్ముధూళిని తొలగించడానికి తీసుకున్న చర్యలు శూన్యం. ఉదాహరణకు ఒకటన్ను బొగ్గు వెలికితీస్తే నాలుగుటన్నుల వ్యర్థాలు ఉత్పత్తి అవుతాయి. అంటే ఈ ఖనిజాల వెలికితీతవల్ల అడవి, పర్యావరణం మొత్తం విధ్వంసం జరుగుతుంది. కోట్లాదిమంది ఆదివాసులు నిర్వాసితులౌతారు.

ఎవరి ప్రయోజనాల కోసం: అబూజ్‌మాడ్‌లో సైనికశిబిరం ఏర్పాటు వెనుక అత్యధికంగా బహుళ జాతిసంస్థల ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయనేది సుస్పష్టం. అపుడు సల్వాజుడుం ఏర్పాటుచేసినా, తర్వాత ఆపరేషన్ గ్రీన్‌హంట్‌తో పారామిలటరీ దళాలు దించినా, ఇపుడు సైన్యాన్నిదించినా కేంద్రప్రభుత్వ లక్ష్యం ఒకటే. ఆదివాసీ ప్రాంతాల్లో మావోయిస్టు ఉద్యమాన్ని అణిచివేసి ఆదివాసులను అడవినుండి తరిమేయడమే లక్ష్యం. నిజానికి ఇప్పటికే బహుళజాతి సంస్థలతో కుదుర్చుకున్న అవగాహన ఒప్పందాలు అమలు జరగక ప్రభుత్వం పై ఒత్తిడి చేస్తున్నాయి. జార్ఖండ్, ఒడిశా రాష్ట్రాల్లో ఇనుపఖనిజం వెలికితీతకు, దాని ద్వారా రెండు ఉక్కుకర్మాగారాల నిర్మాణానికి లక్షకోట్ల రూపాయల ప్రణాళికను లక్ష్మీమిట్టల్‌కు చెందిన "ఆర్సిలర్" సంస్థ ప్రణాళికను సిద్ధంచేసింది. సురేంద్రదాస్, ఫిలిక్స్‌పడేల్‌లు కలిసి రాసిన పుస్తకం 'అవుట్ ఆఫ్ దిస్ ఎర్త్, ఈస్టిండియా ఆదివాసిస్ అండ్ ది అల్యూమినియం కార్టెల్ అనే పుస్తకంలో ఒడిశాలోని బాక్సైట్‌నిల్వల మొత్తం విలువ 2.27 ట్రిలియన్ డాలర్లు. ఇది భారతదేశస్థూల జాతీయోత్పత్తికి రెండు రెట్లు అని చెప్పారు. ఇది 2004 నాటి విలువ. ఇప్పటి విలువ 4 ట్రిలియన్ డాలర్లు. ఇంతేగాక ఈ నాలుగు ట్రిలయన్ డాలర్లతోపాటు చత్తీస్‌గఢ్, జార్ఖండ్ రాష్ట్రాల్లో మిలియన్ల కొద్ది టన్నుల అత్యుత్తమ నాణ్యత కలిగిన ముడిఇనుము, ఇతర 28 రకాల ఖనిజ వనరులున్నాయి. వీటన్నింటివిలువ లక్షలాది కోట్ల రూపాయలుంటాయి. ఇంకా పవర్‌ప్లాంట్లు, ప్రాజెక్టులు, హైవేలు, ఉక్కు, సిమెంటు కర్మాగారాలు, అల్యూమినియంస్మెల్టర్లు, ఇతర మౌలిక సదుపాయాల ప్రాజెక్టులు, ప్రభుత్వాలు కుదుర్చుకున్న వందలాది అవగాహన ఒప్పందాల్లో ఉన్నాయి. ఒక్క జార్ఖండ్‌లోనే 90కు పైగా ఉన్నయి. ప్రపంచంలోనే అతిపెద్ద కార్పోరేట్‌సంస్థలలో ఒక్కటైన "వేదాంత"కు హోంమంత్రి పి. చిదంబరం ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా ఉన్నాడు. ఈ వేదాంత గ్రూపులోని సంస్థలు ఖనిజాల వెలికితీతకు అనేక ఒప్పందాలు కుదుర్చుకున్నాయి. ఈ ఒప్పందాలన్నీ అమలు జరగాలంటే మధ్య, తూర్పుభారతంలోని ఆదివాసీ ప్రాంతాలన్నీ ఖాళీ చేయాలి. ఆదివాసులను నిర్వాసితులను చేయాలి. ఐతే అక్కడ ఆదివాసులకు అండగా ఉన్న మావోయిస్టు ఉద్యమం ఇలాగే కొనసాగి అభివృద్ధి చెందితే ఇది సాధ్యం కాదు. కనుకనే ఆదివాసీ ప్రాంతాలలోకి ఇప్పుడు సైన్యాన్నిదించారు.

విఫలమైన ప్రయోగాలు: నిజానికి మధ్య, తూర్పు భారతంలోని ఆదివాసులను అణచడానికి కేంద్రప్రభుత్వం, ఆయా రాష్ట్రప్రభుత్వాలు చాలా ప్రయత్నాలు చేశాయి. దండకారణ్యంలో 90వ దశకంలో జనజాగరణ్ అభియాన్, ఆపరేషన్ మంథన్, ఆపరేషన్ వైల్డ్‌బైసాన్, ఆఫరేషన్ గోదావరివంటి పేర్లతో హంతకపోలీసు అభయాన్‌లు, నల్లదండు ముఠాలను ఏర్పాటుచేసి ప్రజలను భయాందోళనలకు గురిచేశాయి. రాష్ట్రప్రభుత్వాలు కొత్త కొత్త పోలీసుస్టేషన్లు, క్యాంపులుపెట్టి పోలీసుబలగాలను ఉద్యమ ప్రాంతాలలో పలురెట్లు పెంచాయి. ఆ తర్వాత చత్తీసగఢ్‌లో 2005లో కాంగ్రెస్ నాయకులైన మహేంద్రకర్మ నేతృత్వంలో "సల్వాజుడుం"అనే ప్రైవేటు సైన్యాన్ని ఏర్పాటు చేశారు. ఈ ప్రభుత్వ ప్రేరేపిత ప్రైవేటుసైన్యం స్థానిక ఆదివాసి ప్రజలపై చేసిన అత్యాచారాలు, అకృత్యాలు, అరాచాకాలు అన్నీ ఇన్నీ కావు. వందలాది గ్రామాలను నేలమట్టంచేశారు.దీనివల్ల మూడు లక్షల మంది ప్రజలు చెల్లాచెదురై పోయారు. 50 వేల మంది సల్వాజుడుం కేంపుల్లో నిర్బంధించబడ్డారు. తర్వాత దేశవ్యాప్తంగా సల్వాజుడుం మీద వచ్చిన వ్యతిరేకత, సుప్రీంకోర్టుఇచ్చిన తీర్పువల్ల వీరిని స్పెషల్ పోలీసు ఆఫీసర్లుగా, ఆ తర్వాత కోయకమెండోలుగా ఇప్పుడు గిరిజన బెటాలియన్‌లోకి నియామకం చేశారు. ఇదే విధంగా ఇతర రాష్ట్రాల్లో కూడా ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఇలాంటి ప్రైవేటు సైన్యాలను ఏర్పాటు చేశాయి. జార్ఖండ్‌లో నాగరిక్ సురక్షా సమితి, తృతీయ ప్రస్తుతి కమిటీ, ఒడిశాలో శాంతిసేన, పశ్చిమబెంగాల్‌లో గణప్రతిరోధ్ సమితి, హర్మద్‌వాహినివంటి ప్రైవేటు సైన్యాలను ఏర్పాటుచేశాయి.

ఆ తర్వాత ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ఇండోటిబెటన్ బోర్డర్‌ఫోర్స్ (ITBF), బోర్డర్ సెక్యూరిటీ ఫోర్సు (BSF), సి.ఆర్.పి.ఎఫ్, ప్రత్యేక కోబ్రాదళాలను దండకారణ్యం నుండి జంగల్‌మహల్ వరకు మోహరింపచేశారు. మొత్తం 2 లక్షల మంది పారామిలటరీ బలగాలను జమ్మూ అండ్ కాశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల నుండి ఉపసంహరించి ఇక్కడకు తరలించారు. ఈ బలగాలు ఆయా రాష్ట్రాల్లో గత ఒకటిన్నర సంవత్సర కాలంలో చత్తీస్‌గఢ్‌లో వందలాది మందిప్రజలను చంపివేశాయి. ఉదాహరణకు గొంపాడులో 12 మందిని, తాకివాడలో 7 మందిని, ఒంగనార్‌లో 5 మందిని ఈకాలంలో చంపివేశాయి. వందలాది గృహదహనాలు చేశారు. మహిళలపై అత్యాచారాలు లెక్కలేనన్ని. అలాగే జార్ఖండ్‌లో కూడా వేలాది మంది పారామిలటరీ బలగాలను దించారు. వీరు ఎంతో మంది ప్రజలను బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపివేశారు. జార్ఖండ్‌లోని లాతేహార్‌కుచెందిన జాస్మింత పారామిలటరీబలగాలు చంపిన మొదటిమహిళ. లాతేహార్, కర్సంబ, పుర్బి, సింగ్‌భూమ్ ప్రాంతాల్లో గృహదహనాలు, అరెస్టులు, చిత్రహింసలు, అక్రమకేసులు లాంటివి అనేకం జరిగాయి. పశ్చిమ బెంగాల్లోని లాల్‌గఢ్ ప్రాంతంలో సిపిఎం ప్రభుత్వ ప్రోత్సాహంతో చట్టవ్యతిరేక సాయుధ శిక్షణ కేంద్రాలు నడిచాయి. ఈ సిపిఎం గూండాలు, పారామిలటరీ బలగాలు కలిసి పదుల సంఖ్యలో ప్రజలను చంపివేశాయి. పోలీసు అత్యాచార వ్యతిరేక ప్రజాకమిటీ

(పి.సి.పి.ఎ.)కి చెందిన లాల్‌మోహన్‌తుడు, ఉమాకాంత్‌మహతో, సిధుసోరేన్‌లను సిఆర్‌పిఎఫ్ బలగాలు బూటకపు ఎన్‌కౌంటర్లలో కాల్చిచంపేశాయి. వందలాది మంది అక్రమ కేసుల్లో జైళ్లలో ఉన్నారు. ఈవిధంగా అన్ని రాష్ట్రాల్లో ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా పారామిలటరీ బలగాలు వందలాది మంది ప్రజలను చంపేశారు. అక్రమకేసులు బనాయించారు. కాని ఆదివాసుల ప్రతిఘటనను నిరోధించలేక పోయారు. అందువల్లనే ఈ అన్ని ప్రయోగాల వైఫల్యం తర్వాత సరిగ్గా ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రారంభమైన రెండు సంవత్సరాల తర్వాత కేంద్రప్రభుత్వం సైనికశిక్షణ పేరుతో చత్తీస్‌గఢ్‌లో సైన్యాన్ని దించింది.

ప్రపంచీకరణ భారతం: 2008లో అమెరికాకు చెందిన ఒక ఏజెన్సీ అంతర్జాతీయ అభివృద్ధి అనే అంశంపై ప్రపంచవ్యాప్తంగా చేసిన అధ్యయనం ప్రకారం భారతదేశంలో నాలుగింట మూడు వంతుల ప్రజలు అంటే 83.6 కోట్లమంది రోజుకి రెండు డాలర్లలోపు ఆదాయంతో జీవిస్తున్నారు అని తెలియజేసింది. నిజానికి మనదేశాన్ని ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంగా కీర్తిస్తున్నాం. వలసపాలనకాలం నుండి ఇప్పటి వరకు జరిగిన కాలంలో 120 కోట్ల మంది దేశ ప్రజల జీవితాల్లో వచ్చిన మార్పు శూన్యం. ఏ ప్రభుత్వం అధికారంలో కొచ్చినా గత 60 సంవత్సరాలుగా అమలు చేస్తున్న విధానాలు ప్రజల జీవితాలలో మౌలిక మార్పును తీసుకురాలేక పోయాయి 1970లో ఒక్కశాతంగా ఉన్న జనాభా దేశంలోని 18శాతం సంపదను కలిగి ఉంటే 1996లో అదే ఒక్కశాతం జనాభా దేశ సంపదలో 40 శాతం వాటాను కలిగి ఉన్నారు అంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. దీని యొక్క అసలైన మూలాలను అర్థం చేసుకోవాలంటే ఈప్రభుత్వాలు అమలు చేస్తున్న అభివృద్ధి విధానం యొక్క స్వభావాన్ని అర్థం చేసుకోవాలి.

దేశంలో ప్రపంచీకరణ విధానాల అమలు ప్రారంభమైన తర్వాత గత పది సంవత్సరాల కాలంలో 2 లక్షలమంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. భారత కార్మికవర్గంలోని ప్రతి పదిమంది కార్మికుల్లో తొమ్మిది మంది అసంఘటితరంగ కార్మికులుగా ఉన్నారు. దేశ జనాభాలో 30 శాతంగా ఉన్న దళితులు పట్టణాల్లో పెంట, చెత్త, వ్యర్థాలను ఎత్తేవాళ్ళగాను, గ్రామాల్లో వ్యవసాయ కూలీలుగా బతుకు తున్నారు. ఐక్యరాజ్యసమితి మానవాభివృద్ధి సూచి ప్రకారం ప్రపంచంలో 177 దేశాల్లో భారతదేశం 128వ స్థానంలో ఉంది. ప్రపంచ ఆకలి సూచిక ప్రకారం మనదేశం ఇథియోపియా తర్వాత 94వ స్థానంలో ఉంది. మరోవైపు మనదేశం ప్రపంచంలోని సంపన్నుల జాబితాలో 2వ స్థానంలో ఉంది.

దేశప్రజల జీవన స్థితిగతుల వాస్తవాలు, ప్రపంచీకరణ ప్రభావాలు, ప్రభుత్వాల అభివృద్ధి విధానాలు ఈవిధంగా ఉంటే ప్రభుత్వం మాత్రం అంకెల గారడీతో అభివృద్ధి అత్యంత వేగంగా జరుగుతోందని చెబుతుంది. నిజానికి ప్రపంచీకరణ అభివృద్ధి విధానానికి ప్రత్యామ్నాయ అభివృద్ధి మధ్య, తూర్పు భారతంలో అమలు జరుగుతుంది. గత ఆరుదశాబ్దాలుగా నిర్లక్ష్యానికి, నిరాదరణకు గురైన ఆదివాసులు మావోయిస్టు ఉద్యమం అండతో ప్రత్యామ్నాయ అభివృద్ధి విధానాన్ని అమలు చేసుకుంటున్నారు. గ్రామస్థాయిలో ఆదివాసీ ప్రజలు అక్కడ ఏర్పాటు చేసుకున్న జనతన సర్కారుల ద్వారా వివిధ శాఖలు ఏర్పాటు చేసుకున్నారు. వ్యవసాయం, విద్య, వైద్యం, అటవీరక్షణ, ఆర్థికం, లఘుపరిశ్రమలు, వ్యాపారం, న్యాయ, సంస్కృతి ప్రచారం వంటి శాఖలను ఏర్పాటు చేసుకుని నిర్వహించుకుంటున్నారు. మన రాజకీయనాయకులు అప్పుడప్పుడు స్థానిక సంస్థలకు మరిన్ని అధికారాలు ఇవ్వాలని మాట్లాడుతూ ఉంటారు. కాని ఆచరణలో స్థానిక సంస్థలకు అధికారాలు ఇచ్చింది లేదు, ఉన్నవి అమలు జరిగింది లేదు. కాని ఇక్కడ నిజమైన అధికారాన్ని, అభివృద్ధిని ఆదివాసులు అమలు చేసుకుంటున్నారు.

ఈ సంవత్సరం దండకారణ్యంలోని లక్షాయాభై వేల మందికి పైగా ఆదివాసీ స్త్రీ, పురుషులు 30 లక్షల పని దినాలతో భూమి చదును చేసి మళ్ళ నిర్మాణం చేసుకోవడం ఇందుకు ఒక ఉదాహరణ. ఈ ఆదివాసులు సమష్టి వ్యవసాయం ద్వారా, వ్యవసాయంలో పాత పద్ధతులస్థానే అధిక దిగుబడి పద్ధతులు అమలుచేయడం ద్వారా అభివృద్ధి సాధిస్తున్నారు. సాగు, తాగునీటి చెరువులు, కాలువలు అభివృద్ధి చేసుకుంటున్నారు. ఒకవైపు ఈప్రభుత్వాల ప్రపంచీకరణ విధానాలతో వ్యవసాయ రంగంలోని సంక్షోభంతో రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం, పంట విరామం ప్రకటించడం జరుగుతుంటే ఇక్కడ స్వావలంబన విధానాలతో వ్యవసాయరంగం అభివృద్ధి చెందుతోంది. ఇక్కడ గ్రామాల్లో విద్యాశాఖ ద్వారా పాఠశాలలు ప్రారంభించబడి మాతృభాషలో విద్యను బోధిస్తున్నాయి. శ్రమను గౌరవించడం, ప్రజాస్వామ్యం, శాస్త్రీయ విద్య పునాదిగా విద్యా విధానం రూపొంది అమలు జరుగుతోంది. గ్రామీణ వైద్యశాలల ద్వారా వైద్యశాఖపేదలకు చికిత్స అందుబాటులోకి తెచ్చింది. ఇక్కడి రైతాంగం యువతని ప్రజావైద్యులుగా తీర్చిదిద్దుతున్నారు. రహదారులు నిర్మించారు. కనుకనే ఈప్రత్యామ్నాయ అభివృద్ధిని విధ్వంసం చేసి పెట్టుబడిదారులను, బహుళజాతి సంస్థలను అభివృద్ధి చేయడానికే అబూజ్‌మాడ్‌లో సైన్యాన్ని దింపారు. వీరికి అమెరికా, ఇజ్రాయెల్‌లు సైనిక, ఆయుధ, ఆర్థికసహకారాన్నందిస్తున్నాయి. ఇప్పటికే ఈసైన్యం ఉన్న కాశ్మీర్‌లో గత 20 ఏళ్ళలో 10 వేలమందిని మాయం చేశారు. మణిపూర్‌లో గత 40 ఏళ్ళలో 20 వేలమందిని మాయం చేశారు. ఇప్పుడు ఈ రాష్ట్రాల చెంతన దండకారణ్యం, ఇతర ఆదివాసీ ప్రాంతాలను చేర్చుతున్నారు.

కనుక ప్రజలు, ప్రజాస్వామిక వాదులు కేంద్ర ప్రభుత్వ ఈ అప్రజాస్వామిక చర్యను ఖండించాలి. బహుళజాతి సంస్థలతో కుదుర్చుకున్న ఒప్పందాలు రద్దు చేసుకుని మధ్య, తూర్పుభారతంలో సైన్య, పారామిలటరీ బలగాలను పూర్తిగా ఉపసంహరించు కొనేవరకు పోరాడాలి. కోట్లాది మంది ఆదివాసులు నిర్వాసితులు కాకుండా అడ్డుకోవాలి. ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను అమలుచేస్తున్న ఆదివాసులకు అండగా నిలవాలి.



నివేదిక

# 'ముప్పై వసంతాల దండకారణ్య సాహిత్యోద్యమం' పై సదస్సు

విప్లవ రచయితల సంఘం ఆవిర్భావ దినోత్సవం ( జూలై 4) సందర్భంగా 'ముప్పై వసంతాల దండకారణ్య సాహిత్యోద్యమం' పై సదస్సు 3 జూలై 2011 ఆదివారం హైదరాబాదు లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, పబ్లిక్ గార్డెన్స్ నాంపల్లిలో కామ్రేడ్ ఆర్.ఎస్.రావు వేదిక పై ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు జరిగింది. సదస్సులో మొదటి సెషన్ 'చరిత్రలో ఆదివాసీ ఉద్యమాలు - దండకారణ్యం' పై డా. గుంటి రవి ప్రసంగించగా కా. వరవరరావు అధ్యక్షత వహించారు. కా. వివి సదస్సును ప్రారంభిస్తూ విప్లవోద్యమం ఈ రోజు దేశ వ్యాప్తంగా పీడిత వర్గాల, పీడిత ప్రజల పక్షాన ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను దండకారణ్యంలో నెలకొల్పుతుంటే, పాలకులు ఆ నమూనాను ధ్వంసం చేసి సామ్రాజ్యవాదులకు దేశ సంపదలను, వనరులను అప్పజెప్పడానికి ఆదివాసీ ప్రజలను, నిర్వాసితులను చేస్తున్నారన్నారు. మొత్తంగా గ్రీన్‌హంట్ పేరుతో క్రూరమైన అణచివేతకు రాజ్యం పూనుకుంటోందన్నారు. అయితే ఆదివాసీల చరిత్రను చూస్తే 'వాళ్ళు చరిత్రలో ఓడిపోయిన సందర్భాలు ఉన్నాయి కావచ్చు, కానీ లొంగిపోయిన సందర్భాలు లేవు' అని అన్నారు. దండకారణ్యానికి, మొత్తంగా విప్లవోద్యమ నాయకత్వంలో రూపొందుతున్న ప్రజా, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాకు మనమంతా బాసటగా నిలవాలన్నారు. డా. గుంటి రవి ఈ నేలపై రెండు శతాబ్దాలకు పైగా సాగిన, సాగుతున్న ఆదివాసీల పోరాటాల చరిత్రను కొన్ని మైలు రాళ్ళవంటి సంఘటనలతో వివరించారు. నడుస్తున్న దండకారణ్య పోరాటంలో ఆదివాసీల పాత్రను వివరించారు. భూంకాల్ పోరాటంలోని కానుసిద్దూ నుంచి మొదలు పెట్టి బిర్సాముండా, కొమురం భీం లతో సహా ఇవాల్టి విప్లవోద్యమం దాకా వారి త్యాగాలను, ఆరాట, పోరాటాలను వివరించారు.

రెండవ సెషన్ 'దండకారణ్య మహిళా ఉద్యమం' కు కా. ఎం. రత్నమాల అధ్యక్షత వహించగా కా. షోమాసేన్ ప్రసంగించారు. సెషన్‌ను ప్రారంభిస్తూ కా. రత్నమాల వివిధ మహిళా ఉద్యమాలు, వాటిలో చోటు చేసుకుంటున్న కొన్ని అనవసర, పెడ ధోరణుల గురించి ప్రస్తావించారు. దండకారణ్య మహిళా ఉద్యమం పై కా. షోమాసేన్ మాట్లాడుతూ దండకారణ్య ప్రాంతంలో ఆదివాసీ మహిళల వీరోచిత పోరాటాలను వివరించారు. విప్లవోద్యమంలో సృజనాత్మకంగా వారు పాల్గొంటున్న తీరు ఎదుగుతున్న తీరు వివరించారు. ఆహారం, వ్యాయామం, ఆట, పాట, మాట మొత్తంగా రూపొందుతున్న నూతన వ్యక్తిత్వం, పెంపొందిన ఆత్మస్థైర్యం ఇలా ఆమె స్వయంగా చూసినవి, పరిశీలించినవి వివరించారు. రకరకాలుగా అణచివేతలకు గురైన ఆదివాసీ మహిళ ఇవాళ దండకారణ్య ఉద్యమంలో ఎదిగిన, ఎదుగుతున్న తీరు, నాయకత్వం వహిస్తున్న తీరు వివరించారు. మహిళా విముక్తికి మొత్తంగా సమాజ విముక్తికి దండకారణ్య మహిళా ఉద్యమం కొత్త దారులు వేస్తోందన్నారు.

మూడవ సెషన్ 'దండకారణ్య సాహిత్య, సాంస్కృతికోద్యమం' కు కా. ఉదయభాను అధ్యక్షత వహించగా, కా. పాణి ఆ అంశంపై మాట్లాడారు. దండకారణ్యంలో విప్లవోద్యమం ఊపిరి సలపని సాయుధ పోరాటం చేస్తూ, అనేక కష్ట నష్టాల మధ్య నుండి మూడు దశాబ్దాలకు పైగా అద్భుతమైన సాహిత్య సృష్టిని చేస్తోందన్నారు. కథ, నవల, కవిత్వం, పాట, వ్యాసాలు, రిపోర్టులు ఇలా అనేక ప్రక్రియల్లో చాల గొప్ప సాహిత్య సృష్టి చేస్తోందన్నారు. దండకారణ్య రచయితల వేగాన్ని అందుకోవడంలో అరుణతార వెనుకబడే ఉందన్నారు. విప్లవోద్యమం సృష్టిస్తున్న సాహిత్యాన్ని అందుకోవడం, ప్రచారం చేయడం, ఎత్తిపట్టడం తనవంతుగా విప్లవ రచయితల సంఘం కొనసాగిస్తుందని అన్నారు.

నాల్గవ సెషన్ 'దండకారణ్యంలో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూన' కు కా. జి. కళ్యాణరావు అధ్యక్షత వహించగా ఆ అంశంపై కా. సత్నాం మాట్లాడారు. సత్నాం దండకారణ్య ప్రాంతాన్ని, ఉద్యమాన్ని, అక్కడి ఆదివాసుల జీవితాన్ని, రూపొందుతున్న ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి నమూనాని తన పుస్తకం 'జంగల్‌నామా' (హిందీ) లో రాసారు. ఆదివాసీ గ్రామాలపై, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాపై రాజ్యం చేస్తున్న దాడిని అక్కడి ప్రజలపై అమలవుతున్న నిర్బంధాన్ని వివరించారు. దండకారణ్యంలోని రూపుదిద్దుకుంటున్న నూతన ప్రజాస్వామిక సంస్కృతి, జీవితాలను వివరించారు. ప్రజలను వారి జీవితాలనుంచి బేదఖలు చేసి సామ్రాజ్యవాదులకు దాసోహమంటున్న దళారీ పాలకులకు, వారి విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమం నడుస్తోందన్నారు. నిజమైన అభివృద్ధి, స్వేచ్ఛ, సార్వభౌమత్వం, సమానత్వాల కోసం, దోపిడీ నుండి విముక్తి కోసం అక్కడి ప్రజల పోరాటం సాగుతోందని అన్నారు.

చివరి సెషన్ 'అభివృద్ధి నమూనాల సంఘర్షణ - ప్రజలపై యుద్ధం' కు కా. గీతాంజలి అధ్యక్షత వహించగా ఆ అంశంపై ప్రొ. ఎస్.శేషయ్య మాట్లాడారు. కా. ఆర్.ఎస్. రావు వేదికపై జరుగుతున్న ఈ సదస్సులో కా. ఆర్.ఎస్. రావు ఆలోచనలను గుర్తు చేసారు. కా. ఆర్.ఎస్. రావు చాల సునిశితమైన మార్క్సిస్టు విశ్లేషణలను అందించారని అన్నారు. తన ప్రసంగ అంశంపై మాట్లాడుతూ రాజ్యమే తనకు కావల్సిన సమ్మతితోపాటు అసమ్మతినీ సృష్టించుకుంటోందని అన్నారు. ప్రజా వ్యతిరేకత తీవ్రతను తగ్గించుకునే ప్రయత్నాలు చేస్తోందన్నారు. విప్లవోద్యమం నిర్మిస్తున్న అభివృద్ధి నమూనాను కూల్చి ప్రజలపై తన 'అభివృద్ధి' నమూనాను రుద్దే క్రమంలోనే ప్రజలపై యుద్ధం ప్రకటించిందన్నారు.

ఈ సదస్సులో సాధన రాసిన 'గ్రీన్‌హంట్ ఉత్పాతాలు' పుస్తకాన్ని కా. గంటి ప్రసాదం ఆవిష్కరించారు. సింధూకిరణ్ రాసిన 'దండకారణ్య ఉద్యమ ఆకాశంలో సగం' పుస్తకాన్ని కా. ఎస్. రజని ఆవిష్కరించారు. కా. అనూరాధ గాంధీ రాసిన 'స్త్రీవాద ఉద్యమంలో తాత్విక ధోరణులు' పుస్తకాన్ని కా. చూపు కాత్యాయని ఆవిష్కరించారు. అలాగే పి. శంకర్ రాసిన 'విముక్తి బాటలో విప్లవోద్యమం - 30 ఏండ్ల దండకారణ్యం' పత్రం, సాధన రాసిన 'విముక్తి యుద్ధంలో వికసిస్తూన్న ప్రజా సాహిత్యం - సంస్కృతి' పైన రాసిన పత్రం ప్రజాయుద్ధంలో సగభాగమైన మహిళలు - సదస్సుకు అందాయి. ప్రజాకళామండలి కళాకారులు తమ పాట, ఆట, మాటలతో 30వసంతాల దండకారణ్య ఉద్యమ స్ఫూర్తిని చాటారు.



# జీతన్ మరాండీ, అతని ముగ్గురు సాంస్కృతిక సహచరుల ఉరిశిక్షలు రద్దు చేయాలి

ఈ వ్యవస్థ మీద రాజీలేని పోరాటం చేసే వారి ప్రాణాలు హరించడం రాజ్యానికి కొత్తేమీ కాదు. మొదటి నుంచీ ఆదివాసులు తల ఎత్తుకొని బతుకుతున్నారు కనుకనేమో తలారి వ్యవస్థ ఎప్పుడూ వారిని ఉరికంబాలకు ఎక్కిస్తూ ఉంటుంది. కానూ సిద్దూలు, ఖుదీరాంబోసు, బిర్సా ముండా మొదలు కొమురం భీం వరకు ఆదివాసీ తిరుగుబాటు వీరులను వలస పాలకులయితేనేమీ, నైజాం సర్కారైతేనేమీ ఉరికంబాలెక్కించారు. చంపి చెట్లకు వేళ్లాడదీసారు. జోడెన్‌ఘాట్‌లో 1940లో కొమురంభీంను, ఆయన సహచర వీరులను పదిమందిని అట్లా 'మా గ్రామాల్లో మా రాజ్యం' అని తర్వాతి తరాలు స్వరాలు వినిపించకుండా భయపెట్టడానికి అన్నట్లు చంపి చెట్లకు వేళ్లాడదీసారు. స్పార్టకస్‌ను, వేలాది ఆయన బానిసల తిరుగుబాటు సహచరులను చంపి దీపస్తంభాలకు వేళ్లాడదీసి 'భవిష్యత్తులో ఇంకెప్పుడూ బానిసలు తిరుగుబాటు చేయకుండా ఉండడానికి గుణపాఠం' అన్నాడు డీన్ నియంత. ఆ బానిసలు చిందించిన నెత్తురు నుంచే బానిస వ్యవస్థను రద్దు చేసే తరం పుట్టుకొస్తుందన్నది స్పార్టకస్ భార్య. నియంత చెప్పినమాట అబద్ధమయింది. ఎదురు తిరిగినవాళ్లు చెప్పిన మాట నిజమయింది. అయినా స్వార్థ ప్రయోజనాలున్న పాలకవర్గాలు చరిత్ర నుంచి నేర్చుకోవడానికి నిరాకరిస్తూనే ఉన్నాయి.

జార్ఖండ్‌లోని గిరిధి సెషన్స్ కోర్టు ఆదివాసీ దళిత సాంస్కృతిక కార్యకర్తలైన జీతన్ మరాండీ, అనిల్‌రామ్, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్‌లకు ఉరిశిక్షలు విధించింది. జీతన్, అతని సహచరులు జార్ఖండ్ ఆవాన్, జనవాది క్రాంతికారీ మోర్చా వంటి కళా సాంస్కృతిక సంస్థలు ఏర్పాటు చేసి జార్ఖండ్‌లో దశాబ్దంపైగా ఖొత్తా, సంతాలీ, నాగ్‌పూరీ, హిందీ భాషల్లో పాటలు, శ్రవ్య, దృశ్య కళారూపాలు సృజించి ప్రదర్శిస్తున్నారు. జీతన్ అఖిల భారత విస్థాపన విరోధి కమిటీ జాతీయ కమిటీ సభ్యుడు. జార్ఖండ్‌లో విస్తృతమైన జనాదరణ ఉన్న కళాకారుడు. అక్కడి కళా సాంస్కృతికాభిమానులు ఆయనను చిలీ దేశపు విక్టర్ యారాతో, ఆవాన్ నాట్యమంచ్ విలాస్ ఘోగ్రేతో, తెలుగు నేల మీద గద్దర్‌తో పోల్చుకొని గర్వపడతారు. ఆయన ప్రసంగాలు, వ్యాసాలు కూడా ఆదివాసుల జీవితాలను, జీవన విధానాలను, సంస్కృతిని, పోరాటాలను ఎత్తిపడుతూ ఉంటాయి. జార్ఖండ్‌లోని విలువయిన వనర్ల కోసం, ముఖ్యంగా ఖనిజ వనరులను దోచుకొని, ఉక్కు కర్మాగారాలు నిర్మించడానికి వస్తున్న లక్ష్మీ మిట్టల్ వంటి బహుళజాతి కంపెనీలకు, బడా కంపెనీలకు బానిసలుగా వ్యవహరిస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ప్రతిఘటిస్తూ జీతన్ నాయకత్వంలో ఆదివాసీ సాంస్కృతిక కార్యకర్తలు ప్రచారం చేస్తున్నారు. పోరాడుతున్న ప్రజల మధ్య ఉన్నారు. అదే ప్రభుత్వాలకు కోపానికి కారణం. ఆయన, ఆయన సాంస్కృతిక సహచరులు బహిరంగ జీవితంలో ఉన్నారు. ప్రజాసంఘాల్లో పని చేస్తున్నారు. ప్రభుత్వ సామ్రాజ్యవాద అనుకూల విధానాలను, భూస్వామ్య, పెట్టుబడిదారీ స్వార్థ ప్రయోజనాలను బలపరిచే విధానాలను విమర్శిస్తూ పాడుతున్నారు, మాట్లాడుతున్నారు గనుక వాళ్లను ప్రభుత్వం మావోయిస్టులుగా చిత్రిస్తున్నది. మావోయిస్టు పార్టీ ముద్రవేస్తే నిషేధం వర్తిస్తుంది. నిషేధిత పార్టీ సభ్యులని ఆరోపించి చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (యు.ఎ.పి.ఎ.) కింద నేరారోపణ చేసి నిర్బంధించడానికి వీలవుతుంది. మావోయిస్టు పార్టీ ఎక్కడయినా, ఏదయినా చర్యకు పూనుకుంటే అందులో ఇరికించడానికి వీలవుతుంది. మావోయిస్టు పార్టీ అగ్ర నాయకుడు నారాయణ సన్యాల్‌తో పరిచయం ఉన్నందుకే, జైల్లో ఆయనను పియుసిఎల్ అధ్యక్షుడుగానూ, డాక్టర్‌గానూ కలిసినందుకే డాక్టర్ బినాయక్‌సేన్ ఎంత చేదు జీవితానుభవం రుచి చూడాల్సి వచ్చిందో ఇంకా జ్ఞాపకాల్లో పచ్చిగానే ఉన్న ప్రజలకు ఇంతకన్న వివరించి చెప్పనక్కర్లేదు.

27 అక్టోబర్ 2007న జార్ఖండ్‌లో బిఖారే అనే చోట ఒక బహిరంగ సభ ప్రదేశంలో మావోయిస్టులు అనూప్ మరాండీని, మరో 19 మందిని చంపారు. అనూప్ మరాండీ మాజీ ముఖ్యమంత్రి బాబూలాల్ మరాండీ కొడుకు. వీళ్లంతా ఆయన సంఘటితం చేసిన నాగరిక సురక్షా సమితి సభ్యులు. జార్ఖండ్‌లో నాగరిక సురక్షా సమితి అంటే, బెంగాల్‌లో వామపక్ష ప్రభుత్వం కాలంలో హర్మద్ వాహిని, ఛత్తీస్‌గఢ్‌లో సాల్వాజుడుం వంటి చట్టానికి అతీతమయిన ప్రైవేట్ సైనిక బలగం. మావోయిస్టులను ఎదుర్కోవడానికి ఉద్దేశించింది. ఏమైనా, ఆ కాల్పులు జరిపిన మావోయిస్టులలో జీతన్ మరాండీ అనే దళ నాయకుణ్ని అక్కడ చూసినవారు పోల్చుకున్నారు. అతడేమో అజ్ఞాతంలో ఉన్నాడు. దొరికిననాడు ఎట్లాగూ ఎన్‌కౌంటర్ అవుతాడు. కనుక పోలీసులు అప్పటికే వేరు వేరు కేసుల్లో మూడు నాలుగేళ్లుగా జైళ్లకు పోతూ వస్తూ ఉన్న సాంస్కృతిక కార్యకర్త జీతన్ మరాండీని ఇరికించి మళ్లా అరెస్టు చేసారు. తప్పుడు సాక్ష్యాలు చెప్పించి ఉరిశిక్ష వేయించారు.

రాంచీలో 5 ఏప్రిల్ 2008న జీతన్ మరాండీని రాతూ రోడ్‌లో

అరెస్టు చేసినపుడు ఆయన విస్థాపన విరోధి జన వికాస్ ఆందోళన్ కమిటీ మీటింగ్‌కు వెళ్లి వస్తున్నాడు. గనుల తవ్వకాల వల్ల, ప్రైవేట్ కంపెనీల, ఉక్కు ఫ్యాక్టరీల నిర్మాణం వల్ల లక్షలాదిగా నిర్వాసితులవుతున్న ఆదివాసుల సమస్యల గురించి, పునరావాసం గురించి, కోల్పోతున్న ఉనికి, సంస్కృతి గురించి, పోరాటాల గురించి రాస్తూ ఈ కారణాలన్నీ జార్ఖండ్‌లో నక్సలైటు ఉద్యమం వ్యాపిస్తోందని రాంచీ నుంచి వెలువడుతున్న సుప్రసిద్ధ హిందీ దినపత్రిక 'ప్రభాత్ ఖబర్'లో ఆయన రాసిన వ్యాసం మూడో భాగం ఆ రోజే ప్రచురింపబడింది. రాజ్యమే సామ్రాజ్యవాద ప్రపంచీకరణ - మైనింగ్ పాలసీ వల్ల మావోయిజం పుట్టి పెరగడానికి దోహదం చేస్తున్నదని, ఇపుడది అన్నిటికన్నా ప్రమాదకరమైన అంతర్గత శత్రువుగా ప్రకటించి ప్రభుత్వం గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో తన ప్రజలపై యుద్ధం నిర్వహిస్తున్నదని ఆయన ఆ వ్యాసాన్ని ముక్తాయింపు చేసాడు. శాంతి కోరుతున్న ప్రజాస్వామ్యవాదులు ఈ అన్యాయమైన ప్రభుత్వ దాడిని నిలవరించాలని విజ్ఞప్తి చేసాడు.

మావోయిస్టు పార్టీ సభ్యులనైనా చర్చల కోసం కాకుండా విశ్వాసాల కోసం నిర్బంధించడానికి వీలులేదని, మావోయిస్టు పార్టీ సానుభూతి పరులను, భావజాలాన్ని ప్రచారం చేసేవారిని, మావోయిస్టు సాహిత్యం కలిగి ఉన్నవారిని నేరారోపణ చేయడానికి వీలయిన అపరాధులుగా భావించరాదని ఇప్పటికి ఎన్నో సందర్భాల్లో సుప్రీం కోర్టు చెప్పి ఉన్నది. కానీ ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్‌లలో ప్రభుత్వాలు కాదు గదా కోర్టులు కూడా ఈ విషయంలో విశ్వాసమే లేదా సామ్రాజ్యవాద వ్యతిరేకతయే లేదా ఆదివాసుల పట్ల సానుభూతియే జీవిత ఖైదు వేయదగినంత నేరంగా భావిస్తున్నాయి. ఇంక ఆదివాసుల గురించి గొంతెత్తిన వాళ్లు ఆదివాసీ సాంస్కృతిక కార్యకర్తలే అయితే చెప్పేదేమున్నది.

మన దేశంలో బహిరంగ జీవితంలో, ప్రజా సంఘాల్లో పని చేస్తున్న సాంస్కృతిక కార్యకర్తలకు ఉరిశిక్ష పడడం ఇదే మొదటిసారి అనుకుంటాను. మన సమాజంలో, వ్యవస్థలలో ధిక్కార స్వరాన్ని సహించని సంస్కృతి ఇంతగా దిగజారింది.

అజ్ఞాత జీవితంలోకి వెళ్లి పీపుల్స్ వార్ జిల్లా నాయకుడైన, ఎన్‌కౌంటర్ అయిన జన నాట్య మండలి దివాకర్ వంటి వాళ్ల ఉదాహరణలు ఉండవచ్చు. పరోక్షంగా రాజ్యం చంపించిన తెలంగాణ కోయిల బెల్లి లలిత, 'ఎన్‌కౌంటర్' అయిన ఐలన్నల ఉదాహరణలు ఉండవచ్చు. కాని ఒక అబద్ధపు నేరారోపణలో న్యాయస్థానం విచారణ నిర్వహించి, అబద్ధపు సాక్ష్యాలు నమ్మి సాంస్కృతిక కార్యకర్తలకు ఉరిశిక్షలు వేయడం మాత్రం ఇదే మొదటిసారి.

దక్షిణాఫ్రికాకు ఇంకా స్వాతంత్ర్యం సిద్ధించక ముందు 1985లో బెంజమిన్ మొలైసె అనే కవికి ఒక సబ్ ఇన్‌స్పెక్టర్‌ను చంపాడనే తప్పుడు ఆరోపణతో ఉరిశిక్ష విధించారు. అది అమలయింది కూడ. అంతకన్నా గగుర్పాటు కలిగించే ఉదంతం కెన్‌సారోవివాది.

కెన్‌సారోవివా నైజీరియా ఒగోని జాతికి చెందిన సుప్రసిద్ధ కవి. నాటకకర్త. ఒగోని ప్రాంతంలో నైజీరియా నుంచి ఎగుమతి అయ్యే చమురు నిక్షేపాలు సమృద్ధిగా ఉన్నాయి. ఆ చమురును, ఆ చమురుపై వచ్చే అపారమైన లాభాలను బ్రిటిష్ చమురు కంపెనీలే తరలించుక పోతున్నాయి. ఒగోనీ తెగ ప్రజలకు మిగిలింది మాత్రం కాలుష్యం, విధ్వంసం, అసహజ మరణాలు. ఒగోనీ ప్రాంతపు చమురుపై హక్కు ఒగోనీ ప్రజలకే చెందాలని కెనెసారోనివా నాయకత్వంలో 1995 నాటికి గొప్ప పోరాటం నిర్మాణమైంది. ఆ పోరాటానికి నైజీరియాలోని ప్రజాస్వామ్య వాదులు, బయట ప్రవాసంలో ఉన్న రచయితలు కూడ మద్దతు తెలిపారు. ముఖ్యంగా ఫ్రాన్స్‌లో ప్రవాసంలో ఉన్న నోబెల్ సాహిత్య బహుమతి గ్రహీత, నైజీరియా కవి, నాటకకర్త, ఓలెసోయెంకా ఈ ఉద్యమానికి రహస్య నాయకత్వాన్ని అందించాడు. ప్రవాసం నుంచి రహస్యంగా నైజీరియాకు వచ్చి ఈ పోరాటాన్ని రగిలించి పోతున్నాడని నైజీరియా నియంతకు అనుమానం. అప్పటికే అరెస్టయి జైల్లో ఉన్న కెన్‌సారోవివాను తప్పుడు హత్యకేసులో ఇరికించి ప్రభుత్వం ఉరిశిక్ష పడేలా చేసింది. ప్రపంచ వ్యాప్తంగా నిరసన పెల్లుబికింది. ఓలెసోయెంకా నైజీరియాకు, ముఖ్యంగా ఒగోనీ ప్రాంతానికి వచ్చి పోతున్న జాడ చెప్తే క్షమాభిక్ష పెడతామని ప్రభుత్వం కెన్‌సారోవివాను ప్రలోభ పెట్టి చూసింది. 'ఇది నా పోరాటం. మా పోరాటం. మా భూమి, మా వనర్లు, మా చమురు, మా స్వేచ్ఛ కోసం మా ఒగోనీ జాతిపోరాటం, ఇందుకెవరయినా సంఘీ భావం ప్రకటిస్తే వాళ్లనూ మా జాతిగానే భావిస్తాం. ఇంకెవరి జాడనో చెప్పి చావు తప్పించుకోవడమెందుకు? సార్వభౌమత్వం కోసం పోరాటం ఉరితీయదగినంత నేరమైతే ఆ నేరానికి ఉరికంబం ఎక్కడానికి సిద్ధంగా ఉన్నానని కెన్‌సారోవివా ప్రకటించాడు.

ఉరిశిక్ష ప్రకటించగానే గిరిధి కోర్టు బయటికి వచ్చి కోర్టు ఆవరణలో జీతన్ మరాండీ, ఆయన సాంస్కృతిక సహచరులు కూడా అదే ధిక్కార స్వరాన్ని ప్రకటించారు. 'వహ్ సుభా కభీ తో ఆయేగీ' అనే పాట పాడారు. ఎందుకో తెలుసా? ఈ సుప్రసిద్ధమైన పాట అదే పేరుతో రాజ్‌కపూర్ నటించిన సినిమాలోది. ఆ సినిమా డాస్టవస్కీ రాసిన సుప్రసిద్ధ నవల 'నేరమూ - శిక్ష'పై ఆధారపడి తీసినది. డాస్టవస్కీకి కూడా జార్ చక్రవర్తి ప్రభుత్వం ఒక హత్యా నేరంలో ఉరిశిక్ష వేసి, ఆఖరి క్షణంలో ఆయన రచయిత అని వదిలి వేసిందని మనకు శ్రీశ్రీ భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షల సందర్భంగా స్వయంగా కరపత్రం రాసి సభలో చెప్పి ఉన్నాడు. ఇందిరాగాంధీని జార్‌చక్రవర్తి కన్నా దుర్మార్గురాలని అనిపించుకోవద్దని హితవు చెప్పి ఉన్నాడు. తెలంగాణలో పదకొండు మంది రైతాంగ సాయుధ పోరాట వీరులకు పడిన ఉరిశిక్ష కాగితాలపై ఖురాన్‌పై భయభక్తులతో సంతకం చేయని ఉస్మానలీఖాన్ కన్నా దుర్మార్గురాలని అనిపించుకోవద్దని హితవు చెప్పి ఉన్నాడు - అప్పటికి ఇందిరాగాంధీ స్పెయిన్‌లో ఉరిశిక్ష పడిన ఐదుగురు యువకులకు క్షమాభిక్ష పెట్టవలసిందని నియంత

ఫ్రాంకోకు విజ్ఞప్తి చేసి ఉన్నది. ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో భూమయ్య కిష్టాగౌడ్‌లను 1 డిసెంబర్ 1975న ఉరి తీసారు.

ఇప్పుడు మనం ఆమె కోడలు పాలనలో ఉన్నామా? మనుమని పాలనలోనా? మన్మోహన్ సింగ్ పాలనలోనా? ప్రపంచ బ్యాంక్ పాలనలోనా? ఎవరి పాలన అయినా పాకిస్థాన్ జైల్లో ఉన్న భారతీయ ఖైదీల విడుదల కోసం అడుగుతున్నాం. ఉరిశిక్షల రద్దు కోసం అడుగుతున్నాం. మనమేకాదు, భారత ప్రభుత్వం అడుగుతున్నది.

కాని భారత ప్రభుత్వం జెయిళ్లలో మాత్రం అఫ్జల్‌గురు మొదలు ఎందరో అమాయకులు రాష్ట్రపతి క్షమాభిక్ష కోసం మృత్యుద్వారం దగ్గర నిలబడి క్షణక్షణం నిరీక్షిస్తున్నారు. ఇది మరణశిక్ష కంటే ఘోరమైన నిరీక్షణ. మరొకవైపు దేశభక్తి మీద మొనాపలీ ప్రకటించినవాళ్లు అనాగరికంగా అఫ్జల్‌గురును ఇంకెప్పుడు ఉరితీస్తారని అడుగుతున్నారు. అనాగరికంగా అనే సాహసమెందుకంటే ప్రపంచంలో నూట ముప్పై దేశాలు మరణ శిక్షలను రద్దు చేసినవి.

సుప్రీంకోర్టు 'అరుదయిన సందర్భాల్లో అత్యంత అరుదైన దారుణమైన నేరాలు రుజువయినపుడు తప్ప మరణశిక్ష విధించరాదని' చెప్పింది. 'పోలీసులు ఎన్నో మార్లు తమ ఆరోపణలను స్థిరపరచడానికి సాక్ష్యాలను సృష్టిస్తూ ఉంటార'ని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పదవీ విరమణ చేసిన జస్టిస్ భగవతి చెప్పి ఉన్నాడు. ఆయన అంతర్జాతీయ న్యాయస్థానంలో కూడా పని చేసి ఉన్నాడు.

ఇవ్వాళ గిరిధి కోర్టు ఉరిశిక్ష విధించింది కేవలం నలుగురు సాంస్కృతిక కార్యకర్తలకు కాదు. మన ప్రజా సాంస్కృతిక విశ్వాసాలపై అది తీర్పు ప్రకటించింది. న్యాయమూర్తి తీర్పు ప్రకటించి బెంచి దిగిపోగానే పోలీసులు బయటికి తెచ్చిన జీతన్ మరాండీ, ఆయన సహచరులు ఎప్పటివలెనే పాటలు పాడారు - నినాదాలు ఇచ్చారు - అవి ఎప్పటి వలెనే ప్రజల్లో పనిచేసే కళాకారుల స్వరాలు. ప్రతిఘటనను, రేపటిపై విశ్వాసాన్ని ప్రకటించే పాటలు - కష్టం చేసే మనుషుల ఆకాంక్షలు ప్రతిఫలించే పాటలు. జీవితోత్సవాన్ని, మానవత్వ మనుగడను చాటిచెప్పే పాటలు. జార్ఖండ్ దళిత ఆదివాసీ ప్రజల, సహస్ర వృత్తుల సబ్బండరాశుల ఐక్యతలో ఉన్న అందాన్ని గానం చేసే పాటలు. సంతాల్ ప్రజల శతాబ్దాల ఉజ్వల పోరాట పాటలు.

వాళ్లతోపాటు జీతన్ సహచరి అపర్ణ, వాళ్ల రెండున్నరేళ్ల శిశువు ఆ సాయంకాలం ఉరితీసే వేకువ వేళకే ఉదయించే సూర్యుని కోసం కళ్లలో మన ప్రజల ప్రజాస్వామ్య సంస్కృతిపై అచంచల విశ్వాసంతో ఎదురు చూస్తున్నారు.

ఇన్నాళ్లయినా విడిపించుకోలేకపోయినా, విజయవర్ధనరావు, చలపతిల మరణశిక్షలు రద్దు చేయించగలిగిన ప్రజాస్వామిక ఉద్యమాలపై భరోసాతో నిరీక్షిస్తున్నారు.

కనుక ఇవ్వాళ వ్యవస్థ బోనులో ఉన్నది. రచయితల, కళాకారుల, సాంస్కృతిక కార్యకర్తల ప్రజాస్వామిక విశ్వాసాలు పరీక్షకు నిలవాల్సి ఉన్నది. ప్రజాన్యాయ విచారణ నిర్వహించాల్సి ఉన్నది.

దేశంలోనే మొదటిసారిగా మరణశిక్ష పడిన జీతన్ మరాండీ, అతని ముగ్గురు సాంస్కృతిక సహచరుల ఉరిశిక్షలు రద్దు చేసి బేషరతుగా విడుదల చేయాలని ఉద్యమించాల్సి ఉన్నది.

**- విప్లవ రచయితల సంఘం**
ఆంధ్రప్రదేశ్, 28 జూలై, 2011



కరపత్రం

# జార్ఖండ్ ఆదివాసీ, దళిత ప్రజాకళాకారులు జీతన్‌మరాండీ, అనిల్‌రామ్, మనోజ్‌రాజ్వర్, ఛత్రపతి మండల్‌ల ఉరిశిక్షల రద్దు కోరుతూ...

జార్ఖండ్ ఆదివాసీ, దళిత ప్రజాకళాకారులు జీతన్‌మరాండీ, అనిల్‌రామ్, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్‌లకు ఆ రాష్ట్రంలోని గిర్డీ సెషన్స్ కోర్టు జూన్ 22న ఉరిశిక్ష విధించింది. జీతన్, అతని సహచరులు జార్ఖండ్ ఆవాన్, జనవాదీ క్రాంతికారీ మోర్చా వంటి కళా సాంస్కృతిక సంస్థలు ఏర్పాటు చేసి జార్ఖండ్‌లో ఒక దశాబ్దం పైగా ఖొత్తా, సంతాలీ, నాగపురీ, హిందీ భాషల్లో పాటలు, శ్రవ్య, దృశ్య కళారూపాలు సృజించి ప్రదర్శిస్తున్నారు. ఆడియో, వీడియో క్యాసెట్లు కూడ వెలువడి ఆదివాసీ ప్రాంతాల్లో, హిందీ తెలిసిన ప్రాంతాల్లో ప్రసిద్ధమైనవి.

అణచివేతకు గురవుతున్న ప్రజల కోసం రాసే, కళా ప్రదర్శనలిచ్చే కవులను, కళాకారులను ఉరితీయడం చాలా అసాధారణమైన విషయం. అరుదయిన నేరాల్లో అరుదయిన వాటికే



**ఈ సభలో జీతన్ మరాండీ సహచరి అపర్ణమరాండీ పాల్గొని ప్రసంగిస్తుంది.**

స్థలం : సుందరయ్య కళా విజ్ఞాన కేంద్రం,
సమయం : 30 ఆగస్టు, 2011, సాయంత్రం 5 గం.
అధ్యక్షత : గీతాంజలి (విరసం)
వక్తలు : డా. బి.డి. శర్మ, (మాజీ చైర్మన్, జాతీయ కమిషన్ ఎస్.సి./ఎస్.టి.)
గద్దర్ (తెలంగాణ సాంస్కృతిక వేదిక),
ఎం.టి. ఖాన్,
బొజ్జా తారకం (సీనియర్ అడ్వకేట్),
ఎం. రత్నమాల (ప్ర. ర. వే.),
ప్రొఫెసర్ శేషయ్య (అధ్యక్షుడు ఎ.పి.సి.ఎల్.సి.),
జాన్ (ప్రజా కళా మండలి)
వరవరరావు (విరసం),
అపర్ణ మరాండీ, మొదలయినవారు
ప్రజాకళాకారులచే సాంస్కృతిక ప్రదర్శనలుంటాయి.

ఉరిశిక్ష వేయాలనే సుప్రీంకోర్టు నిర్వచనాన్ని వ్యాఖ్యానిస్తూ ఇటీవల సుప్రీంకోర్టు డివిజన్ బెంచి అది సాధారణ పౌరుల కన్నా పోలీసులు చేసినపుడు అరుదయిన నేరమవుతుందని వ్యాఖ్యానించింది. ఇపుడా పోలీసులే జీతన్‌ను, అతని సహచరులను అన్యాయంగా హత్యకేసులో ఇరికించి ఉరికంబమెక్కిస్తున్నారు. ఇటువంటి ఉదంతాలు ప్రపంచ చరిత్రలోనే చాలా తక్కువ. దక్షిణాఫ్రికా కవి బెంజిమిన్ మొలైసేని 1985లో అప్పటి వలస ప్రభుత్వం ఉరి తీసింది. నైజీరియాలో ఒగోనీ ఆదివాసీ జాతి కవి, నాటక కర్త కెన్‌సారో వివాను 1996లో ఆ ప్రభుత్వం ఉరి తీసింది. ఒగోని ప్రాంతంలో చమురు బ్రిటిష్ కంపెనీలు దోచుకుపోవడానికి వీలు లేదని ఉద్యమించినందుకు ఆయనపై ఈ చర్యకు ఒడిగట్టింది. ఈ ప్రజా కళాకారులు పేద, పీడిత ప్రజల కోసం, దోపిడీకి గురయిన ప్రజల కోసం రాసి, పాడి, ప్రదర్శనలిచ్చారు. భూస్వామ్య, పెట్టుబడిదారీ దేశాల్లో పాలకుల అన్యాయ పాలనను ప్రశ్నించినందుకు ప్రాణాలు తీయడం అసాధారణమేమీ కాదు. రాజకీయ కారణాలతో తప్పుడు సాక్ష్యాలు సృష్టించి తమ చర్యలను సమర్థించుకోవడమూ చూస్తూనే ఉన్నాం. ఇటువంటి చాల సందర్భాల్లో ఉద్దేశపూర్వకంగా ఇరికించి, తప్పుడు ఆరోపణలు చేసి, సాక్ష్యాలను సృష్టించడం ద్వారా ఉరిశిక్షలు అమలయిన ఉదంతాలు చరిత్ర నిండా కనిపిస్తాయి.

రాజకీయ ప్రత్యర్థులను అన్యాయంగా ఉరితీసిన ఉదంతాలను మనం ఎన్నో చూసాం. కాని జీతన్ ఆయన ముగ్గురు సహచర కళాకారులకు ఉరిశిక్ష పడడం తెలిసి దేశమంతా నివ్వెరపోయింది. ప్రజలందరూ ఎంతో ప్రేమించి, ప్రశంసించే కళాకారులు వాళ్లు. జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రి బాబూ లాల్ మరాండీ కొడుకు అనుప్ మరాండీ, అతని జార్ఖండ్ వికాస్ మోర్చా అనే ప్రైవేట్ సైన్యానికి చెందిన పద్దెనిమిది మంది హత్యకేసులో ఐదు నెలల తర్వాత వీళ్లను ఇరికించారు. అప్పటి దాకా వాళ్లు ప్రజల మధ్య బహిరంగంగా పాడుతూ, ప్రదర్శనలిస్తున్న వాళ్లే. ఆ సంఘటనను మావోయిస్టులు తామే చేసామని ప్రకటించుకున్నారు కూడా. ఈ నలుగురూ మావోయిస్టు పార్టీ సభ్యులు కారు. దళ సభ్యులు కారు. మావోయిస్టు పార్టీతో వీళ్లకే సంబంధమూ లేదు.

పోలీసులు చార్జిషీట్‌లో కొందరు మావోయిస్టులను నిందితులుగా చూపారు. అందులో ఒకరి పేరు జీతన్ మరాండీ. ఆ జీతన్ మరాండీ అజ్ఞాతంలో ఉన్నాడు. ఈ జీతన్ మరాండీని ఇరికించడానికి పోలీసులకిది కలిసి వచ్చింది.

జీతన్ మరాండీని రాష్ట్ర రాజధాని రాంచీలో 2008 ఏప్రిల్ 5న అరెస్టు చేసినపుడు ఆయన విస్థాపన విరోధి జన వికాస్

ఆందోళన ఏర్పాటు చేసిన బహిరంగ సభ నుంచి తిరిగివస్తున్నాడు. భూ ఆక్రమణలు, అక్రమ ఖనిజ తవ్వకాలు, ఉక్కు కర్మాగారాల నిర్మాణాలు చేపట్టిన ప్రైవేటు కంపెనీలు ప్రజలను నిర్వాసితులను చేసి వాళ్ల జీవనాధారాన్ని విధ్వంసం చేస్తున్నారని వాళ్లకు వ్యతిరేకంగా పోరాడుతున్న సంస్థ విస్థాపన విరోధి జన వికాస్ ఆందోళన్. 2007 అక్టోబర్ 1న ముఖ్యమంత్రి నివాసం ముందు జరిగిన రాస్తారోకోలో ఆదివాసీల నిర్వాసితత్వానికి వ్యతిరేకంగా మాట్లాడినందుకే జీతన్‌ను అరెస్టు చేస్తున్నామని పోలీసులు అతనికప్పుడు చెప్పారు కూడా. బహుశా అప్పుడు వాళ్ళు అన్యాయమైన అరెస్టులపై ప్రజాగ్రహాన్ని చల్లార్చడానికి అని ఉంటారు. కానీ అంత సులభంగా ఆయనను, ఆయన సహచరులను వదలడానికి వాళ్లు సిద్ధంగా లేరు.

ప్రజాందోళన వెల్లువలోని లావాను పసికట్టి దానిని తుఫానుగా మార్చే తుఫాను తుమ్మెదలు జీతన్ వంటి కళాకారులని పోలీసులకు తెలుసు. వీళ్లని హత్యకేసులో ఇరికించి, తప్పుడు సాక్ష్యాలు సృష్టించి, మరణ శిక్ష వేయించారు. కానీ పోలీసులకు స్పష్టంగా తెలుసు వీళ్లా చర్యలో పాల్గొనలేదని.

ఇప్పుడీ శిక్షను హైకోర్టు ఖరారు చేయాల్సి ఉన్నది. విచారణ (సెషన్స్) కోర్టు నమోదు చేసిన సాక్ష్యాల పైననే హైకోర్టు నిర్ణయం ఆధారపడి ఉంటుంది.

అందువల్ల మనం హైకోర్టు నిర్ణయం దాకా నిరీక్షించనక్కర్లేదు.

దేశంలోని ఉదారవాదులు, ప్రజాస్వామ్యవాదులందరికీ అసలు ఉరిశిక్షలకు వ్యతిరేకంగానే ఉద్యమించాల్సిన బాధ్యత ఉంది.

ప్రపంచంలో 96 దేశాలు మరణశిక్ష చట్టాన్నే రద్దు చేసాయి. 34 దేశాలు మరణశిక్షలు అమలు చేయవద్దని నిర్ణయించుకున్నాయి. కాని మన ప్రభుత్వం మాత్రం నిస్సిగ్గుగా తన అన్యాయ, అప్రజాస్వామిక పాలనను వ్యతిరేకించే వారి అడ్డు తొలగించకోడానికి ఈ హేయమైన చట్టాన్ని ఆశ్రయిస్తున్నది.

జీతన్ అతని సహచరులకు విధించిన ఉరిశిక్ష ప్రజా వ్యతిరేకమైంది. ప్రజలకు సవాలు, మన శిక్షాస్మృతి నుంచే మరణశిక్ష తొలగించాలని మనం గొంతెత్తాల్సి ఉన్నది.

ఇప్పుడు మనం ఉదాసీనత్వం వహిస్తే, కుట్రపూరితంగా రచించిన తప్పుడు ఆరోపణల కారణంగా రేపు ప్రజా కళాకారుల ప్రాణాలు హరింపబడే ప్రమాదం ఉంది. మనం మౌన ప్రేక్షకులుగా మిగులకూడదు. వాళ్ల స్వరాలు ఉరికంబాల మీద పాడుతూ నొక్కబడినప్పుడు వాళ్ల స్మృతిలో కొవ్వొత్తులు వెలిగించవలసిన విషాదంలోకి నెట్టబడకుండా ఉండాలంటే ఈ క్షణమే ఉద్యమించాలి. ఉరిశిక్షల రద్దు దాకా విశ్రమించకూడదు.

ఈ లక్ష్యంతోనే ఆదివాసీ, దళిత ప్రజా కళాకారులు జీతన్ మరాండీ, అనిల్ రామ్, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్‌ల ఉరిశిక్షల రద్దు కమిటీని కళాకారులు, రచయితలతో ఏర్పాటు చేసాం. ఇప్పటికిది తాత్కాలికమే. దీనిని రాష్ట్ర వ్యాప్తమైన, సాధ్యమయితే దేశవ్యాప్తమయిన సమగ్రమైన వేదికగా మనందరి కృషితో విస్తరించాల్సి ఉన్నది.



నా స్వరమూ, నా సంస్కృతియే నా ఆయుధాలు

బాల్యంలో కలమో, పుస్తకమో కాక నా చేతిలో పశువులను కాసే కర్ర ఉండేది. పశువులను లెక్కపెట్టడానికి కూడా నేను గులకరాళ్లను ఉపయోగించేవాణ్ని. ప్రతి రోజూ రేపటికోసం నిరీక్షణలోనే గడిచేది.

ఎల్లప్పుడూ నగారా, ఢోలక్, హార్మోనియమ్ వంటి సంగీత సాధనాలతోనే ప్రజలు నన్ను పోల్చుకునేవాళ్లు.

ప్రజలు నన్నెప్పుడూ పంచె, గాంజి , ఘుంఘ్రు (కాలిగజ్జెలు) వంటి జానపద కళాకారుల వేషంలో తప్ప చూడలేదు.

నా స్వరమూ, నా సంస్కృతియే నా ఆయుధాలు.

ఈ పాటల్లో అసభ్యత మచ్చుకైనా కనిపించదు. అవి వినోదం కన్నా ఉత్తేజానికి ప్రేరకాలయ్యాయి. వాటిల్లో ఉన్నదంతా సామాజిక చైతన్యం.

ప్రగతిశీల మేధావులు, రచయితలు, కళాకారులు, క్రియాశీల కార్యకర్తలు ముందుకు వచ్చి నన్ను తప్పుడు ఆరోపణల నుంచి నిర్దోషిగా ప్రకటించే తీర్పు వచ్చేలా సహకరించి, నన్ను జైలు నుంచి విముక్తి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఎందుకంటే నేను ప్రజా సంస్కృతిని, ఆదివాసీ సంప్రదాయాలను సంరక్షించే ప్రక్రియలో మళ్లీ నిమగ్నం కాగలగాలి.

- జీతన్ మరాండీ

ప్రజాస్వామ్య భావాలు గల రచయితలు, కళాకారులందరూ వేదికలో భాగమేనని, కావాలని మేం ఆకాంక్షిస్తున్నాం. ఆ ఆకాంక్షతోనే ఒక తొలి ప్రయత్నంగా జీతన్ మరాండీ, అనిల్ రామ్, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్‌ల ఉరిశిక్షలను రద్దు చేయాలని డిమాండు చేస్తూ బహిరంగ సభ నిర్వహిస్తున్నాం. రచయితలు, కళాకారులు, బుద్ధిజీవులు, ప్రజాస్వామ్యవాదులు, ప్రజాసంఘాలు పెద్ద సంఖ్యలో పాల్గొని విజయవంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తూ ఆహ్వానిస్తున్నాం.

ఈ సభలో జీతన్ మరాండీ సహచరి అపర్ణమరాండీ పాల్గొని ప్రసంగిస్తుంది.

**జీతన్ మరాండీ కళాబృందం (అనిల్‌రామ్, మనోజ్‌రాజ్వర్, ఛత్రపతి మండల్) ఉరిశిక్ష రద్దు కమిటీ**



నివేదిక

# జీతన్ కళాబృందం ఉరిశిక్షల రద్దు కమిటీ ఆధ్వర్యంలో బహిరంగ సభ

జీతన్ మరాండీ కళాబృందం (అనీల్‌రాం, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్) ఉరిశిక్ష రద్దు కమిటీ ఆధ్వర్యంలో 30 ఆగస్టు 2011 న సుందరయ్య కళావిజ్ఞాన కేంద్రంలో సాయంత్రం 5గంటల నుంచి బహిరంగ సభ జరిగింది. ఈ సభలో కవులు, కళాకారులు, ప్రజాస్వామికవాదులు, మేధావులు, ప్రజలు, వివిధ ప్రజా సంఘాల కార్యకర్తలు, నాయకులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. జీతన్ మరాండీ, అనీల్ రాం, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్‌ల ఉరిశిక్షలను వ్యతిరేకిస్తూ కవులు, కళాకారులు, ప్రజాస్వామిక వాదులు సంతకాలు చేసారు. ఈ బహిరంగ సభకు కా. గీతాంజలి అధ్యక్షత వహించగా వక్తలుగా జీతన్ మరాండీ సహచరి అపర్ణా మరాండీ, విస్తాపన్ విరోధి జన్ వికాస్ ఆందోళన్ కార్యదర్శి దామోదర్ తురి, గద్దర్, బొజ్జాతారకం, ఎం. రత్నమాల, ప్రొ. ఎస్. శేషయ్య, బి.డి. శర్మ, ఆర్. నారాయణ మూర్తి, రమేష్‌హజారీ, ప్రతాప్‌రెడ్డి, గోరటి వెంకన్న, జాన్, శివారెడ్డి, వరవరరావు తదితరులు పాల్గొని ప్రసంగించారు. ప్రజాకళా మండలి, మార్పు కళామండలి, అరుణోదయ, డప్పు సంస్థల కళాకారులు తమ ఆట, పాట, మాటలతో ఉరిశిక్షలకు వ్యతిరేకంగా తమ గళాన్ని వినిపించారు.

అపర్ణా మరాండీ మాట్లాడుతూ తన సహచరునికి చిల్ఖారీ సంఘటనతో ఎటువంటి సంబంధమూ లేదనీ, జీతన్‌ను మిగతా ముగ్గురిని తప్పుడు ఆరోపణలతో, తప్పుడు సాక్ష్యాలతో ఆ కేసులో ఇరికించారనీ పేర్కొంది. ఆ క్రమంలోనే గిరిధి సెషన్స్ కోర్టు జీతన్‌కు, అతని సహచరులకు ఉరిశిక్షలు విధించినట్లు చెప్పింది. జీతన్ చేసిన తప్పేంటి అని చూస్తే ఎన్నో ప్రకృతి వనరులు, ఖనిజ సంపదలు ఉన్న జార్ఖండ్ రాష్ట్రంలో దారిద్రం ఎందుకుందని, కష్టం చేసుకునే ప్రజలు ఎందుకు దారిద్ర్యం అనుభవిస్తున్నారని ప్రశ్నిస్తూ పాటలు రాసినందుకు, పాడినందుకు, జనాన్ని చైతన్యవంతుల్ని చేస్తున్నందుకే ఈ శిక్షలను విధించారని పేర్కొంది. జీతన్‌కు ఉరిశిక్ష కేవలం అతని ఒక్కనిపై జరుగుతున్న దాడి ఎంత మాత్రం కాదని, ఈ ఉరిశిక్ష ప్రజల పక్షం వహించి మాట్లాడుతున్న వారిపై జరుగుతున్న దాడని పేర్కొంది. జల్, జంగల్, జమీన్‌ల కోసం పోరాడుతున్న ప్రజలపై దాడిగా పేర్కొంది. రేపు తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డాక ఇక్కడ కూడ సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా జల్, జంగల్, జమీన్‌ల కోసం పోరాడాల్సే ఉంటుందని పేర్కొంది. జీతన్‌తో సహా ఆ ముగ్గురి ఉరిశిక్షలు రద్దు అయ్యే దాకా పోరాడుదామని, ఆ క్రమంలో అందరూ అన్ని రకాల సహకారాలు అందించాలని విజ్ఞప్తి చేసింది.

జన విస్తాపన్ విరోధి జన్ వికాస్ ఆందోళన్ ప్రతినిధి దామోదర్ తురి జార్ఖండ్‌లో జరుగుతున్న సామ్రాజ్యవాద దోపిడీ, ప్రజలను అన్ని రకాల వెనుకబాట్లలో ఉంచుతున్న దళారీ పాలకుల స్వభావం గురించి వివరించారు. పెద్దపెద్ద ప్రాజెక్టుల పేరిట ప్రజల్ని వారి జీవితాలనుంచి బయటకు తోసేస్తున్నారని అన్నారు. ప్రజల్ని చైతన్యవంతుల్ని చేస్తున్న జీతన్ మరాండీ, అనీల్ రాం, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్ వంటి వారిని ఉరిశిక్షలకు గురిచేద్దామని చూస్తోంది ప్రభుత్వం అని అన్నారు. జార్ఖండ్ రాష్ట్రం 2000లో ఏర్పడిన నాటి నుంచి ఈ పదేళ్ళలో ఏడు సార్లు ముఖ్యమంత్రులు మారారని వారంతా ఆదివాసీలేనని అన్నారు. కోట్లాది రూపాయల కుంభకోణాలలో కూరుకుపోయారని అన్నారు. సాధారణ ప్రజలకు పోరాటం తప్ప వేరే దారి మిగలలేదన్నారు. కళాకారులపై ఉరిశిక్షలకు వ్యతిరేకంగా చేస్తున్న ఈ ఉద్యమానికి అందరూ సహకరించాలని అన్నారు.

ప్రొ. ఎస్. శేషయ్య మాట్లాడుతూ ఉరిశిక్షలు రాజ్యాంగం కల్పించిన జీవించే హక్కుకు వ్యతిరేకమన్నారు. సుప్రీంకోర్టు 1983లో ఉరిశిక్ష జీవించే హక్కుకు వ్యతిరేకం కాదని, చాల ప్రత్యేకమైన కేసులలోనే ఉరిశిక్షలు విధించాలని చెప్పింది. దేశవ్యాప్తంగా దాదాపు నాల్గువందల మంది ఉరిశిక్షలు పడ్డవారున్నారన్నారు. కేవలం మానవ హక్కులు, మానవత్వం, నైతికం మాట్లాడితే సరిపోదు. మొత్తంగా న్యాయవ్యవస్థనే నేరం - శిక్ష విషయంలో వివక్ష చూపిస్తోందన్నారు. సుప్రీం కోర్టు రకరకాల వ్యాఖ్యానాలు చేస్తోంది. బూటకపు ఎన్‌కౌంటర్‌లకు పాల్పడినవారిని ఉరిశిక్ష తీయాలంటే మనం ఆనందపడొచ్చు, కాని మనం ఉరిశిక్షలకు వ్యతిరేకం కదా అనే మీమాంస ఎదురౌతుంది. రాజీవ్‌గాంధీ శ్రీలంకకు శాంతిసేనలను పంపి ఎల్.టి.టి.ఇ. ని ఊచకోతలు కోయించగా, వాళ్ళు ప్రతీకారంతో రాజీవ్‌గాంధీని చంపేసారు. ఈ రోజు రాజీవ్‌గాంధీ చావు కారణమైన మానవ బాంబుకు బ్యాటరీ కొని ఇవ్వడంలో పాత్ర ఉందని నిందితునికి ఉరిశిక్ష విధించారు. కాశ్మీర్ టెర్రరిస్టుల పేరిట ఉరిశిక్ష విధించారు. పార్లమెంటుపై దాడి కాదు, అది ప్రజాస్వామ్యంపై దాడి అని ఆ కేసులో కోర్టు ప్రకటించింది. అదే పార్లమెంటు కాశ్మీరీ ప్రజల హక్కుపై ఎటువంటి నిర్ణయాలు చేస్తోందో చూస్తూనే ఉన్నాం. ఎచ్.కె.ఎల్. భగత్, జనార్దన్ పూజారిలు ఇందిరా గాంధీ హత్యదరిమిలా సిక్కుల ఊచకోతకు పాల్పడ్డారు. వాళ్ళకు ఏ శిక్షలూ పడలేదు. నరేంద్ర మోడి, తొగాడియ వంటి వారికి ఈ దేశంలో ఉరిశిక్షలు పడతాయా? అదే దళితులకు, ఆదివాసులకు అయితే ఉరిశిక్షలు పడతాయి. స్త్రీలపై అత్యాచారం జరిగినప్పుడు ఉరిశిక్ష కావాలని సమాజం అడిగేలా ఎవరు తయారు చేస్తున్నారు? ఏ వ్యవస్థలోనైనా వ్యక్తి నేరాలకు కారణం వ్యవస్థ. శిక్షించాల్సింది వ్యవస్థనే గాని వ్యక్తిని మాత్రం కాదు. మధ్య తరగతి, ధనిక వర్గం భయంతో శిక్షలు కఠినంగా ఉండాలని కోరుతున్నాయి. సమస్యకు కారణం రాజకీయ ఆర్థిక విధానాలని మనం అర్థం చేయించాలి. ఆపరేషన్ గ్రీన్ హంట్ గురించి మనం మాట్లాడాలనుకుంటే ప్రభుత్వం మనల్ని జీతన్ మరాండీ గురించి మాట్లాడే పని మీద పెడుతోందన్నారు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఎ.పి.సి.ఎల్.సి) మొత్తంగా ఉరిశిక్షలకు వ్యతిరేకంగా చేసే పోరాటంలో తన వంతు పాత్ర పోషిస్తుందన్నారు.

రిటైర్డు ఐ.ఎ.ఎస్ అధికారి బి.డి. శర్మ మాట్లాడుతూ ఈ రోజు ఈ స్థితికి ఎలా వచ్చామో ఆలోచించాలన్నారు. ఈ రాజ్యం

ఇక్కడి బలంతో ఏర్పడలేదన్నారు. జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాలు పాలకులు తమ దోపిడీని వేగవంతం చేసే క్రమంలో ఏర్పడ్డాయన్నారు. అసలు గ్రీన్ హంట్ అంటే ఏమిటి? 1886లో అమెరికాలో రూజ్‌వెల్ట్ 'గ్రీన్ హంట్' పదాన్ని వాడాడు. అమెరికాలోని రెడ్ ఇండియన్స్ (అక్కడి ఆదివాసులు) ను చంపడానికి ఈ పదాన్ని వాడాడు. పది మందిలో తొమ్మిది మంది విషయంలో ఇది సరియైందని రూజ్‌వెల్ట్ అన్నాడు. ఆదివాసులను వేటాడ్డం, చంపడం గ్రీన్‌హంట్ ఉద్దేశం అన్నారు. బ్రిటిష్ వాళ్ళు ఈ దేశంలోని ఆదివాసులపై ఒక్క దగ్గర కూడా విజయం సాధించలేక పోయారన్నారు. ఆదివాసులు చాల గట్టిగా ప్రతిఘటించారన్నారు. హిట్లర్ కూడ రెండవ ప్రపంచ యుద్ధంలో పశ్చిమం వైపు వెళ్ళినప్పుడు అక్కడ గ్రామాలలో యుద్ధాలను ఎదుర్కోలేక ఓడిపోవడమే అతని ఓటమి వెనుక అసలు కారణం అన్నారు. భూమి ఎవరిది? అడవులు ఎవరివి? అని ప్రశ్నలు వేసుకుంటే అవి దేవుడిచ్చినవని వాటిపై మనుషులకు అధికారం లేదనే ధోరణి కొనసాగుతోంది. స్వాతంత్ర్యం కన్నా ముందు ఆదివాసులు తమ స్వంత సార్వభౌమత్వం కల్గి ఉండేవారు. స్వాతంత్ర్యం తరువాత గవర్నర్ ఆజ్ఞకు అధీనమయ్యే పరిస్థితి వచ్చింది. 'అన్నలు వచ్చాక మా పరిస్థితి బాగుందని, పోలీస్, పట్వారీలనుంచి మాకు విముక్తి దొరికిందని' ఒక ఇంటర్వ్యూలో ఆదివాసులు పేర్కొన్నారన్నారు. 1949లో రాజ్యాంగం అమలులోకి వచ్చాక దేశానికి ఏమి వెలుగులు వచ్చాయో కాని, ఆదివాసుల జీవితాలలో కాళరాత్రులు ప్రారంభమైంది అప్పటి నుంచే అని ఆయన అన్నారు. ఆదివాసులు నిత్య జీవితంలో ఆచరించే అనేక విషయాలు, సంస్కృతి (ఇప్ప సార తాగడం, జంతుబలులివ్వడం) మన రాజ్యాంగ దృష్టి కోణం నుంచి చూసినట్లైతే వారంతా దోషులౌతారని అన్నారు. ఆ క్రమంలోనే జీతన్ మరాండీ, అతని మిత్రులు ఈ రాజ్యం దృష్టిలో దోషులయ్యారన్నారు. జల్, జంగల్, జమీన్ ప్రజలవన్నారు. ప్రభుత్వం ముందా? మన గ్రామం ముందా? ఈ ప్రభుత్వం పోయినా గానీ మన గ్రామం ఉంటుందా? ఉండదా? అని ప్రశ్నించుకున్నప్పుడు గ్రామం ఉంటుంది. ఈ దేశానికి 'స్వాతంత్ర్యం' వచ్చాక, ఆదివాసులకు స్వాతంత్ర్యం పోయిందన్నారు. సమతా జడ్జిమెంట్‌లో ఆదివాసీల భూమి ఆదివాసులదే అని చెప్పి ఉంది. ఈ సంపదలన్నీ మావని ఈ రోజు ప్రజలంటున్నారు. ఈ జల్, జంగల్, జమీన్‌లు మా గ్రామానికి చెందుతాయి, ఇవి రాజ్యానివి కావని మనం ప్రకటించాలని అన్నారు. 'కాగజ్ తుమ్హారా - జమీన్ హమారా' అని మనమంతా ముక్తకంఠంతో ప్రకటించాలన్నారు. ఆదివాసులనుంచి అన్నీ దోచుకుని వాళ్ళనే పేదవాళ్ళని అంటున్నారు. ఆదివాసీకి భూమి, చెట్లు, నీళ్ళు ఉండేవి. అవన్నీ లాక్కొని ఆదివాసులను పేదలంటున్నారన్నారు. జీతన్, అతని సహచరుల ఉరిశిక్షలకు వ్యతిరేకంగా పోరాడుదామన్నారు.

బొజ్జా తారకం మాట్లాడుతూ ఉరిశిక్షలను 1864 ఏప్రిల్‌లో బ్రిటిష్ వాళ్ళు పెట్టారన్నారు. పాటకు, మాటకు రాజ్యాన్ని కూల్చే శక్తి ఉందని రాజ్యానికి తెల్సు. ఐదుగురు భారతీయులు కల్సి కూర్చోవడం బ్రిటిష్ వాడు నేరం అన్నాడు. అదే ఈ రోజుకు కొనసాగుతోందన్నారు. బ్రిటిష్ కాలం నాటికి ఇవాల్టి రాజ్యానికి తేడాలేదన్నారు. భారతదేశంలోని ప్రజలందరు నిజమైన ప్రజాసంఘాలు, కంఠాలు, గళాలు అందరం ఒక్కతాటిపైకి వచ్చి పోరాడుదామన్నారు. అడవిలో ఆదివాసులు అడవిని కాపాడుతున్నారు, అడవిలో సంపదలను కాపాడుతున్నారు. వాళ్ళందరిని రక్షించుకోవాల్సిన బాధ్యత మన మీద ఉంది. వారి ఆట, పాట, మాటలకు బాసటగా మనమంతా నిల్చుందాం. అలాంటి పోరాటం చేద్దాం అని అన్నారు.

ఆర్. నారాయణమూర్తి మాట్లాడుతూ మనమంతా పెద్ద ఎత్తున కదిలి జీతన్ మరాండీ, అనీల్‌రాం, ఛత్రపతి మండల్, మనోజ్ రాజ్వర్‌లను కాపాడుకోవడానికి జార్ఖండ్‌కు తరలి వెళదాం అని అన్నారు. వారిని ఉరిశిక్ష నుంచి రక్షించుకోవడానికి ప్రధాన మంత్రి దగ్గరికి, రాష్ట్రపతి దగ్గరికి, ఎక్కడికి అవసరమైతే అక్కడికి వెళదామన్నారు. తన వంతుగా ఈ పోరాటానికి అన్ని రకాల సహాయం అందిస్తానన్నారు. ప్రజాకళాకారులను ఇటువంటి శిక్షలనుంచి మనమే కాపాడుకోవాలన్నారు.

ప్రజాకళామండలి నుంచి జాన్ మాట్లాడుతూ ఈ ఉరిశిక్షలకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని దేశం నలుమూలల విస్తరింప చేద్దాం అని అన్నారు. దేశ సరిహద్దుల్లో ఉండాల్సిన సైన్యాలు ఆదివాసీ గూడాల్లో, తెలంగాణ పుర వీథుల్లో కవాతు చేస్తున్నాయన్నారు. జీతన్ మరాండీ, అతని సహచరులు మా పాటను వదలం, మా మాటను వదలం అని చెప్పారు. వారికి బాసటగా మనమంతా నిలుద్దాం. పీడిత ప్రజలంతా ఒక తాటిపైకి రానియ్యకుండా ఈ రాజ్యం అన్ని విధాల ప్రయత్నిస్తోంది, మనమంతా ఒక్కటై ఈ ఉరిశిక్షలకు వ్యతిరేకంగా ఉద్యమిద్దామన్నారు.

శివారెడ్డి మాట్లాడుతూ బినాయక్‌సేన్‌కు బేయిల్ రావడం ఎంత కష్టమైందో మనకు తెల్సు. నేరం చేసినప్పుడు శిక్ష పడద్దా అని ఒక మిత్రుడు అడిగాడు. ఈ అభిప్రాయం జనంలో ఎలా అభివృద్ధి అయిందో మనమంతా ఆలోచించాలి. అవసరాలు సృష్టించేది, తీరే మార్గాలు సృష్టించేది అంతా పెట్టుబడే. అన్నా ఉద్యమం ముఖ్యమంత్రి, ప్రధానమంత్రులనే కాదు కార్పోరేట్‌లనూ ఈ బిల్లు కింద తేవడానికి ఉద్యమిస్తుందా అని అడిగారు. భవిష్యత్తులో జరిగే యుద్ధాలు దేశాల మధ్య కాదని, కార్పోరేట్‌ల మధ్య జరుగుతాయని అన్నారు. దీనికి వ్యతిరేకంగా అభిప్రాయ సేకరణ, నిర్మాణం చేయాలని అన్నారు.

ఎం. రత్నమాల మాట్లాడుతూ ఎ.పి.సి.ఎల్.సి. తన ప్రణాళికలోనే ఉరిశిక్షల రద్దు కోసం రాసుకుందని గుర్తు చేస్తూ, రాజ్యానికి ఒక వ్యూహం ఉంటే మనకు పది వ్యూహాలు ఉండాలన్నారు. వరవరరావు మాట్లాడుతూ ఇవాళ ఉరిశిక్షలన్నీ రాజకీయ విశ్వాసాలకు సంబంధించినవని, తమిళులు, ఝార్ఖండ్ దళిత ఆదివాసీలు, కాశ్మీరులు, వివిధ జాతి పోరాటాలు చేస్తున్నవారి పట్ల రాజ్యం ఉరిశిక్షలు సమాధానంగా ఎంచుకుందన్నారు. రాజకీయ ప్రత్యర్థులను అన్యాయంగా ఉరితీసిన ఉదంతాలను మనం చరిత్రలో ఎన్నో చూసామన్నారు. ఎమర్జెన్సీ రోజుల్లో భూమయ్య, కిష్టాగౌడ్‌లను మనం ఉరిశిక్షల నుంచి కాపాడుకోలేక పోయామన్నారు. ఇన్నాళ్ళైనా, మనం విడిపించు కోలేకపోయినా విజయవర్ధనరావు, చలపతిల మరణశిక్షలను రద్దు చేయించగలిగినవి ప్రజాస్వామిక ఉద్యమాలే అని అన్నారు. అదే స్ఫూర్తితో దేశంలోనే మొదటిసారిగా కళాకారులపై విధించిన ఉరిశిక్షలకు వ్యతిరేకంగా ఉద్యమిద్దమన్నారు.



లేఖ

# ఝార్ఖండ్ హరితవనాల నుండి తూర్పు కనుమలకో సాంస్కృతిక లేఖ

- అమృత

ప్రియమైన నీకు,

ఈ ఉత్తరాన్ని నేను నీకు మనసులో ఎప్పట్నుంచో రాస్తూనే ఉన్నాను. ఓ నెల పైనే అయిందనుకో మొదలుపెట్టి. నీ రంగానికి సంబంధించిన (నా హృదయానికి దగ్గరైన) అనేక అంశాల్ని చూసి, అనుభూతి చెందే ఓ అరుదైన అవకాశం దొరికింది. వెళ్లేటప్పుడు కొంత ఇలాంటి అవకాశం ఉంటుందని ఊహించి మీ కోసమే 5 క్యాసెట్లైనా నింపుకుని రావాలనుకున్నా. ఎక్కువే అయ్యాయనుకో.

సరే ఊరించకుండా అసలు విషయంలోకి వస్తాను. కొద్ది రోజులపాటు బీహార్ - ఝార్ఖండ్ సాంస్కృతిక రంగం కామ్రేడ్స్‌తో ఉండే అవకాశం కలిగింది. ఆ రోజుల్లో నాకు వీలైన మేరకు వాళ్ల పాటలూ, డ్యాన్సులూ, వీధినాటకాలూ చూడ్డానికీ, రికార్డు చేయడానికీ ప్రయత్నించాను. అనుకోకుండా (అంటే మా ప్లానులో లేకుండె) ఝార్ఖండ్ సాంస్కృతిక సంఘం బాధ్యులు ఒకరు కూడా కలిశారు. ఆయనతో ఓ పూట భేటీ అయింది.

ఓ వరుసలో మొదలుపెడ్తాను. ఇప్పుడు నేను రాయబోయేది ఝార్ఖండ్‌లో జరుగుతున్న సాంస్కృతిక కృషి గురించి. ఇక్కడి సాంస్కృతిక సంఘం పేరు ఝార్ఖండ్ అభేన్. దీని ఏర్పాటు గురించి ముందుగా -

ఝార్ఖండ్ అనే రాష్ట్రం 2000లో ఏర్పాటైనప్పటికీ 'ఝార్ఖండ్' అనే జాతిపరమైన భావనకి 1915లోనే అంకురార్పణ జరిగింది. 1935లో జరిగిన ఒక ఆదివాసీ మహాసభలో 'ఝార్ఖండ్' అనే పదం వెలుగులోకి వచ్చింది. అయితే అప్పటినుండీ ఇటీవలి ఝార్ఖండ్ ముక్తి మంచ్ (శిబు సోరెన్‌ది) వరకు అందరు నాయకులూ ఎన్నికల దారే పట్టారు. ప్రజలకి ఈ నాయకుల మీద నమ్మకాలు పూర్తిగా పోయాయి. నిజానికి ఝార్ఖండ్ రాష్ట్రం కోసం చేపట్టిన ఉద్యమం పక్కదారి పట్టాక, ఉద్యమం ఉధృతి అంతా తగ్గిపోయాక రాష్ట్రాన్ని ఏర్పర్చారు. చిన్న రాష్ట్రాలను చేసి వాటిని సులభంగా అణచివేయవచ్చు అనే బిజెపి కుట్రలో భాగంగా కూడా ఇది ఏర్పాటైంది.

నాయకులు విద్రోహం చేసినా ఝార్ఖండ్ ప్రజల్లో జాతి భావనలు మాత్రం సమసిపోలేదు. తమ భూమి, అడవి, నీరు, పంటలపై తమకు హక్కు ఉన్నట్లే తమ భాష, సంస్కృతుల పైనా తమకే హక్కు ఉండాలని వారి ఆకాంక్ష. ప్రజల ఈ ఆకాంక్షల్ని దృష్టిలో ఉంచుకునే '95లో జాతి ఆకాంక్షల డిమాండ్ల కోసం ఒక సంఘాన్ని ఏర్పర్చారు. దానికంటే చాలాముందే అంటే 1985 నాటికే ఝార్ఖండ్ సాంస్కృతిక బృందాన్ని ప్రత్యేకంగా ఏర్పర్చారు.

మొదట్లో బీహార్ మొత్తానికి క్రాంతికారీ సాంస్కృతిక సంఘం (కె.ఎస్.ఎస్.) ఉన్నది. ఝార్ఖండ్ ప్రజల సంస్కృతిని అభివృద్ధి పర్చాలంటే దీని శాఖగా ఝార్ఖండ్ పేరుగల సంఘాన్ని పెట్టాలనుకున్నారు. ఇది కె.ఎస్.ఎస్. ప్రణాళికనే కలిగి ఉన్నది అప్పటినుండి. (ఈ మధ్యనే దీన్ని విడిగా చేసి వేరే ప్రణాళిక రాయాలనుకుని ఆ కృషి మొదలు పెట్టారు). బీహార్‌లోని సింద్రీలో 1985లో జరిగిన రెండవ అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమాఖ్య మహాసభల సందర్భంగా వీరు విల్లు అంబులతో, లాఠీలతో ఝార్ఖండ్ సంప్రదాయ నృత్య ప్రదర్శన ఇవ్వగా అందరూ ఎంతగానో చకితులయ్యారు. అక్కడే ముగ్గురితో ఒక కమిటీని ఏర్పరచి 'ఝార్ఖండ్ అభేన్' అనే పేరు పెట్టారు. అదే సాంస్కృతిక బృందంగా పని చేయసాగింది. అంటే మహాసభల ద్వారా ఏర్పాటు కాలేదన్నమాట. పని చేస్తూ క్రమంగా తన బలాన్ని పెంచుకుని 1990లో మహాసభలు జరుపుకుంది.

**నిర్మాణాలు:**

మొదట్లో బాగానే బాల్యారిష్టాలు ఎదుర్కొన్నారు సంస్థని నిలబెట్టడానికి. ఏటికి ఎదురీదుతూనే, కష్టపడి అన్నీ నేర్చుకుంటూనే వాళ్ళ సంస్థను ఇవ్వటి స్థితికి చేర్చిన తీరు నిజంగా ఉత్తేజపూరితమైనది. ఝార్ఖండ్ అభేన్ సభ్యులందరూ - నాయకత్వం సహా ఆదివాసులే. ఆదివాసేతరులు కొద్దిగా ఉంటారేమో గానీ వాళ్ల సంఖ్య చాలా తక్కువ అనుకోవచ్చు.

'85 నుంది '90 వరకు వాళ్లు ప్రధానంగా 3 జిల్లాల్లో పని చేశారు - ఇప్పటి ఝార్ఖండ్‌లోని గిరిడీ, హజారీబాగ్, ధన్‌బాద్ జిల్లాల్లో. 1990లో ఈ 3 జిల్లాలకీ కలిపి మహాసభలు జరిపి ఒక కమిటీని ఎన్నుకున్నారు. గిరిడి జిల్లాలోని ఇస్రీ బజార్ అనే ఊర్లో ఇది జరిగింది. కా. సుందర్ దీనికి కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఐదుగురితో కమిటీని ఎన్నుకున్నారు. అయితే అందరూ సంస్థలోకి వచ్చి చదువు నేర్చుకోవడం మొదలుపెట్టినవారే. వారికి రాజకీయ పరిస్థితిని అర్థం చేసుకోవడం, విశ్లేషించడం, దానికనుగుణంగా పాటలు రాయడం ఇదంతా ఎంతో కష్టంగా తోచింది. దాంతో కొందరు వేరే రంగంలో పని చేస్తామని వెళ్ళిపోగా, మరి కొందరు మాకు 'సాంస్కృతిక ప్రతిభ' (కల్చరల్ టాలెంట్స్') తక్కువున్నాయని చెప్పుకుని వెళ్ళిపోయారు. అందుకని ఈ కమిటీ ఎక్కువ కాలం పని చేయకుండానే విచ్ఛిన్నమైపోయింది. కార్యదర్శి ఒకరే మిగిలారు.

కొంతమంది చదువుకున్న వాళ్లు ఉండాలి, లేకపోతే నడిచేటట్లు లేదు - పాటలు రాయాలన్నా, పత్రిక నడపాలన్నా, రాజకీయాలు చెప్పాలన్నా - దేనికైనా చదువు అవసరం అని భావించారు. కానీ చదువుకున్నవారు ఎక్కువ లేరు. అయినా

పట్టుదలగా సంస్థను అభివృద్ధి పర్చాలని 91-92 లో ఒక తాత్కాలిక కమిటీని ఏర్పర్చారు. ఇందులో కొందరు చదువుకున్న వాళ్లు ఉన్నారు. ఐదుగురి కమిటీలో ఒకతను స్కూలు పిలగాడే. ఈ కమిటీ నిలదొక్కుకుని పని చేయడంతో సంస్థ త్వరగానే అభివృద్ధి చెందింది. తర్వాత 'ఉత్తర ఛోటానాగ్‌పూర్' ప్రాంతంలోని 5 జిల్లాలను కలిపి ఒక ప్రమండల్ కమిటీని ఏర్పర్చారు. ఇప్పుడు మహాసభలు జరిపి ఈ కమిటీ ఎన్నికని ధృవీకరించాలనే ఆలోచనలో ఉన్నారు.

'91 నాటి కమిటీ సభ్యుల్లో '95 లో ఒకతను (స్కూలు విద్యార్థి ఇతనే) ఝార్ఖండ్ జాతి ఆకాంక్షల సంస్థ బాధ్యుడిగా వెళ్లగా, ఒకతను ఇనాక్టివ్ అయ్యాడు. మిగతావాళ్లు కొనసాగుతున్నారు.

'96లో జిల్లా కాన్ఫరెన్స్‌లు నిర్వహించి హజారీబాగ్ జిల్లా కార్యవర్గాన్ని 15 మందితో, జిల్లా బాడీని ఐదుగురితో, బొకారో జిల్లా కార్యవర్గాన్ని 11 మందితో, జిల్లా బాడీని ఐదుగురితో ఏర్పర్చారు. ఇతన జిల్లాల బాధ్యుల్నీ, ఈ జిల్లా కమిటీల బాధ్యుల్నీ కలిపే ప్రమండల్ కమిటీని ఏడుగురితో ఏర్పర్చి నడిపిస్తున్నారు. గిరిడిలో కాన్ఫరెన్స్ జరగలేదు గానీ నలుగురితో జిల్లా కమిటీ నడుస్తోంది.

ప్రస్తుతం అక్కడ పూర్తికాలం కార్యకర్తలతో నడిచే 5 సాంస్కృతిక బృందాలు ఉన్నాయి. 1. తూర్పు హజారీబాగ్ బృందం 2. పశ్చిమ హజారీబాగ్ బృందం (వీళ్లు రాంచీ జిల్లా వరకు వెళ్తారు) 3. గిరిడీ-ధన్‌బాద్ బృందం 4. బొకారో బృందం 5. తూర్పు కొడరమా-పశ్చిమ గిరిడీ బృందం.

ఒక్కో బృందంలో 20నుండి 25 మంది వరకు సభ్యులుంటారు. అయితే ఎప్పటికీ కొందరు వచ్చి చేరి కొన్నాళ్లు ఉండి మళ్లీ ఇండ్లకు వెళ్తుంటారు. వీరితో కలిపితే 30 నుండి 50 వరకూ కూడా అవుతుంటారు.

గ్రామ స్థాయి కమిటీలు లేవు గానీ గ్రామాల్లో యూనిట్స్‌లాగ ఉన్నాయి - నలుగురు, ఐదుగురు ఉంటూ ఉంటారు. వీరు కాక ఒక్కో గ్రామంలో విడి సభ్యులుంటారు. ఒక్కో జిల్లాలో 20 మంది వరకూ ఉంటారు ఈ సభ్యులు. పెద్ద ప్రోగ్రాం ఇవ్వాలనుకుంటే 500 మంది దాకా సభ్యుల్ని వీరు తీసుకురాగలరు. పెద్ద మీటింగులకు ప్రచారం చేసేటప్పుడు ఒక్కో టీంలో 50, 60 మంది నుండి 100 మంది దాకా కూడా ఉండి చేస్తారు.

జిల్లా కమిటీలు ఆ జిల్లాకే పరిమితమై లేవు అని అర్థమై ఉంటుంది కదా! స్థాయి జిల్లా కమిటీనే గానీ ఒకదాని పరిధి 2 జిల్లాలు కలిపి ఉంది. అంటే బొకారో జిల్లా కమిటీలో గిరిడీవాళ్లూ ఉన్నారు. హజారీబాగ్‌నేమో 2 భాగాలుగా విడగొట్టారు. మళ్లీ గిరిడీ కమిటీ విడిగా ఉన్నది.

**పనివిధానం:**

ప్రమండల్ కమిటీ 4 నెలలకోసారి సమావేశమౌతుంది. జిల్లాకమిటీ 2 నెలలకు ఒకసారి. ప్రమండల్ కమిటీ సభ్యులే ఒక్కో టీంకు బాధ్యులుగా ఉండి వాటిని నడిపిస్తూ ఉంటారు. టీం సమావేశాలూ ఉంటాయి. మొదట్లో ప్రతీ ప్రోగ్రాం తర్వాత సమావేశమై సమీక్ష జరిపి, భవిష్యత్ కార్యక్రమం అనుకునేవాళ్లు. ఆ తర్వాత కార్యక్రమాలు బాగా పెరిగిపోయాయి కనుక 4,5 ప్రోగ్రాంలు ఇచ్చాక, 3 నెలలకోసారి సమావేశమౌతున్నారు. పెద్ద ప్రోగ్రాములప్పుడు 50 నుండి 100 దాకా ఉంటారు కనుక ప్రతిరోజూ సాయంత్రం ఒక గంట మీటింగ్ జరుపుతారు.

ఏ ప్రజాసంఘం కార్యక్రమం ఉన్నా ఝార్ఖండ్ అభేన్ అక్కడ తప్పక ఉండాల్సిందే. ముందు ప్రచారానికి గానీ, సభలో ప్రదర్శన ఇవ్వడానికి గానీ, ఇతర రాష్ట్రాల్లో ప్రోగ్రాంలకూ వెళ్తూ ఉంటారు. ఇందుకోసం అన్ని బృందాలనుండీ ఎంపిక చేసినవారితో సెంట్రల్ టీం వెళ్తూంటుంది. చాలా సమయం వీటితోనే అయిపోతుంది. ఈ కార్యక్రమాలు లేనప్పుడు ఈ బృందాలు పూర్తిగా ప్రజల్లోనే ఉంటాయి. గ్రామం నుండి గ్రామానికి వెళ్తూ ప్రదర్శనలు

వే నెలలో పూర్ణిమకి సంథాలీ ఆదివాసులు సంప్రదాయపరంగా ఒక పండుగ జరుపుకుంటారు. అన్నిటికంటే పెద్ద పండుగ ఇదే వాళ్లకు. గిరిడి జిల్లాలో పరస్‌నాథ్ అని ఒక కొండ, ఆ కొండ మీద దేవుడూ ఉన్నారట. దాన్ని సంథాలీలు 'మారంగ్‌బురు' అంటారు. అక్కడకి అందరూ చేరుకుంటారు. విల్లు, బాణాలు, అన్ని రకాల వాయిద్యాలు, పెద్ద, పెద్ద ఆకు దొనెల్లో తాము వండిన పదార్థాల్ని తీసుకుని ముందు రోజు రాత్రే చేరుకుంటారు. అప్పుడక్కడ వాతావరణం ఆదిమ కమ్యూన్‌ని పోలి ఉంటుంది. వేల ఆకుల్ని వరుసగా పరిచి అందరు తెచ్చినవీ అందరూ పంచుకుని తింటారు. ఎంత కొంచెమైనా అందరూ అందరివీ పంచుకుంటారు. సంథాలీలో ఒక సామెత ఉంది - 'కష్టమైన పరిస్థితుల్ని అధిగమించాలి - వేటలో ఎవరైనా మరణించవచ్చు' అని. అంటే ఆ రోజు వేట చేస్తారు కనుక ఎవరికైనా ఏమైనా కావచ్చు కనుక పంచుకుని తింటారన్నమాట. గతంలో కొందరు ఇలా వేట చేస్తూ జంతువుల దాడిలో చనిపోయారు కూడా. తినేశాక ఇక వాయిద్యాలు బైటకి తీసి పూర్తి స్థాయిలో వాయించడం మొదలుపెడ్తారు. మంచి గురికాళ్లు ముందే వెళ్లి ఆంబుష్‌లో కూచుంటారు. జంతువులు వాయిద్యాల ఘోషకి భయపడి పరిగెత్తుకెళ్లి ఆంబుష్‌లో చిక్కుకుంటాయి. ఏదైనా జంతువుని మొదటగా బాణంతో కొట్టిన వ్యక్తి ఆ ఊరు పేరు చెప్పి 'హరి' అంటాడు. దాంతో అతను, అతని ఊరు ఆనాటి విజేతలన్నమాట. ఆ తర్వాత ఎంతమంది కొట్టినా, ఎన్నిటిని కొట్టినా విజయం ఇతని ఊరిదే, కొద్దిగా ఎక్కువ భాగం వస్తుంది ఇతనికి. కొట్టిన జంతువు ఎంత పెద్దదైనా, ఎంత చిన్నదైనా కొట్టినదాన్ని అందరూ సామూహికంగా వండుకుని తింటారు. తక్కువ జంతువులు వేట అయితే ఎంత చిన్న ముక్కగానీ ప్రతి ఒక్కళ్లకీ అందేలా పంచుతారు. ఏ ఒక్కరికీ మాంసం అందకుండా పోవద్దు అన్నది నియమం. మళ్లీ వేలాదిగా ఆకులు పరచి అందరూ తింటారు. కమ్యూన్ జీవితానికి సంబంధించిన ఇలాంటి అంశాలు మనకు సంథాలీ ఆదివాసీ జీవితంలో ఎన్నో కనిపిస్తాయి.

ఇస్తుంటారు. మొత్తం ప్రజలపైనే అన్నిటికీ ఆధారపడ్డారు. ప్రజలు వీరిని ప్రేమతో ఆహ్వానిస్తారు - ఎంతమంది వచ్చినా ఆదరిస్తారు. ప్రజా సాంస్కృతిక బృందాలన్నిటివలెనే ఇవి కూడా ప్రజల హృదయాల్లో సుస్థిర స్థానాన్ని ఏర్పరుచుకున్నాయి.

గ్రామాల్లోకి వెళ్లినప్పుడు ముందుగా ప్రజల ఆట, పాటలు, వివిధ వాయిద్యాలూ అన్నీ అధ్యయనం చేస్తారు (మురళి, నగారా, డోలు, ఢంకా వగైరా). అన్ని జానపద పాటల్లోవలెనే వాటిలో మంచి అర్థం ఉన్నవీ (ఉత్పత్తితో సంబంధం ఉన్నవి), అంధవిశ్వాసాలూ, అశ్లీలంతో కూడినవీ అన్నీ ఉంటాయి. వాటిని విశ్లేషిస్తూ వీళ్లు వాటిలోని మంచి-చెడూ చెప్తూ తమ విప్లవ ఆటపాటల్ని ప్రదర్శిస్తారు. దీంతో ప్రజలపై మంచి ప్రభావం పడ్డమే కాక వారిలో కొత్త ఆలోచనలు రేకెత్తే అవకాశం ఉంటుంది. కొన్ని చారిత్రక రోజుల్ని తప్పక పాటిస్తూ ప్రదర్శనలు ఇస్తారు. ఆ రోజుల్ని తప్పక పాటించే ప్రజాసంఘాలతో కలిసి కూడా చేస్తారు (ఉదా. మార్చి 8ని మహిళా సంఘమైన 'నారీ ముక్తి సంఘం'తో కలిసి పెద్ద ఎత్తున చేస్తారు). రష్యా విప్లవదినం అక్టోబర్ ఒకటి, సిద్ధూ-కానూ హూల్ దివస్ (తిరుగుబాటు దినం - 19వ శతాబ్దంలో ఈ ఇద్దరు సోదరుల నాయకత్వాన సంథాల్ ప్రజలు చేసిన తిరుగుబాటును గుర్తు చేస్తూ), బీర్సా ముండా జయంతి, మేడే, 23 మార్చి అమరుల స్మృతిదినం వంటి కొన్నింటిని తప్పక పాటిస్తారు. మావో జన్మదిన శతాబ్ది సందర్భాన్నీ పాటించారు.

### ఝార్ఖండ్ అభేన్ ప్రత్యేకత : బాలసభ్యులు

ఝార్ఖండ్ అభేన్ సభ్యత్వంలో చెప్పుకోదగిన అంశం - పిల్లల సంఖ్య. బాధ్యులైన కొందర్ని వదిలేస్తే ఈ 5 బృందాల్లోని మెజారిటీ సభ్యులు ఆడ, మగ పిల్లలే. 8 ఏళ్ల వయసు పిల్లలనుండి ఈ బృందాల్లో ఉన్నారు. తాత్కాలికంగా వచ్చి పోయే వారిలోనూ మెజారిటీ పిల్లలే. ఆ బృందాలు గ్రామాల్లో ప్రదర్శనలిస్తూ తిరిగేటప్పుడు అందరికంటే తొందరగా, ఎక్కువగా వీరిపట్ల ఆకర్షితులయ్యేది పిల్లలే (సహజమే కదా). వీళ్లు వాళ్లని చేరదీసి అనేక విషయాలు చెప్పి ఉత్తేజితుల్ని చేస్తారు. నిజానికి ఆదివాసీ ప్రాంతాల్లోని బాలబాలికలకు ఇంటి వద్ద పెద్ద భవిష్యత్ ఏముందని - దారిద్ర్యం, అవిద్య, అజ్ఞానం. టీంలోకి రావడం ద్వారా వాళ్లు 'పోగొట్టుకునేదేం' లేదు గానీ పొందేది చాలా ఉన్నది - ముఖ్యంగా జ్ఞానం, సమిష్టి జీవనం, అందరి ప్రేమాభిమానాలు, అన్నిటికంటే ఉత్తేజకరంగా సృజనాత్మకతను వెలికి తీసే అవకాశం.

మొదట్లో ఝార్ఖండ్ అభేన్‌లో చేరాలనుకునే పిల్లలు ఇంటి నుండి పారిపోయి వచ్చేవారు. ఇప్పుడు తల్లిదండ్రులే వీళ్లని సంస్థకు అప్పగించి - 'మా అబ్బాయికి/అమ్మాయికి అన్నీ మంచిగా నేర్పండి' అని చెప్పి పంపిస్తారు. చిన్నతనంలోనే వచ్చి ఇప్పుడు నాయకత్వంలోకి వచ్చినవారూ ఉన్నారు - '96లో జిల్లా కమిటీల్ని నిర్మించింది వీరితోనే. వీరి తర్వాతి తరం ఇప్పుడు నాయకత్వాన్ని అందిపుచ్చుకోడానికి తయారుగా ఉంది (వీరి వయసూ 14-16 మధ్యనే సుమా). పిల్లలు ఝార్ఖండ్ అభేన్‌లో ఉంటే గ్రామాల్లో ఆ కుటుంబాలకు ప్రజల్లో గౌరవం కూడా పెరుగుతుంది.

ఇంతమంది పిల్లలతో తిరిగేటప్పుడు మీకు ఏం సమస్యలు ఎదురుకావడం లేదా అని అడిగితే - దాదాపుగా ఏం రావడం లేదు అన్నారు. కారణాలు ఏంటంటే వీళ్లకి రోజంతా టైం టేబుల్ ఉంటుంది. ప్రాక్టీస్, చదువు, ఆటలు, ప్రదర్శనలు - ఇలా ఎప్పుడు ఏం చేయాలో అంతా క్రమశిక్షణగా నడుస్తుంది కనుక వేరేవి ఏం ఆలోచించి తగువులు పెట్టుకోడానికి ఉండదు. అయినా పిల్లలు కనుక ఏమైనా సమస్యలు వస్తే కూచోబెట్టి పరిష్కరిస్తారు. ఎవరూ గారాబంతో చెడిపోయినవాళ్లు కాదు, జీవితంలో కష్టనష్టాలు అనుభవించి వచ్చినవాళ్లే కనుక అంత సమస్యలు సృష్టించేవాళ్లూ ఉండరు. రాజకీయాలు అందుతూనే ఉంటాయి ఎలాగూ.

ఆకలికీ, నిద్రకీ కొంత సమస్యనే ఉంటుంది. గ్రామాల్లో వసూలు చేసిన చందాలతో బిస్కెట్లలాంటివి ఎప్పుడైనా కొని పెడతారు అన్నం ఆలస్యం అయినప్పుడు. ఒకోసారి చాలా అన్నం అన్ని ఇండ్లనుంచీ వస్తుంది కనుక సాయంత్రం మిగిలిన అన్నాన్ని మళ్లీ తినేస్తారు. దాంతో ప్రదర్శన ఇచ్చి తినేవరకూ అర్ధరాత్రి దాటినా ఆకలికి ఆగుతారు. నిద్ర విషయంలోనూ క్రమేపీ అలవాటుపడ్డారు. అసలు సాంస్కృతిక ప్రదర్శనలు ఇవ్వడంలో వాళ్లు ఎంతగా మమేకం అయిపోతారంటే నగరాల్లో పెద్ద ప్రదర్శనలు ఇచ్చేటప్పుడు ఆకలినీ, అలసటనూ పూర్తిగా పక్కనపెట్టేస్తారట ఈ పిల్లలు! బాధ్యులు ఆపమన్నా బతిమాలుకుని మరీ సాధన చేస్తారట! 'అయినా ఆదివాసీ సమాజంలో ఆకలి తెలీకుండా పెరిగే పిల్లలు ఎవరు చెప్పండి' అని ఆయన అన్నప్పుడు నిజంగా కదిలిపోయాను.

నేను కూడా ఆ పిల్లల్ని చూశాను కదా - ఆయన చెప్పినదాంట్లో ఏం అతిశయోక్తి లేదు. అంత చిన్నవయసులోనూ ఎంతో పట్టుదలతో వెలిగిపోతున్నాయి వాళ్ల కళ్లు! వీళ్లందరికీ చదువు సంస్థలోకి వచ్చాకే. కానీ ఎన్ని పాటలు, ఎన్నెన్ని భాషల్లో కంఠతా పట్టేస్తారో! ఏ భాషలోని పాటనైనా గంట గంటన్నరలో నేర్చేసుకుంటారట. హిందీ, సంథాలీ, ముండారీ, ఖోర్టా, నాగ్‌పురీ, భోజ్‌పురీ వంటి బీహార్ ఝార్ఖండ్ భాషల్లోనే కాక బెంగాలీ, నేపాలీ భాషల్లోనూ మాతృభాషలో పాడినట్లు పాడేస్తుంటారు. హిందీ కూడా మాతృభాష కాదు కనుక వాళ్లు నేర్చుకోవల్సిందే! ఆంధ్రప్రదేశ్‌కొచ్చినప్పుడు పట్టుకున్న కొన్ని పాటల పదాలు విన్పించారు. ఇవి మొత్తం నేర్చుకోలేదులే - అవసరం ఉందంటే మాత్రం తప్పక నేర్చేసుకుంటారు, సందేహం లేదు.

### విద్య:

చదువు, రాత హిందీలో నేర్చుకుంటారు. అందరూ ఇంగ్లీషు కూడా నేర్చుకుంటూ ఉంటారు. లెక్కలూ, సామాన్య జ్ఞానం, ఇతర స్కూలు సబ్జెక్ట్స్ కూడా చెప్తూ ఉంటారు వీరికి. ఇవి కాక రాజకీయ క్లాసులు ఉంటాయి. రాజకీయ క్లాసుల్లోనూ - అందరికీ చెప్పే రాజకీయ సబ్జెక్ట్స్ కాక వీరికి కళలు సాహిత్యం గురించిన మార్క్సిస్టు మహోపాధ్యాయుల బోధనలు, ఇతర దేశాల అనుభవాలు కూడా చెప్తారు. కామ్రేడ్ మావో యేనాన్ ప్రసంగం తప్పనిసరిగా చెప్తారు, చదివిస్తారు. 'విప్లవంలో కళ, సంస్కృతి పాత్ర గురించి చెప్పడం ద్వారా కేవలం పాటలూ, డ్యాన్సులే చేస్తున్నాం అని వాళ్లు చిన్నబోకుండా చూస్తాం' అన్నారు.

గ్రామాలు తిరిగేటప్పుడు పగలు పి.టి.రూపంలో డ్యాన్స్, మధ్యాహ్నం రిహార్సల్స్ ఉంటాయి. ఇవి కాక 3 నెలలకు, 6 నెలలకు ఒకసారి ఒక్కో బృందానికి విడిగా వర్క్‌షాప్ నిర్వహిస్తారు. క్లాసులు వీటిలో భాగంగానే చెప్తారు. సెంట్రల్ టీంకి విడిగా వర్క్‌షాప్ నడుపుతారు మళ్లీ. ఒక వారంపాటు ఉంటాయి ఇవి.

**నిర్బంధం:**

ఈ సంస్థపై ఇంకా అంతగా నిర్బంధం విరుచుకుపడలేదనే చెప్పాలి. ప్రదర్శనల్ని పెద్దగా ఆటంకపర్చింది తక్కువే. అయితే క్యాంపెయిన్స్ సందర్భంగా అరెస్టులు చేయడం, జైలుకు పంపడం, అక్రమ కేసులు పెట్టడం జరిగాయి, జరుగుతున్నాయి. 2003 మార్చి 8 కోసం క్యాంపెయిన్ చేస్తుండగా కా. జీతన్ మరాండీ అనే నాయకుడిని అరెస్టు చేశారు. ఇంకా విడుదల చేయలేదు. ఇది మూడోసారి ఈయనను అరెస్టు చేయడం. కా. రాంబలినీ మూడుసార్లు అరెస్టు చేశారు. ఈయనను బాగా కొట్టారు. కొట్టినకొద్దీ ఆయన మరింత పాడుతూ పోయారు. చిత్రహింసలవల్ల ఆయనకు ఇప్పుడు పాడ్డం కూడా కష్టమైతున్నది ఒకోసారి. కొడరమా జిల్లాలో ప్రచారం చేస్తున్న టీంపై బడి పోలీసులు లాఠీచార్జి చేసి మొత్తం అన్ని వాయిద్యాలూ విరగ్గొట్టి అందర్నీ చెల్లాచెదురు చేశారు. అందరూ మళ్లీ గ్రామంలో కూడి విరిగిన వాయిద్యాలు తీసుకుని పోలీస్‌స్టేషన్‌ని ముట్టడించి వాళ్లతో క్షమాపణ చెప్పించి అన్నిటికీ డబ్బులు కూడా కక్కించారు. ప్రజలందరినీ కలుపుకుని వెళ్లారు. మార్చి 8కి ప్రచారం చేస్తున్నప్పుడు ఇద్దరు చిన్న అమ్మాయిల్ని కూడా అరెస్టు చేసి మళ్లీ ప్రోగ్రాంలివ్వద్దని బెదిరించారు. అందరూ వెళ్లి విడిపించుకొచ్చుకున్నారు.

ఇక విలేకరులు వార్తాపత్రికల్లో వీళ్ల ప్రోగ్రాంల గురించి ఫోటోలతో సహా ప్రచురిస్తూనే ఉంటారు. కాబట్టి రాష్ట్రంలో వీరి కార్యక్రమాల గురించి ఈ రూపంలో కూడా ప్రచారం అవుతూనే ఉంటుంది.

**ఝార్ఖండ్ అభేన్ ప్రదర్శనల్లో తలమానికం - యుద్ధనృత్యం:**

సంప్రదాయకంగా సంథాలీ ఆదివాసులు విల్లు అంబులతోనూ, లాఠీలతోనూ నృత్యం చేస్తూ ఉంటారు. ఝార్ఖండ్ అభేన్ ఆ బాణీల్ని తీసుకుని, ఆ నృత్యాన్ని తీసుకుని విప్లవీకరించి ప్రదర్శన ఇవ్వసాగింది. ఇదే అత్యంత ప్రజాదరణ పొందిన, ప్రాచుర్యం పొందిన 'యుద్ధ నృత్యం'. నిజానికి ఈ పేరు వీళ్లు పెట్టింది కాదు. '87లో కలకత్తాలో జరిగిన 3వ ఎఐఎల్ఆర్‌సి సభల సందర్భంగా రోడ్లపై విల్లు అంబులతో వీళ్లు ఆ నృత్యాన్ని ప్రదర్శించగా మీడియానే దీనికి 'వార్ డ్యాన్స్' అని పేరు పెట్టింది. అప్పట్నుంచీ వీళ్లూ అదే పేరుతో దీన్ని పిలుస్తున్నారు.

500 మంది దాకా పిల్లా-పెద్దా, ఆడా-మగా అందరూ కలిసి చేసే నృత్యం ఇది. నిజానికి ఎన్ని వందలమందైనా దీన్లో పాల్గొనే సామూహికత గల కళారూపం. ఎక్కడైనా ఆదివాసులు తమ అద్భుతమైన స్వరసమ్మేళనం, లలితమైన కదలికలతో ప్రదర్శించే గొప్ప నృత్యాలు నీకు తెలియనివి కావు. అవి ఇక్కడా పుష్కలంగా ఈ యుద్ధనృత్యంలో, ఆ పాటల్లో మనకు దొరుకుతాయి. ఆ అందాన్ని కళ్లారా చూడాల్సిందే. యుద్ధ నృత్యం కనక 'మిలిటెంట్ కదలికలూ' ఉంటాయనుకో. విల్లు బాణాలతోనే కాక చెక్క తుపాకులతోనూ చేస్తారు దీన్ని. చిన్నప్పుడు ఒక జోక్‌కి బాగా నవ్వుకునేవాళ్లం గుర్తుందా? మరీ నిట్టనిలువుగా నడిచేవాళ్లు ఉంటే ముళ్లపూడి రమణ పుస్తకంలోలాగ 'గజంబద్ద మింగి వచ్చాడేమో' అని. నాకు నిజంగా వీళ్ల లయ, తాళ జ్ఞానం, చిన్న విరుపుతో గొప్ప కళను సృష్టించడం అన్నీ చూస్తుంటే 'చిన్నప్పుడే ఏదో మింగి ఉంటారు' అన్పించేసింది. ఎవ్వరూ తీసిపోరు. ఇంతకీ దీనికి ప్రత్యేకంగా వాయిద్యాల్ని వాయించాలి. చాలామంది అన్ని వాయిద్యాలూ వాయించడం, అంతే నైపుణ్యంగా డ్యాన్స్ చేయడం కనిపించింది - అంతా చిన్న పిల్లలే. ఆ తాళజ్ఞానం ఉంటేనే ఈ డ్యాన్స్ చేయగలుగుతారు కూడా.

ఈ నృత్యానికి కట్టిన పాటల్లో అమరవీరుల దగ్గర్నుంచీ నూతన ప్రజాస్వామిక విప్లవ రాజకీయాల వరకు అనేక అంశాలు ఉన్నాయి. వివిధ బాణీల్లో ఉన్నాయివి. దండకారణ్యంలో 'రేలా' లాగ ఇక్కడ 'త్రహరే తననా' అని ఉంటుంది. ప్రతీ పాటకూ బాణీని ఈ రూపంలో పాడతారు. దీన్ని విని వాద్యగాళ్లు వాయించడం మొదలుపెడ్తారు. కొన్ని బాణీలు అద్భుతం. వాళ్ల గొంతుల్లో ఎంత మాధుర్యం, ఎంత మార్దవం! ఎత్తడం దించడం అంతా ఎక్కడా ఏం ఆటంకాలు లేకుండా, అందరూ ఒకేలా....నృత్యం చేయడానికే వీళ్ల శరీరాలు ఉన్నాయా అన్నట్లు అణువణువునా ఆ లయబద్ధత! ఓహ్ అద్భుతం!

మేం చూసినది ఒక గ్రామంలోని బృందం అప్పటికప్పుడు మా కోసం ఇచ్చిన ప్రదర్శనని. 'సాధన లేదు, హఠాత్తుగా చేశాం, అంత బాగా రాలేదు, ప్రోగ్రాం అప్పుడు ఎంత బాగుంటుందో' అని వాపోయారు! కానీ మనకు అన్నం మెతుకు చాలు కదా అది ఎంత అద్భుతంగా ఉందో అనుభూతి చెందడానికి! పది సంవత్సరాలకు పైగా వీరి ప్రదర్శనల విడియోలు ఉన్నాయట. తెప్పించుకుని చూస్తే సరి మీరు.

**పాటల పుస్తకాలు, క్యాసెట్లు:**

వీళ్లు ఇప్పటివరకు 3 పాటల పుస్తకాలు వేశారు. 'క్రాంతికారీ సిరింగ్ 1,2,3 భాగాలు ('విప్లవ పాటలు' అని అర్థం) మొత్తం 6 క్యాసెట్లు రిలీజ్ చేశారు. వీటిలో ఖోర్‌టా, నాగ్‌పురి, సంథాలీ, హిందీల్లో పాటలు పాడారు. పదివేలకు పైగా క్యాసెట్లు ప్రజల్లోకి విడుదల చేశారు మొత్తంగా.

**పాటలు, వీధినాటికలు, నృత్యాలు:**

అక్కడి మహిళా సంఘమైన నారీముక్తి సంఘంతో (ఎన్ఎంఎస్) కలిసి అనేక మహిళా సమస్యలపై వీళ్లు నాటికలు వేస్తుంటారు. విడిగానూ సామాజిక సమస్యలపై వేస్తుంటారు. వరకట్నం, తాగుడు, డాక్టర్ల అవినీతి - ప్రజావ్యతిరేకత, మంత్రగత్తెలు - మూఢనమ్మకాలు, పోలీసుల దౌర్జన్యాలు - ప్రజా ప్రతిఘటన వంటి అనేక సమస్యలపై వీధినాటికలు వేశారు. ఈ సమస్యలన్నిటి పైనా అనేక పాటలు ఉన్నాయి. ఆడపిల్లల పట్ల ఉండే వివక్షపై పాటలున్నాయి. ఒక పాటలో కూతురే తండ్రిని ప్రశ్నిస్తుంటుంది ఈ విషయంపై.

చైనా విప్లవానికి 50 సంవత్సరాలు నిండిన సందర్భంగా ప్రత్యేకంగా పాట రాసి, దానికి డ్యాన్స్ కంపోజ్ చేసి ప్రచారం చేశారు. నూతన ప్రజాస్వామిక విప్లవం గురించీ, ప్రజాసైన్యం గురించీ అనేక పాటలున్నాయి. ఆగస్టు 15 విద్రోహం, మేడే చరిత్ర వంటివి సరేసరి. సామ్రాజ్యవాదం గురించి పాటలున్నాయి, అలాగే మొన్నటి ఇరాక్ యుద్ధం సందర్భంగా వెంటనే పాట రాసి ప్రచారం చేయడం బాగుంది. (జె.ఎన్.ఎం. దీనిపై స్పందించిందా?)

ఝార్ఖండ్ జాతి ఆకాంక్షలపై పాటలున్నాయని వేరే చెప్పనవసరం లేదుగా. అమరులపై కొన్ని పాటలున్నాయి. అయితే అమరుల సంఖ్య ఆంధ్రప్రదేశ్‌తో పోలిస్తే తక్కువ కనుక ఆ ఉధృతి లేదు. ఇక్కడి పాటల్లోని వెరైటీ, భావాల గాఢత, కవిత్వపరమైన విలువలూ కొంత తక్కువనిపించాయి (అర్థమైనమేరకు). అయితే కొన్ని పాటలకు ఎంచుకున్న అంశాలూ, కొన్ని వ్యక్తీకరణలూ చాలా బాగున్నవీ, ఎ.పి.లో చూడనివీ ఉన్నాయి. తెలుగు బాణీలూ కొన్ని తీసుకుని రాశారు. బెంగాలీ, అస్సామీ బాణీల్లోనూ పాటలున్నాయి.

ఈ పాటల్లోనే కొన్నిటికి నృత్యరూపం ఇచ్చి ప్రదర్శిస్తుంటారు. బెంగాలీ, నేపాలీ పాటలకూ నృత్యాలున్నాయి. అయితే స్టెప్స్‌లో వెరైటీ, వేగం తక్కువ. ఈ విషయంలో వారు సాధించాల్సింది ఇంకా ఉందనిపించింది. అయితే నృత్యంలో వారి లలితమైన కదలికల నుండి జె.ఎన్.ఎం. నేర్చుకోవాల్సినది చాలా ఉంది.

వీధి నాటికలు 3, 4 చూశాను వాళ్లవి - ప్రత్యేక ప్రదర్శనలు మా కోసం! కొందరు గతంలో వేసినవాళ్లు, కొందరు మొదటిసారి (అప్పటికప్పుడు) ఆ పాత్రల్ని వేశారు. గతంలో వేసినవాళ్లు ఎంత బాగా చేశారని! అసలు ఒకళ్లిద్దరు పిల్లలైతే ఎంత బాగా నటించారంటే నిన్ను, భాస్కర్, దివాకర్‌లనూ ఎంతగా గుర్తుచేసుకున్నానో చెప్పలేను - ఎంత మురిసిపోయేవాళ్లో అని! అదంతా వాళ్ల జీవితాల గురించీ, వాళ్లు రోజువారీగా చేసే పోరాటాల గురించీ కనుక అలవోకగా చేసేశారు. అయితే దీనికి కొంత శిక్షణ తోడైతే మరింతగా రాణిస్తారు. డ్యాన్స్‌లోనూ, వీధినాటికల్లోనూ మరింత శిక్షణతో పదునెక్కాల్సి ఉంది. వీధినాటికలకు ఉండాల్సిన సృజనాత్మకత, స్పాంటేనియస్‌గా డైలాగులు చెప్పడం...అంతా చాలా బాగుంది.

నేను వాళ్లకు ఒక రోజు 'మూకాభినయం' నేర్పించాను. ఎంతగా ఉత్తేజం పొందారంటే ఓ గంటలో ఓ మైమ్ నాటకం తయారు చేసి ప్రదర్శించేశారు. ఒక గ్రామంలో పోలీసులు దాడి చేసి అందర్నీ కొడ్తుంటే మహిళలు తిరగబడి వాళ్లని ఫుల్ దంచి, వాళ్ల చేతుల్లో వాళ్లనే ఉమ్మించి నాకించారు. నిజంగా జరిగిన ఈ సంఘటన ప్రదర్శించారు - ఒక్క డైలాగ్ లేకుండా. అందులో ఇన్ఫార్మర్‌గా 11 ఏళ్ల పాప నటన అద్భుతం! నువ్వే గుర్తొచ్చావు. ఒక నాటకంలో జమిందార్‌ని చివర్లో కొట్టి ఊరేగింపు తీసి బాండ్ రాయిస్తారు. ఆ బాండ్‌లో ఏం రాయాలో చెప్తారు. ఆ జమీందార్ వేసినమ్మాయిలో చక్కటి నటన, డైలాగ్ డెలివరీ ఉన్నాయి. ఆమె అప్పుడు వీళ్ల డైరెక్టర్ కూడా ఆ నాటకాలకి. 'ఇప్పటినుంచి పేదవాళ్లని గౌరవంగా చూస్తాను' అని రాయమంటే 'ఇవ్వాళ పేదవాళ్లను గౌరవంగా చూస్తాను, రేపటినుంచి ఎప్పట్లాగే బాధిస్తాను' అంటుంది. ఎంత చక్కటి టైమింగ్‌తో అంటుందంటే ప్రేక్షకులు గొల్లుమంటారు. భూస్వాముల వర్గస్వభావాన్ని చక్కగా చూపింది. వరకట్నంపైన నాటకంలో కాబోయే పెళ్లికొడుకు చివరివరకూ మోటార్ సైకిల్ జపం వదలడు - మహిళా సంఘం వచ్చి మొత్తం ఎడ్యుకేట్ చేసినా చివరివరకూ మంచి టైమింగ్‌తో 'అయితే మోటార్ సైకిల్ కూడా దొరకదా?' అంటూ ఉంటుంది. బాగా నవ్వుతాం. ఇలా చెప్పాలంటే వాళ్ల నటన, సృజనాత్మకత, టైమింగ్...అన్నీ బాగున్నాయి. కానీ ప్రదర్శన కొంత ముడిపదార్థంగా ఉన్నది. సానబట్టాలి. (నిజానికి జె.ఎన్.ఎం. వాళ్లకు కూడా ఇంకా పూర్తిగా వీధినాటకం టెక్నిక్ అలవడలేదు అనుకున్నాం కదూ?)

జె.ఎన్.ఎం. వాళ్లందరికీ పంపాలని వాళ్ల పాటలూ, వీధినాటికలూ అన్నీ రికార్డు చేశాను. 5,6 క్యాసెట్లు అవుతుండచ్చు. తాగుడుపై వేసిన నాటకం ఒకటి మాత్రం రికార్డు చేయలేదు. నిజానికి అది బాగా చేశారు. హఠాత్తుగా ప్రదర్శించడంతో రికార్డింగ్ కుదరలేదు. ఇవి కాక వాళ్లు తయారు చేసి అమ్ముతున్న 6 క్యాసెట్లు ఇచ్చారు. అవి కాపీలు పంపుతున్నా. హిందీ వస్తే నాటికలన్నీ అర్థం అవుతాయి. సగం పాటలూ అర్థమౌతాయి. మిగతా అన్నీ బాణీల కోసమే. నేనూ కొన్ని బాణీల కోసమే చేశా కనుక పూర్తి పాటలుండవు అన్నీ. యుద్ధనృత్యానికి ఎలా వాయిస్తారో మన డప్పిస్టులు వింటారని అదీ కొంత చేశాను. 'త్రహారే తననా' అని వచ్చే పాటలన్నీ 'వార్ డ్యాన్స్'వే.

సరే కామ్రేడ్! నాకు గుర్తున్నంతవరకు, నేను నోట్స్‌లో రాసుకున్న మేరకు అన్నీ రాశాననే అనుకుంటున్నా.

కానీ వాళ్లు చిన్న, చిన్న పిల్లల్ని చేర్చుకుని తల్లిదండ్రుల్లాగ ప్రేమగా సాకుతూ, వాళ్లకి అన్నీ నేర్పడం మాత్రం - ముఖ్యంగా జ్ఞానంతో ప్రకాశించే వాళ్ల ముఖాల్ని చూసినప్పుడు - అద్భుతంగా తోచింది. ఈ విషయంలో గ్రామాల్లో పిల్లలకీ వీళ్లకీ తేడా కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. ఇందులో కొద్ది సంవత్సరాలు చేశాక వాళ్ల వాళ్ల టాలెంట్స్‌ని బట్టి వాళ్లను వివిధ రంగాల్లోకి పంపిస్తుంటారు - అలా ఇతర రంగాలకు వెళ్లిన మంచి కళాకారులూ ఉన్నారు. ఏ రంగానికి పోవాలనేది టాలెంట్, ఉద్యమ అవసరాలు - రెంటిని బట్టి నిర్ణయిస్తారు. ఝార్ఖండ్‌లో వివిధ నిర్మాణాల్లో పని చేస్తున్న చాలామంది ఇందులో 1, 2 ఏళ్లు పని చేసినవాళ్లే ఉంటారు - చిన్నప్పుడే వస్తారు కనుక.

మంచి సాహిత్యాన్ని చదివినప్పుడు ఎం.ఎస్.ఆర్. అనివార్యంగా మదిలో మెదిలినట్లే ఇలా సాంస్కృతిక రంగానికి సంబంధించి ఏది చూసినా, ఏది చదివినా, ఏది విన్నా భాస్కర్‌తో సంభాషిస్తూనే ఉంటాను. జె.ఎన్.ఎం. అంటే వీళ్లకి చాలా ప్రేమ, గౌరవం. సమయం లేదు, లేకుంటే జె.ఎన్.ఎం. గురించీ, భాస్కర్, దివాకర్, పద్మ, కుమారిల గురించీ బోల్డు వివరంగా చెబ్దును వీళ్లకు. ఈసారి ఏ వర్క్‌షాప్‌లోనో కలిస్తే మీరే ఆ పని చేయచ్చు.

ఉంటాన్మరి. జె.ఎన్.ఎం. కామ్రేడ్స్ అందరికీ సాంస్కృతిక అభినందనల్తో

నీ

సంథాలీ



వ్యాసం

# ప్రజాయుద్ధంలో పెంపొందుతున్న నూతన సంస్కృతి

- వింధ్య

మన దేశంలో నాలుగు దశాబ్దాలకు పైగా ప్రజాయుద్ధం కొనసాగుతూ వస్తోంది. నక్సల్బరీ వసంతకాల మేఘగర్జనతో మన దేశ విముక్తికి నూతన ప్రజాస్వామిక విప్లవమే మార్గం అనే రాజకీయాలు తిరుగులేని విధంగా స్థాపించబడ్డాయి. నక్సల్బరీ మార్గం గత రివిజనిస్టు ఆచరణతో పూర్తిగా తెగతెంపులు చేసుకుని నూతన రాజకీయాల్నీ, నూతన సైద్ధాంతిక పునాదినీ ఎలాగైతే ఏర్పర్చిందో అలాగే పాత భూస్వామ్య, సామ్రాజ్యవాద, రివిజనిస్టు, అన్ని రకాల విప్లవ ప్రతీఘాతుక సంస్కృతుల్నీ తిరస్కరిస్తూ నూతన సంస్కృతికీ మార్గాన్ని తెరిచింది. మనం ఆర్థిక వ్యవస్థను పునాదిగానూ, సంస్కృతిని దానిని బట్టి ప్రధానంగా నిర్ణయించబడే ఉపరితలాంశంగానూ పరిగణిస్తాం. రాజకీయాలూ, సంస్కృతీ రెండూ ఉపరితలానికే చెందిన అంశాలే అయినప్పటికీ, నూతన రాజకీయాల ద్వారా, వాటి ఆసరాతో నూతన సంస్కృతి నెలకొనడం అనేది మన దేశంలో నక్సల్బరీ నుండి మనకు కనిపిస్తుంది. ఆర్థికాన్నీ, రాజకీయాన్నీ అనుసరించే సంస్కృతి మారుతుంది. విప్లవం విజయవంతం అయ్యి నూతన వ్యవస్థ నెలకొనేవరకూ ఆర్థిక వ్యవస్థ అంటే పునాది మారనప్పటికీ నూతన సంస్కృతికి సంబంధించిన అనేక అంశాల్ని మనం ఈ విప్లవ కాలం అంతటా నెలకొల్పుతూ పోతాం. ఈ పునాదులే భవిష్యత్తులో నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతం అయ్యాకా, అది సోషలిజంలోకి పరివర్తన చెందినప్పుడూ, అంతిమంగా కమ్యూనిజంలోకి ప్రవేశించినప్పుడూ కమ్యునిస్టు సంస్కృతి నెలకొనడానికి దారి తీస్తాయి అని స్థూలంగా చెప్పచ్చు. నూతన ప్రజాస్వామిక విప్లవ దశలో ప్రధానంగా భావజాల రంగంలో జరిగే వర్గపోరాటం ద్వారా నూతన సాంస్కృతిక అంశాలు పార్టీలో, ప్రజాసైన్యంలో, విప్లవ ప్రజాసంఘాల్లో, ప్రజల్లో మనం నెలకొల్పుతాం.

వర్గపోరాటమే అన్ని నూతన విలువలకూ జన్మస్థలి. మన వర్గపోరాటం నూతన సంస్కృతి కోసం కూడా అనేది ఒక వాస్తవమైతే, ఈ వర్గపోరాటం అనేక నూతన సాంస్కృతిక అంశాల సృష్టికీ, అవి బలంగా నెలకొనడానికీ నేపథ్యంగా, కారకంగా పని చేస్తోందనేది మరో వాస్తవం. అలాగే సంస్కృతి అనేది వర్గాతీతంగా ఉండేది కాదు. కనుక మనం నెలకొల్పే నూతన సంస్కృతి తప్పనిసరిగా కార్మికవర్గ సంస్కృతిగానే ఉండేలాగ మన దిశ ఉంటుంది. నూతన ప్రజాస్వామిక విప్లవ దశలో కార్మికవర్గ నాయకత్వంలో నెలకొనే భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, నూతన ప్రజాస్వామిక సంస్కృతిగా అది ఉంటుంది. అయితే కార్మికవర్గ నాయకత్వం వల్ల దానిలో సోషలిస్టు అంశాలు ఇమిడి ఉంటాయి. అవి నిర్ణయాత్మకంగా, నాయకత్వ స్థానంలో కూడా ఉంటాయి.

బూర్జువా వర్గం ప్రజాస్వామిక విప్లవాలకు నాయకత్వం వహించే స్థితి పోయింది కనుక అర్ధ వలస, అర్ధ భూస్వామ్య దేశాల్లో కార్మికవర్గమే ప్రజాస్వామిక విప్లవాలకు నాయకత్వం వహిస్తుందనీ, అందుకే దానిని నూతన ప్రజాస్వామిక విప్లవం అంటామనీ మనందరికీ తెలిసిందే. ఇదే అంశాన్ని మనం సంస్కృతికి అన్వయించి చూసినప్పుడు సోషలిస్టు అంశాలు ప్రజాస్వామిక దశలోనూ నిర్ణయాత్మకంగా ఉండడాన్ని అర్థం చేసుకోగల్గుతాం. అందుకనే ప్రజాస్వామిక సంస్కృతినీ, సోషలిస్టు/కమ్యూనిస్టు సంస్కృతినీ మనం విడి విడి అంశాలుగానే వివరించుకున్నప్పటికీ వాటిని విడదీసే చైనా గోడ ఏదీ లేదనేది కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ప్రజాస్వామిక విప్లవం కార్మికవర్గ నాయకత్వంలో జరుగుతోంది కనుక కమ్యూనిస్టు పార్టీ తక్షణ కార్యక్రమం నూతన ప్రజాస్వామిక సంస్కృతి స్థాపన గురించే ప్రస్తావిస్తుంది. ప్రజలను ఆ కార్యక్రమంతోనే సమీకరిస్తుంది. అయితే ఆచరణలో అందులో సోషలిస్టు సంస్కృతికి సంబంధించిన అంశాలూ ఉంటాయి. అవి ప్రధానంగా కమ్యూనిస్టు పార్టీ, ప్రజాసైన్యం ద్వారా అమలవుతూ ప్రజలను ఆ దిశగా ఆలోచింపజేస్తాయి, వాటిని అలవర్చుకోడానికి పురిగొల్పుతాయి. అయినప్పటికీ సోషలిస్టు ఆర్థిక, రాజకీయ వ్యవస్థ నెలకొనే వరకూ మనం దాన్ని సోషలిస్టు సంస్కృతి అనలేం. అయితే పార్టీలో మాత్రం అది కార్మికవర్గ పార్టీ కనుక మొదటినుండీ కూడా కమ్యూనిస్టు సంస్కృతినే మనం నెలకొల్పడానికి కృషి చేస్తాం. ప్రజాసైన్యంలో కూడా మనం ఈ సంస్కృతిని నెలకొల్పడానికి తీవ్రంగా కృషి చేస్తాం. మొత్తంగా గుర్తుంచుకోవల్సింది ఏంటంటే ఈ నూతన సంస్కృతిని కార్మికవర్గ నాయకత్వంలో మాత్రమే మనం నెలకొల్పగల్గుతాం అనేది.

అలాగే మన ప్రస్తుత విప్లవం ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగంగా జరుగుతోంది కనుక మన సంస్కృతి కూడా ప్రపంచ కార్మికవర్గ సోషలిస్టు నూతన సంస్కృతిలో భాగంగా ఉంటుంది. అది విశాల ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక, నూతన ప్రజాస్వామిక సంస్కృతి రూపంలో ప్రపంచ సోషలిస్టు నూతన సంస్కృతిలో భాగం అవుతుంది.

ప్రతి వర్గమూ తనదైన సంస్కృతిని సమాజంలో ఆధిపత్యంలో ఉండేలాగ చూసుకుంటుంది. అధికారాన్ని నిరాటంకంగా కొనసాగించడానికి ఒక తప్పనిసరి ముందు షరతుగానే అది ఉంటుంది. భావజాలం మీద ఆధిపత్యం ద్వారా

అధికారంలోని వర్గం సమాజంలోని అత్యధిక ప్రజానీకంపై తన ప్రభావాన్ని నెరిపి వారిని తన రాజకీయాలకూ, ప్రయోజనాలకూ అనుగుణంగా నడుచుకునేలా చేస్తుంది. అధికారంలో లేని వర్గం, ప్రస్తుత సందర్భంలో కార్మికవర్గం, దానికి ప్రాతినిధ్యం వహించే కమ్యూనిస్టు పార్టీ, సమాజంలో ఆధిపత్యం వహిస్తున్న దోపిడీవర్గ సంస్కృతిని నిరసిస్తూ, దాన్ని బహిర్గతం చేస్తూ, దానితో పోరాడుతూ దానికి ప్రత్యామ్నాయంగా ప్రజాస్వామిక, సోషలిస్టు సంస్కృతికి సంబంధించిన అంశాల్ని విస్తృతంగా ప్రచారంలోకి తెస్తాయి. నిజానికి ఈ భావవిప్లవం రాజకీయ విప్లవానికి ముందు నుండే ప్రారంభమై, దానిని అనుసరించి అభివృద్ధి చెందుతూ పోతుంది.

నూతన ప్రజాస్వామిక సంస్కృతికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాద, భూస్వామ్య సంస్కృతులు ఒక విప్లవ ప్రతీఘాతుక సాంస్కృతిక ఐక్యసంఘటనను కట్టాయి. విధ్వంసం లేకుండా నిర్మాణం సాధ్యం కాదు కనుక ఈ విప్లవ ప్రతీఘాతుక సంస్కృతిని ధ్వంసం చేయకుండా నూతన సంస్కృతిని మనం నిర్మించలేం. విప్లవ సంస్కృతీ, విప్లవ ప్రతీఘాతుక సంస్కృతీ కూడా ఈ యుద్ధంలో చావో, రేవో తేల్చుకునే పోరాటంలో నిమగ్నమై ఉన్నాయి. ఏ యుద్ధంలోనైనా ప్రత్యర్థి వర్గాలు వైరి వర్గానికి చెందిన ఆర్థికాన్నీ, రాజకీయాల్నీ, సంస్కృతినీ ధ్వంసం చేయడాన్ని లక్ష్యంగా కలిగి ఉంటాయి. నేడు మన దేశంలో విప్లవానికీ, విప్లవ ప్రతీఘాతుకత్వానికీ మధ్య యుద్ధం తీవ్రంగా కొనసాగుతోంది. ఈ తీవ్రమైన వర్గయుద్ధం సైద్ధాంతిక, ఆర్థిక, రాజకీయ, సైనిక, సాంస్కృతిక రంగాలన్నిటా తీవ్రంగానే కొనసాగుతోంది. అలా పాలకవర్గాల ఆర్థిక వ్యవస్థనూ, రాజకీయ వ్యవస్థనూ, పతన సంస్కృతినీ ధ్వంసం చేసి దాని స్థానంలో నూతన ప్రజా ఆర్థికాన్నీ, ప్రజా రాజకీయాధికారాన్నీ, సోషలిస్టు సంస్కృతినీ నెలకొల్పడానికి మన ప్రజాయుద్ధం ప్రయత్నిస్తుంటే, మన ప్రజాయుద్ధాన్ని ఓడించడం ద్వారా తిరిగి తమ పాత వ్యవస్థల్నీ, సంస్కృతినీ నెలకొల్పడానికి పాలకవర్గాలు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి.

విప్లవ ప్రజానీకం పాత రాజకీయ వ్యవస్థను తమ ప్రాంతాల్లో ధ్వంసం చేస్తూ నూతన ప్రజా రాజకీయ అధికారాన్ని నెలకొల్పుతున్నారు. ప్రజా రాజకీయాధికారం ఉన్న చోట్ల నూతన ఆర్థిక వ్యవస్థను నెలకొల్పే ప్రాథమిక ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ప్రజా శత్రువులు వీటిని మొగ్గలోనే తుంచేయాలనే దుష్ట పన్నాగాలతో అనేక అణచివేత క్యాంపెయిన్లను చేపడ్తున్నారు. ప్రజాసైన్యం అనన్యమైన త్యాగాలతో, అనుపమానమైన సాహసంతో ప్రజారాజ్యాధికార అంగాలను పరిరక్షిస్తూ పురోగమిస్తోంది. ఉద్యమ ప్రాంతాల్లో నెలకొంటున్న నూతన సంస్కృతి కూడా పాలకవర్గాల టార్గెట్ అవ్వడంలో ఆశ్చర్యం ఏం లేదు. సల్వాజుడుం సందర్భంగా ప్రజల వాయిద్యాలను ధ్వంసం చేయడం అనేది దీనికి ప్రతీకాత్మకంగా కనిపించే ఒకానొక ఉదాహరణ మాత్రమే. రోజువారీగా అనేక రూపాల్లో ఈ దాడి కొనసాగుతోంది. అతి ప్రాచీనమైన సాంస్కృతిక అవశేషాలు గల ఆదివాసీ ప్రాంతాలను ప్రత్యేకంగా టార్గెట్ చేయడం ద్వారా సాంస్కృతిక విధ్వంసానికి కూడా పాలకవర్గాలు వెనకాడడం లేదు. ఇరాక్‌లో అత్యంత ప్రాచీనమైన నాగరికతను ధ్వంసం చేయడానికి వెనకాడని అమెరికా సామ్రాజ్యవాదుల అనుంగు శిష్యుల నుండి మనం అంతకంటే ఆశించగలిగేదీ ఏముంది?

ప్రజాయుద్ధానికీ, ప్రజా సంస్కృతికీ గల గతితార్కిక సంబంధాన్ని కనుక పరిశీలిస్తే, అవి ఒకదానినొకటి పరిరక్షించుకుంటూ, ఒకదానినొకటి పెంపొందించుకునే పరస్పరాధారిత సంబంధంలో ఉన్నాయని మనకర్థమవుతుంది. ప్రజాయుద్ధం లేకుండా ప్రజా సంస్కృతిని పెంపొందించడం గానీ, దాన్ని పరిరక్షించుకోవడం గానీ సాధ్యం కాదు. అలాగే ప్రతిగా ప్రజా సంస్కృతి ప్రజాయుద్ధం పెంపొందడానికి తగిన సాంస్కృతిక భూమికను కలిగించడం ద్వారా దాని ఎదుగుదలకూ, విస్తరణకూ దోహదపడుతుంది. అందుకనే ప్రజాసైన్యంలో ప్రజా సంస్కృతికి సంబంధించిన నిర్మాణం కూడా మనం ఏర్పరుస్తున్నాం, ప్రచారాన్ని ప్రజా సైన్య ముఖ్య కర్తవ్యాల్లో ఒకటిగా చేర్చాం. సైన్యంలో ఉండే సాంస్కృతిక నిర్మాణం ప్రజల్లో నూతన ప్రజాస్వామిక సంస్కృతిని ప్రచారం చేయడంతో పాటు ప్రజాసైన్యంలోనూ నూతన విలువలు నెలకొనడానికి కృషి చేయడం ద్వారా సైద్ధాంతికంగా, రాజకీయంగా ప్రజాసైన్యాన్ని మరింతగా బలోపేతం చేసి దాని పటిష్టతకు దోహదం చేస్తుంది. చేయాలి. ఇలా సంస్కృతీ, ప్రజాసైన్యం, ప్రజాయుద్ధం విడదీయరాని సంబంధంలో ఉండడాన్ని మనం చూస్తాం. అయితే ఈ సంబంధాన్ని మనం ఎంతగా గుర్తించి వాటిని సరైన సమీకరణంలోకి తెస్తాం అనేది మార్క్సిజాన్ని మనం సరిగా అన్వయించడం మీద ఆధారపడి ఉంటుంది.

కమ్యూనిస్టు పార్టీ, దాని నాయకత్వంలో నడిచే ప్రజాసైన్యమూ, విప్లవ ప్రజాసంఘాలూ ప్రచారానికే పరిమితం కాకుండా నూతన సాంస్కృతిక అంశాలను ఆచరణలోకీ తెస్తాయి. తమ ఆచరణ ద్వారానే అవి బూర్జువా, భూస్వామ్య సంస్కృతికీ, సోషలిస్టు సంస్కృతికీ విభజన రేఖను గీసి సమాజంలోని ప్రగతిశీల శక్తులన్నిటినీ తమ వైపుకు ఆకర్షిస్తాయి. సంస్కృతికి సంబంధించిన అత్యున్నత అంశాలన్నిటికీ అవి ప్రతీకలుగా నిలవడానికి ప్రయత్నిస్తాయి. ఇందులో అవి ఎంత విజయం సాధిస్తాయనేది విప్లవ విజయానికి కీలకమైన అంశాల్లో ఒకటి అనడం అతిశయోక్తి అవబోదు. ముఖ్యంగా సామ్రాజ్యవాద పతన సంస్కృతీ, విలువలూ మరింతగా, మరింతగా విశృంఖలంగా సమాజాన్ని చీకటిలోకి లాక్కుపోతున్న నేటి స్థితిలో విప్లవకారులు ఎంతగా నూతన సంస్కృతికి ప్రతీకలుగా నిలుస్తారో అంతగా ప్రజల్ని విప్లవ ఆవశ్యకత విషయంలో ఒప్పించగల్గుతారనేది మనం గుర్తించాలి. ఉదాహరణకు, బూర్జువాల, భూస్వాముల సైనికులు ప్రజల ఇళ్లపై బడి అన్నిటినీ దోచుకుంటారు. ఎర్ర సైనికులు ప్రజల ఆస్తుల్ని పరిరక్షిస్తారు, తమకు అవసరమైనవి అడిగి తీసుకుంటారు, వాటికి ధర చెల్లిస్తారు. రెండిటి సంస్కృతిలో ఉండే తేడా వారు చెప్పే రాజకీయాల్ని ప్రజలు ఎలా స్వీకరిస్తారు అనే అంశాన్ని ప్రభావితం చేస్తుంది. ప్రజల్లో విప్లవంలో భాగం అవ్వాలనే ఆకాంక్షను

కలిగించడానికి కమ్యునిస్టు పార్టీ, మరీ ముఖ్యంగా ప్రజాసైన్యంలో మనం పెంపొందించే నూతన సాంస్కృతిక అంశాలు ఒక ముఖ్యమైన పాత్రను వహిస్తాయి. ఎందుకంటే ఆ సైన్యంలో విప్లవ వర్గాలైన కార్మికవర్గం, రైతాంగం అత్యధిక సంఖ్యలో భాగం అవుతాయి. పెటీబూర్జువా వర్గం నుండి గణనీయమైన సంఖ్యలో సైన్యంలో చేరతారు. ఈ వర్గాలు భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతి అతి తీవ్ర అణిచివేతకు గురవుతూ వాటి నుండి కూడా విముక్తిని కోరుకునే స్థితిలో ఈ వ్యవస్థలో ఉంటున్నాయనే విషయాన్ని మనం గుర్తించినప్పుడు ప్రజాసైన్యంలో ఉండే సంస్కృతి పట్ల వారు కలిగి ఉండే ఆకాంక్షల్ని గుర్తించడం మనకు సులభమే.

నూతన సంస్కృతిని పెంపొందించడానికీ, ప్రచారం చేయడానికీ మనం రెండు మార్గాలను అవలంబిస్తున్నాం. ఒకటి అందుకు కొన్ని ప్రత్యేక నిర్మాణాల్ని ఏర్పర్చుకుని వాటికి దీనికి సంబంధించిన కర్తవ్యాలను నిర్దేశించుకుని ప్రజల్లోనూ, సైన్యంలోనూ, పార్టీలోనూ పని చేస్తున్నాం. మరొకటి మనం రోజువారీ ఆచరణ ద్వారా, మనపై మనం చేసుకునే అంతర్గత పోరాటం ద్వారా (వ్యక్తిగతంగానూ, సంస్థాపరంగానూ) పెంపొందిస్తున్న కమ్యూనిస్టు సంస్కృతి, విలువలు. ఈ రెండూ కూడా కీలకమైనవే.

పై విషయాల్ని దృష్టిలో ఉంచుకుని పిఎల్‌జిఎ పదవ వార్షికోత్సవం సందర్భంగా పార్టీలో, ప్రజాసైన్యంలో, సమాజంలో మనం పెంపొందిస్తున్న నూతన సాంస్కృతిక అంశాల్నీ, మరోవైపు దానిలో పొడసూపుతున్న అన్యవర్గ సాంస్కృతిక అంశాల్నీ ఒకసారి మధింపు వేసుకుందాం. నూతన అంశాల్ని మరింతగా పెంపొందించుకుంటూ, వాటిని విస్తృతంగా ప్రచారంలో పెడదాం. ప్రతికూలాంశాలకు పునాది ఎక్కడుందో గుర్తించి వాటిని తొలగించుకోవడానికి పునరంకితమవుదాం.

## మన ఉద్యమ ప్రాంతాల్లో మనం పెంపొందిస్తున్న నూతన సాంస్కృతిక అంశాలు

### పోరాట వారసత్వం

మన ప్రజాయుద్ధం ప్రజల పోరాట వారసత్వాన్ని వెలికి తీసి వారి ముందు ఆచరించాల్సిన ఆదర్శంగా దానిని నిలబెట్టడంలో గణనీయమైన విజయాన్ని సాధించింది. దోపిడీ, ఆధిపత్యాలకు తల వంచని అనేక మంది వీరుల, వారి నాయకత్వంలో జరిగిన పోరాటాల, ఉద్యమాల చరిత్రను వెలికి తీసి, వాటిని విప్లవీకరించి తిరిగి వారి వారసులుగా మనం పోరాట సంప్రదాయాన్ని ఎలా నెలకొల్పాలనే అంశాల్ని మనం ప్రచారం చేశాం. అది బీహార్-ఝార్ఖండ్‌లలో సిధూ-కానూ, బిర్సా ముండా (ఉల్‌గులాన్), ఆదిలాబాద్‌లో కొమురం భీం, మన్యంలో అల్లూరి, బస్తర్‌లో గుండాదూర్ (మహాన్ భూంకాల్), భారతదేశవ్యాప్తంగా భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజ్‌గురు, ఉద్దంసింగ్, పంచాది నిర్మల, స్నేహలత, నక్సల్బరీ, శ్రీకాకుళ అమరులు ఇంకా అనేకానేక ఉద్యమాలూ, వీరులూ. ఆ పోరాటాల గుర్తుగా మనం వాటికి సంబంధించిన కొన్ని తారీఖుల్ని కూడా నిర్ణయించి ఆ పోరాటాలను గుర్తు చేసుకుని వారి వలెనే స్వాతంత్ర్యం, స్వేచ్ఛ, సమానత్వాల సాధనకై, ప్రజాస్వామ్యంకై, హక్కులకై అన్నిటికంటే ముఖ్యంగా పీడిత ప్రజల రాజ్యాధికారానికై జరిగే పోరాటానికి తిరిగి అంకితం కావడానికి ఆ దినాల్ని మనం జరుపుతున్నాం. ఇవి ప్రజల సామూహిక చైతన్యంలో భాగమైపోయాయి. మన దేశానికి సంబంధించే కాక అంతర్జాతీయంగా కూడా కార్మికవర్గానికి ముఖ్యమైన దినాల్ని, మార్క్సిస్టు మహోపాధ్యాయులకు సంబంధించిన, మహత్తర అక్టోబర్ విప్లవం, చైనా విప్లవానికి సంబంధించిన దినాల్ని మనం ప్రజల చైతన్యంలో భాగం చేయడానికి కృషి చేశాం. అక్టోబర్ విప్లవ దినం, మేడే, మార్చి 8 అంతర్జాతీయ శ్రామిక మహిళా దినం, భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల వర్ధంతి (సామ్రాజ్యవాద వ్యతిరేక దినం) వంటివి దీనికి కొన్ని ఉదాహరణలు. అలాగే అమరులను స్మరించుకోవడానికి మనం కామ్రేడ్ చారు మజుందార్ అమరత్వం చెందిన రోజు జులై 28ని అమరుల స్మారక దినంగా ప్రజల్లో నెలకొల్పాం. గ్రామగ్రామాన వందల సంఖ్యలో వెలసిన అమరుల స్థూపాలు ఈ నూతన సంస్కృతికి చిహ్నంగా మనకు అగుపిస్తాయి. ఇంకా విప్లవోద్యమం అనేక మలుపులను, మైలు రాళ్లను ముఖ్యమైన రోజులుగా స్మరించుకోవడం, జరుపుకోవడం.

### సమష్టితత్వం

కమ్యూనిస్టు సంస్కృతిలో ఒక ప్రధానమైన అంశం, ఒక విధంగా పునాది అంశం సమష్టితత్వం. ఇది సరిగ్గా భూస్వామ్య సంస్కృతిలోని వ్యక్తి ఆధిపత్యానికీ, పెట్టుబడిదారీ సంస్కృతిలోని వ్యక్తివాదానికీ వ్యతిరేకంగా నిలుస్తుంది. వీరులే చరిత్ర నిర్మాతలు అనేదాన్ని ఖండించి ప్రజలే చరిత్ర నిర్మాతలు, ప్రజలే నిజమైన వీరులు అనేదాన్ని నెలకొల్పడానికి మనం ప్రధానంగా సమష్టితత్వాన్ని పెంపొందించడంపై ఆధారపడుతాం.

వర్గసమాజంలో వ్యక్తి ప్రయోజనం ప్రధానంగా ఉంటుంది. భూస్వామ్య సమాజం పుట్టుక మీద ఆధారపడి వ్యక్తి ఉన్నతిని కూడా నిర్వచిస్తుంది, దాన్ని బట్టే అవకాశాల్ని కల్పిస్తుంది. బూర్జువా సమాజం వ్యక్తి ప్రయోజనాలను అత్యున్నత స్థానంలో నిలబెట్టి అన్ని మానవ సంబంధాలనూ కూడా దానికే లోబడి ఉండేలా మార్చేస్తుంది. దీనికి విరుద్ధంగా సమష్టి ప్రయోజనానికి కమ్యూనిస్టు సంస్కృతి అత్యున్నత ప్రాధాన్యతనిస్తుంది. అది వ్యక్తిని సమష్టి నుండి వేరు చేసి చూడదు. సమష్టిలో భాగంగానే వ్యక్తి ఉన్నతి కూడా ఉంటుందని చెప్తుంది. వ్యక్తికీ, సమష్టికీ ఉన్న గతితార్కిక సంబంధాన్ని మార్క్సిజం చాలా స్పష్టంగా నిర్వచించింది. కమిటీ పని విధానంలో కూడా సమష్టి నిర్ణయాలు, వ్యక్తిగత బాధ్యత రూపంలో ఈ సంబంధాన్ని మనం ప్రతిబింబిస్తాం. ఈ సమష్టితత్వం అనేది మనం చేసే ప్రతి పనిలో మనం పాటించడానికి తీవ్రంగా కృషి చేస్తున్నాం. గ్రామాల్లో మనం ప్రజల దైనందిన జీవితానికి సంబంధించిన అనేక అంశాల్లో సమష్టితత్వాన్ని పెంపొందించడానికి ప్రయత్నిస్తున్నాం. అది వ్యవసాయం కావచ్చు, నీటి పారుదల సౌకర్యాల కల్పన కావచ్చు, ఒక ఇల్లు కట్టడం

కావచ్చు, స్థూప నిర్మాణమే కావచ్చు. అన్నిటినీ మనం సమష్టిగానే చేపడ్తున్నాం. ఆదివాసీ ప్రాంతాల్లో అయితే ప్రజల్లో గల సమష్టి రూపాల్ని మనం విప్లవీకరించి తిరిగి వారి వద్దకే తీసుకెళ్లి అమలు చేయిస్తున్నాం.

దీనికి సంబంధించిన ఉల్లంఘనలు మనకు ప్రతిరోజూ, ప్రతి విషయంలోనూ జరిగే అవకాశాలు ఉంటూనే ఉంటాయి, ఉన్నాయి. ఈ విషయంలో మనం ఎంతో చైతన్యవంతంగా ఉంటే తప్ప బూర్జువా వ్యక్తివాదం అధిపత్యం వహించకుండా మనం ఉద్యమాన్ని కాపాడుకోలేం. దానికున్న పునాది ఏంటంటే రైతాంగం నుండీ, పెటీ బూర్జువావర్గం నుండీ వచ్చిన కామ్రేడ్స్ మన పార్టీలో ఇప్పటికీ అధికంగా ఉండడం. రైతాంగ సంకుచిత స్వార్థం సమష్టితత్వానికి ఒక అడ్డంకి కాగా, అసమానాభివృద్ధి వల్ల పెటీబూర్జువా సెక్షన్స్ నుండి వచ్చిన కామ్రేడ్స్‌లో నైపుణ్యాలు ఎక్కువగా ఉండడం, దానికి సమపాళ్లలో ఉండాల్సినంత కమ్యూనిస్టు చేతన లేకపోవడం మరో అడ్డంకి. తమకున్న నైపుణ్యాల్ని ప్రధానం చేసుకుని వారు ఆలోచించినప్పుడు సమష్టితత్వం దెబ్బతిని వ్యక్తివాదం ప్రబలుతోంది. కనుక చైనా సాంస్కృతిక విప్లవం స్ఫూర్తితో మనం నిరంతరం వ్యక్తిలోని కమ్యూనిస్టు చేతన ప్రధానాంశం అనీ, నైపుణ్యం అనేది సెకండరీ అంశం అనీ విద్యను అందించాలి. శ్రీశ్రీ అన్నట్టుగా మనం ఏ వృత్తినీ, నైపుణ్యాన్నీ పొందాలన్నా, చేపట్టాలన్నా ముందుగా కమ్యూనిస్టులం కావాలి అనేదాన్ని ప్రచారంలో పెట్టాలి. మన నూతన సంస్కృతిలో మనం పరిష్కరించాల్సిన కీలకమైన సమస్య ఇది.

### ప్రజాపంథా, వర్గపంథా

ప్రజా సంస్కృతిలో మరో ముఖ్యమైన అంశం ప్రజల నుండి ప్రజల వద్దకు అనే ప్రజాపంథాకు సంబంధించినది. మనం ఏ పని చేసినా దీన్ని అంటిపెట్టుకుని ఉండాలి అనేదాన్ని మనం అన్ని రంగాల్లోనూ ప్రచారం చేయడమే కాక అమల్లో పెడుతున్నాం. భూస్వామ్య, బూర్జువా సంస్కృతి ప్రకారం గొప్ప గొప్ప ఆలోచనలన్నీ మేధావుల, బ్రాహ్మణుల వంటి అగ్రకులాల వారి బుర్రల్లో పుడతాయి. ప్రజలు వారి దృష్టిలో ఏమీ తెలియని మొద్దులు, తెలివిమాలినవారు. మనం దీన్ని సరిగ్గా తలకిందులు చేసి ప్రజలే నిజంగా తెలివైనవారు, వివేకంగలవారు అనే చారిత్రక సత్యానికి కట్టుబడతాం.

దీన్ని పార్టీలో, ప్రజాసైన్యంలో కూడా కార్యకర్తలకూ - నాయకులకూ, సైనికులకూ-కమాండర్లకూ మధ్య సంబంధాల్లో కేంద్రీకృత ప్రజాస్వామ్యం రూపంలో మనం అమలు చేస్తున్నాం. ఇది ప్రజాసైన్యంలో ప్రజాస్వామ్య సంస్కృతి నెలకొనడానికి దారి తీస్తుంది. ప్రజాసైన్యంలో కమాండర్లకూ, ప్రజా సైనికులకూ నడుమ ఉండే సంబంధాల్లో సమానత్వం, ప్రజాస్వామ్యం అమలవుతోంది. బూర్జువా పోలీసు, సైన్యాలకు భిన్నంగా ఇది మన సైన్యంలో పెంపొందుతున్న నూతన సాంస్కృతిక అంశం. ప్రజాసైన్యంలో కమాండర్లు ప్రజా సైనికులను బూర్జువా సైన్యాల్లోలా తిట్టడం, అవమానపరచడం, అణచివేయడం కనిపించదు. కొట్టడం అనేది అనేదైతే ఏ మాత్రం లేదనే చెప్పచ్చు. ఇలాంటి సందర్భాలు చాలా అరుదుగా కొన్ని చోట్ల ముందుకు వస్తే వాటిని విమర్శ-ఆత్మవిమర్శ ద్వారా సరిదిద్దుతున్నాం. సంబోధనలోనూ, జీవన విధానంలోనూ సమానత్వాన్నీ, ప్రజాస్వామ్యాన్నీ మనం పాటిస్తున్నాం. (దీనినే యేనాన్ తరహా జీవనం అంటాం, ఈ విషయంలో యేనాన్ ప్రమాణాలు అత్యున్నతమైనవి). సైనికుల నుండి సైనికుల వద్దకు అనే రూపంలో కూడా ప్రజాస్వామికాన్ని మనం అమలు చేస్తాం.

సాంస్కృతిక రంగానికి సంబంధించిన ఒక ఉదాహరణనే మనం తీసుకుంటే, ప్రజల్లో ముడిసరుకుగా ఉన్న పాటలనూ, కళారూపాలనూ మనం తీసుకుని, వాటిని విప్లవీకరించి తిరిగి వాటిని ప్రజల వద్దకు తీసుకుని వెళుతున్నాం. ఈ క్రమంలో అవి సుసంపన్నం అవుతాయి. ఈ క్రమం పదే, పదే నిరంతరం జరుగుతూనే ఉంటుంది. ఆ విధంగా ఆ రంగంలో ప్రజాపంథాను మనం అమలు చేయడం ద్వారా నూతన సంస్కృతికి మనం తెర తీస్తున్నాం. ఇలా ప్రతి రంగంలోనూ జరుగుతోంది. ఇందుకు మనం కోకొల్లలుగా ఉదాహరణలను చెప్పుకోవచ్చు.

వర్గపంథా పైన ఆధారపడే మనం ప్రజాపంథాను అమలు చేస్తున్నాం. మనం చేపట్టే నిర్మాణాల్లో, పోరాటాల్లో, ప్రజా పంచాయితుల్లో, నాయకత్వ తర్ఫీదులో, వారి ఎంపికలో ఇలా అనేక అంశాల్లో మనం వర్గపంథాను అంటిపెట్టుకుని ఉంటున్నాం. పీడిత ప్రజల రాజ్యాధికారాన్ని స్థాపించడంలో ఇది ఎంతో కీలకమైన అంశం. అధికారంలోంచి తొలగించబడిన వర్గాలు తిరిగి అనేక రూపాల్లో తమ ప్రాబల్యాన్ని నెలకొల్పే ప్రయత్నం చేస్తాయి. అందుకు దొంగదారులు కూడా వెతుక్కుంటాయి. ప్రజానుకూలంగా ఉన్నట్టు నటిస్తూ ప్రజలను నమ్మించి మన నిర్మాణాల్లోకి చొరబడే ప్రయత్నాలు చేస్తాయి. వర్గపంథాను దృఢంగా అమలు చేయడం ద్వారానే ఈ ప్రమాదం నుండి బైటపడగల్గుతాం. నూతన ప్రజాస్వామిక దశ నాలుగు వర్గాల ఐక్యత మీద ఆధారపడేదిగా ఉంటుంది కనుక ఈ దశలో ప్రజలు అంటే ఈ నాలుగు వర్గాల ప్రజలు అనే అర్థం. వర్గపంథా అంటే ఈ నాలుగు వర్గాల ప్రయోజనాలను కాపాడేదిగానే ఉంటుంది.

మన పార్టీ ఆచరణలో సాధారణంగా శత్రువర్గాల విషయంలో మనం రాజీపడ్డం వంటి తప్పులు చేసింది తక్కువ. అలా చేసినవారు చరిత్రలో తేలిపోయారు కూడా. కానీ మనం ఆచరణలో చేసే తప్పుల్లో విప్లవకర వర్గాల విషయంలో వర్గపంథాను వదిలి పెట్టడం ఉంటోంది. అది రెండు రూపాల్లో ఉంటోంది - కేవలం భూమిలేని, పేద రైతాంగంలోనే పని చేస్తూ మిగతా విప్లవకర వర్గాల్లో తగినంత పని చేయకపోవడం లేదా వారి ప్రయోజనాల కోసమూ పట్టించుకోకపోవడం, వారికి హాని కలిగే నిర్ణయాలు చేయడం ఒకటైతే, మరొకటి - పునాది వర్గాలను విస్మరించి తాత్కాలిక ప్రయోజనాల కోసం విప్లవకర వర్గాల్లోని ఇతర వర్గాల వారికి ప్రాధాన్యం ఇవ్వడం. ఈ రెండు తప్పుల విషయంలో ప్రజల్నీ, కార్యకర్తలనూ విద్యావంతం చేయడం మన కర్తవ్యం. అప్పుడే ప్రజాపంథానూ, వర్గపంథానూ మనం సరిగ్గా ఆచరించి ప్రజల సంస్కృతిలో వాటిని భాగం చేయగల్గుతాం. నూతన సంస్కృతిలో వర్గపంథా, ప్రజాపంథాల అమలు, వాటిపై ప్రచారం ఒక ముఖ్య

భాగంగా ఉంటాయి. మన ప్రజాసైన్యం చేసే కవాతులో ఒక అడుగు ప్రజాపంథాగా ఉంటే మరో అడుగు వర్గపంథాగా ఉండాలి. అప్పుడే అది నిజమైన ప్రజాసైన్యంగా వర్ధిల్లుతుంది.

**త్యాగనిరతి**

త్యాగం లేనిదే ఏ విప్లవమూ పురోగమించదు. చరిత్రలో మౌలిక మార్పును తెచ్చిన ఏ విప్లవాలైనా రక్తాన్ని చిందించకుండా గెలిచింది లేదు. ప్రజలనూ, సైన్యాన్నీ, పార్టీనీ త్యాగాలకు పురికొల్పకుండా విప్లవ కార్యకలాపాలు ముందుకు పోవడం ఉండదు. ఇది విప్లవాల యుగం. కనుక త్యాగాలు అనేవి ఈ చారిత్రక కాలంలో అనివార్యం. ఈ కాలంలో ప్రజలు విప్లవం చేస్తారు. దోపిడీ, పీడనల నుండి విముక్తి కోసం పోరాడ్డం వారి చారిత్రక అవసరం. కాలం చెల్లిన వ్యవస్థను వదిలించుకోవాలంటే త్యాగాలు చేయక తప్పదు. అందుకనే అత్యున్నతమైన, అద్భుతమైన త్యాగాల నమూనాలు మనకు విప్లవ కాలాల్లో కోకొల్లలుగా కనిపిస్తాయి. ఇలా లేకుంటే ఇన్ని నమూనాలు మనకు దొరకడం అసాధ్యం. చారిత్రక అనివార్యత అనడం వల్ల వ్యక్తులుగా, సమూహాలుగా త్యాగాలకు సంసిద్ధం కావడానికున్న త్యాగాల ప్రాధాన్యత తగ్గదు. దాన్ని శాస్త్రీయంగా ఇలా విశ్లేషించుకుంటున్నాం అని మాత్రమే దాని అర్థం. ఈ చారిత్రక కాలంలో త్యాగాల అనివార్యతను శాస్త్రీయంగా అర్థం చేసుకోవడం ద్వారా దానికి సిద్ధపడ్డం అనేది కమ్యునిస్టు చైతన్యం ద్వారా జరుగుతుంది. ఈ చైతన్యాన్ని మనం విస్తృతంగా పెంపొందించడానికి కృషి చేస్తాం. కమ్యునిస్టు పార్టీ సభ్యులవ్వడం అంటేనే ఈ చైతన్యాన్ని స్వంతం చేసుకోవడం కూడా.

కామ్రేడ్ మావో కార్మికవర్గ అగ్రగాములు ఎలా ఉండాలో చెప్పిన మాటలు మనకు శిరోధార్యంగా ఉంటాయి.

**"అగ్రగాములు దాపరికం లేకుండా, సానుకూలంగా (పాజిటివ్‌గా), నిజాయితీగా ఉండాలి. వారు ఎటువంటి స్వార్థాన్నీ కలిగి ఉండరు, వారు కేవలం దేశ, సామాజిక విముక్తిని కోరుకుంటారు. వారు కష్టాలకు వెరవరు, బదులుగా కష్టాలు ఎదురైనప్పుడు వారు పట్టుదలను ప్రదర్శిస్తారు, వారు ఎల్లప్పుడూ పురోగమిస్తూ ఉంటారు. వారిలో క్రమశిక్షణారాహిత్యం గానీ, కీర్తికండూతి గానీ ఉండవు; వారి కాళ్లు నేల మీద దృఢంగా ఆని ఉంటాయి. వారు వాస్తవవాదులుగా ఉంటారు. వారే విప్లవపథానికి మార్గదర్శకులు" - కామ్రేడ్ మావో.**

మనం పెంపొందించే నూతన సంస్కృతిలో త్యాగాలను ఎత్తిపట్టడం, ప్రాణత్యాగం చేసినవారి త్యాగనిరతిని కీర్తించడం, అనుసరించాల్సిన నమూనాలుగా నిలబెట్టడం ఒక ముఖ్య భాగంగా ఉంటాయి. త్యాగం అనేది కేవలం ప్రాణత్యాగానికే సంబంధించిన అంశం కాదు. అది రోజువారీగా అనేక అంశాల్లో ఉంటుంది. విప్లవ ప్రజానీకం, విప్లవకారులూ రోజువారీగా చేస్తున్న త్యాగాలు అసంఖ్యాకం, అనేకం, వైవిధ్యపూరితం.

చీకటి వెలుగులున్నట్టే త్యాగం పక్కనే విద్రోహాలూ, దిగజారుళ్లూ కూడా ఉంటాయి. అందుకనే ద్రోహాల్ని ఖండిస్తూ, ఛీత్కరిస్తూ త్యాగాల్ని ఎత్తిపట్టడం మన సంస్కృతిలో ఒక ముఖ్య అంశంగా ఉంటుంది. పెట్టుబడిదారీ సమాజం పనిగట్టుకుని స్వార్థాన్నీ, వ్యక్తి ఉన్నతినీ ప్రచారంలో పెడ్తుంది. పక్కవారిని తొక్కేసి, మోసాలు చేసి అయినా అందలాలు ఎక్కమని పురికొల్పుతుంది. మన సంస్కృతి స్వార్థంతో పోరాడి, సమష్టి కోసం దాన్ని త్యాగం చేయమనీ, అందరి ఉన్నతిలో భాగంగానే వ్యక్తి ఉన్నతి కూడా ఉంటుందని చెప్తుంది. భావజాలరంగంలో జరిగే పోరాటంలో స్వార్థానికీ, త్యాగానికీ మధ్య జరిగే ఈ పోరాటం పునాది అంశంగా ఉంటుంది. అయితే చారిత్రక గతితార్కిక భౌతికవాద పరిణామాల్ని అధ్యయనం చేస్తూ త్యాగాల చారిత్రక ఆవశ్యకత, కమ్యూనిజం ఆవశ్యకత అనే శాస్త్రీయమైన పునాదిపై ఆధారపడి మనం ఈ పోరాటాన్ని చేస్తాం.

**జవాబుదారీతనం**

భూస్వామ్య సమాజంలో రాజు లేదా జమీందారే సర్వాధికారాలు కలిగి ఉంటాడు. ఎవరికీ జవాబు చెప్పాల్సిన పని వారికి లేదు. బూర్జువా సమాజంలో ఉండేది బూటకపు ప్రజాస్వామ్యం కనుక అన్ని విషయాల్లోలాగానే ప్రజలకు జవాబుదారీతనం వహించడంలోనూ అది చెప్పేది ఒకటి చేసేది ఒకటిగా ఉంటుంది. ప్రజలకు హాని కలిగించే ఎటువంటి ఆర్థిక, సామాజిక, పర్యావరణ, రాజకీయ, నైతిక, సైనిక, న్యాయపరమైన వగైరా ఏ విధానాల్ని అది చేపట్టినా, అమలు చేసినా అది ప్రజలకు జవాబుదారీతనం వహించదు. అది పైకి ఎన్నికల తతంగం ద్వారా దాన్ని అమలు చేస్తున్నట్టు భ్రమ కల్పించినా ఆ ఎన్నికల ప్రక్రియే పరమ బూటకమైనది కనుక నేరస్తులు బహిరంగంగా తిరుగుతుంటారు, ఆస్తుల్ని పెంచుకుంటూ ఉంటారు. వారు కల్పించిన బూర్జువా చట్రంలో ప్రజలు వారిని నిలదీయగలగడం, బాధ్యత వహించేలా చేయడం అనేది సాధ్యం కాదు. కానీ మనం నెలకొల్పే నూతన సంస్కృతిలో ప్రజలకు బాధ్యత వహించడం ఒక ప్రధాన అంశంగా ఉంటుంది. మనం చేసే ప్రతి పనీ ప్రజల కోసమే, అదే సమయంలో ప్రతి పనికీ మనం ప్రజలకు జవాబుదారీతనం వహిస్తాం. తప్పులు జరిగినప్పుడు ప్రజల ముందు మనం వినమ్రంగా తల వంచి మన తప్పుల్ని ఒప్పుకుంటాం. క్షమాపణలు కోరుతాం. ప్రతి నిర్మాణంలోనూ విమర్శ - ఆత్మవిమర్శను ఒక నిర్మాణ పద్ధతిగా మనం అమలు చేయడం ఇందులో కూడా భాగమే.

కమ్యూనిస్టు సంస్కృతిలో జవాబుదారీతనం పై నుండి కిందికి ఉంటుంది. ఉండాలి కూడా. ప్రజాసంఘాల్లోనూ ఫ్రాక్షన్స్ రూపంలో పార్టీ సభ్యులు ఉంటారు కనుక జవాబుదారీతనం వారి నుండి మొదలవుతుంది. బూర్జువా సమాజంలో పైకి మాత్రం జవాబుదారీతనం పై నుండి ఉన్నట్టు కనిపించినా వాస్తవంగా ప్రతీదానికీ బాధ్యతను కింది వారిపై నెట్టేయడం, బాధ్యత వహించాల్సిన పై స్థాయిలోని అసలు దోషులు తప్పుకోవడం ఆనవాయితీగా, పద్ధతిగా అమలవుతూ ఉంటుంది.

మావోయిస్టు పార్టీ జవాబుదారీతనానికీ, అందులోనూ

పైనుండి జవాబుదారీతనానికీ ప్రతీకగా నిలుస్తూ వస్తోందనేది ఒక వాస్తవం. మనం ఎన్నోసార్లు తప్పులు చేసినప్పటికీ ప్రజలకు మనపై అపారమైన విశ్వాసం ఉండడానికి ప్రధానంగా దోహదపడ్తున్న విషయం ఇది. అయితే ప్రజల విషయంలో జరుగుతున్న తప్పుల విషయంలో గానీ, పార్టీలో జరిగే తప్పుల విషయంలో గానీ మనం మరింత బాధ్యతగా ఉండాల్సిన అవసరం కనిపిస్తోంది. బాధ్యతారహితంగా, పరిణామాల్ని ఆలోచించకుండా వ్యవహరించడం వల్ల ప్రజలకు జరుగుతున్న హాని ఒకవైపూ, పార్టీలో జరుగుతున్న తప్పుల విషయంలో నిజాయితీగా తమ బాధ్యతను పైనుండి ఒప్పుకోవడం కాక తమకన్నా కింది కమిటీలపైకి నెట్టేసే ధోరణి మరోవైపు కొంత మేరకు ఉంటూనే ఉన్నాయనేది చేదు వాస్తవం. ఈ రెండు విషయాల్నీ మనం సీరియస్‌గా సరిదిద్దుకోవడం ద్వారానే అసలైన అర్థంలో జవాబుదారీతనాన్ని మనం నెలకొల్పగలం. ఇది చేయకుండా కేవలం క్షమాపణలు చెప్తూ పోవడం ఒక దశ తర్వాత దాని ప్రభావాన్ని కోల్పోతుంది.

### శ్రమను గౌరవించడం

బూర్జువా, భూస్వామ్య సంస్కృతికీ ఆ మాటకొస్తే వర్గ సమాజాల్లోని సంస్కృతికీ, కమ్యూనిస్టు సంస్కృతికీ ఉన్న ముఖ్యమైన తేడాల్లో ఒకటి శ్రమ పట్లా, శ్రమించే వారి పట్లా వైఖరిలో ఉండే తేడా. మొత్తంగానే వర్గ సమాజాల్లో శారీరక శ్రమను చిన్నచూపు చూస్తారు. దోపిడీ వర్గాలూ, ఆ భావజాలం ప్రభావంలో ఉండే ఇతర వర్గాల ప్రజలూ, మన దేశానికి సంబంధించి ప్రత్యేకంగా అగ్రవర్ణాలవారూ శ్రమనూ, శ్రామికులనూ హీనంగా చూస్తారు. అందుకని శ్రామికులను కూడా అగౌరవంగా, అవమానకరంగా చూడడం ఉంటుంది. వర్గ సమాజం తన దోపిడీని నిరాటంకంగా, సాధ్యమైనంత ఎక్కువగా కొనసాగించడానికి భావజాల రంగంలో వీటిని పెంచి పోషిస్తుంది. శ్రామికులు తమంతట తామే తాము తక్కువవారమని అనుకునేలా, తమ విధి అగ్ర వర్గాలకూ, అగ్రవర్ణాలకూ సేవ చేయడమే అని భావించుకునేలా చేస్తుంది. సోషలిస్టు సంస్కృతిలో ఉత్పత్తిలో పాల్గొనడం, శ్రామికులను గౌరవించడం ప్రధాన అంశంగా ఉంటుంది. ఉత్పత్తిలో పాల్గొనడానికీ, శ్రమను గౌరవించడానికీ దగ్గర సంబంధం ఉంది. సోషలిస్టు సంస్కృతిలో శ్రమ చేయడం జీవన విధానంగా ఉంటుంది. కొందరు శ్రమ చేస్తే కొందరు వారి శ్రమపై ఆధారపడి పరాన్నభుక్కులుగా ఉండడం జరగదు. ఆ సమాజంలో శ్రామికులు ఆత్మగౌరవంతో, శ్రమైక జీవన సౌందర్యంతో ప్రకాశిస్తూ ఉంటారు.

ఇక సోషలిస్టు సమాజంలోనూ మనం పరిష్కరించాల్సిన ముఖ్యమైన వైరుధ్యాల్లో ఒకటి శారీరక శ్రమకూ, మానసిక శ్రమకూ మధ్య వైరుధ్యం. ఇది ఉత్పత్తిలోని అన్ని రంగాల్లోనూ, సామాజిక కార్యాచరణకి సంబంధించిన అనేక పనుల్లోనూ ప్రతిబింబిస్తుంది. మన దేశంలో కులవ్యవస్థతో కూడా ముడిపడి ఉన్న సమస్యగా ఇది చాలాకాలం కొనసాగుతుంది అని మనం దృష్టిలో ఉంచుకోవాలి. అలాగే కుటుంబంలో స్త్రీ పురుషుల మధ్య పని విభజనలో కూడా ఈ వైరుధ్యం ప్రతిబింబిస్తూ ఉంటుంది. కమ్యూనిజంలోకి ప్రవేశించడానికి తప్పకుండా మానసిక శ్రమకూ, శారీరక శ్రమకూ మధ్యగల వైరుధ్యాన్ని పరిష్కరించాల్సి ఉంటుంది. ఈ విషయం పట్ల చైతన్యం గల కమ్యూనిస్టులుగా మనం మొదటినుండే దీని విషయంలో శ్రద్ధ వహిస్తూ పార్టీలో, సైన్యంలో, ప్రజల్లో ఈ రెంటికీ మధ్య ఉన్న తేడాను తగ్గించడానికి ప్రత్యేక శ్రద్ధతో ప్రయత్నిస్తున్నాం.

సైనిక జీవితమే ప్రధాన భాగంగా ఉన్న ప్రస్తుత స్థితిలో, యుద్ధంలో మునిగి ఉన్న స్థితిలో ఈ తేడాలు కొట్టొచ్చినట్టు కనబడే అవకాశం కొంత తక్కువ. అయినప్పటికీ మన దేశంలో ఉండే అసమానాభివృద్ధి వల్ల నైపుణ్యాల్లో గల తేడాలు, విప్లవావసరాల రీత్యా అనివార్యంగా చేపట్టాల్సిన పనులూ, బాధ్యతలూ, వాటి ఒత్తిడీ ఈ వైరుధ్యం తలెత్తడానికి గల భౌతిక పునాదిగా నేడు పార్టీలోనూ, సైన్యంలోనూ కొనసాగుతోంది. బూర్జువా సమానత్వం పేరుతో అందరూ అన్ని పనులూ చేయాలనేది యాంత్రికంగా అమలు చేయాల్సిన అవసరం లేదు (మన సంస్కృతిలో అలా చేయకపోవడం ఒక అంశం కూడా) గానీ కమ్యూనిస్టు చైతన్యంతో తమ శక్తినంతటినీ వెలికి తీసి శ్రమించడం అనేదాన్ని మనం మరింతగా అమలులో పెట్టాల్సిన అవసరం అయితే నేడు ఉన్నది. పీడిత వర్గాల, కులాల, స్త్రీల నైపుణ్యాల్ని ప్రత్యేక శ్రద్ధతో పెంచుతూ మానసిక శ్రమలోనూ వారి భాగాన్ని పెంచడం అనేది ఈ వైరుధ్య పరిష్కారానికి ముఖ్యమైన ముందు షరతుగా ఉంటుంది. ఈ పని చేయకుండా మనం ఎంత కృషి చేసినా అది పాక్షిక ఫలితాల్నే అందిస్తుంది.

### ప్రజలకు సేవ చేయడం

ప్రజలకు సేవ చేయడం అనేదాన్ని మనం చాలా విస్తృతమైన అర్థంలో వాడతాం. దానికున్న మొదటి, ప్రధానమైన అర్థం ప్రజలే చరిత్ర నిర్మాతలు అనే సూత్రంతో ముడిపడి ఉన్నది. కమ్యూనిస్టుల్ని అగ్రగాములు అని అంటారు. అంటే ప్రజల్ని ముందుండి నడిపించేవారు, నిర్దిష్ట పరిస్థితుల నిర్దిష్ట అధ్యయనం ద్వారా ముందుచూపుతో జరగబోయే పరిణామాల్ని శాస్త్రీయంగా అంచనా వేసి, దానికనుగుణమైన కార్యక్రమాన్ని రూపొందించేవారు, దానిని ఆచరణ రూపంలోకి తేవడానికి నాయకత్వం వహించేవారు అని చెప్పుకోవచ్చు. అతి తక్కువ నష్టాలతో, సాధ్యమైనంత తక్కువ సమయంలో దాన్ని సాధించడం అనేది అగ్రగాముల కర్తవ్యంగా ఉంటుంది. మరి ఇంత ప్రముఖ పాత్ర వహించే కమ్యూనిస్టులు లేదా మరో మాటలో వీరులే చరిత్ర నిర్మాతలు అవ్వరా? ఇటీవల కొందరు తాత్విక స్థాయిలోనే వీరులే చరిత్ర నిర్మాతలు అనే సూత్రాన్ని ప్రచారం చేస్తున్నారు కూడా. ఇందుకోసం వారు చరిత్రలో గొప్ప పాత్ర వహించిన కొందరు వ్యక్తుల్నీ, సైంటిస్టుల్నీ ఉదహరించి వారి వల్లనే మార్పు వచ్చింది అని వాదిస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీ ఈ వాదనల్ని తిరస్కరిస్తుంది. అది ప్రజలకు విప్లవ చైతన్యాన్ని అందించి చారిత్రకంగా వారి పాత్రను వారు గుర్తెరిగి దాన్ని నిర్వర్తించేలా చేస్తుంది. ప్రజలకు సేవ చేయడం అనేదానికున్న ప్రధానమైన అర్థం ఇది.

ఇక దానికున్న విస్తృతమైన అర్థంలో పార్టీ, ముఖ్యంగా ప్రజాసైన్యం ప్రజలకుండే వివిధ అవసరాలను పట్టించుకుని తీర్చడం అనేది కూడా ఉంటుంది. ఉత్పత్తిలో సహాయం చేయడం, ప్రకృతి వైపరీత్యాలు, ఇతర ప్రమాదాల సమయంలో సహాయం చేయడం, వైద్య సహాయం చేయడం, గ్రామాల్లో చెత్తాచెదారం తొలగించి శుభ్రం చేయడం, ఏమైనా రిపేర్లు ఉంటే చేసి పెట్టడం మొదలైన అనేక రూపాల్లో ఈ సేవను రోజువారీగా మన ప్రజాసైన్యం కొనసాగిస్తుంది. సమాజంలో బలహీనులుగా ఉండేవారందరి పట్ల అంటే ముసలివారు, స్త్రీలు-పిల్లలు, రోగులు, బాలెంతలు, శారీరక, మానసిక రుగ్మతలు గలవారు ఇంకా ఇతరత్రా బలహీనులైన వారి పట్ల మరింత అక్కరను, మానవతను చూపడం అనేది కూడా ప్రజాసైన్యం సంస్కృతిలో, నూతన ప్రజాస్వామిక సమాజంలో ఒక ముఖ్యమైన అంశంగా ఉంటుంది. ఈ చైతన్యాన్ని మనం ప్రజల సంస్కృతిలో భాగం చేస్తాం. వర్గ సమాజ భావజాలం వల్ల ఇటువంటి వారి పట్ల వివక్ష, అనాదరణ, నిర్లక్ష్యం మన వర్గ ప్రజల నుండి కూడా జరుగుతూ ఉంటుంది. పార్టీ, ప్రజాసైన్యం తమ ఆచరణ ద్వారా, ప్రజలను విద్యావంతుల్ని చేయడం ద్వారా దీనిని తొలగించే ప్రయత్నం చేస్తాయి. బలహీనుల పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించే సంస్కృతిని పెంపొందించడం ద్వారా విశాల సెక్షన్ల ప్రజల విశ్వాసాన్నీ, ఆదరణనూ ప్రజాసైన్యం సంపాదించుకుంటుంది.

చైనా లాంగ్‌మార్చ్ కథల్లోని ఒక కథలో ఒకతను సరిహద్దు ప్రాంతంలో రక్షణ ఏర్పాట్లు ఎలా ఉన్నాయో చూడాలనుకుంటాడు. అక్కడి ఎర్రసైన్యం కమాండర్‌తో అతను తిరుగుతాడు. ఎంతసేపు తిరిగినా అతనికి ప్రజలతో గల సన్నిహిత సంబంధాలు, అతను వాళ్ల అవసరాలు గుర్తుపెట్టుకుని (కళ్లద్దాలు తెచ్చివ్వడం వంటివి) వాటిని తీర్చడం వంటివి కనిపిస్తాయే తప్ప పెద్ద రక్షణ కవచాల నిర్మాణాలేవీ కనిపించవు. క్రమంగా అతనికి ప్రజలతో గల ఈ సన్నిహిత సంబంధాల్లోనే, వారితో ఎర్రసైన్యం పెనవేసుకు పోవడంలోనే అసలైన రక్షణ ఇమిడి ఉందని అర్థమవుతుంది. అలాగని రక్షణ ఏర్పాట్లు చేసుకోరని కాదు, ప్రజలు నిర్ణయాత్మకమైన అంశం అనేదే ఇక్కడ మనం గమనించాల్సింది. మన అనుభవంలోనూ ఇది పదే పదే రుజువైన విషయమే. కాబట్టి ప్రజల చైతన్యం పెంచడం, ప్రజల అవసరాల పట్ల శ్రద్ధను కలిగి ఉండడం అనే రూపంలో ప్రజలకు సేవ చేయడం కమ్యూనిస్టు సంస్కృతిలో ఒక ముఖ్యమైన అంశంగా ఉంటుంది.

మన ప్రజాసైన్యం మొదటి నుండి కూడా ఈ విషయంలో రష్యా, చైనా ఎర్రసైన్యాల్ని ఆదర్శంగా తీసుకుంటూ, వారి ఒరవడిలోనే ప్రజలకు సేవ చేయడాన్ని తన జీవితంలో భాగం చేసుకున్నది. అయితే కొన్ని చోట్ల, కొన్ని సార్లు మనలోని సెక్టేరియన్ ధోరణి వల్ల ప్రజలతో సంబంధాలు దెబ్బ తినడం జరుగుతోంది. ప్రజలకు సేవ చేయడం అనేది మరుగున పడి ప్రజలపై పెత్తనం చేయడం జరుగుతోంది. ఇలాంటివి జరిగినప్పుడల్లా మన ఉద్యమం ఆ మేరకు దెబ్బ తినడం అనివార్యమే. ఒక విధంగా చెప్పాలంటే నక్సల్బరీ నుండి ఇప్పటివరకూ కూడా మనం పొందిన తాత్కాలిక ఓటములన్నిటికీ మనలోని సెక్టేరియన్ ధోరణి పూసలో దారంలా ఒక ముఖ్యమైన కారణంగా కనబడుతుంది. గెలుపు ఓటములను నిర్ణయించడంలో దీనికి కీలక పాత్ర ఉన్నది అని గుర్తిస్తూ అనేక డజన్ల రూపాల్లో మనలో వ్యక్తం అవుతున్న సెక్టేరియన్ ధోరణుల్ని వదిలించుకోవడానికి మనం కృషి చేయడం ప్రజలకు సేవ చేయడం అనే సంస్కృతిని కామ్రేడ్ మావో చెప్పిన అర్థంలో నెలకొల్పడం అత్యంత ఆవశ్యకం.

## స్త్రీ పురుష సంబంధాల్లో నూతన సంస్కృతి

స్త్రీ పురుష సంబంధాల విషయంలో నూతన సంస్కృతిని నెలకొల్పడం కూడా మనం చేస్తున్న కృషిలో ఒక ప్రముఖమైన భాగంగా ఉన్నది. ఇది లేకుండా మహిళలు ఇంత పెద్ద ఎత్తున విప్లవోద్యమంలో భాగం కావడం అంత సులభమయ్యేది కాదు. ఈ విషయంలో మన ప్రధాన దాడి దిశ పితృస్వామిక సంస్కృతిపై ఉంటోంది, ఉండాలి కూడా.

సమానత్వం : మొదటగా స్త్రీలు పురుషులకన్నా తక్కువవారు అనే భావనను మనం తీవ్రంగా ఎదుర్కొన్నాం. స్త్రీ పురుష సమానత్వ భావనను గ్రామాల్లోనూ, పార్టీలోనూ, సైన్యంలోనూ, ప్రజాధికార అంగాల్లోనూ, విప్లవ ప్రజాసంఘాల్లోనూ, ఒక్క మాటలో అంతటా నెలకొల్పే ప్రయత్నం మనం సీరియస్‌గా చేశాం. స్త్రీ పురుష సమానత్వాన్ని విస్తృతంగా ప్రచారం చేసి ఆచరణలో రుజువు చేశాం. ఉద్యమ ప్రాంతాల్లో స్త్రీ పురుష వివక్షను కొంతవరకూ తగ్గించగలిగాం. పితృస్వామ్యంలో భాగమైన స్త్రీల అణచివేత, వివక్ష అనే అంశాల్ని మనం బలంగా ఎదుర్కొని విజయం సాధించాం. ఇది స్త్రీలకు స్వేచ్ఛను కల్పించి వారిలోని సృజనాత్మకత మరింతగా వెల్లివిరియడానికీ, వారు మరింతగా ప్రజాయుద్ధంలో భాగం కావడానికీ దారి తీసింది.

స్త్రీలపై పురుష పెత్తనం తొలగింపు : భూస్వామ్య సమాజంలో స్త్రీలపై పురుషుడు కొట్టడం, తిట్టడం, వేధించడం, అనుమానించడం వంటి అనేక రూపాల్లో దౌర్జన్యాన్ని కొనసాగిస్తుంటాడు. విప్లవోద్యమంలో వీటి వేటికీ తావు లేదు. స్త్రీని తన తోటి విప్లవకారిణిగా, వ్యక్తిత్వం గల కామ్రేడ్‌గా అతను గౌరవించాల్సి ఉంటుంది. గ్రామాలలోనూ స్త్రీలపై పురుషుల దౌర్జన్యాన్ని, అది భర్త కావచ్చు, కుటుంబ సభ్యులు కావచ్చు, పెత్తందార్లు, పెద్దలు కావచ్చు, విప్లవోద్యమం అంతం చేయడానికి తీవ్రంగా కృషి చేసింది. స్త్రీలకు గట్టి అండగా నిలిచింది.

నాయకత్వ స్థానంలో స్త్రీలు : మరొక ముఖ్యమైన మార్పు స్త్రీలు పురుషులతో సమాన స్థాయిలో అన్ని రంగాల్లోనూ పాలుపంచుకోవడం. నేడు విప్లవోద్యమ ప్రాంతాల్లో ఇది ఎంత సాధారణ దృశ్యం అయిపోయిందంటే ఒకప్పుడు మరో విధంగా ఉండిందనీ, స్త్రీలకు అనేక రకాల కట్టుబాట్లు ఉండేవనీ నూతన తరానికి ప్రత్యేకంగా చెప్పాల్సిన స్థితి ఉన్నది. స్త్రీలు అంతటా నాయకత్వ స్థానాల్లో ఉండడాన్ని ఒక సగటు విషయంగా చూడడానికి ప్రజలు అలవాటు పడ్డారు. ముఖ్యంగా రాజకీయ నాయకులుగా స్త్రీలు గొప్ప ప్రజామోదాన్ని పొందారు.

ప్రజాస్వామికంగా పెళ్లిళ్లు : పెళ్లి విషయంలో పరస్పరం ఇష్టపడ్డం, ఎంచుకోవడం అనేది నెలకొన్నది. బలవంతపు పెళ్లిళ్లకు

కాలం చెల్లింది. గతంలో తల్లిదండ్రుల పెత్తనం ప్రధానంగా ఉండేది. సమాజంలోని అనేక అంశాలు అంటే కులం, మతం, వర్గం, కుటుంబ చరిత్ర వంటి అనేక అంశాలు ఆధారంగా జరిగే పెళ్లి ఇద్దరు స్వతంత్ర వ్యక్తుల మధ్య సంబంధంగా కాక రెండు కుటుంబాల మధ్య సంబంధంగా ఉండేది. ఇప్పుడు అది మారింది. ఈ పెళ్లిళ్లు నూతన సామాజిక సంబంధాలకూ, నూతన సంస్కృతికీ ప్రతిబింబంగా ఉంటాయి. పెళ్లి ఖర్చులు తగ్గించుకుని సాదాసీదాగా పెళ్లిళ్లు చేసుకోవడం, పూజారుల, ఆదివాసీ ప్రాంతాల్లో పటేళ్ల ప్రమేయాన్ని లేకుండా చేయడం వంటి నూతన అంశాలు కూడా ఇందులో నెలకొన్నాయి. ఇక పార్టీలో, ప్రజాసైన్యంలో అయితే పెళ్లిళ్లు మరింత సాదాసీదాగా ఒక సభ రూపంలో జరుగుతున్నాయి.

విప్లవోద్యమంలో అమరత్వం అనేది సాధారణ దృశ్యమైంది. అమరుల సంఖ్య వేలల్లోకి చేరింది, రేపది లక్షల్లోకి కూడా చేరుతుంది. ఎంతోమంది కామ్రేడ్స్ తమ జీవన సహచరులను కోల్పోతున్నారు. మన సమాజంలో పురుషులు మళ్లీ పెళ్లిళ్లు చేసుకోవడం అనేది మామూలే. కానీ స్త్రీలు మళ్లీ పెళ్లి చేసుకోవడం విషయంలో అనేక ఆటంకాలు ఉన్నాయి. నేడు విప్లవోద్యమం ఈ అడ్డంకులన్నిటినీ తొలగించింది. ఒకోసారి చాలా చిన్న వయసులోనే, పెళ్లయిన కొద్ది కాలానికే సహచరుల్ని కోల్పోవడం అనేది కూడా జరుగుతోంది, అంతే కాక మళ్లీ పెళ్లి చేసుకున్నాక ఆ సహచరుల్ని కూడా కోల్పోవడం జరుగుతోంది. కొన్ని సందర్భాల్లో తమ కళ్ల ముందే శత్రువుతో పోరాడుతూ సహచరులు అమరులు కావడం కూడా జరుగుతోంది. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏంటంటే వ్యక్తిగతంగా సహచరుల్ని కోల్పోవడం ఎంత బాధాకరమైనప్పటికీ వారి సహచర కామ్రేడ్స్ ఆ బాధను కసిగా మలుచుకుని మరింత దృఢదీక్షతో విప్లవంలో కొనసాగుతున్నారు. ప్రజాయుద్ధంలో పెంపొందుతున్న మరొక నూతన అంశం ఇది. భూస్వామ్య సమాజంలో సహచరుడిని కోల్పోవడం అంటే ఒక స్త్రీ జీవితంలో అనేక అంశాలకు అది ఒక అంతంగా ఉంటుంది. కానీ విప్లవోద్యమంలో స్త్రీ తన రాజకీయ జీవితాన్ని మునుపటిలాగానే జీవించే పరిస్థితులు ఉన్నాయి.

వివక్షపూర్వకమైన, అవమానకరమైన భాష తొలగింపు : భూస్వామ్య సంస్కృతి స్త్రీల విషయంలో వివక్షాపూర్వకమైన, అవమానకరమైన భాషనూ, తిట్లనూ ఉపయోగిస్తుంది. బూర్జువా సంస్కృతి కూడా ఈ నేరానికి అతీతమైనది కాదు. విప్లవోద్యమం అలాంటి అవమానకరమైన, వివక్షాపూరితమైన పదాలను తొలగించింది. పార్టీలోనూ, ప్రజాసైన్యంలోనూ, విప్లవ ప్రజాసంఘాలలోనూ స్త్రీలను ప్రధానంగా ఉద్దేశించే తిట్లన్నిటిపై నిషేధం విధించింది. అయితే విశాల ప్రజానీకంలో ఈ సాంస్కృతిక అంశాన్ని మరింతగా పెంపొందించాల్సిన అవసరం ఉంది. అందుకోసం కృషి కొనసాగుతోంది.

మనం చేసిన ఈ పాజిటివ్ కృషి మహిళా విముక్తికి ఎంతగానో దోహదం చేస్తున్న అంశమే అయినప్పటికీ ఈ విషయంలో మనం చేరుకోవాల్సిన గమ్యాలు చాలానే ఉన్నాయి అనేది గుర్తించాలి. మనం పార్టీలో పై నుండి కింది వరకూ చేపట్టిన పితృస్వామ్య వ్యతిరేక దిద్దుబాటు ఉద్యమంలో సరిదిద్దుకోవాల్సిన విషయాల్ని విస్తృతంగానే తడిమాం. పితృస్వామిక భావజాలంతో పోరాటం ఒక రోజులో, కొన్ని సంవత్సరాలలోనే పూర్తయిపోయేది కాదు. వేల సంవత్సరాల వారసత్వంగా నరనరానా జీర్ణించుకున్న భావజాలాన్ని బద్దలు కొట్టడం ఒకటి, రెండు తరాల్లో సాధ్యం కాదు కదా, అదసలు కమ్యూనిజం వరకు కూడా ఉండే పోరాటమనే మనం చెప్తున్నాం. ఇప్పటివరకూ వచ్చిన మార్పులు కూడా పితృస్వామ్య సంస్కృతి పై ప్రధానంగా స్త్రీలు, వారికి ప్రోత్సాహంగానూ, స్వయంగానూ పార్టీ నాయకత్వం చేసిన కృషి వల్లనే జరిగింది. తమ విముక్తి కోసం స్త్రీలు విప్లవంలో భాగం కావడం అనివార్యంగా జరిగే పరిణామం. దానికి చైతన్యవంతంగా పితృస్వామ్య సంస్కృతిపై పోరాడ్డం అనే అంశం ద్వారా విస్తృతినీ, లోతునీ కలిగించాల్సిన బాధ్యత కమ్యూనిస్టులదే. పితృస్వామ్య సంస్కృతిపై పోరాడటాన్ని తనలో అవిభాజ్యమైన అంశంగా కలిగి ఉండని సంస్కృతిని మనం కమ్యూనిస్టు సంస్కృతి అననే అనలేం. అంత కీలకమైన అంశం ఇది.

**నైతిక విలువలు**

కమ్యూనిస్టు నైతికత అనేది మన సంస్కృతికి ఆయువు పట్టులాంటిది. ముఖ్యంగా కమ్యూనిస్టులు ప్రపంచవ్యాప్తంగా కూడా అత్యున్నతమైన నైతిక విలువలకు ప్రతీకలుగా నిలిచారు. కమ్యూనిస్టులను నైతిక విలువల నుండి విడదీసి చూడడం అనేది అసహజమైన విషయంగా పరిగణిస్తుంది సమాజం. అందుకనే అది బూర్జువా, భూస్వామ్య, రివిజనిస్టుల నుండి ఆశించని నైతిక విలువల్ని కమ్యూనిస్టులనుండి ఆశిస్తుంది. మన దేశ నిర్దిష్టతలో మావోయిస్టుల నుండి ఆశిస్తుంది. దానికి కారణం ఈ విషయంలో ప్రపంచవ్యాప్తంగానూ, మన దేశ విప్లవ చరిత్రలోనూ ఎందరో గొప్ప వీరులు, త్యాగధనులు నెలకొల్పి మనకిచ్చి పోయిన అత్యున్నత నైతిక విలువల వారసత్వమే. ఆ వారసత్వాన్ని సమున్నతంగా ఎత్తిపడుతూ, సమాజ విప్లవాత్మక పురోగమనానికి దోహదపడే, దానికి అనుగుణంగా ఉండే నైతిక విలువల్ని పెంపొందించాల్సిన బాధ్యత ప్రతి తరం కమ్యూనిస్టుల మీదా ఉంటుంది.

నైతిక విలువలు అనేవి మన సంస్కృతిలో కేంద్ర స్థానంలో ఉంటాయి. ఒక విధంగా చెప్పాలంటే మన రోజువారీ జీవితం వాటి చుట్టూనే అల్లుకుని ముందుకు పోతూ ఉంటుంది, ఎందుకంటే మన ప్రతి అడుగులో వాటిని మనం పాటించాల్సి ఉంటుంది, ప్రజలు మనల్నీ, శత్రువునూ వేరు చేసి చూడడంలో ఇవి కూడా ఒక కీలకమైన పాత్ర వహిస్తాయి. ముఖ్యంగా పతన, అరాచక ధోరణులు పెచ్చరిల్లిపోతున్న సామ్రాజ్యవాద యుగంలో, రోజు రోజుకూ నైతిక విలువలే మృగ్యమైపోతున్న స్థితిలో ఇప్పటికీ అత్యున్నతమైన విలువల కోసం నిలబడి, వాటి కోసం ఎన్నో వ్యక్తిగతమైన త్యాగాల్ని చేసే కమ్యూనిస్టుల పట్ల సమాజం వినమ్రంగా ఉంటుంది. మన రాజకీయాలకూ, మన నైతిక విలువలకూ చాలా అవినాభావ సంబంధం ఉన్నదని మనం చెప్పినప్పటికీ ఒకోసారి మన రాజకీయాలతో విభేదించే వాళ్లు కూడా మన నైతిక ప్రమాణాలను ఎత్తిపడుతూ, వాటి పట్ల గౌరవాన్ని

ప్రదర్శిస్తూ ఉంటారు. చేసినది చెప్పడం, చెప్పినది చేయడం ద్వారా ప్రజలకు రహస్య పార్టీ అయినప్పటికీ మన మీదనే నమ్మకం ఉంటుంది తప్ప దినమంతా హోరెత్తించే బూర్జువాల ప్రచారం మీద ఉండదు. అంటే ఈ విలువలకు విప్లవోద్యమంలో ఎంత ప్రాముఖ్యత ఉందో అర్థం చేసుకోవచ్చు.

కాబట్టి వీటిని కమ్యూనిస్టు చేతనతో మనం పాటించడం ద్వారానే ప్రజల్లో నిజమైన విప్లవ పార్టీగా మనం గుర్తింపు పొందుతాం. నైతిక విలువలు సామాజిక వ్యవస్థతో సంబంధం కలిగి ఉన్నవే. బానిస సమాజంలోని నైతిక విలువలు భూస్వామ్య సమాజంలో మారతాయి. ప్రతీ వర్గ సమాజానికీ దాని ఉపరితలాంశంలో దాని నైతిక విలువలు ఉంటాయి. అయితే వర్గాలనే రద్దు చేయాలనుకునే కమ్యూనిస్టుల నైతిక విలువలకూ, వర్గ దోపిడీని నిలిపి ఉంచాలనుకునే వివిధ వర్గ సమాజాల నైతిక విలువలకూ మౌలికంగానే తేడా ఉంటుంది. కమ్యూనిస్టుల నైతిక విలువలు దోపిడీకీ, అణచివేతకూ, వివక్షకూ, పెత్తనానికీ, అభివృద్ధి నిరోధకత్వానికీ వ్యతిరేకంగా పీడిత ప్రజల ప్రయోజనాల్ని అంటిపెట్టుకుని సత్యానికీ, న్యాయానికీ, ప్రజాస్వామ్యానికీ, నిజాయితీకీ, బాధ్యతకూ, బలహీనుల రక్షణకూ ప్రతీకలుగా ఉంటాయి.

నైతిక విలువలు అంటే కొంతమంది కేవలం స్త్రీ పురుష సంబంధాలకు సంబంధించిన అంశంగానే చూస్తారు కానీ అది సరి కాదు. మొత్తంగా మన జీవితంలో మనం పాటించే ప్రమాణాలన్నీ నైతిక విలువల కిందకే వస్తాయి. ఉదాహరణకు సాదాసీదా జీవనం, దుబారా చేయకపోవడం, ప్రజల నుండి వసూలు చేసిన ప్రతి పైసాకు బాధ్యత వహించడం వంటివన్నీ డబ్బు విషయంలో కమ్యూనిస్టులు పాటించే నైతిక విలువల్లో కొన్ని. స్త్రీ పురుష సంబంధాల విషయంలోనూ పార్టీ ఈ విషయంలో కమ్యూనిస్టు మహోపాధ్యాయులు అందించిన మౌలిక అవగాహన వెలుగులో ఇక్కడి నిర్దిష్ట పరిస్థితులకు దానిని అన్వయిస్తూ అనేక సర్క్యులర్ల ద్వారా అనేక నియమ నిబంధనలను రూపొందించింది. ఇవన్నీ ఆనాటికి ప్రజలకున్న సామాజిక స్థాయి, సాంస్కృతిక స్థాయిలను దృష్టిలో ఉంచుకుని కూడా మనం రూపొందిస్తాం. ఈ విషయంలో మనం ప్రజల తోక పట్టుకుని పోవడం ఉండదు. అలాగే ప్రజలకు ఆమోదం కాని విషయాలనూ మనం ఆచరించకుండా జాగ్రత్త పడుతాం.

సాదా జీవనం, అబద్ధాలాడకపోవడం వంటి అనేక మోసపూరితమైన గాంధీ మార్కు నైతిక విలువలను విపరీతంగా ప్రచారంలో పెట్టాయి పాలకవర్గాలు. కానీ ఇవన్నీ పై పై మెరుగులే తప్ప వాస్తవంలో గాంధీ చేసినదంతా దళారీ బూర్జువావర్గానికీ, భూస్వాములకూ, సామ్రాజ్యవాదులకూ పాదసేవే. అందుకనే నైతిక విలువలను వర్గ ప్రయోజనాల నుండి విడదీసి వాటికవిగా గొప్ప విషయాలుగా చూపే బూర్జువా ధోరణులను కూడా మనం ఎండగట్టాలి. నైతిక విలువలు అనేవి పీడిత ప్రజల ప్రయోజనాలను కాపాడినప్పుడే అవి నిజమైన నైతిక విలువలు అనేది మనం ప్రతి సందర్భంలోనూ ప్రచారంలో పెట్టాలి. ఉదాహరణకు, రహస్య పార్టీగా మనం శత్రువు నుండి పార్టీని రక్షించుకోవడం కోసం కొన్ని వాస్తవాల్నీ, రహస్యాల్నీ బహిరంగంగా వెల్లడించం. ఇది తప్పు కాదు, కానీ అదే మనం ఏదైనా తప్పు చేస్తే ఆ విషయంలో మనం ప్రజల వద్ద దాచడం గానీ, అబద్ధాలు చెప్పడం కానీ జరగదు, కచ్చితంగా వారి వద్ద నిజాయితీగా నిజాన్ని వెల్లడిస్తాం. సరిదిద్దుకోవడానికి తీవ్రంగా కృషి చేస్తాం, సరిదిద్దుకుంటాం. ఇలా అనేక విషయాల్లో బూర్జువా, భూస్వామ్య నైతిక విలువలకూ మన విలువలకూ ఉండే మౌలికమైన తేడాల్ని మనం ప్రజలకు అర్థం చేయించాలి.

నేడు నలభై ఏళ్లకు పైగా కొనసాగుతున్న మన ఆచరణ వల్ల ప్రజలు విప్లవకారులు పాటించే నైతిక విలువల విషయంలో చాలా స్పష్టంగానే ఉంటున్నారు. పాలకవర్గాలు ఊదరగొట్టే బూటకపు విలువల్ని వారు మన నుండి ఆశించడం లేదు. అలాగే మనం వాస్తవంగా పాటించాల్సిన నైతిక విలువల్ని పాటించనప్పుడు వారు మనల్ని సరిగానే నిలదీస్తున్నారు. ఇది మనం సాధించిన ఒక విజయంగా మనం పేర్కొనవచ్చు. పార్టీ సుదీర్ఘకాలం నుండి కొనసాగించిన కృషి వల్లా, అనేక మంది కామ్రేడ్స్ చేసిన త్యాగాల వల్ల, కమ్యూనిస్టులు పాటించే నైతిక ప్రమాణాల విషయంలో నేడు సమాజం అంతటా ఒక పాజిటివ్ ప్రభావాన్ని మనం వేయగలిగాం అనేది ఒక వాస్తవం. అదే సమయంలో బైటి సమాజం ప్రభావంతోనూ, మనం అందించే రాజకీయ, సైద్ధాంతిక విద్యలో గల లోపాల వల్లనూ ఈ విషయంలోనూ కొన్నిచోట్ల చాలా సమస్యలే వస్తున్నాయి. లంపెనైజేషన్ ప్రభావం బాగానే పడుతోంది. దీనిని శత్రువు సమర్థవంతంగా ఉపయోగించుకుని పార్టీకి నష్టం చేయడం, పార్టీని బద్‌నాం చేయడం జరుగుతోంది. కనుక ఎప్పటికప్పుడు ఈ విషయంలో జరుగుతున్న తప్పుల్ని పార్టీ గమనించుకుంటూ సభ్యులందరినీ మెరుగుపర్చుకోవడం ద్వారా, ఆదర్శంగా నిలవడం ద్వారా మనం సమాజంలో కూడా అత్యున్నతమైన విలువలను స్థాపించగల్గుతాం.

## నూతన సంస్కృతి నెలకొనే క్రమం

పార్టీలోనూ, ప్రజాసేనలోనూ, ప్రజల్లోనూ నూతన భావాలకూ, పాత భావాలకూ మధ్య ఎల్లప్పుడూ ఘర్షణ జరుగుతూ ఉంటుంది. ప్రజాస్వామిక, సోషలిస్టు సాంస్కృతిక అంశాలకూ పాత భావజాలం, అలవాట్లకూ మధ్య ఘర్షణ నిరంతరం జరుగుతూ ఉంటుంది. నూతన సంస్కృతి నెలకొనడం అనేది ఈ ఘర్షణ క్రమంలో పాతదాన్ని తొలగించుకుంటూ దాని స్థానంలో నూతన అంశాన్ని నెలకొల్పడం ద్వారా మాత్రమే జరుగుతుంది. వర్గపోరాటంలో జరిగే విప్లవాత్మక మార్పులను వెన్నంటి సాంస్కృతిక రంగంలోనూ అలాంటి మార్పు చోటు చేసుకుంటుంది. అది పరిస్థితికనుగుణంగా కొంత వెనుకగానైనా జరుగుతుంది. కానీ ఇది ఏ మాత్రం సాఫీగానో, సాదాసీదాగానో జరిగేది కాదు. ఎందుకంటే ఇది వర్గపోరాటంలో ముఖ్యమైన అంతర్భాగం. అది అంత తీవ్రంగానూ జరుగుతుంది. పార్టీలో కూడా అంతర్గత పోరాటం ద్వారానే నూతన సంస్కృతి అభివృద్ధి చెందుతుంది. ఇది

కూడా నిరంతర క్రమమే, గతితార్కిక నియమమే. ఈ విషయాన్ని గుర్తెరగడం వల్లనే పార్టీలో సంస్కృతి విషయంలోనూ విమర్శ-ఆత్మవిమర్శ, అవసరమైనప్పుడు దిద్దుబాటు ఉద్యమాలు, రెండు పంథాల మధ్య పోరాటాలు మొదలైనవాటిని కమ్యూనిస్టు పార్టీలు చేపడతాయి. ఇవి లేని పార్టీ నిలవనీటిలాగ మారిపోతుంది. నూతన ప్రజాస్వామిక విప్లవ విజయంతోనో, సోషలిజం నెలకొల్పడంతోనో ఇది పూర్తయిపోయింది అనుకోవడంకంటే పెద్ద పొరపాటు మరొకటి ఉండదు. కామ్రేడ్ మావో నాయకత్వాన జరిగిన మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం ప్రపంచానికి అందించిన అతి గొప్ప చేర్పు ఇది. నిజానికి ఈ రెండు పంథాల మధ్య, రెండు సంస్కృతుల మధ్య ఘర్షణ ఎంత నిరంతరమైనదంటే సాంస్కృతిక విప్లవం కూడా ఒకటే సరిపోదు, అనేక సాంస్కృతిక విప్లవాలు జరగాల్సి ఉంటుంది అని కూడా కామ్రేడ్ మావో అంటారు.

నూతన సంస్కృతి నెలకొనడానికి ఒక ముఖ్యమైన షరతు ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచడం. ముఖ్యంగా మన దేశంలాంటి వెనకబడిన, అసమానాభివృద్ధిగల దేశాల్లో నూతన సంస్కృతి నెలకొనడంలో ఇది చాలా కీలకమైన అంశంగా ఉంటుంది. ఎందుకంటే ఇక్కడ నిరక్షరాస్యత శాతం చాలా ఎక్కువ. అసమానాభివృద్ధి వల్ల కొన్ని ప్రాంతాలు మిగతా ప్రపంచానికి చాలా దూరంగా ఉండడం కూడా మనకు కనిపిస్తుంది. నేడు మన ఉద్యమం కూడా ఇటువంటి వెనుకబడిన ప్రాంతాల్లోనే ప్రధానంగా కేంద్రీకరింపబడి ఉంది అనే వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకున్నప్పుడు ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచడానికి మనం ఎంత పెద్దెత్తున కృషి చేయాలో అర్థమవుతుంది. ఇక్కడ మన ప్రజాయుద్ధానికి ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచే కృషి ఒక ముఖ్యమైన కర్తవ్యంగా ఉంటుంది. అది చేయకుండా నూతన సంస్కృతిని మనం నెలకొల్పడం కష్టమౌతుంది.. అక్షరాస్యతను పెంచడానికి క్యాంపెయిన్లు చేపట్టడం, వయోజన విద్యకై, పిల్లల చదువుకై పాఠశాలలు రెగ్యులర్‌గా నడపడం, ఈ పాఠశాలల కోసం ఒక్కో మెట్టుగా విద్యను అందించడం కోసం సిలబస్‌లు తయారు చేయడం అత్యంత ఆవశ్యకం. ప్రపంచవ్యాప్తంగా పాత భావజాలాన్ని కాలదన్నుతూ నూతన అంశాల్ని ప్రవేశపెట్టిన చరిత్రనూ, అది అన్ని రంగాల్లో వర్గపోరాటంలో భాగంగానే ఎలా జరిగింది, జరుగుతుంది అనే విషయాల్ని ప్రజలకు ఒక పద్ధతి ప్రకారం అందించాల్సి ఉంటుంది. ఆ నూతన అంశాలన్నిటినీ పరిచయం చేయాల్సి ఉంటుంది. వార్తా పత్రికలూ, వివిధ ప్రగతిశీల పత్రికలూ, సాహిత్యం, వేర్వేరు ప్రాంతాల, దేశాల సంస్కృతుల పరిచయం మొదలైనవన్నీ అందించాలి. వివిధ రకాల పత్రికలను మనం స్వయంగా నడపాలి. భాష, లిపి మొదలైన విషయాల్లో అభివృద్ధికరమైన అంశాల్ని వాటిలో పాటిస్తూ బోధించాలి. అనేక రకాల కృషి ద్వారా మనం మొత్తం ఒక సమూహంగా, సముదాయంగా మన వర్గపోరాట ప్రాంతాల్లోని ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచాలి.

మన సంస్కృతి శాస్త్రీయమైనదిగా ఉంటుంది. అది హేతుబద్ధంగా, ప్రకృతి చలన సూత్రాల అధ్యయనంపై ఆధారపడినదిగా ఉంటుంది. అందుకని శాస్త్రీయతను రోజువారీ జీవనంలో నెలకొల్పే కృషి అనేది నూతన సంస్కృతిని నెలకొల్పడానికి ఒక ముందు షరతుగా ఉంటుంది. మూఢనమ్మకాలను బహిర్గతపరచడం, అంటువ్యాధులను అరికట్టే చర్యలను తీసుకోవడం, శుచీ శుభ్రతలను పాటింపజేయడం, విజ్ఞాన శాస్త్రాల అధ్యయనాన్ని, ముఖ్యంగా భౌతిక శాస్త్ర అధ్యయనాన్ని పార్టీలో, ప్రజాసైన్యంలో, యువజనుల్లో, పిల్లల్లో, మొత్తంగా ప్రజల్లో విస్తృతంగా పెంపొందించడం చేయకుండా నూతన సంస్కృతిని నెలకొల్పడం అంత సులభం కాదు. కనుక ఈ కృషిని అనేక సృజనాత్మక రూపాల్లో కొనసాగించాలి. ఆధ్యాత్మిక భావవాద భావనలను ఎదుర్కొంటూ భౌతికవాద భావాలను పెంపొందించాలి. మానవ పరిణామ క్రమాన్నీ, సమాజ పరిణామ క్రమాన్నీ అర్థం చేసుకోవడానికి గతితార్కిక చారిత్రక భౌతికవాద సిద్ధాంతాన్ని బోధించాలి.

అన్ని రంగాల్లో ప్రజలు వర్గపోరాటంలో పాల్గొనడం అనేది కూడా నూతన సంస్కృతి నెలకొనడంలో ముఖ్యమైన అంశంగా ఉంటుంది. దీని ద్వారా ప్రజాయుద్ధమూ, నూతన సంస్కృతి సహా అన్ని రంగాల్లో అభివృద్ధి కూడా సాధ్యం అవుతాయి. ప్రజలూ, మిలీషియా ఎంత చురుగ్గా ప్రజాయుద్ధంలో పాల్గొంటే, అవి అంతగా అభివృద్ధి చెందుతాయి.



పాట/కవిత్వం

# ఉరిశిక్షల రద్దుకు కదలండి

-దప్పు రమేష్

ఉరిశిక్షల రద్దుకు కదలండి
ఓ బుద్ధిగల్ల మేధావుల్లారా
న్యాయం కోరే మనుషుల్లారా ॥ ఉరి ॥

1. ఏది బోయినా వస్తదిగానీ
ప్రాణం బోతే రాదని తెల్సిన
హంతకులూ మన పాలకులేసిన
ఉరి శిక్షల రద్దును కోరుతు...... హా!
మానవత్వమును మంచిని కోరేటీ - మాయన్నల్లార
ఉరిశిక్షల రద్దుకు కదలండీ - మాయక్కల్లార

2. జార్ఖండ్‌లో ప్రజాగాయకులు
జితేన్ మరాండి బృందంపైనా
తప్పుడు కేసులు బనాయించిమరి
ఉరి శిక్షలనూ ప్రకటించింద్రూ......హా!
ఆ కుట్ర కేసులా గుట్టువిప్పరండో - మాయన్నల్లార
ఆ ఉరి శిక్షల రద్దుకు కదలండో - మాయక్కల్లార

3. పేదల్లో నిరుపేద వాళ్ళురా
బీదల్లో కడు బీద వాళ్ళురా
చదువూ సంధ్యా లేని ళ్ళురా మూలవాసులూ
ఆదివాసులను.......హా!
అక్కడ కూడా బతక నివ్వ కుండా - మాయన్నల్లార
అంతర్యుద్ధం నడిపిస్తున్నారో - మాయక్కల్లార

4. రాంచీలోని బిర్సా ముండా
సెంట్రలు జైలులో వాళ్ళను బెట్టీ
రెండేళ్ళయినా బెయిలివకుండా
ఉరి శిక్షలను ప్రకటించింద్రూ.......హా!
మానవ హక్కులు మంటగల్పుతుంద్రో - మాయన్నల్లార
ప్రజాస్వామ్యమును పాతర బెడుతుంద్రో - మాయక్కల్లార

5. అసమానతలూ అన్యాయాలూ
దోపిడి పీడన లొద్దన్నందుకు
అడవిలో బుట్టిన అడవీ బిడ్డలూ
అడవి సంపద మాదన్నందుకు.........హా!
చిల్కారీయనె కుట్రకేసు బెట్టీ - మాయన్నల్లార
కళాకారులను ఉరి శిక్షేశింద్రో - మాయక్కల్లార

6. అడవి సంపదును కాజేస్తున్న
కంపెనీలక్కడ్డొస్తుంద్రని
మావోయిస్టులనే ముద్రను వేసీ
ఆదివాసులను చంపేస్తుంద్రు........హా!
బ్రిటిషోళ్ళను మించిపోయినారో - మన దేశ పాలకులు
నెత్తుటి మడుగులో ముంచేస్తున్నారో - మన బీదవాళ్ళనూ

7. శత్రుదేశాలతో యుద్ధం జేసే
భారత మిల్ట్రీ సైన్యాలన్నీ
గిరిజనులూ మన ఆదివాసులను
గ్రీను హంటుతో చంపేస్తున్నయ్
ఆదివాసులే శత్రువు లైట్లేరీ - మన పాలకులాకు
అడవి బిడ్డలే అడ్డెట్లాగయిరీ - మన దేశనేతలకు

8. సామ్రాజ్యదుల కంపెనీలకూ
భారత ప్రజలా సకల సంపదలు
పాలకులూ మన దేశనాయకులు,
అమ్మేస్తున్నరు, కాజేస్తున్నరు,
అన్యాయంబని అడుగుతున్నవాళ్ళా - మాయన్నల్లార
అణిచేస్తున్నరు అక్రమంగ మనలా - మాయక్కల్లార

9. భగత్సింగులా రామరాజులా
బిర్సాముండా, కొమురం భీముల,
వారసులూ మన కళాకారులూ,
అక్రమంగ బంధించబడ్డరూ
ఆ కళాకారులను విడిపించగ రండో - మాయన్నల్లార
ఆ ఉరి శిక్షలా రద్దుకు కదలండో - మాయక్కల్లార

# బహుముఖయుద్ధగాడు

- నాగేశ్వర్

ఈ నేల మీద జానెడు జాగలో మొలిచి
పిల్లలమర్రి అయి విస్తరించిన వనం అతడు
వరంగల్ ఆర్ ఇ సిలో వేసిన తొలి అడుగు మొదలు
మడమ తిప్పకుండా ముందుకే నడిచి
చదువుల శిఖరాగ్రాన నిలిచి
సైద్ధాంతిక చర్చల్లో శాస్త్రీయతకు బట్టకట్టి
ప్రతి మలుపులో వేలు చూపి తూర్పుకే నడిపించి
సాయు(ద్ధ)ధ రంగంలో హిమాలయమై ఎదిగి
అడివి అడివంతా
పచ్చగా నవ్విన పత్రహరితం అతడు
తాత్వికం సాహిత్యం సాయుధం
సకల రంగాల్లో అందెవేసిన చెయ్యతడు
బహుముఖ యుద్ధగాడు అతడు
వేకువ అలల్ని మోసే ఆకుపచ్చ సముద్రం అతడు
అతనిది జ్ఞాతమా! అజ్ఞాతమా!

సందేహమేమీ అక్కరలేదు
వలకి చిక్కనంత మాత్రాన
చేపది అజ్ఞాతవాసం కాదు
సముద్రమంతా అలలై తిరిగిన
అడుగుల సవ్వడతడు
వేటగాడి ఉచ్చుకి చిక్కినంత మాత్రాన
పులిది అజ్ఞాతవాసం కాదు
అడివంతా అమ్మఒడి అయి
కలయ తిరిగిన పాదమతడు
ఉత్తరదక్షిణ ధృవాలే కాదు
తూర్పు పశ్చిమ కనుమలూ
ప్రపంచం మీద వేసే వసంత మేఘ గర్జనల్లో
మెరిసి మురిసి వెలుగై
వేకువ పొడ చూపినవాడు
అజ్ఞాతవాసి ఎలా అవుతాడు?
పిడికిట్లో వెలుతురును పట్టుకుని
దేశం నలుమూలలా నాటుకుంటూ వెళ్ళినోడు
సూర్యుడుగాక మరేమవుతాడు
ఈ దేశ సంపద ఆకలి కడుపులో అన్నమై
ఉడకాలనే... అతడు కలగన్నది
అడవినీ ఆదివాసీ కడుపునీ
వేదాంత వేలుపెట్టి కెలకొద్దనే కదా
అతడు పాలికేకయ్యింది
మార్క్సిజాన్ని మనస్సులో నాటుకుని
మనుషుల్ని ప్రేమించడం తప్ప
మరేమీ తెలియని అతడు
ప్రజాయుద్ధ ప్రతినిధే కాదు
చంద్రశేఖర్ అజాద్ అడుగు జాడ కూడ
వెతికే చూపుండాలే కానీ ఈ మట్టి మీద
ఎక్కడ చూసినా అతని వెన్నెల కన్నులే
సారక్కి గేటు నుండి నాగపూర్ దాకా
అందుకే వేటగాడి వెర్రి ప్రయాణం
నాలుక మీద చర్చల్ని చాక్లెట్‌లా చప్పరిస్తూ
గ్రీన్‌హంట్ భుజానెత్తుకుని
ప్రజల మీదికి భేతాళ చిదంబరం
ప్రజలకీ రాజ్యానికీ మధ్య
మాటల వంతెన కట్టడానికి
పునాది రాళ్ళు పేర్చుకుంటూ అతడు
గెలుపోటములు కొట్లాటలో చెప్పగలమేమో!
పచ్చిగా కాల్చి చంపాక
కొట్లాటలే లేనిచోట
విజేతను ఎలా ప్రకటిస్తాం
చంపారని మాత్రమే ప్రకటించగలం

# బంధుమిత్రుల స్మృతి

- ఎస్.ఎస్.ఆర్

ఏదీ... నాకల...
ఎవరో ఛిద్రం చేశారు
నా కలల్ని ఎవరో నాలుగు రోజులు
ఎండకూ వానకూ ఎరవేశారు
కోపంతో ఎరుపెక్కిన కన్నెక్కడో?
నినాదాల నోరెక్కడో?
స్నేహపు చిరునవ్వుల పెదవులెక్కడో?
బిగిసిన పిడికిలెక్కడో?
అన్నీ అస్తవ్యస్తంగా వికృతంగా
ఈ వ్యవస్థ ఎలా ఉండాలని
వాడు అనుకున్నాడో... అలా
వాడి వికృత ఆలోచనల
పురుగులు పట్టించాడు
ఇది వాడి వికృత కల అని తెలిసి
అందమైన కలకనడం
ఎంత అవసరమో తెలిసి వచ్చింది
మా ముఖాన్ని ఎంత వికృతంగా
చేసినా సరే కలకనడం మానం
మీ ఆచరణ మీ త్యాగం
అందమైన కలలను సాకారం చేసుకునే
కర్తవ్యాన్ని మా ముందుంచింది

# విరామగీతం

-ఎం. యుగంధరరావు

పొగులుతున్న జ్ఞాపకమేదో
ఒక్కచోట నిలవనీయదు
రేఖలు...ఎటు చూసినా అవే, ఒక్కొసారి మెలి తిరిగి!
ఊసులు...ఎక్కడ విన్నా అవే, నలుగురు గొణుకునేంతగా!
పరుగెట్టి పరుగెట్టి అలుపొచ్చి ఆగినా
అవే రేఖలు, అదే ఊసులు...
ఎదురుగా నిలబడి
ఏం మిత్రమా! భుజం తడుతూ
అమరుడి నిశ్చల నిర్మల సౌందర్యాత్మక నవ్వు?!

- - -

గొంతులో అడ్డుపడ్డ నిరాకార పుండును తొలగించడానికి
నాతో నేను తగువులాడిన రోజులు
కిరాణా ఖాతాలో బాకీ పెరిగినట్టు
హైవే రోడ్డు అంతు చిక్కనట్టు
వరదలా పెరిగి నన్నూ ఊడ్చుకెళ్ళాయ్

ఈదుతున్నాను, మునుగుతున్నాను, తేలుతున్నాను
దారి తప్పిన ప్రవాహంలో వెళుతూనే ఉన్నాను
అడుగులు వక్ర సక్ర మార్గాల్లో పడి లేస్తూనే ఉన్నాయ్

ఈ అవ్యక్తీకరణ విరామంలో తెగిన తీగలు,
చెదిరిన శిలాక్షరాలు
కళ్ళు పలవరిస్తూనే ఉన్నాయ్
మండూకాలు నన్ను మింగేయకుండా
వెనక్కో పక్కకో తప్పించుకు తిరుగుతూనే ఉన్నాను

కాలం కళ్ళ కింద ఏర్పడ్డ దిగుడు బావుల లోతును
విప్పార్చిన నేత్ర ద్వయంతో కొలవక పోవడం
సంభాషిస్తున్న, కనిపిస్తున్న, వినిపిస్తున్న
విశృంఖల అణచివేత
దృశ్యాదృశ్యాలపై ట్రిగ్గర్ నొక్కకపోవడం
నేరమే, కాదు మహానేరం.

# మళ్ళీ "జిహాద్" ప్రకటన

- లాంఛర్

సామ్రాట్ లాడెన్‌కి...!
చావు లేదు...!!
అఫ్ఘాన్ ప్రజలల్లో
అతను చిరస్మరణీయుడు
ఆ ప్రజా హృదయాంతరాళాలో
అతడి ఆశయం పదిలపర్చుకొని
భావ పరంపరలను మధనం చేసి
తిరుగుబాటు రూపంగా ఆవిర్భవించి
కొత్త మొక్కలు ఉద్భవించి
విశాలంగా పర్చుకొని
అఫ్ఘాన్ ప్రజల అస్తిత్వం కోసం
మధ్య దార సముద్రం నుండి
లాడెన్ కళేబరం కూడా...
దురాక్రమ రాబందులకు
వ్యతిరేకంగా గర్జిస్తూనే వుంటుంది.

- - -

అపార పోరాట చరిత్ర కలిగిన
ఆ...ఇస్లాం గడ్డ
ఆ తిరుగుబాటు ప్రజల సొంతం
ఆ వెలుగులు, ఆ గాలులు, అన్నీ వారికోసం
అక్కడి కారణాలు వారి పసి పిల్లలని, సైతం
వెచ్చ బరుస్తాయి
ఆ మట్టిలో తేలే పెట్రోలీయం,
అక్కడి ప్రతి మనిషి, జీవకణం...!
ఆ భూముల్లో పుష్పించే కుంకుమ పువ్వూ
వారి స్వేచ్ఛా స్మృతి...!
వాళ్ళు మన స్ఫూర్తిగా
సంతృప్తిగా
స్వేచ్ఛగా
జీవించాలనే కోరిక
ప్రతి ఒక్కరు
బిగించి పట్టిన రైఫిళ్ళ...!
"మరణిస్తే మళ్ళీ,మళ్ళీ,
మా... భూముల్లోనే
మొలుకెత్తాలనే", వాళ్ళ... చింతన
మెక్సికన్, అమెరికన్ రాబందుల... గుండెల్లో
రైలు పరుగెత్తించే
ఆత్మాహుతి బాంబర్స్...!
అఫ్ఘాన్ ప్రజల త్యాగాన్ని
వెలుగెత్తి చాటుదాం!

[illegible]

# ఇంటికి తిరిగి వెళ్లాలని...

ఇంటికి వెళ్లాలని, ఎన్నాళ్లదో కోరిక
ఈ అంతస్తుల, ఐశ్వర్యాల
అసంతృప్త జీవిత నుండి
తప్పించుకొని మావూరికెళ్లిపోవాలని
అన్నిటి గురించీ అక్కడో సంతృప్తి
అది లేకపోయినా, ఇది లేకపోయినా
ఏదీలేకపోయినా, ఏం ఫర్వాలేదనే బేఖాతరీ
సాయంకాలం అయ్యేటప్పటికి అన్నానికి పిలుపు
అరటాకుల్లో ఆవిర్లు చిమ్ముతున్న అన్నాలు, అవకాయా
వరండాలో పేరుకే దీపం
దేన్నీ స్పష్టంగా కనపడనివ్వని వెలుగు
చంద్రుడూ చుక్కలు మనతోటే భోం చేసిన భావన
ఎక్కడ్నుండో తేలుతూ వస్తున్న ఏలపాట
వీదరుగు మీద బొంత పరచిపడుకుంటే,
ఎంత హాయిగా పట్టేది నిద్ర!
వీటన్నిటినీ వదులుకొని
ఆకాశానికి నిచ్చెన వేసి
అందుకోలేని ఎత్తుల కోసం
నిత్యం ఎగబాకుడే
పాతరోజులన్నీ చినిగి
పేలికలైన వెండి జరీముక్కలు

తిరిగి కూర్చుదాం అని కూర్చోబోతే
లేలే, పరుగెత్తు, ... నీవెనకవాళ్లంతా
ముందుకెళ్లిపోతున్నారు చూశావా
అని కోరికల రాక్షసుడి హెచ్చరిక
ఈ వొత్తిళ్ల బాధకే తట్టుకోలేక
సైక్యాట్రిస్టు దగ్గర కెళితే
బ్రోకెన్ డ్రీమ్స్ సైండ్రోమ్ అన్నాడు
ఊరు చేరుకున్నానా, రైలు స్టేషను దగ్గరే
ఇంకెక్కడి ఊరయ్యా అనే ప్రశ్న వినబడి
నోట మాటరాక నిలబడితే
ఊరంతా చదను చేసేశారు - థర్మల్ ప్రాజెక్టు వస్తోంది కదా!
మరి మా తేలినీలాపురం పెలికన్ పక్షులో అనడిగితే,
ఏటయ్యా నీ పిచ్చి వాగుడు
మనుషుల్నే బుల్ డోజ్ చేసేయ్యాలని చూస్తున్న కాలంలో
పెలికన్ల గురించీ, పిజియన్ల గురించీ, పిచికల గురించీ
ఎవడాలోచిస్తాడు?
అడివి మనిషిలాగున్నవు - ఆధునికారణ్యానికి పనికిరావు - పో! పో!
ఇకనేనెక్కడికి పోవాలి? నేనెక్కడికి పోవాలి?

# అనేక స్వాతంత్ర్యోద్యమాలు

నీతి చిరునామాకు
వొక్క జాగాలేనప్పుడు
అవినీతి ముందు
తలదించి నిలబడ్డ శాపాగ్రస్తుల నడక
స్వాతంత్ర్యోద్యమమైతే
భూమి కొరకు
భుక్తి కొరకు
ఈ దేశ విముక్తి కొరకు
అనేక స్వాతంత్రోద్యమాలు చేయాలిక!

టుజి నుంచి కేజీదాక
ఆదర్శ్ నుంచి అక్రమ మైనింగ్ దాక
సిడబ్లుజి నుంచి చిదంబరం ప్రకటనల దాక
అవినీతి ఎదుట
అపరాధి నీతి!

వరద ఊడలెత్తిన అవినీతిలో
ప్రజాస్వామ్యాన్ని
గుమ్మానికి ఉరితీసిన
పార్లమెంటు ఒక మేడిపండు!

ఈ ప్రపంచం మీద
అధికారం కలిగిన అవినీతి ఆశీర్వాదంతోనే
ప్రైవేటీకరణ సరళీకరణల సారెమీద
వేలచిల్లుల కుండ లోక్‌పాల్!

అవినీతే రాజు!
అవినీతే మంత్రి!!
అవినీతే పోలీసు!!!
అవినీతే ఓటు! సీటు! సంపద!
అవినీతి ఆజ్ఞను ఉల్లంఘించిన
నీతిని
చుట్టు ముట్టిన కోరలచట్టాలు
కాపలాకాస్తుంటే
అవినీతే
నీతిపాట పాడుతుంది
అవినీతే
అవినీతి ఆరోపణలు గుప్పిస్తుంది

కంపలో చిక్కిన
పాడు పడిన ప్లాస్టిక్ కవర్‌లా
తాజా కోమలంలో గాలికి వణుకుతుంది
ఎక్కడ ఒక్క శాతమైనా
నీతిమంతమై పోతానేమోనని భయంతో

భూమిని ఆవరించి
నీతికొరకు చనిపోయే
వొక్క దుఃఖం
వొక బాధ అంగీకరించని
అవినీతి వారసత్వ సింహాసనం!
పుట్టుక అవినీతే!
బతుకు అవినీతే!!
చావు అవినీతే!!!

అందుకే
అవినీతి గెలిచేది
సకల జన సేవకు కాదు
స్వయం సేవకే!
ఇంకేం

అవినీతే
రాజ్యమైనప్పుడు
నీతి
జైల్లోనే పడుతుంది

ఆ న్యాయమే
పాలనైనప్పుడు
ఆదివాసీ జైల్లోనే ఉంటాడు

వొక సూర్యోదయం దాక!
('అన్నా' ఉద్యమం చూస్తూ చూస్తూ)

# కలల దాడి

1

ఒంటరిగా
స్వయం నిర్ణయాధికార
దండెత్తిపోయావు

పందుల దొడ్డి చూడంగనే
భగత్సింగు కావల్సుండెనేమొ
యాదన్నా -
వొక బాంబు విసిరి!

నెత్తుటి దాహ తుపాకులు నిల్చున్న
వీథుల్ని చూడగానే
రాజకీయ డయ్యర్లను
ఆజాదులా కాలువాల్సుండెనేమొ
యాదన్నా
వొక గుంజుకున్న తుపాకి కాల్చి!

2

ఎంత మనాదో
ఎంత యాదో
కన్ను తెరిస్తే గాయం
కన్ను మూస్తే గాయం

గాయధారివైయ్యాక
అవ్వను జూడవు
బువ్వను జూడవు
అంతిమ దృశ్యం ఆశయమే!

3

అవునే
ప్రత్యేక తెలంగాణ పాటమ్మా!
మాటమ్మా!
యాదిరెడ్డికి
ఉద్యమాన్నిచ్చావా?
ఉరినా?

తుపాకి గొట్టంతో
వెన్నెల పాడిన యోధుల నేల ఇది!

సామ్రాజ్యవాదాంధ్ర పెట్టుబడి వేర్లు తెగని
కాసాయంతో
తెలంగాణ పెట్టుబడి తల్లివేరు

బలపరుపు సాగుతున్న ఉద్యమమా!
యాదిరెడ్డికి
ఆత్మ స్థైర్యాన్నిచ్చావా?
ఆత్మహత్యనా?

4

కన్నుమూసుకున్నోని
కన్ను తెరిపియాలని
కనుమూసిన ఆరేడు వందలు
ఆయుధాలై నిలబడితే
ఇంత దుఃఖం కొంగున కట్టుకునేదా
ఈ నేల తల్లి!

ఈ మట్టిరేణువు చేయందించిన దండకారణ్యం
సరిహద్దు ఇనుప మెదడు చుట్టుముట్టినా
సుట్టకుదురు కాలేదు!
సునామవుతోంది!!

5

తెల్సీ తెలియక
గల్లీ నుండి
తెల్సీ తెల్సీ
ఢిల్లీ దాక
విశ్వ విఖ్యాతనట సార్వభౌములు
విశ్వరూపమైనప్పుడు
బతుకు నడుపాల్సింది
ఉద్యమాన్ని
చావునడపడం విషాదమే!

6

దర్వాజల నిలబడ్డ దుఃఖం కోసం
పెద మంగళారం నుంచి
పార్లమెంటు మీదకు
యాదన్నా -

కలల దాడి నడిపావు
వొక విధ్వంసానికి వ్యతిరేకంగా విధ్వంసమవుతూ

ఒంటరిగా
స్వయనిర్ణయాధికార
దండెత్తిపోయావు

(మంజీర రచయితల సంఘం రజతోత్సవ కవి సభలో చదివిన కవిత)

# ఆకుపచ్చ వేట

ప్రపంచీకరణ చేత
ప్రపంచీకరణ కొరకు
ప్రపంచీకరణ వలన
ప్రభుత్వం పుట్టినప్పుడు
పౌరుడే
పరాయి శత్రురాజ్యమైయ్యాడు

తన నీడకు
తనే భయపడినపుడు
దూరమౌతున్న దానికోసమే
హింసకు పేటెంటు ప్రకటించుకున్నాక
మనిషిని
మాంసపు ముద్దని చేసే
ఆకుపచ్చ వేటే
అరుగాలమెల్ల
ఆకురాలు కాలమల్లా

అబూజ్‌మాడ్ వేటైనా
ఆదివాసీ వేటే
ప్రజాతలం మీద
ప్రభుత్వం బాంబులై పోతుంది
అత్యాధునిక ఆయుధ మరణాలవుతోంది

చిరిగిన బతుకులు సంధించిన
ప్రశ్నకు
నెత్తుటి జవాబు కురుస్తోంది

కడుపులు కోసైనా
ఆదివాసి ప్రాణ 'ఖనిజం'
కార్పోరేట్ కండై పోవాలి
బహుళజాతి వేదాంతపు
ప్రైవేటీకరణ జపంతో
గోతులు తొవ్విన లక్షలు
'గాలి' అయిపోవాలి
'మధుకోడై' పోవాలి
వందల చేతులు
బొందల గడ్డకెదగాలి
కూడే లేని కడుపు
కాడై మండాలి
సరళీకరణమంత్రంతో
మాయమైపోయి
ఇక్కడొక
కొండుండే దిగ
అక్కడొక
అడవుండే దిగ
ఇక్కడొక
నదివుండే దిగ
అక్కడక్కడ
ఆదివాసీ ఉండేవాడుగ
వర్తమానం
గతమైపోవటమేగా -

ఒక చెమట చుక్కల సూర్యగోళం
ఒక సునామీ కేంద్రం
దొడ్డు బియ్యం నోర్లు
భూసంస్కరణలన్నప్పుడు
బాస్మతి బానకడుపులు
ఆర్థిక సంస్కరణలన్నాయి

ప్రభుత్వం పెట్టుబడిదారు
పెనవేసుకుపోయిన ప్రణాళికల్లో
పర్యావరణం
తలపండు పగిలి
అవయవాలు చిక్కిశల్యమై
అభివృద్ధి దేశం
బోదకాలైంది
ఆకలి
అబూజ్‌మాడైయ్యింది

సిగ్గును శిశిరంలో దాచుకొని
కూడు గూడు గుడ్డ గుక్కపట్టిన గొంతుల కోసం
రాజ్యం
ఆకపచ్చవేటైంది

# స్త్రీలింగాలు

రాజ్యం
దేశం మీదొదిలిన
దేవుని కోడెల
మునుంబట్టిన భయంతో
అడవి మైదానాల
స్త్రీలింగాలన్నీ
దేహదురాక్రమణ
నిరసనగా
దేవునింటికి చేరాయి

మట్టివాసన తగిలి
మనిషైపోయి
నోరు తెరిచిన నోటీసు
'సమస్త చరాచరాలకు
భారత తుపాక్కి
భయపడిన దేవుడు
ధర్మాన్ని నడిపించే
ధైర్య శిక్షణ కోసం
ఆదరబాదరగా
ఆబూజ్‌మాడ్ తెలియని అంతర్ధానమైయ్యాడు
విజిటింగ్స్
రద్దు చేయడమైనది' అన్నది

ఒళ్ళు తెలియని జ్వరంతో వాకపల్లి
భల్లూగూడ
ఉస్మానియా బాలికల హాస్టల్
భళ్లున నవ్వాయి
కాళ్ళతీపుల్ని
కడుపుమంటల్ని అధిగమిస్తూ
దేవుడి మార్గాన్ని చూశాయి

# సోంపేట

అక్కడ
వొళ్ళంత
వొడిసెల చేసి
మట్టి మంచె మీద
మనిషి నిలబడ్డాడు

అక్కడ
మనిషి
మట్టిని బుక్కే మృగాల్ని
తరిమే
డప్పై మోగాడు

అక్కడ
ఆకలి నోళ్ళకు
మెతుకు ప్రకటిస్తూ
మనిషి
నెత్తురొడిన వరిమొక్కైయ్యాడు

ఒక పిట్ట
ఒక చెపపిల్ల
ఒక వరిగింజ
ఒక నీటి బిందువు
ఒక మనిషి

మట్టికి
ఆకుపచ్చ తోరణం కట్టి
చెమట గంధపు
చారిత్రక పాఠానికి
పుటలు పుటలై
పరిమళించాయి

మెతుకు మీద
బూడిద సమాధి చిమ్మి
బతుకు విషం చేసే
పగ బట్టిన వెలుగును
పలుగూ పార ధిక్కరించాయి

అభివృద్ధి శకటం మీంచి
ఆగమేఘాల మీద దిగుతున్న
చీకట్లను
యుద్ధానికి సిద్ధం చేసిన
గింజ జన్మభూమ్మీది వ్యర్థంలా
కోసి కుప్పబెట్టాడు

కేవలం
బువ్వపెడ్తానన్నందుకు
బుల్లెట్ విసిరిన రాజ్యానికి
బువ్వ గింజలా రాలి
భూమిలో నాటుకొని
శ్రీకాకుళమై పూసి
తెలంగాణై కాశాడు

చీకటి పడుతున్న
మట్టికి
మనిషి
సూర్యుడైయ్యాడు

## రైతు భాషరాదు

దుఃఖనదులన్నీ
మైదాన సముద్రమవుతున్నప్పుడు
మృత్యువు కౌగిలిలో వణుకుతున్న
ప్రజాస్వామ్య రజాకార్ల రాజ్యం ఇది!
పొగబెట్టి
వొక మట్టి ఆకుల నీడ తగులబెట్టి
వొక కుప్పేసిన బువ్వలు తగులబెట్టి
చెదలు పట్టిన అలల్లో
పుచ్చిన కలైన
వొక ఆకలి వాసనల బతుకును తవ్వేసి
వొక జీవితాన్ని దోచుకొని
నల్లవెన్నెల మెరుపు చిరుగుల
మనిషి శవం మీద
బుసకొట్టి వెంటాడిన పెట్టుబడి
నియంతృత్వ అభివృద్ధై రెపరెపలాడ్తోంది

మంచు బిందువును
తుపాకీతో పేల్చిన వాక్ స్వాతంత్ర్యం
ప్రపంచంలో అతిపెద్ద
బదిరాంధ భావ ప్రకటనా స్వేచ్ఛ
ప్రజల కన్ను
ప్రైవేటీకరణ తలకెక్కిన తూటా మీద నడుస్తూ
చమట చుక్కను చదివే
స్పర్శ కోల్పోయిన ప్రజాస్వామ్యం!

క్షమించండీ!
జీరునాగేశ్వర్రావు
శీరపు ఎర్రయ్య
ఈ దేశానికి ఇక వెనుక ముందు
రైతుకర్థమయ్యే భాష రానేరాదు
మనుషుల్లో పంజరాలు నాటి
ప్రాణాల్ని దొంగిలిస్తున్న
రాజ్యం
ప్రాణాన్నే గురిపెట్టాలిక
సంక్షేమంగా -

## ప్రజలేం చేస్తారు

ప్రజలేం చేస్తారు
స్వేచ్ఛా చౌక్ మత్తడి పడుతూ పుడుతారు

ప్రజలేం చేస్తారు
నేల గుండెల్లో అమెరికా వేలాడదీసినది దిష్టి బొమ్మకు
నిప్పు పెట్టే సద్దాంలవుతారు

ప్రజలేం చేస్తారు
వాషింగ్టన్ సైన్యం యుద్ధటాంకుల్ని చీల్చుకొని
మూడు యుద్ధాల కీర్తికవచాన్ని
ఖననం చేస్తారు

ప్రజలేం చేస్తారు
సహారాలో సముద్రమై
హోరెత్తుతారు

ప్రజలేం చేస్తారు
మంటలంటుకున్న చమురు నదిని చేసి
నైలునదై దేశాన్ని ముంచెత్తుతారు

ప్రజలేం చేస్తారు
అధ్యక్ష భవనంలోని
అడవుల్ని చమురుగనుల్ని బతుకుదెరువుల్ని మింగి
అవినీతి మీసందువ్వుతున్న
పాత సామాన్ను భోగిమంట వేస్తారు

ప్రజలేం చేస్తారు
ట్యునీషియా, ఈజిప్టు, కాశ్మీరు, తెలంగాణల
కొత్త నాగరికతలవుతారు

## చిన్న మాట

- వసంత

ఒక గీత
ఏమి అర్థంకానట్లే ఉంటుంది
అర్థాలు స్ఫురిస్తుంది
ఏదో అసంపూర్తిగానే తోస్తుంది
ఎంతో భావం పలికిస్తుంది
ఒక ఊహ . .

మొదలూ చివరా కనిపించనట్లే ఉంటుంది
ఎందరో జీవితాలను వెలిగిస్తుంది
గీతైనా
మాటైనా

ఊహైనా
సమాజ పురోగమనంలో భాగమైనపుడే
అర్థవంతమవుతుంది

సాల్వడాండాలీ, హుస్సేన్ గీతల్లా
ఫైజ్ అహ్మద్ ఫైజ్ పాటల్లా
ఆదివాసీ జీతన్ మరాండీ[1] పిలుపులా

(1. జీతన్ మరాండీ ఒక ఆదివాసీ సాంస్కృతిక కళాకారుడు. ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా తన పాటలతో, మాటలతో, రాతలతో, ఆదివాసీలలో చైతన్యం రగిలిస్తున్నందుకు అక్రమ కేసులు బనాయించి ఇటీవలే జార్ఖండ్ లోని గిరిధి లోకల్ కోర్ట్ జీతన్ మరాండీకి ఉరిశిక్ష విధించింది)

# కామ్రేడ్

- దిల్ సప్నా

కవిత తెలుగు అనువాదం : బి.ఎస్.రాజు

కామ్రేడ్!
వీధిలో నువ్వున్నపుడు
విప్లవం గురించి మాట్లాడావు

కామ్రేడ్!
మురికి వాడలలో నువ్వున్నపుడు
విముక్తి గురించి మాట్లాడావు

కామ్రేడ్!
నీటిలో చేపలా
ప్రజలలో నువ్వున్నపుడు
మార్క్సిజం మాట్లాడేవు
లెనినిజం మాట్లాడేవు
మావోయిజం మాట్లాడేవు
అంతేనా!
ఇంకెన్నో మాట్లాడేవు !
సోషలిజమన్నావు!
కమ్యూనిజమన్నావు!

అయితే ఇపుడు కామ్రేడ్ !
కుర్చీలో ఉన్న నీవు
వీధి ఏమి చెబుతోందో
వినిపించుకోవు

అయితే ఇపుడు కామ్రేడ్!
స్వర్గ సామ్రాజ్యంలో ఉన్న నీవు
మురికివాడలు దర్శించవు
ఊరకనే నయనా అలా, అక్కడున్న జనం
సంతోషంతో చచ్చారో
ఇంకా బతికే ఉన్నారో
తెలిసేందుకైన

అయితే కామ్రేడ్! ఇపుడు
రాజ మహల్లో ఉన్న నీవు
ఆఖరికి ప్రజల విన్నపాలకు కూడా
ఎడ ముఖం పెట్టావు !

ఉన్నదున్నట్లు మాట్లాడుతా
నువ్వేమి అనుకోకుంటే
కామ్రేడ్ ఇదివరకటిలా
ఇపుడు లేవు నీవు
ఏది మారకుండానే
చాల ఆశ్చర్యంగా నువ్వు మారిపోయావు
నీ దయగల అనుమతితో
ముక్కుసూటిగా
నీకో ప్రశ్న వేయనా ?

ఓ కామ్రేడ్!
అసలు నువ్వింకా కామ్రేడ్ వేనా?
కామ్రేడ్ తప్ప ఇక తతిమా అన్నీనా ?

[illegible]

# ఆదర్శం...

దేహమంతా గాయాల మయమైనా
పాడే వేణువు ఆదర్శం కావాలి....

నిర్బంధం ఎంతగా ఉక్కుపాదం మోపినా
గొంతు చించుకు వచ్చే నినాదం కావాలి...

నిషేధాలు ఎన్ని ఇనుప తెరలల్లినా
పొద్దు పొడుపులా పొడుచుకు వచ్చే వాక్యం కావాలి....

పెడరెక్కలు విరిచికట్టి కళ్ళలో గుండు సూదులు గుచ్చి
గుండెల్లో గురిపెట్టినా సత్యం వాక్కు కావాలి....

పాటల పల్లవిలో ప్రతి చరణంలో
నీ హృదయం నిక్షిప్తమై అజరామరం కావాలి....

# కలలను కత్తిరిస్తున్నవేళ

కంటి రెప్పల చుట్టూ
పాతబడుతున్న
ముళ్ళ కంచె

నే నిలుచున్న చోటే
నీవు ఓ పునాదిరాయి
వేసి పొమ్మంటూ ఉంటే
గొంతు పెగలనీయకుండా
బిగించిన కబంధ హస్తాలు!

పచ్చగా పరచుకున్న చోట
నల్లని మసిపూతకు
నీవు పూనుకుంటుంటే
గుండె పగిలేటట్టు
రోదిస్తున్నా
గుండెల్లో దిగబడ్డ తూటా!

చేతులు బార్లా చాపి
వలనిండా పడ్డ నా బువ్వ
నేడు బురదపాము చేస్తూ
అడ్డుపడుతున్న
నా డొక్కలో... నీ
ఇనుప బూటు తాపు!

వద్దయ్యా మా
బతుకులు మేం బతుకుతాం..
మా నేలని
మేం ఏలుకుంటాం
అంటే..
మా నీళ్ళను మేం
మా పంట సేల్లో
తడుపుకుంటామంటే..
మా ఉద్యోగాలేవో
మేం జేసుకుంటామంటే..

అధికారపు
హుంకరింపులతో
మా కలలను
కత్తిరిస్తున్నావు!

అయినా
వేయి తలల నాగుపాము
చలిచీమల చేత చిక్కదా??

# వెలుగులోకి..

బీజాన్ని చీల్చుకొని
వచ్చే లేలేత చిగురులా

హృదయాంతరాళంలోంచి
పెల్లుబికే ప్రతిధ్వనిని
నాలుగు గోడలమధ్య
ఆపే కుట్రలెన్నెదురైనా...

గొంతుపై ఉక్కుపాదం
మోపినా
ఇనుప గొలుసుల
బంధించ జూసినా...

నినాదమై
బయటకొచ్చిన
నీ కేక
నలుదిశలా
వ్యాప్తిచెంది
దిక్కులు పిక్కటిల్లే
పెను గర్జనగా
మారుతుంది...

శత్రువు గుండెల్లో
గుబులు పుట్టిస్తుంది..

ఎత్తిన పిడికిలి
వజ్రాయుధమై
నియంత కుత్తుకను
ఉత్తరిస్తుంది

ప్రజల కళ్ళలో
వెలుగును
సృష్టిస్తుంది...

(మిలియన్ మార్చ్ కు సంఘీభావంగా)

# చెత్తబుట్ట - సూర్యకిరణం

తొలి సూర్య కిరణం
మీ పీతి కంపుతో
ఎక్కడ మలినమవుతుందోనని
నా ఒళ్ళంతా చీపురు చేసుకొని
ఆ చివరనుండి ఈ చివరి వరకు
ఊడ్చి మీ మలినాలను
మీరు పారబోసిన మీ కంపు మావిని
మా నెత్తికెత్తుకొని
మీ ఒళ్ళంతా మీ అమ్మ తుడిచిందో లేదో కాని
మేము మాత్రం తప్పక తుడిచి పారబోస్తుంటే...

రాత్రంతా మీ చీకటి కార్యాలతో
పారబోసిన మీ చెత్త జూసి
దాక్కోలేక సిగ్గుపడిన సందమామ
మా రాకతో ఊపిరి పీల్చుకొని
సూరీడు చాటుకు పోతూ
మీ కంటపడకుండా
మా వంక విసిరిన నవ్వు
గుండెల్లో పదిలం బిడ్డా...

ఈ పీతి బుట్ట సాచ్చిగా
మీ జన్మ రహస్యం
ఇంతే...

# ముఖాన్ని కోల్పోయిన వాణ్ణి..

ముఖాన్ని కోల్పోయిన వాణ్ణి
దాచిపెట్టుకుందామనుకున్నంతలోనే
పోగొట్టుకున్న వాణ్ణి!

వెతుకుతూ వెళుతున్న
దారిలో నాదంటూ
కానరాక
చిక్కుకున్న
దారాల పోగుల మధ్యలో
ఒక్కొక్క పోగు
కలుపుకుంటూ
వచ్చిన దారిని
మరిచిపోయిన వాణ్ణి!
ముఖాన్ని కోల్పోయిన వాణ్ణి!

# ఎగసిపడుతున్న ఎడారి జ్వాలలు

మొన్న ఎగసిపడిన
జాస్మిన్ సెగలు
అంటించిన నిప్పు
రవ్వలు...
ఆకలిగొన్న
పేగుల ఆర్తనాదాలే
పొలి కేకలై
నిద్ర లేచిన మమ్మీల
నోట నిండి
ఎగసిపడిన ఇసుక
తుఫాన్లో
అవినీతి చక్రవర్తి
ముబారక్
సింహాసనాన్ని
పెళ్ళగించి
ప్రజల పాదాల
చెంతకు
అధికారం
దాసోహమన్న
క్షణం ...
ఇది మరో మారు
విముక్తి పోరాటాల
యుగమని
జన హోరుముందు
మర ఫిరంగులు
బలాదూరని...
ఉత్తుంగ తరంగాలుగ
ఎగసిపడే
జన కెరటాల తాకిడికి
ఏ రక్షణ కవచాలు
అడ్డు నిలవవని ...
అట్టడుగు జనావళికి
మరోమారు
గుండెనిబ్బరాన్నిచ్చిన
ఎడారి హోరు...
ఎండమావులే కాదు
ఒయాసిస్సులూ
ఉన్నాయన్న
భరోసాకు
జేజేలు....

ఈ విజయం
శాశ్వతం కావాలని...
(ట్యునీసియా, ఈజిప్టు ప్రజల పోరాటాలకు మద్దతుగా...)

పదిలం నేస్తం...
రా
మాటాడు

# మాటాడుకుందాం రా...

మాటాడుకుందాం
రా
మనసువిప్పి నగ్నంగా...

కనులలోయలో దాగిన
కలలన్నీ కుప్పబోసి
పూచిక పుల్లాటాడుదామా?
లేక
పాదం అంచున కట్టిన
సైకత ప్రేమమందిరంతో
తాజ్ ని ఓడిద్దామా?

రా నేస్తం..
గుండెపై చెవిపెట్టి
అగ్గిపెట్టెల ఫోన్ ల
దారం గుండా వినబడే
నా లబ్ డబ్ లయను
ఈ కొండ శిఖరాన
నిలబడి లోయంతా
వినపడేట్టు
నీవు ఎలుగెత్తి
గానం చేస్తే
నీతో శృతి కలుపుదామని
ఈ అంచున....
నీ నవ్వుల వెన్నెల
పరచుకున్న
ఈ అడవి పూల
పరిమళం
దిగంతాలు
వ్యాప్తిచెందనీ...
నవ్వు నీ ఒక్కడికే
సొంతమైందన్న
ఈర్ష్య నాలో
పొగొట్టేలా
సందమామ
వంగి నీ నుదుట
ముద్దులిడే
ఆ దృశ్యం
గుండె గూటిలో

# నువ్వొక్కడివే...

నిన్ను చంపేసామని
నువ్వు ఇంకలేవని
నీ నీడ మరి కనబడదని
నీ గొంతు వినబడదని
నీ భౌతిక కాయం సముద్రంలో కలిపేసామని
శ్వేత సౌధంలో ఈరోజు హాయిగా
కడుపునిండా తాగి నిదురోతున్నాడు...

భూమండలాన్నంతా చాపలా చుట్టి
తన చంకలో పెట్టుకున్నానని విర్ర వీగిన
హిరణ్యకశిపుడి డొక్కలో నీవు తన్నిన తాపుకు
వాడికి ఊపిరాడలేదిన్నాళ్ళు...

ప్రపంచాన్నంతా సరకుజేసి కట్టుకున్న
తన వ్యాపార మూల స్తంభాలు కూల్చిన
నీ నేర్పరితనం జూసి వాడి కాళ్ళ కింద నేల నెర్రెలు బారింది...

వాడి సాంకేతికత అంతా ఒట్టి
పటాటోపమేనని నిరూపించావొక్కడివే...

ప్రాణ భయంతో కలుగులో దూరిన వాడి
మొఖం చూసిన క్షణం బడుగు జనాల
గుండె మూడింతలయ్యిందన్నది ముమ్మాటికీ నిజం...

వాడి గుండెల్లో పరిగెత్తిన విమాన రొద
ఎప్పటికీ ఓ విజయ చిహ్నమే...

నిన్ను పట్టుకున్నామన్నది
వాడి గొప్పతనంకాదని
ఎవడో యూదా లేదా బ్రూటస్సో
లేదా కత్తుల సమ్మయ్యో కావచ్చు!
నీ ఆనుపానులు చెప్పిన తల్లి కడుపులో
చెయ్యి పెట్టిన ద్రోహి...

నువ్వు చేసింది తప్పనిపించలా ఇప్పటికీ...

కానీ
నువ్వు లేవన్నది మింగుడుపడట్లేదెందుకో....



ప్రసంగ పాఠం

# మార్క్సిజం - అస్తిత్వాలు

(మే 21, 22 కావలి విరసం సాహిత్యపాఠశాల ప్రసంగపాఠం)

- పాణి

అస్తిత్వ వాదాలు-మార్క్సిజం అని కాకుండా అస్తిత్వాలు-మార్క్సిజం అనడంలో ఒక స్పష్టత ఉన్నది. ఇది ఈ పాఠశాల అధ్యయన చట్రాన్ని తెలియజేస్తుంది. కేవలం ఒక కార్యక్రమం కోసం రూపొందించుకున్న ప్రణాళికగానేగాక మార్క్సిస్టులు ఈ సమస్యతో వ్యవహరించవలసిన సిద్ధాంత చట్రంగా కూడా దీన్ని చూడవచ్చు. అస్తిత్వవాదాల గురించి కూడా తప్పక మాట్లాడవలసిందే. కానీ అది పూర్తిగా వేరే విషయం. అస్తిత్వవాదాల పరిశీలనా పద్ధతులు, అందులోని సూత్రీకరణలు, వాటిలోని తేడాలు, వాటి మీద మార్క్సిస్టుల విశ్లేషణలు, విమర్శలు వగైరా అందులోకి వస్తాయి.

ఈ సాహిత్యపాఠశాల వాటిని లక్ష్యంగా ఎంచుకోలేదు. అయితే మార్క్సిస్టుల్లో కొందరికి అస్తిత్వాల ఊసు రాగానే రకరకాల అస్తిత్వవాదాలు గుర్తుకు వస్తాయి. అవి ప్రవచించిన వ్యక్తులు గుర్తుకొస్తారు. ఇది యాదృచ్ఛికం కాదు. అస్తిత్వవాదాల వల్ల మనకు అస్తిత్వాల ఎరుక కలగడం, అస్తిత్వవాదులు మార్క్సిజాన్ని తిరస్కరిస్తూ, వ్యతిరేకిస్తూ మాట్లాడడం... ఈ రకమైన ప్రతిస్పందనకు కారణం. అట్లాగే మార్క్సిస్టుల్లో కొందరైనా అస్తిత్వాల సమస్యను సీరియస్ సిద్ధాంత సమస్యగా కాక కేవలం రాజకీయ సమస్యగా చూడడం వల్ల కూడా ఇరు శిబిరాల మధ్య ఒత్తిడి తప్పడం లేదు. నిజానికి దీన్ని విప్లవ, అస్తిత్వవాద శిబిరాల మధ్య సమస్యగా చూడడం వల్ల ఎన్నటికీ పరిష్కారం దొరకదు. సాంఘిక అస్తిత్వాలను చారిత్రక భౌతిక వాదం ప్రకారం ఎలా విశ్లేషించాలి? అనే విషయంలో స్పష్టత అవసరం. మార్క్సిస్టులు చేయవలసిన కృషి ఇదే. అందువల్లే ఈ సాహిత్య పాఠశాలకు ఇతివృత్తంగా అస్తిత్వాలు - మార్క్సిజాన్ని ఎంచుకోవలసి వచ్చింది. కావట్టి నా ప్రసంగం పూర్తిగా దానికి అనుగుణంగానే సాగుతుంది.

అయితే అందులో కూడా చాలా అంశాలు ఉండవచ్చు. నేను నా పరిమితులకు లోబడి కొన్నిటిని మాత్రమే ప్రస్తావిస్తాను. నేను ముఖ్యమనుకొన్న వాటి వల్లనే అస్తిత్వాలపై స్పష్టత కలగకపోయినా ఈ మొత్తంలో వాటి ప్రాధాన్యత చెప్పడం మాత్రమే నా ఉద్దేశం. నిజానికి అస్తిత్వాలు - మార్క్సిజం అనే సిద్ధాంత అంశం మీద అనేకమంది అనేక వైపుల నుంచి కలిసికట్టుగా కృషి చేయవలసి ఉన్నది. నా ప్రసంగం అందులో ఒక చిన్న ప్రయత్నం మాత్రమే. దీన్ని నేను మూడు భాగాలుగా చెప్తాను. ఒకటి : అస్తిత్వాలు అంటే ఏమిటి? ఈ ప్రశ్న తలెత్తిన సందర్భంలోని ప్రత్యేకత ఏమిటి? ; రెండు: చారిత్రక భౌతికవాదానికి సంబంధించిన కొన్ని విషయాలు చెప్పి, వాటి ఆధారంగా అస్తిత్వాలను అర్థం చేసుకోడానికి ఒకటి రెండు ప్రాతిపదికలు మాత్రమే చెప్తాను.

**2**

మొదట - అస్తిత్వాల గురించి లోతైన చర్చ జరుగుతున్న ఈ సందర్భాన్ని గుర్తించాలి. నిజానికి ఇది ఇప్పటికిప్పుడు పుట్టుకొచ్చింది కాదు. కనీసం ఇరవై ఏళ్లుగా తెలుగు ప్రజల ఉద్యమ ప్రపంచంలో, ఆలోచనా రంగంలో తీవ్రమైన అలజడి, అంతర్మథనం సాగుతున్నది. అస్తిత్వాల ఎరుక కలిగాక మన ఉద్యమ ఆవరణ సమూలంగా కొత్త సన్నివేశంలోకి వచ్చింది. మన విశ్లేషణా సామర్థ్యం కొత్త సవాళ్లను ఎదుర్కొంటున్నది. కొత్త నుడికారం మనకు పరిచయమైనది. ఈ మాట కేవలం విప్లవ శిబిరాన్ని ఉద్దేశించే అనడం లేదు. సగటు ప్రజల మనో ప్రపంచమే ఈ ఎరుక వల్ల కొత్త సన్నివేశంలోకి చేరుకున్నది.

ఒకప్పుడు 'మనం' అనుకున్న సందర్భాలన్నీ 'మీరు - మేం' అనే సంఘర్షణా సంవాదంగా మారిపోయాయి. శ్రామికులు తమను తాము కార్మికవర్గంగా గుర్తించడం వల్ల ఈ ప్రపంచాన్ని మార్చగలరనే భావన వైపు నుంచి చూస్తే ఈ కొత్త గుర్తింపులు, 'మీరు - మేము' అనే ప్రత్యేకతలు చాలా ఆందోళన కలిగిస్తాయి.ఈ గుర్తింపుల గురించి మాట్లాడే వాదాల మీద అసహనం కలుగుతుంది. ఆ వాదాల వల్లే మనుషులకు ఈ ఎరుక కలిగిందని కొందరైనా అనుకోవచ్చు.

కాబట్టి మొదట తేల్చుకోవలసింది ఏమంటే - వాదాల వల్ల ఈ ఎరుక విస్తరించి ఉండవచ్చుగాని, అస్తిత్వ స్పృహ అనేది బైటి నుంచి సంక్రమించేది కాదు. అయితే తెలుగు సమాజంలో ఈ చైతన్యం కలగడానికి దేశీయ కారణాలే చాలా ఉన్నాయి. వాటి విశ్లేషణ కూడా చాలా ప్రత్యేకమైనది. అంతకంటే ముందు ... అస్తిత్వాలన్నీ భౌతిక వాస్తవాలే అని గుర్తించాలి. సామాజిక జీవితమే అనేక భౌతిక వాస్తవికతల అల్లిక కాబట్టి, అందులో ఉండే ఒక్కో వాస్తవికత ఒక్కో ప్రత్యేకమైన అనుభవాన్ని ఇస్తుంది. దాని గురించి వాదాలు రూపొందవచ్చు. ఆధునిక చైతన్యం ఎలాంటిదంటే - ప్రతి అనుభవాన్నీ ఒక పద్ధతి ప్రకారం వాదనగా మార్చగలుగుతుంది. అలాంటి అనుభవాలను విశ్లేషించే చట్రాన్ని తయారు చేసుకుంటుంది. అందులో ఒక రకమైన హేతుతర్కం భూమికగా పని చేస్తుంది. అట్లా అస్తిత్వవాదాలు రూపొందాయి.

ఇప్పుడు మనం చేరుకున్న ఈ కొత్త సందర్భం ఒకప్పుడు మనం జీవించిన, విశ్లేషించిన, ఉద్యమించిన ప్రపంచానికంటే పూర్తి భిన్నమైనదీ, కొత్తదీ. అందువల్లే అందరూ ఒక రకమైన ఉక్కబోతను అనుభవిస్తున్నారు. ఈ ఉక్కబోత అనే స్థితిని విడమర్చి చూస్తే అందులో శాస్త్రీయతకు సంబంధించిన సవాళ్లు కనిపిస్తాయి. ఆధునిక విజ్ఞాన శాస్త్రాలకు పితామహులనదగిన వారు కూడా ఒకానొక భావజాల ఆవరణలో కొనసాగారని మనకు తెలిసిందే. వారు ప్రతిపాదించిన వైజ్ఞానిక సూత్రాలకు, వాటిలో ఉన్న శాస్త్రీయతకు సంబంధం లేని భావజాలం అది. పైగా భిన్నమైనది కూడా కావచ్చు. దానికి వారిపైన ఉన్న తాత్విక ప్రభావాలు కూడా కారణం కావచ్చు. సామాజిక శాస్త్రాల్లో శిఖరాయమానమైన మార్క్స్ ఈ బాదరబందీని తోసేసి సామాజిక రంగంలో ఎన్నటికీ చెక్కుచెదరని శాస్త్రీయతకు పునాది వేశాడు. మార్క్సిస్టులుగా మనకు అది సొంతం.

కాబట్టి అన్ని రకాల ఉద్వేగాల నుంచి, రాజకీయ ఒత్తిడుల నుంచి, అవతలివారి సంవాద తీవ్రత నుంచి పూర్తిగా విముక్తమై శాస్త్రీయ సిద్ధాంత పద్ధతి నుంచి సవాలును ఎదుర్కోవలసి ఉన్నది. నిజానికి పైన చెప్పిన కొత్త సందర్భం మార్క్సిస్టులకు అమితమైన ఆనందం కలిగించాలి. మార్క్సిస్టు సిద్ధాంత ఆయుధాగారంలోని ఏఏ పనిముట్లను ఎంత సవ్యంగా వాడి మార్క్సిజానికి ఉన్న శాస్త్రీయతను నిరూపించగలం? అనే కుతూహలం ఈ సందర్భంలో పెరగాలి. కాబట్టి మనం అనుభవిస్తున్న ఉక్కబోతను పారదోలడానికి దగ్గరి దారి ఏదీ లేదు. పైగా అస్తిత్వవాదాల నేపథ్యంలో మార్క్సిజం ముతక సిద్ధాంతమనీ, అస్తిత్వ సమస్యలకు అందులో విశ్లేషణ కష్టమనీ, వర్గపోరాటంలో అస్తిత్వ సమస్యలు పరిష్కారం కావనే భావజాలాన్ని అస్తిత్వ ధోరణులు విడుదల చేశాయి. భావజాలమని ఎందుకంటున్నానంటే... ఆయా వాదాలు ప్రత్యేకంగా చారిత్రక భౌతికవాదం సాంఘిక అస్తిత్వాలను అర్థం చేసుకోడానికి పనికిరాదని ఒక సంవిధానం ప్రకారం నిరూపించలేదు. అసలు చారిత్రక భౌతికవాద పద్ధతి దగ్గరికి వెళ్లి దాని శాస్త్రీయతతో వ్యవహరించలేదు. మార్క్సిజం గురించి కొన్ని భావజాల సంబంధమైన నిర్ధారణలు చేసుకొని ... అది సరిపోదని చెప్తున్నారు. మార్క్సిజం గత కాలానికి సంబంధించిన మేధో ప్రపంచమనే ధోరణి దాని నుంచే పుట్టుకొచ్చిందే. భారత దేశంలో విప్లవోద్యమం రాజకీయంగా గతం కంటే చాల బలంగా, విస్తారమైన ప్రాంతంలో కొనసాగుతున్న తరుణంలో ఈ ధోరణి ప్రబలిందని మర్చి పోరాదు.

రాజకీయ ఉద్యమాన్ని గట్టిగా నడిపితే దీన్ని అధిగమించగలమనుకోవడం పాక్షిక సత్యం. రాజకీయ ఉద్యమాల వల్ల సమస్య ఒక మేరకు పరిష్కారమైనట్లు కనిపిస్తుంది. రాజకీయంగా సానుకూలంగా ఉన్న కాలంలో బైటపడని సమస్యలు ఆ తర్వాత బైటికి రావడం చాలా సార్లు చూశాం. ఉద్యమాలే సిద్ధాంత సమస్యలను వాయిదా వేయవచ్చు. ప్రజా ఆచరణ నుంచే సమస్యలు పరిష్కారమవుతాయని, ఆచరణ నుంచే సిద్ధాంతం రూపొందుతుందనే అభిప్రాయాలు జ్ఞానానికి సంబంధించిన భౌతికవాద వైఖరిని తెలియజేస్తాయి. అంత మాత్రాన సిద్ధాంతరంగంలో ప్రత్యేకంగా కృషి ఏమీ చేయనవసం లేదనుకోవడం పొరపాటు. అలాంటి కృషి చేసినప్పుడే చారిత్రక భౌతికవాదం గురించిన విమర్శలను ఓడించినట్టవుతుంది.

ప్రజల రోజువారీ జీవితంలోని సమస్యల తీవ్రత వల్లనైనా, రాజకీయ సమీకరణాల బలాబలాల వల్లనైనా, వాటితో నాయకత్వం సమర్థవంతంగా వ్యవహరించడం వల్లనైనా ఉద్యమాలు ఉధృతమవుతాయి. దీర్ఘకాలావధిలో సమాజపు అట్టడుగుపొరలో జరిగిన, జరగబోయే మార్పులను వివరించే సిద్ధాంతరంగంలో ఎన్ని సమస్యలున్నా ఉద్యమాలు వేగం పుంజుకోవచ్చు. ఉద్యమాల ముందుండే సిద్ధాంత సమస్యలను రాజకీయ, నిర్మాణ సమస్యలుగా మలచిన ఘటనలు చాలా ఉన్నాయి. కాబట్టి అస్తిత్వాల సమస్య స్వభావం ఏమిటి? అని ఆలోచించాలి. మార్క్సిజం సాంఘిక అస్తిత్వాలను శక్తివంతంగా విశ్లేషించగలుగుతుందని నిరూపించడం ఇప్పుడు ముఖ్యమైన కర్తవ్యం. అంటే మార్క్సిస్టులు అతి పెద్ద సిద్ధాంత పోరాటాన్ని పకడ్బందీగా నడపాల్సి ఉంటుంది.

దీనికి ఇప్పటికే మనకున్న అవగాహన సరిపోతుందనుకుంటే ఎన్నటికీ ఈ లక్ష్యం చేరుకోలేం. మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అన్వయించడమనే పేరుతో అస్తిత్వాలపై మార్క్సేతర సూత్రీకరణల ప్రమాదం కూడా పొంచి ఉంది. దీన్ని కూడా అధిగమించవలసి ఉన్నది. అట్లాగే ఈ ప్రజాస్వామిక ఆకాంక్షలన్నిటి మధ్య ఐక్యతను రాజకీయ తలంలో సాధించాలనుకునే వాళ్లు కూడా ఉంటారు. ఇది చాలా అవసరమైనదే. అయితే మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అన్వయించి, అన్ని ఉద్యమాలను సంఘటితపరిచి ఈ ఐక్యత సాధించాలనే వాళ్లు కోరుకుంటారు. నిజానికి ఏ శాస్త్రంతోనైనా శాస్త్రీయత గీటురాయి మీద, శాస్త్ర పద్ధతితో వ్యవహరించి సమస్యలను విశ్లేషించాల్సిందేగాని సృజనాత్మకంగా చెప్పడం అంటూ ఉండదు. సృజనాత్మకతను సామాజిక శాస్త్రాలలోకి తీసుకపోతే అందులోని శాస్త్రీయత దూరమయ్యే ప్రమాదం ఉంటుందని చెప్పడానికే ఇదంతా.

### 3

అస్తిత్వాలు ఇప్పటికిప్పుడు పుట్టుకొచ్చినవి కాదు. వీటికి సుదీర్ఘమైన మన సమాజ చరిత్రతో సజీవమైన సంబంధం ఉన్నది. వాటి గురించిన వాదనలు ఇప్పుడే రావడానికి కారణం అధునిక చైతన్యం. మనం జీవిస్తున్న సమాజం ఎప్పటికప్పుడు ఆధునికంగా పరివర్తన పొందడం వల్ల, అందులోని అవలక్షణాల మీద తీవ్ర విమర్శ, పోరాటం చేయగల ఆలోచనలను కూడా అదే అందిస్తున్నందు వల్ల అతి ప్రాచీనమైన ఈ అస్తిత్వాల గురించి ఇప్పుడు గతాని కంటే భిన్నమైన ఎరుక కలిగింది. ఈ తేడా

గమనించాలి. ఇప్పుడు కలిగిన ఈ ఎరుక నుంచి వాదాలు పుట్టుకొచ్చాయి. అందుకే గతంలో సాంఘిక ఆధిక్యాలను వ్యతిరేకించిన ఆలోచనా ధారలకు ఇప్పటి ఆలోచనలకు మౌలికమైన తేడా ఉన్నది. కాలం మారడం వల్ల వచ్చిన తేడా అనుకోవడం పైపై వ్యవహారం. మన సమాజం ఆధునికతలోకి ప్రవేశించడమే అప్పటికీ ఇప్పటికీ ఉన్న ముఖ్యమైన తేడా.

ఉదాహరణగా చెప్పాలంటే - వైదిక భావజాలాన్నీ, ఆధిక్యాన్నీ దునుమాడిన భక్తి ఉద్యమానికి, (వాటికీ అబ్రాహ్మణ, దళిత, బహుజన కులాల సామాజిక అస్తిత్వమే ప్రేరణ) ఆ తర్వాత వచ్చిన అస్తిత్వ ఆలోచనలకు, సాంఘిక ఉద్యమాలకు మధ్య ఈ తేడా చూడొచ్చు. చారిత్రకంగా మన సమాజం ఆధునికతలోకి ప్రవేశించడమే ముఖ్యమైన తేడా.

దీన్ని కూడా రెండు దశల్లో చూడవచ్చు. ఈ ఆధునికత మొదలైన తొలినాళ్ల ( ఉదాహరణకు ఫూలే) ఉద్యమాలు ఆధునికత మీద ఏర్పరుచుకున్న వైఖరికీ, ఆ తర్వాత వచ్చిన సాంఘిక ఉద్యమాలు ఆధునికత మీద ఏర్పరుచుకున్న వైఖరికీ తేడా ఉన్నది. ఫూలే తదితరులు మన స్థానిక సమాజానికంటే వలసవాదుల ఆధునికత చాలా ప్రగతిదాయకమని భావించారు. దీనికి కారణం ఏమంటే ... ఆధునికతకు రెండు ముఖ్యమైన లక్షణాలు ఉంటాయి. ఒకటి : సమాజంలో హేతు చింతన పెరగడం, రెండు : సమాజం వ్యవస్థా బాహుళ్యంగా మారడం. ఈ రెండిటి వల్ల పాత సమాజంలోని బర్బరత్వం నశించి, సాంఘిక జీవితంలో విముక్తి వస్తుందని భావించారు. దాని కోసం వారు వలసవాదాన్ని ఆశ్రయించడానికి కూడా వెనుకాడలేదు. రెండో తరం సాంఘిక ఉద్యమకారుల్లో ముఖ్యుడైన అంబేద్కర్ కాలం నాటికి వలస వ్యతిరేక ఉద్యమం వెల్లువ సాగుతూ ఉండేది. దానికి జాతీయ భావన, సామ్రాజ్యవాద వ్యతిరేకత అనేవి ప్రబలంగా ముందుకు వచ్చాయి. ఈ ప్రత్యేక వాతావరణంలో అంబేద్కర్‌లాంటి వారు సాంఘిక ఉద్యమానికి ప్రాధాన్యత ఇచ్చినందువల్ల సామ్రాజ్యవాద ఏజెంట్లు అనే విమర్శ కూడా ఎదుర్కోవలసి వచ్చింది. ఇక అధికార మార్పిడి తర్వాత సాగుతున్న సాంఘిక ఉద్యమాలు ప్రధానంగా ఈ ఆధునితలో తమకు అన్ని రకాలుగా దక్కాల్సిన చోటు కావాలని కోరుకుంటున్నాయి. ఆధునిక పూర్వ బంధనాల నుంచి మానవ జీవితాన్ని విముక్తం చేయలసిన ఆధునికత ఆ పని చేయలేదనే విమర్శ నుంచి ఈ ఉద్యమాలు తలెత్తాయి.

ఇప్పుడు ఈ ప్రస్తావన ఎందుకు అవసరమైందంటే - పాత అబ్రాహ్మణ ఉద్యమాలకూ, ఇప్పటి అస్తిత్వ వాదాలకూ ముఖ్యమైన తేడా ఉన్నదని గుర్తించడం వల్ల ఈ విషయంలో సిద్ధాంత ఆచరణకు దారి సులువు అవుతుంది. అయితే అస్తిత్వ వాదాలు తమ వాదనకు ఒక చారిత్రక భూమికను నిర్మించడానికి గతంలో జరిగిన తిరుగుబాట్లకు, ఆధిక్య భావజాలానికి వ్యతిరేకంగా వికసించిన ఆలోచనలకు తాను వారసురాలినని చెప్పుకుంటాయి. ఇది ఏ వాదంలోనైనా, ఉద్యమంలోనైనా ఉండేదే. అసలు అవన్నీ ప్రజల చరిత్ర అనే ఖజానాలోని విలువైన సంపద. ఆధునిక చైతన్యం వల్ల రూపొందిన వాదాలు ఆ సంపద ఎంత విలువైనదో, అది ఎట్లా మరుగునపడిపోయిందో, దాన్ని ఎట్లా చిన్నబుచ్చారో తమ పద్ధతిలో వివరిస్తాయి. ఈ తేడా పట్ల స్పష్టత ఉంటే - అస్తిత్వాల గురించి , అస్తిత్వవాదాల గురించి మాట్లాడడంలో ఉన్న తేడా కూడా తెలుస్తుంది. సాంఘిక అస్తిత్వాలను శాస్త్రీయ సామాజిక సిద్ధాంతంగా మార్క్సిజం ఎలా వివరిస్తుంది? అనేది ముఖ్యమైన సిద్ధాంత కృషికి దారి దొరుకుతుంది.

అస్తిత్వాలు - మార్క్సిజం అనే విషయంలోకి వెళ్లేముందు మార్క్సిజం గురించి మనం ఏమనుకుంటున్నాం? అని ఒకసారి ఆలోచించడం బాగుంటుంది. మార్క్సిస్టులకు ఉండే అపారమైన ఆచరణ బలం వల్ల ఉద్యమ సంప్రదాయం నుంచి, నిర్మాణాల సొంత చరిత్ర నుంచి మార్క్సిజం గురించిన ఆలోచనలు పోగవుతుంటాయి. అందుకే మార్క్సిజాన్ని ఆచరణ శాస్త్రమని అంటారు. అయితే - మార్క్సిజాన్ని నేర్చుకోవడంలో నిర్మాణాల, ఉద్యమాల అధ్యయన సంస్కృతి పాత్ర కూడా ఉంటుంది. అవి ఒక రకమైన ఒరవడని అందిస్తాయి. తప్పని సరిగా ఉద్యమాచరణ నుంచి, నిర్మాణాల నిర్వహణ నుంచి కలిగే జ్ఞాన సముపార్జనా క్రమాన్ని గౌరవిస్తూనే దాన్ని కూడా నిగ్గుతేల్చగల శాస్త్రీయ పద్ధతి మార్క్సిజంలో ఉన్నదని బహుశా అందరూ అంగీకరిస్తారనుకుంటాను. అలాంటి దేమీ లేదనుకుంటే ఒక చిక్కు వస్తుంది. అదేమంటే ఎవరి అనుభవం? ఏ అనుభవం నుంచి ఏ నిర్మాణం... లేదా ఏ ఉద్యమం ...ఏ సమయంలో గడించిన అనుభవం గురించి మాట్లాడుకుంటున్నాం? అనే ప్రశ్న ఎదురవుతుంది. ఇది తప్పక సాపేక్షవాదానికి దారి తీస్తుంది. కావట్టి మార్క్సిజం గురించిన మన అధ్యయనం మీద ఎన్ని ప్రభావాలు, వారసత్వాలు, ఒరవడులు ఉన్నా మార్క్సిజంలోని కీలకమైన చారిత్రక భౌతికవాదంలోని శాస్త్రీయతే గీటురాయి కావాలి. అయితే చారిత్రక భౌతికవాదం అంటే ఏమిటి? అనే విషయంలోనే మన ఉద్యమ చరిత్రలో కూడా తీవ్రమైన సంవాదం జరిగింది. చారిత్రక భౌతికవాదాన్ని తత్వశాస్త్ర దృష్టితో చూసే సంప్రదాయం కూడా ఉన్నది. అంటే... సంవిధాన పరమైన సమస్యలు ఈ గోదాములో వెన్నాడుతున్నాయన్నమాట. అసలు ఈ నుడికారమే పాత వ్యవహారమనుకొనేవాళ్లుండవచ్చు. చారిత్రక భౌతికవాదం ఊసే లేకుండా అస్తిత్వాల గురించి మాట్లాడబోతే అది సుమారుగా అస్తిత్వవాదాల ఆలోచనా తలంలో నుంచి మార్క్సిస్టుల వ్యాఖ్యానం అయ్యే ప్రమాదం ఉంది.

మార్క్సిస్టులుగా అనేక సందర్భాల్లో, పలు రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక సమస్యలపై వెలిబుచ్చుతూ వచ్చిన వైఖరులన్నీ మార్క్సిస్టు సిద్ధాంతం నుంచే పుట్టకొచ్చాయని చెప్పగలమా? అని సందేహించడం తప్పేమీ కాదు. ఆ వైఖరులు రోజువారీ ఉద్యమ నిర్వహణకు దోహదపడినంత మాత్రాన అవన్నీ

సిద్ధాంతం నుంచే రూపొందాయనుకుంటే చిక్కుల్లో పడిపోతాం. మనం వెలుబుచ్చే వైఖరులనూ, మార్క్సిజాన్ని మనం అధ్యయనం చేసే పద్ధతులను కూడా తరచి చూసుకోకుండా ఏ సమస్యతోనూ సిద్ధాంత తలంలో వ్యవహరించలేం.

**4**

మార్క్సిజంలోని రాజకీయ సిద్ధాంతం అత్యంతానికి అత్యంత ప్రాధాన్యత ఇస్తూనే మార్క్సిజాన్ని సామాజిక సిద్ధాంతంగా గుర్తించడం కూడా అంతే ముఖ్యం. చారిత్రక భౌతిక వాదాన్ని శాస్త్రీయ సామాజిక సిద్ధాంతమని అనుకుంటే సాంఘిక అస్తిత్వాల విశ్లేషణకు అంతకు మించిన సాధనం మరొకటి లేదు. చరిత్ర పుట్టుక, దాని సాధారణ గమన నియమాలు, సమాజంలోని వ్యవస్థల పుట్టుక, వాటి పరిణామం, సామాజిక జీవితంలోని వివిధ స్థాయిల మధ్య జరిగే సంపర్కాలు, వాటి వల్ల వివిధ రంగాల్లో ఉత్పన్నమయ్యే పరిణామాలు తెలుసుకోగలిగే శాస్త్ర పద్ధతి మీద ఆధారపడినప్పుడే ఏ సామాజిక సమస్య అయినా సరిగా అర్థం అవుతుంది. అంటే - దీర్ఘకాలావధిలో, చరిత్ర అట్టడుగు పొరల్లో ఆ సమస్య ఎలా పరివర్తన పొందుతున్నదో వివరించాల్సి ఉన్నది.

ఒక మనిషి తన గురించి తాను ఏమనుకుంటున్నాడు అనే దానిపై ఆధారపడి ఎట్లా అంచనా వేయరాదో అలాగే పరివర్తనా దశలో ఉన్న ఒక సమాజాన్ని ఆనాటి దాని చైతన్యంపై ఆధారపడి అంచనా వేయరాదు.. అనే మార్క్స్ అభిప్రాయం శాస్త్రీయతపట్ల ఆయన వైఖరిని తెలియజేస్తుంది. ఇందులో ఒక ముఖ్యమైన అంశం ఉంది. సమాజం ఒక వాస్తవంలో మనిషి జీవిస్తున్నాడంటే దానికి సంబంధించిన భావజాల ప్రభావంలో ఉనికిలో ఉన్నట్టు లెక్క. అయితే ఆ భావజాలమే వాస్తవం కాదు. అందుకే మార్క్స్ దాన్ని తప్పుడు భావజాలం అని అన్నాడు. భావజాల విమర్శకుడిగా ఆయన దాన్నుంచి బయట పడాలంటే సమాజమనే వాస్తవాన్ని తెలుసుకోడానికి శాస్త్రం అవసరాన్ని గుర్తించాడు. సామాజిక శాస్త్రం లేకుండా భావజాలం ద్వారా వాస్తవికతను వివరించలేం... దాని మార్పులో క్రియాశీలంగా వ్యవహరించలేం అనే అవగాహనని దృఢంగా నిలబెట్టడానికి అవసరమైన సామాజిక సిద్ధాంతాన్ని నిర్మించాడు. లేకపోతే వాస్తవికత గురించి మనకు ఏ అనుభవం కలుగుతుందో అదే సత్యమైపోయే ప్రమాదం ఉంది. అనుభవంలో భావజాలం కలగలసి ఉంటుంది. ఇది అనుభవ వాదానికి దారి తీస్తుంది. మార్క్స్ అనుభవవాదాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తాడు. అయితే అనుభవానికి ఏ ప్రాధాన్యత ఉండదని కాదు. అనుభవం ఆధారంగా సిద్ధాంతం నిర్మించలేం.. అనుభవం కూడా సామాజిక చరిత్ర అనే మొత్తంలో పరివర్తనాయుతంగా ఉంటుంది కాబట్టి దాన్ని శాస్త్రీయంగా వివరించలేం అని మాత్రమే మార్క్స్ ఉద్దేశం. ఉదాహరణకు అనుభవానికి సాహిత్య సృజనలో కీలక పాత్ర ఉంటుంది. అలాంటి సాహిత్యంలో చిత్రితమైన జీవితం సామాజిక వాస్తవికతను అర్థం చేసుకోడానికి వనరుగా ఉపయోగపడుతుంది. సామాజిక సిద్ధాంత విషయాలు ... అనుభవాలు వేర్వేరు తలానికి చెందినవి అని గుర్తించడానికే ఈ వివరణ.

అందువల్ల అస్తిత్వాల గురించి, అనుభవాల గురించి ఆ సాంఘిక అనుభవం ఉన్నవారి అనుభవ తలం మీద ఆధారపడి మాత్రమే దానికి సంబంధించిన సామాజిక వాస్తవికతను అంచనా వేయలేం. అదే నిజమైతే సిద్ధాంతమంటూ మరొకటి అవసరం లేదు. ఈ మాట అస్తిత్వ సమర్థకులకే కాదు, అస్తిత్వాల గురించిన చర్చ అంటే అస్తిత్వవాదుల మాటలపై, వాదాలపై చర్చ అనుకొనే మార్క్సిస్టులకు కూడా వర్తిస్తుంది. ఆ చైతన్యం ఎందుకు అలా ఉన్నదో భౌతిక జీవితంలోని వైరుధ్యాల ద్వారా వివరించాల్సి ఉంటుంది.. అని కూడా మార్క్స్ అంటాడు. దాన్ని ఒకే ఒక మాటలో చెప్పాలంటే ... సామాజిక ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్యఉన్న ఘర్షణను వివరించవలసి ఉంటుంది.

ఉత్పత్తి శక్తుల అభివృద్ధి నిరంతరాయమైనది. ప్రకృతితో మానవ జాతికి ఉండే సంబంధంలో నిరంతరం నేర్చుకోవడం అనే ప్రక్రియ నడుస్తుంటుంది. ప్రకృతితో మానవజాతికి నిర్మాణయుత సంబంధం మాత్రమే ఉంటుంది. ప్రకృతికి...మానవ సమాజానికి ఉన్న సంబంధంలో నుంచే ఉత్పత్తి శక్తుల అభివృద్ధి జరుగుతుంటుంది. మానవ సమాజం బంధ వ్యవస్థ కాదు, పాక్షికంగా ప్రకృతిలోకి తెరుచుకొని ఉంటుంది. ఉత్పత్తి శక్తుల రూపంలో ప్రకృతి మానవ సమాజం మీద ప్రభావం చూపుతుంది. సమాజం లోపల ఉండే ఆంతరంగిక నిర్మాణ సంబంధాలు లేకపోతే సమాజానికి .... అంటే మానవ జాతికి చరిత్ర-అంటూ ఉండదు. ప్రకృతి చరిత్ర మాత్రమే ఉంటుంది. అప్పుడు సమాజం ఎందుకు ఇట్లా ఉన్నది? అందులో మార్పుకు కారణం ఏమిటి? అనే ప్రశ్నలు ఎదురవుతాయి. చారిత్రక భౌతికవాదంలోని ముఖ్యమైన విషయాలివి.

'ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి వ్యక్తీకరణలుగా ఉన్న ఉత్పత్తి సంబంధాలు వాటికి అవరోధంగా మారుతాయి. అప్పుడు సాంఘిక విప్లవాల యుగం ప్రారంభమవుతుంది..' అంటాడు మార్క్స్. ఇక్కడ మార్క్స్ పునాది - ఉపరితలం అనే రూపకాన్ని వాడాడు. పునాది అంటే ఆ చారిత్రక యుగంలో ఆధిక్యంలో ఉన్న ఉత్పత్తి సంబంధాలని అర్థం. దానికి అనురూపమైన ఉపరితలం ఏర్పడుతుంది. అయితే ఉత్పత్తి సంబంధాల్లో పాత సమాజంలోని ఉత్పత్తి సంబంధాలు కూడా కలిసి ఉంటాయి. శుద్ధ ఉత్పత్తి సంబంధాలు ఎక్కడా ఉండవు. పాత ఉత్పత్తి సంబంధాలు కొత్త పునాదితో, ఉపరితలంతో ఎలాంటి సంబంధంలో ఉంటూ మనుగడ సాధిస్తున్నాయనేది చాలా ముఖ్యమైన విషయం.

ఉత్పత్తిశక్తుల అభివృద్ధి స్థాయికి అనుగుణంగా ఉత్పత్తి సంబంధాలు అనే స్ట్రక్చర్ ఏర్పడ్డాక ఆ సంబంధాల్లో మార్పు ఎలా వస్తుంది? అనేది కీలక ప్రశ్న. దీర్ఘకాలావధిలో సామాజిక చరిత్ర ఎలా పరిణామం చెందింది అనే దానికి సంబంధించిన ప్రశ్న ఇది. చరిత్రకు సంబంధించిన దీర్ఘకాల గమనం ఎలా ఉంది? అందులో మార్పులు ఎలా జరిగాయి? అనేవి వివరించడం మార్క్సిజం

లక్ష్యాలు. కచ్చితత్వాన్ని కోల్పోకుండా ఆచరణాత్మక దృష్టితో ఈ లక్ష్యాన్ని సాధించాల్సి ఉంటుంది. చరిత్రలో మౌలిక మార్పు అంటే ఒక స్ట్రక్చర్ మరో స్ట్రక్చర్‌గా పరివర్తన పొందడమే. ఇక్కడే మార్క్స్ మానవకర్తృత్వం పాత్రను గుర్తించాడు. చారిత్రక ప్రపంచమనేది ప్రకృతిలో భాగమైనా మార్క్స్ సమాజంలోని మార్పును మానవ ఆచరణ పునాదిగా గుర్తించాడు. ప్రకృతి నియమాలకూ.. సామాజిక వ్యవస్థలకు (ఇక్కడ వ్యవస్థ అంటే సిస్టం కాదు, ఇనిస్ట్యూషన్లు) మధ్య మానవ ఆచరణ సాగుతుంది. ఉత్పత్తి సంబంధాల మొత్తమైన స్ట్రక్చర్‌ను.. అందులో మార్పుకు కారణమయ్యే మానవకర్తృత్వాన్ని మార్క్స్ సమ ప్రాధాన్యంలో గుర్తించాడు. చరిత్ర పట్ల భౌతికవాద దృక్పథాన్ని చెప్తూ అయన తన సంవిధానాన్ని వివరించాడు.

## 5

చారిత్రక భౌతికవాదంలోని ఈ పద్ధతి తప్ప సాంఘిక అస్తిత్వాల విశ్లేషణకు మరో మార్గమేమీ లేదు. సాంఘిక అస్తిత్వాలు - ఉత్పత్తి సంబంధాలు అని పరిశీలిస్తే అస్తిత్వవాదాల కంటే భిన్నంగా చారిత్రకభౌతికవాద పద్ధతి పాటించినట్టవుతుంది. లేకపోతే అస్తిత్వాల గురించి మనం ఎక్కడ నిలబడి మాట్లాడుతున్నామో మనకే తెలియదు. అప్పుడు సహజంగానే వేర్వేరు అస్తిత్వవాద సమర్థకుల మాటలు మనల్ని ప్రేరేపిస్తుంటాయి. లేదా మనమే మార్క్సిస్టు ప్రవచనాల పేరుతో అస్తిత్వాల గురించి మరో రకమైన అస్తిత్వవాదాన్ని వినిపిస్తుంటాం. అందుకే మార్క్సిస్టులు అస్తిత్వాల గురించి మాట్లాడుతున్నప్పుడు చారిత్రకభౌతికవాదమనేదాన్ని కనీసంగా పరిగణనలోకి తీసుకొని మాట్లాడుతున్నారా? ఆ ఊసే లేకుండా మాట్లాడుతున్నారా? అనేది ముఖ్యం. పీడిత అస్తిత్వాల ఆకాంక్షలు, వాటి మధ్య సమన్వయం, వాటి సాధన మొదలైనవి వాటిపట్ల ప్రజాస్వామిక వైఖరికి సంబంధించినవి. అవి చాలా విలువైనవి. వాటి కోసం తప్పక కృషి చేయవలసిందే. ఈ మాటలే అస్తిత్వాల పట్ల మార్క్సిస్టుల సిద్ధాంత విశ్లేషణ కాజాలవు. మార్క్సిస్టులు తీసుకున్నట్టవు అయితే మొదట ఒక స్పష్టత అవసరం. సాంఘిక అస్తిత్వాలు చాలా బలీయమైన భౌతిక వాస్తవంగా ఉన్నాయి కాబట్టి వాటిని ఉత్పత్తి సంబంధాల్లో భాగంగా చూసే అలవాటు ఉంది. కానీ ఇది కుదింపు వాదం. స్ట్రక్చర్ ప్రాధాన్యతను నొక్కిచెప్పేక్రమంలో ఈ పద్ధతి ముందుకు వచ్చింది. కంటి ముందు కనిపించే వాస్తవికతకు భౌతిక పునాది ఉండాలంటే అది అనివార్యంగా ఉత్పత్తి సంబంధాల్లోనే ఉండి ఉండాలి.... ప్రతి వాస్తవితకతను ఉత్పత్తి సంబంధాల ఆధారంగా విశ్లేషించినప్పుడే భౌతికవాదం అవుతుంది.... ఉత్పత్తి సంబంధాల ప్రాధాన్యతను పాటించినట్టవుతుంది.. అనే పద్ధతి మార్క్సిస్టు శిబిరంలో గట్టిగా ఉన్నది. సమాజమనే మొత్తాన్ని, అందులోని రాడికల్ మార్పులను అధ్యయనం చేయడానికి ఉత్పత్తి సంబంధాలు కేంద్రంగా ఉండాల్సిందే. చారిత్రక భౌతికవాదంలోని అత్యంత కీలకమైన విషయం ఇది.

అయితే సమాజమనే మొత్తంలో ఉత్పత్తి సంబంధాలు ఉన్నట్లే ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు కూడా ఉంటాయి. వీటని నిరాకరించడం కానీ, లేదా వీటిని కూడా ఉత్పత్తి సంబంధాల్లో భాగం చేయడం మార్క్సిజం కాదు. సమాజమనే మొత్తంలో ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు కూడా ఉంటాయని గుర్తించకపోతే సమాజంలోని క్లిష్టత అర్థం కాదు. సామాజిక సంబంధాల్లో ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు రెండూ ఉంటాయి. మాట వరసకు రెండూ ఉంటాయని అంగీంకరించినా వీటిలో ఉత్పత్తి సంబంధాలు మాత్రమే భౌతిక పునాది అనే ధోరణి ఉన్నది. ఉత్పత్తేతర సామాజిక సంబంధాలను కూడా ఉత్పత్తి సంబంధాల్లో కలిపి చర్చించే పద్ధతి కూడా ఉన్నది. ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు ఎలా ప్రభావితం చేసుకుంటాయనేది చాలా ముఖ్యమైన విషయం. దానికంటే ముందు సమాజమనే పూర్ణాన్ని అర్థం చేసుకోడానికి ఉత్పత్తి సంబంధాలను కేంద్ర స్థానంలో ఉంచుతూనే, ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు కూడా ఉన్నాయని అంగీరించాలి. సాంఘిక అస్తిత్వాలనే గడ్డు వాస్తవానికి ఏదో ఒక భౌతిక పునాది ఉండాలి కదా? అనే ప్రశ్న భౌతికవాదులకు తప్పని సరిగా ఎదురయ్యేదే. ఉత్పేత్తేర సామాజిక సంబంధాల్లో కూడా భౌతిక పునాది ఉంటుంది. ఇట్లాగాకపోతే సాంఘిక అస్తిత్వాలు ఏర్పడడానికి కారణం ఏమిటి? అనే ప్రశ్నను మార్క్సిస్టులు ఎన్నటికీ సంతృప్తికరంగా వివరించలేరు. చారిత్రక భౌతిక వాదాన్ని ఆశ్రయించకుండా అభిప్రాయాలు ఎన్ని చెప్పినా వాటికి సిద్ధాంత లక్షణం రాదు. గెలిచి తీరాల్సిన పోరాట రంగస్థలం పొలిమేరలోనే ఆగిపోయి తచ్చాడినట్లవుతుంది. మన కళ్ల ముందున్న సమాజాన్నీ, జటిలమైపోతున్న సామాజిక అనుభవాన్నీ ఎన్నటికీ విడమర్చుకోలేం.

ప్రపంచవ్యాప్తంగా పాత సమాజాల కంటే ఆధునిక సమాజాలు సంక్లిష్టం కావడం గమనించవచ్చు. మన దేశంలో కూడా పాత సమాజానికంటే ఆధునిక సమాజం చాలా సంక్లిష్టంగా తయారైంది. దీనికి కారణం ఏమంటే ఒకప్పుడు ఆర్థిక సాంఘిక సంబంధాలు పెనవేసుకొని ఒకే వ్యవస్థగా ఉండేది. తర్వాత అవి వేరవుతూ సమాజం బహుముఖీనం అయింది. దానికి కారణం ఉత్పత్తేతర సామాజిక సంబంధాలనేవి ఉండడం, వాటిదైన పాత్ర సమాజంలో ఉండడం. అన్నిటినీ ఉత్పత్తి సంబంధాల్లో భాగంగా చెప్పి, అందులోఎదురయ్యే వైఫల్యాన్ని చారిత్రక భౌతికవాదానికి అంటగట్టినట్టవుతుంది. ఉత్పత్తేతర సామాజిక సంబంధాలతో ఉత్పత్తి సంబంధాలు ఎలా వ్యవహరిస్తాయనే విషయాన్ని పట్టించుకోకపోవడ వల్ల ఉత్పత్తి సంబంధాల ప్రాధాన్యతను కూడా తగ్గించినట్లు అవుతుంది.

సామాజిక వ్యవస్థలకు కూడా నిర్దిష్ట చరిత్ర ఉంటుంది. వాటిని ఎలా వివరించడానికి ఉత్పత్తి సంబంధాల దగ్గరికి వెళ్లామంటే చాలా చిక్కు సమస్యలు వస్తాయి. అయితే సామాజిక సంబంధాలు లేదా వ్యవస్థలు ఎలా పుట్టాయి? ఎలా పరివర్తన పొందాయి? ఎట్లా పునరుత్పత్తి అవుతున్నాయి? అనేవాటిని (వాటి చలనలంలో,

చారిత్రక సందర్భంలో..) అర్థం చేసుకోడానికి ఉత్పత్తి సంబంధాలు ఉపయోగపడతాయి. ఉత్పత్తి సంబంధాలనేవి సమాజంలోని ఇతర అంశాలకు ఒక రకమైన కండీషన్‌ను విధిస్తాయి. అంతేగాని సామాజిక సంబంధాల్లోని ప్రతి చిన్న అంశాన్నీ ఉత్పత్తి సంబంధాల్లో భాగం చేసి చూడడం వల్ల కుదించినట్టవుతుంది. సమాజమనే మొత్తంలో సాంఘిక వ్యవస్థల పాత్రను విస్మరించినట్టవుతుంది. అంతేగాక ఉత్పత్తి శక్తులు - ఉత్పత్తి సంబంధాల మధ్య ఘర్షణ చరిత్ర అభివృద్ధికి దారితీస్తుందనే చారిత్రక భౌతిక వాదంలో సాంఘిక అస్తిత్వాలను వివరించడానికి అవకాశం లేదనే అసంగత విమర్శకు అవకాశం ఇచ్చినట్టవుతుంది. మార్క్సిస్టు పద్ధతిలోని వైశాల్యాన్ని పట్టించుకోకపోవడం కూడా అవుతుంది.

కాబట్టి ... ఉత్పత్తి సంబంధాల స్ట్రక్చర్ - మానవకర్తృత్వం అనే మార్క్స్ సంవిధానంలో భాగంగా ఉత్పత్తి సంబంధాలు - ఉత్పత్త్యేతర సామాజిక సంబంధాలు ఎలా ప్రభావితం చేసుకుంటాయి? అని ఆలోచించాల్సి ఉంటుంది.

ఉత్పత్తి సాధనాల మీది యాజమాన్యంలో, ఉత్పత్తి క్రమంలో ఏర్పడే సంబంధాల్లో, అదనపు విలువ ఉత్పత్తి - సంగ్రహణంలో వర్గం అనే కేటగిరీ కనిపిస్తుంది. అంటే ఉత్పత్తి సంబంధాల నుంచి పుట్టే వర్గం అనే కేటగిరీని అదనపు విలువ దోపిడీ ప్రాతిపదిక నుంచి మార్క్స్ విశ్లేషించాడు. పెట్టుబడిదారీ వ్యవస్థలో అదనపు విలువ దోపిడీని గుర్తించడం వల్లే మార్క్స్ వర్గాన్ని స్పష్టంగా చూడగలిగాడు.

వ్యవసాయం, వ్యవసాయాధారిత వృత్తులు కలిసి ఏకైక ఆర్థిక వ్యవస్థగా ఉన్న కాలం మనకు ఒకటి ఉండేది. ఆ రకమైన ఉత్పత్తి సంబంధాలు ఏర్పడే దశలో మన దేశంలో బలమైన సాంఘిక సంబంధాలు కూడా పుట్టాయి. ఆ దశలో ఉత్పత్తి సంబంధాలు - సాంఘిక సంబంధాలు అతి దగ్గరిగా ఉండేవి. ఆనాటి ఉత్పత్తి సంబంధాల నుంచి ఆ రకమైన సాంఘిక సంబంధాలు పుట్టాయి. అందు వల్ల వాటి మధ్య తేడా కనిపించేది కాదు. ఆ సమాజంలో అదనపు సంపద దోపిడీ అనేది ఆచారం మీద, కట్టుబాట్ల మీద, నమ్మకాల మీద ఆధారపడి సాగేది. అంటే ఉత్పత్తి సాధనాల మీది యాజమాన్యం చట్టం ద్వారా సంక్రమించిన సమాజం కాదది. దళితులకు భూమిపై హక్కు లేదని, మహిళలకు సంపదపై హక్కు లేదనే భావజాలం ద్వారా అగ్రకులాలు, రాజులు, మగవారు సంపదపై ఆధికారాన్ని సంపాదించుకున్నారు. అదనపు సంపద దోపిడీని సుస్థిరం చేసుకున్నారు. అంటే సాంఘిక సంబంధాల్లో అంతరాల ద్వారా ఆర్థిక దోపిడీ జరుగుతుండేది. తక్కువ స్థాయి పనులన్నీ దళితుల చేత చేయించుకోడానికి, కుటుంబంలో స్త్రీల శ్రమను దోచుకోడానికి, కౌలు రైతులను భూస్వాములు దోచుకోడానికి ఆ రోజుల్లో సాంఘిక కట్టుబాట్లే కారణం.

ప్రపంచ వ్యాప్తంగా కూడా పాత సమాజాలు ఇట్లాగే ఉండి ఉంటాయి. అన్ని చోట్లా సామాజిక అంతరాలు ఉంటాయి. అవి దోపిడీకి, రాజకీయాధికారానికి కారణమయ్యాయి. ఫలానా ఉత్పత్తి సంబంధాలు అన్నిదేశాల్లో ఒకేలా ఉంటాయనడానికి వీల్లేదు. అట్లాగే ఉత్పత్త్యేతర సామాజిక సంబంధాలు కూడా అన్ని దేశాల్లో ఒకేలా ఉండవు. వాటి తేడాలనుబట్టి సాంఘిక వ్యవస్థలు, సాంఘిక అస్తిత్వాలు కూడా ఏర్పడ్డాయి. అసలు మార్క్స్ పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాల విశ్లేషణే అమూర్తమైనది. ఆయన ఒక నమూనాగా బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానాన్ని పరిశీలించాడు. ప్రపంచంలోని పెట్టుబడిదారీ వ్యవస్థలన్నీ అట్లాగే లేవు. ఇంగ్లండ్‌లో పెట్టుబడిదారీ విధానంతోపాటు ఆధునికపూర్వ లక్షణాలు కూడా కనిపిస్తాయి. ఏ సమాజంలో కూడా శుద్ధ ఉత్పత్తి సంబంధాలు ఉండవు.

మన దేశంలో పాత ఉత్పత్తి సంబంధాలు మారే క్రమంలో ఆనాటి సాంఘిక సంబంధాలు ఉత్పత్త్యేతర సామాజిక సంబంధాలుగా మిగిలిపోయే క్రమాన్ని తీసుకున్నాయి. అంటే పాత ఉత్పత్తి సంబంధాలు మారిపోయినా (సాపేక్షంగానే కావచ్చు) ఉత్పత్తితో నేరుగా సంబంధం లేని సాంఘిక సంబంధాలు కొనసాగుతూ వచ్చాయి.

మన దేశంలో వలసవాదానికి ముందున్న ఉత్పత్తి సంబంధాల ప్రత్యేక లక్షణం వల్ల సాంఘిక అంతరాల మీద ఆధారపడి ఆర్థిక దోపిడీ జరిగేది. చారిత్రకంగా వలసవాదం అన్ని స్థానిక సమాజాల్లో వలెనే మన దేశంలో కూడా ఈ రకమైన స్థానిక వ్యవస్థల్లో మార్పు తెచ్చింది. వలసవాదం మన దేశీయ సాంఘిక వ్యవస్థల్లో నేరుగా ఎంత మార్పు తెచ్చిందనే చర్చనీయాంశమే అయినా ఆర్థిక వ్యవస్థ సాంఘిక అంతరాల మీద ఆధారపడి కొనసాగే ఆధునిక పూర్వ స్థితిలో మార్పుతీసుకొని వచ్చింది. వలసవాదం ఒక రాజకీయార్థిక వ్యవస్థ. దానికి దానిదైన నియమాలు, చలనాలు ఉన్నాయి. పైగా భారత సమాజంలో దానికి దీర్ఘకాలిక వ్యూహం ఉన్నదని అందరూ అంగీకరించేదే. అందు వల్ల మన దేశపు సాంఘిక వ్యవస్థల్లో ముఖ్యమైన కుల వ్యవస్థ, కుటుంబ వ్యవస్థలో వలసపాలన నేరుగా జోక్యం చేసుకోకపోయినా అవి ఆర్థిక వ్యవస్థతో పెనవేసుకొని పోయిన స్థితిలో అయితే మార్పు తెచ్చింది. అంతమాత్రాన పూర్తిగా మార్పు వచ్చిందని చెప్పలేం. ఎందుకంటే వలసవాదం ఉత్పత్తి సంబంధాల్లో తెచ్చిన మార్పు వల్ల పాత సంబంధాలు పూర్తిగా తుడిచిపెట్టుకపోలేదు. పారిశ్రామిక విప్లవానికి పురిటిగడ్డ అయిన బ్రిటన్ పెట్టుబడిదారీ వ్యవస్థనే శుద్ధ వ్యవస్థ కాదని పైన చెప్పుకున్నాం. భారత దేశంలో నేటికీ పోడు వ్యవసాయం, మనుగడ కోసం వ్యవసాయం అనే ఉత్పత్తి రూపాలూ ఉనికిలో ఉన్నాయి. అత్యంత బలహీనంగానైనా పాత ఉత్పత్తి సంబంధాలు మిగిలి ఉండడమేగాక అవి ఆమేరకు సాంఘిక సంబంధాలతో పెనవేసుకొని ఉన్నాయి. అయితే సమాజమనే మొత్తంలో వాటి పాత్ర చాలా తక్కువ అని మర్చిపోరాదు.

వలసవాదంతో ఆర్థిక, సాంఘిక వ్యవస్థల మధ్య దూరం

పెరిగాక సాంఘిక సంబంధాలు ప్రధానంగా ఉత్పత్తేతర సామాజిక, సాంస్కృతిక పాత్ర పోషిస్తున్నాయి. ఆర్థిక సంబంధమైన పాత్ర ఎక్కడైనా పోషించినా మొత్తం మన ఆర్థిక వ్యవస్థలో దాని ప్రభావం చెప్పుకోగలిగినంత లేదు. సుమారుగా వలసవాదం ఈ గడ్డ మీద స్థిరపడ్డప్పటి నుంచి సాంఘిక సంబంధాలు ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తేతర సామాజిక సంబంధాలుగా వేరైపోయే క్రమాన్ని చూడవచ్చు. పాత ఉత్పత్తి సంబంధాల్లో మార్పు రావడం వల్ల ఈ క్రమం జరిగింది. కొత్త ఉత్పత్తి సంబంధాలు రూపొందుతున్న క్రమంలో పాత ఉత్పత్తేతర సంబంధాలు కొనసాగడానికి కారణం అవి కూడా భౌతిక పునాదిలో భాగం కావడమే.

ఈ భౌతిక పునాది రెండు రకాలుగా సమకూరే అవకాశం ఉంది. ఒకటి : పాత ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు కూడా ఏదో ఒక మేరకు పరివర్తన పొందడం, రెండు: కొత్తగా రూపొందుతున్న ఉత్పత్తి సంబంధాల మీద, కొత్త సాంఘిక వ్యవస్థల మీద ఆధారపడి వాటిలో కూడా వ్యక్తం కావడం.. మన సామాజిక, సాంస్కృతిక జీవితానుభవం నుంచి ఈ రెంటినీ అనేక ఉదాహరణలతో వివరించవచ్చు. ఈ కారణాల వల్లనే సామాజిక క్రమం అనేది ఎలా పుడుతుంది? ఎలా పరివర్తన పొందుతూ ఉంటుంది? ఎలా పునరుత్పత్తి అవుతుంది? తదితర విషయాలను అర్థం చేసుకోడానికి ఉత్పత్తి సంబంధాల చట్రం ఉపయోగపడుతుంది. ఉత్పత్తి సంబంధాల ప్రాధాన్యత అక్కడ ఉంటుంది. ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు అన్ని సమాజాల్లో ఉంటాయని, వాటికి కూడా భౌతిక పునాది ఉంటుందని, శుద్ధ ఉత్పత్తి సంబంధాలు ఎక్కడా ఉండవనే వైఖరి చారిత్రక భౌతికవాదంలోని శాస్త్రీయతకు ఎంత మాత్రం అవరోధం కాదు. ఈ వైఖరి తీసుకోకపోతే ఉత్పత్తి సంబంధాలనే అట్టడుగు పొరలో దీర్ఘకాలావధిలో వచ్చే మార్పు ఆధారంగా ... దాని మీద నిర్మాణమైన అతి పెద్ద సంక్లిష్టమైన సాంఘిక జీవితాన్ని వివరించడం అయ్యేపని కాదు. ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు ప్రభావితం చేసుంటాయని ఒప్పుకోకపోతే సమాజంలోని క్లిష్టత అర్థం కాదు.

భౌతిక పునాది అనే విషయాన్ని ఇప్పుడు ఇలా చెప్పుకోవచ్చు. ఆధిక్యంలో ఉన్న ఉత్పత్తి సంబంధాలు, అంతరించిపోకుండా ఏదో ఒక మేరకు కొనసాగుతూ వస్తున్న పాత ఉత్పత్తి సంబంధాల అవశేషాలు, ఆకాలం నాటి ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు ఈ మూడూ కలిసి భౌతిక పునాది . ఉత్పత్తేతర సామాజిక సంబంధాలు నుంచి సాంఘిక అస్తిత్వాలు ఏర్పడతాయనే సిద్ధాంత చట్రం ప్రకారం పీడిత అస్తిత్వాల గురించి శాస్త్రీయ విశ్లేషణ ఇవ్వవచ్చు. దాని ఆధారంగా పీడిత అస్తిత్వాల విముక్తి పోరాటాలకు సరైన దారి దొరుకుతుంది.



# రచనలకు ఆహ్వానం

అరుణతార అనేక ఇబ్బందుల మధ్యనే విప్లవ సాహిత్య సాంస్కృతిక రంగంలో కృషి చేస్తోంది. విరసం అధికార పత్రికగా ప్రజా ఉద్యమాల పక్షాన నిలబడి ప్రగతిశీల విలువలను నిలబెట్టడంలో సోదర సాహిత్య, రాజకీయ, సామాజిక పత్రికలతోపాటు తన వంతు బాధ్యత నిర్వర్తిస్తోంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ పెచ్చరిల్లిన ఈ తరుణంలో విప్లవోద్యమంతోపాటు అనేక ప్రజా ధిక్కార స్వరాలు, నిరసనలు, పోరాటాలు వెల్లువెత్తుతున్నాయి. సామాజిక సంబంధాలను, విలువలను, ప్రజా ఆకాంక్షలను పాలకవర్గ విధానాలు ధ్వంసం చేస్తున్నాయి. ప్రజలు తమ వనరుల నుంచి, స్థావరాల నుంచి విస్థాపనకు గురవుతున్నారు. ప్రజల సహజీవన సంస్కృతి మీద దారుణమైన అణచివేత కొనసాగుతోంది. ఆదివాసుల పోరాటాల మీద రాజ్యం అతి పెద్ద స్థాయిలో యుద్ధం ప్రకటించిన సందర్భంలో మనం ఉన్నాం. అణగారిన ప్రాంతాలు, కులాలు, మహిళలు, మత మైనార్టీలు తీవ్ర అభద్రతలోంచే ఆత్మగౌరవం కోసం, న్యాయమైన ఆకాంక్షల కోసం పెనుగులాడుతున్నారు. ఈ సంఘర్షణను తెలుగు సృజనాత్మక సాహిత్యం అద్భుతంగా వ్యక్తీకరిస్తోంది. మారుతున్న ఈ సామాజిక సందర్భాన్ని తెలుగు రచయితలు గతం కంటే శక్తివంతంగా వివిధ ప్రక్రియల్లో ప్రజానుకూల చైతన్యాన్ని ప్రదర్శిస్తున్నారు, సామాజికవేత్తలు విశ్లేషిస్తున్నారు.

ఈ వ్యక్తీకరణలకు, విశ్లేషణలకు అరుణతార మరింతగా వేదిక కావాలని మా ఆకాంక్ష. కథ, కవిత్వం, పాట, విమర్శ, పుస్తక సమీక్ష, అనువాదాలతోపాటు విశాల ప్రజా సాహిత్య సాంస్కృతిక రంగంలోని ఏ విషయం మీదైనా రచనలు పంపండి. సాహిత్య, కళా సిద్ధాంత, భావజాలపరమైన వాదాలను, విమర్శలను, వివిధ భాషా సాహిత్యాల్లోంచి ప్రగతిశీల రచనలను అనువాదం చేసి పంపించండి. సామాజిక, రాజకీయ, ఆర్థిక అంశాల మీద, ఉద్యమాల మీద విశ్లేషణలు, నివేదికలు పంపించండి. రాజ్యహింసా రూపాల మీద వ్యాసాలు పంపండి. అమరులైన ప్రజా ఉద్యమ కార్యకర్తలు, బుద్ధిజీవులు, రచయితలపై స్మృతి వ్యాసాలు పంపించండి.

మీ రచనల వల్లే అరుణతార తాను నిర్దేశించుకున్న సాహిత్య, సాంస్కృతిక కర్తవ్యాలను, ప్రజా ఉద్యమ బాధ్యతలను మరింత శక్తివంతంగా నిర్వర్తించగలుగుతుంది. మీ రచనల వల్లే పత్రిక ప్రమాణాలు మరింత బలోపేతమవుతాయి. పత్రికలో వస్తున్న రచనల మీద ఎప్పటికప్పుడు అభిప్రాయాలను, విమర్శలను రాసి మా కృషిని మెరుగులు దిద్దండి. అన్ని రకాలుగా మీ నుంచి సహకారాన్ని కోరుతూ...

\- సంపాదకుడు

పుస్తకపరిచయం

# జాన్ మిల్లింగ్‌టన్ సిన్జ్ "రైడర్స్ టు ద సీ" తెలుగులో 'విషాదనాయిక మోరియా'!

- పి.వరలక్ష్మి

ఇంగ్లిషు సాహిత్యంతో పరిచయం ఉన్న వాళ్ళకు ఈ విషాద ఏకాంకిక గురించి చెప్పనవసరం లేదు. ఐర్లాండ్ దేశంలోని ఆరన్ ద్వీప మత్స్యకారులపై 20వ శతాబ్దం మొదట్లో వచ్చిన 'రైడర్స్ టు ద సీ' నాటిక ప్రపంచ ప్రసిద్ధి చెందింది. విమర్శకుల ప్రశంశలందుకుంది. సిన్జ్ నాటికల్లో ఐర్లాండ్ గ్రామీణ సమాజపు కవితాత్మక నుడికారం ఆకట్టుకుంటుంది. ఆ సౌందర్యాన్ని పోనివ్వకుండా 'విషాద నాయిక మోరియా'గా దీనిని తెలుగులోకి తీసుకొచ్చిన శివలక్ష్మిగారికి అభినందనలు.

విషాదనాయిక
మోరియ
ఏకాంకిక
జాన్ మిల్లింగ్టన్ సిన్జ్
స్వేచ్ఛానువాదం: శివలక్ష్మి

సముద్రంలోని కల్లోలాన్నంతటిని తమ జీవితంలో నింపుకున్న మత్స్యకార కుటుంబం కేంద్రంగా 'రైడర్స్ టు ద సీ' నాటిక నడుస్తుంది. కేవలం నాలుగు పాత్రలతో నడిచే ఈ నాటికలో ప్రధాన పాత్ర వృద్ధ మహిళ మోరియా. మిగతా పాత్రలు ఆమె కూతుర్లు కేథలీన్, నోరా, కొడుకు బార్ట్లీ. మోరియా కుటుంబానికి సముద్రమే ప్రాణాధారం. ఆ సముద్రమే ప్రాణాంతకం. అది మోరియా భర్తను, మామను, ఐదుగురు కొడుకులను కబళించింది. మిగిలిన ఒకే కొడుకు బార్ట్లీ తల్లి వద్దన్నా వినకుండా అల్లకల్లోలంగా ఉన్న సముద్రంపై సంతకు బయలుదేరుతాడు. తొమ్మిది రోజులనుండి సముద్రంలో గల్లంతైన మరో కొడుకు మైఖేల్ శవం కోసం ఎదురుచూస్తున్న మోరియాకు రోజు గడిస్తే ఇక తనకు కొడుకులే మిగలరనిపిస్తుంది. అపశకునం మాటలతో అన్నను సాగనంపినందుకు కేథలీన్, నోరాలు తల్లిని కోప్పడతారు. అప్పటికే మునిగిపోయిన మైఖేల్ చొక్కా, మేజోడు అక్కచెల్లెళ్ళకు అంది ఉంటాయి. తల్లికి తెలియనివ్వకుండా దాచిపెట్టి దేవుడి దయవల్ల ఆమెకు కాస్త కునుకు పట్టాలని కోరుకుంటూ ఉంటారు.

అయితే మోరియా అత్యంత గడ్డు విషాదానికి సిద్ధపడి ఉంటుంది. చివరగా గ్రామస్తులు బార్ట్లీ శవం ఇంటికి చేర్చినప్పుడు మోరియా అనే మాటలు ఆమె దుఃఖాతీత దశను తెలియజేస్తాయి. అప్పుడు ఆమె అనంతమైన దుఃఖంతో పిగిలిపోక 'ఇంత కంటే నన్నేం చేయగలవు' అని సముద్రాన్ని సవాలుచేసే మొండిధైర్యంతో నిలబడుతుంది.

"ఎంతమందిని మింగినా ఎప్పటికీ సంతృప్తి చెందని ఈ దయలేని సముద్రం ఇక మీదట నన్నేమీ చెయ్యలేదు. దక్షిణం నుండి వెర్రిగాలులు విపరీతంగా వీస్తున్నప్పుడూ, అలలు బీభత్సంగా తూర్పు నుంచీ పడమర నుంచీ తాకుతూ చెవులు చిల్లులు పడేలా హోరుమని వినిపిస్తున్నప్పుడూ ఇక భోరుమని నేను ఏడవ నక్కరలేదు. పదేపదే రక్షించమని ఆ దేవున్ని ఎవరికోసమూ ప్రార్థించనక్కరలేదు."

"...నాకిప్పుడు అంతులేని విశ్రాంతి దొరికింది. ఇక నుంచీ సుదీర్ఘమైన రాత్రుల్లో గాఢనిద్ర పోతాను."

ముందుమాటలో అనువాదకురాలు చెప్పినట్లు ఒక మధురవాణి పాత్రలా సృష్టికర్తను మించిన వ్యక్తిత్వం సంతరించుకున్న పాత్ర మోరియా. అందుకే ఆమె తెలుగు అనువాదానికి మోరియా పేరే పెట్టారు.

ఈ పుస్తకం చదివాక అంత కష్టనష్టాలకు ఓర్చుతూ ఎందుకు వాళ్ళు అక్కడే ఉండిపోవాలి అని ఒక మిత్రురాలు అన్నది. నిజానికిది లోతైన ప్రశ్న. ఆధునికపూర్వ సమాజాలు సునామీలతోనైనా జీవిస్తాయి కాని అంత సులభంగా ఆధునిక ప్రపంచంలోకి ఇమడవు. నాగరికమైనవిగా చెప్పుకుంటున్న సమాజాలు ప్రాచీన మానవులను ఎన్నడూ స్నేహపూర్వకంగా తమలో కలుపుకోలేదు. ప్రకృతితో సహజీవనం చేస్తున్న వాళ్ళను అలా ఉండనివ్వనూలేదు. అయితే ప్రకృతితో వట్టి చేతులతోనే తలపడే ప్రాచీన మానవుని తత్వం వాతావరణ సంక్షోభాలకే కాదు అభివృద్ధి సునామీలకూ ఎదురొడ్డుతూ ఉంటుంది.

| | | |
|---|---|---|
| పుస్తకం పేరు | : | విషాదనాయిక మోరియా |
| రచయిత | : | జాన్ మిల్లింగ్‌టన్ సిన్జ్ |
| స్వేచ్ఛానువాదం | : | శివలక్ష్మి |
| ప్రచురణ | : | కుహూ ప్రచురణలు, హైదరాబాద్<br>9/1బి, గ్రీన్ హిల్స్ కాలని<br>సరూర్‌నగర్, హైదరాబాద్-500 035<br>ఫోన్: 040-24031710 |
| పేజీలు | : | 32 |
| వెల | : | 30 రూపాయలు |

కాపీలు దొరికే షాపులు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ.



కథ

# లక్షణ

- కె. సుభాషిణి

అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంటూ ఉవ్వెత్తున లేస్తున్న ఆందోళనను అదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నం చేస్తోంది లక్షణ. అలంకారంలో ఎక్కడయినా చిన్న లోపం ఉందేమో అని పదే పదే భిన్నకోణాల నుండి తనను తాను చూసుకుంది. ప్రక్కనే నిలబడ్డ వనజను చూస్తూ... "ఎలా ఉందంటావ్..." మెడలోని వజ్రాల హారాన్ని గుండెల మీదకు సర్దుకుంటూ అడిగింది లక్షణ.

"నా ప్రావీణ్యాన్ని అంతా చూపించి ఈ పూట మిమ్మల్ని అలంకరించాను. ఈ మాఘమాసపు నిండు పున్నమి వెన్నెలను అంతా ఒకచోట కుప్పబోసి దానికి ఆకారం కల్పిస్తే ఎలా ఉంటుందో అలా ఉన్నారు. రాకుమారి తమరు...! మిమ్మల్ని ఇలా చూస్తుంటే నాకే అదో మాదిరి మైకం కమ్ముకుంటోంది... ఇక స్వామీ చూస్తే ఏమయిపోతారో..."

లక్షణ బుగ్గల్లో మంకెన పూలు పూశాయి. "ఏంటా మాటలు..." వనజను మురిపంగా కసురుకుంది లక్షణ. పక్కకు తిరిగి, "ఆ చరితా! ఏర్పాట్లన్ని పూర్తయ్యాయా...?" కిటికి తెరలు లాగుతున్న చరిత పరుగున లక్షణ దగ్గరకు వచ్చింది. "మీరు ఆజ్ఞాపించడం... మేము చెయ్యకపోవటమూనా..? ఎప్పుడో పూర్తి చేసేశాం... రాకుమారీ..."

"నా మనసెరిగిన నెచ్చెలివి... పైగా పనిమంతురాలివి. నాకు, స్వామికి నీవు ఎంత సేవ చేస్తున్నావో నాకు తెలుసు..." ఆనందంతో చరిత కళ్లల్లో నీళ్లు ఊరాయి.

"మీ దంపతులకు సేవ చేయడం నా పూర్వ జన్మ సుకృతం తల్లీ... మీ తండ్రిగారు అందుకోసమే కదా నన్ను మీతో పాటు ఇక్కడికి అరణంగా పంపారు. ఈ జీవితం మీకే అంకితం తల్లీ..."

అణువణువునా వినయాన్ని ప్రదర్శించింది చరిత. అంతలోనే గొంతు సవరించుకుంటూ బ్రతిమాలుతున్న ధోరణిలో, "రాకుమారీ! ఏ చిన్న పొరబాటు లేకుండా అన్ని ఏర్పాట్లు చాలా జాగ్రత్తగా చేశాను. బాగా పొద్దుపోయింది. మీరు నాకు సెలవు ఇప్పిస్తే ఇంటికి పోతాను. ఆయనకు ఒంట్లో బాగాలేదు. త్వరగా రమ్మన్నారు..." కళ్లు కిందికి వాల్చింది చరిత. "తొందరేమీ చరితా! ఇంత హడావుడిలో ఎలా కుదురుతుంది. పైగా ఈ రోజు స్వామి మన అంతఃపురానికి వస్తున్నారు. ఆ ఉద్యానవనంలో ఏర్పాట్లన్నీ ఒక్కసారి నేనే స్వయంగా పరీక్షిస్తాను. నాకు సంతృప్తిగా అనిపిస్తే నీవు సెలవు తీసుకుందువు గాని..."

చరిత ముఖం చిన్నబోయింది. ఇంటికి తీసికెళ్లడానికి సుగంధాలు వెదజల్లే పూలను, కొన్ని పండ్లను, రుచికరమైన పదార్థాలను అంతకుముందే మూటగట్టి సిద్ధం చేసి పెట్టుకుంది. అవి కూడా లక్షణకు అమర్చిన తరువాత మిగిలినవే. భర్తతో వెన్నెల్లో గడపాలనే కోరిక చరితలో సన్నగిల్లింది.

'ఎంత సేవ చేసిన దక్కేది ఇంతే కదా...' విరక్తిగా అనిపించింది.

మేలి ముసుగును సవరించుకుంటూ లక్షణ ఒక్క క్షణం ఆగింది. "అది సరే! స్వామి స్నానానికి ఏర్పాట్లు చేశారా? నీరు గోరువెచ్చగా ఉండాలి సుమా! సుగంధ ద్రవ్యాలను సిద్ధంగా ఉంచారా?... కాని చరితా! మనము అటు వెళ్లగానే స్వామి ఇటు వస్తే ఎలాగే...?" బేలగా అడిగింది లక్షణ.

లక్షణను చూసి మనసులోనే జాలిపడింది చరిత. "ఇంతకు నీవు వెళ్లి స్వామికి ఏం చెప్పావ్? ఏమన్నారు? ఎప్పుడు వస్తామన్నారు...?"

"రాకుమారి మీ ఆరాటమే కాని ఎన్నిసార్లు అడిగినా సమాధానం అదే కదా! రాచకార్యంలో ఉన్న స్వామిని కలవడానికి నాకు వెంటనే అనుమతి ఎక్కడ లభించింది. ఏంతో సేపు గుమ్మం బయటే ఉంటిని. లోనికి రమ్మని పిలుపు వచ్చాక ఈ రోజు లక్షణాదేవి మీకోసం ఎదురుచూస్తున్నారని ఆ ఒక్క మాట మాత్రమే చెప్పగలిగాను. గుర్తు ఉంది. తప్పకుండా వస్తాను అని స్వామి అన్నారు. ఆలస్యమయితే అంతఃపురానికి రాకుండా నేరుగా ఉద్యానవనానికే వస్తామని చెప్పమన్నారు..."

"అయినా ఎందుకో నాకు ఆందోళనగా ఉందే చరితా! మనసు ప్రశాంతంగా లేదు... ఓ... చంద్రోదయమయి చాలా సేపు అయ్యింది కదూ!... అయ్యో స్వామి నేరుగా అక్కడికే వెళ్తారో ఏమో! పద త్వరగా..."

* * *

చెయ్యి తిరిగిన చిత్రకారుడు గీచిన చిత్రపటంలా ఉంది లక్షణ ఉద్యానవనం. మెత్తటి పచ్చటి గడ్డి బెత్తెడు ఎత్తు పెరగడంతో నేలంతా పచ్చటి తివాసి పరిచినట్టుగా ఉంది. ఎక్కడెక్కడి నుండో రకరకాల పూలమొక్కలు, లతలు తెప్పించి తన ఉద్యానవనంలో పెంచుకుంటోంది లక్షణ. నేలమీద ఎక్కడా ఒక్క ఎండు ఆకుగాని, ఎండు పుల్లగాని లేకుండా శుభ్రంగా ఉంది. అన్ని రంగుల పూలు, సుగంధాలు వెదజల్లే పూలు, రెండు మూడు రోజులు వాడకుండా మెరుస్తూ మురిపించే పూలు, కేవలం రాత్రి పూట మాత్రమే వికసించి సువాసన వెదజల్లే పూలతో తోట ఆహ్లాదకరంగా ఉంది. వెన్నెల్లో అవి మరింత శోభాయమానంగా మెరుస్తున్నాయి. మార్గమధ్యలో అక్కడక్కడా చలువరాతి అరుగులు ఉన్నాయి. అరుగుల మీదికి పూల తీగలను పాకించారు. కొన్నిచోట్ల పెద్ద

పెద్ద గుబురు వృక్షాలు కూడా ఉన్నాయి. వాటి కొమ్మలలో గూళ్లు కట్టుకున్న పావురాలు, చిలుకలు, పిట్టలు కిచకిచమంటూ ఊసులాడుకుంటున్న శబ్దాలు వినిపిస్తున్నాయి. బహుశ లక్షణ ఉద్యానవనంలోని హడావుడిని గురించి మాట్లాడుకుంటున్నాయేమో.

ఇంద్రధనస్సులోని ఏడు రంగులతో ఉన్న వివిధ రకాల పూలమొక్కల మధ్య నగిషీలు చెక్కిన విశాలమైన చందన మంచాన్ని వేశారు. వాటిపై పట్టు పరుపులు పరిచారు. చుట్టూ దిండ్లు అమర్చారు. పూలతో పాన్పును మొత్తం అతిరమ్యంగా అలంకరించారు. పక్కన బల్లమీద వీణ ఉంది. దాని మీద పట్టుబట్ట కప్పి పెట్టారు.

లక్షణ ప్రతి చిన్న ఏర్పాటును నిశితంగా పరిశీలించింది. చిన్ననాటి నుండి లక్షణకు ప్రకృతి, మొక్కలు, పూలు అంటే అమిత ప్రీతి. మెచ్చుకోలుగా చరిత వైపు చూసింది.

"భోజన ఏర్పాట్లు నేను చెప్పిన ప్రదేశంలోనే కదా ఏర్పాటు చేశారు...? అన్నీ నెయ్యితో చేసినవే కదా! తాజా వెన్నను పెట్టడం మరిచిపోలేదు కదా!"

"నా నుండి ఎన్నడయినా పొరబాటు జరిగిందా రాకుమారీ..."

"లేదులే కాని... తక్కువ మోతాదులో మధుపానాన్ని స్వామికి అందుబాటులో ఉంచాలి..."

"అది మీరు ప్రత్యేకంగా చెప్పాలా రాకుమారీ..."

"వింజామరలు సిద్ధం చేశారా?... ఈ పూట స్వామికి నేనే స్వయంగా విసురుతాను..."

"అందుకే కదా వాటిని ప్రత్యేక శ్రద్ధతో తయారు చేయించాను. మీ అరచేతులకందకుండా ఉండాలని జాజి, మల్లెపూలతో అల్లించాను..."

కొంతమంది చెలికత్తెలు ఉద్యానవనంలో హడావుడిగా తిరుగుతూ, చేసిన ఏర్పాట్లను మరొక్కసారి చూస్తున్నారు. మరికొంత మంది లక్షణ ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నారు.

పూల చెండును చేతిలోకి తీసుకొని చెంపకు ఆనించుకొని వాసన చూసింది లక్షణ. శరీరం అంతా మత్తు ప్రవహించినట్టు అయింది. కొన్ని క్షణాలు అలానే నిల్చుని చూపును ముందుకు సారించింది. కృత్రిమంగా ఏర్పాటు చేసిన నీటి కొలనులు పసుపు పచ్చటి వెన్నెల కాంతిలో మరింతగా మెరుస్తున్నాయి. అక్కడక్కడా ఒక మోస్తరు లావు ఇసుక రాళ్లతో చిన్న గుట్టలను ఏర్పాటు చేసి వాటి మధ్యలో గడ్డిని, పూల చెట్లను పెంచారు. గుట్టలపైన రమణీయమైన సుందర శిల్పాలను నిలబెట్టారు. గుట్టల మీదుగా నీరు పారే ఏర్పాటును చేశారు. నీరు పారుతుంటే లయబద్ధమైన సంగీతంలాగా వినిపిస్తోంది. లక్షణ తనకు తెలియకుండానే కాళ్లు, చేతులు లయబద్ధంగా కదిలిస్తోంది. అలాంటి పరిసరాల్లో వాతావరణంలో శ్రీకృష్ణుని వేణునాదం లేకపోవడం వెలితిగా ఉంది లక్షణకు. ఆలస్యాన్ని భరించలేకపోతోంది.

"స్వామి ఇంకా రాలేదేంటి చరితా? స్నానపానాదులు తన మందిరంలో చేసుకొని ఇక్కడకు వస్తారేమో? లేక స్నానానికి ఏ రాణి అంతఃపురానికో వెళ్లింటే... ఆమె స్వామిని వదులుతుందా? ఆయన ఇక్కడకు రావటం జరుగుతుందా? ఇన్ని ఏర్పాట్లు చేయించాను. మా సవితి అక్కగార్లు అందరికి ఈ విషయం తెలిసే ఉంటుంది. ఇప్పుడు స్వామి రాకపోతే నగుబాటు కానా? వారి ముందర, అంతఃపురంలోనూ తల ఎత్తుకొని ఎలా తిరగగలను. ఇంతకంటే అవమానం ఇంకొకటి ఉంటుందా...?" లక్షణ ముఖంలో దిగులు మేఘాలు కమ్ముకున్నాయి.

"బాధపడకండమ్మా! స్వామి మీకు వాగ్దానం చేశారు కదా! తప్పకుండా వస్తారు. నాకు ఆ నమ్మకం ఉంది. మీరు దిగులు పడితే స్వామిని ఎలా సంతోషపెట్టగలరు.

లక్షణ ముఖంలో కొద్దిగా వెలుగు వచ్చింది. మనసులోని అనుమానం మాత్రం తొలిగి పోలేదు.

"నువ్వు స్వామి దగ్గరకు వెళ్లిన సమయంలో అక్కడ సత్యభామ చెలికత్తెకాని, మిత్రవింద చెలికత్తెకాని కనిపించారా...?"

"నేను వెళ్లేటప్పటికే నాగ్నజితిగారి చెలికత్తె ఉన్నిందమ్మా. నేను బయలుదేరేటప్పుడు జాంబవతి, కాళింది గారి చెలికత్తెలు కనిపించారమ్మా. వారితో స్వామీ ఏమీ చెప్పారో నాకు తెలియదు. నాతో మాత్రం... మీ అంతఃపురానికి వస్తామని చెప్పమన్నారు. మన అంతఃపురానికి వస్తాను అని చెప్పిన స్వామి వాళ్ల అంతఃపురాలకు వస్తాను అని ఎలా చెప్తారు? ఎలా పోతారు రాకుమారీ..."

"అంతేనంటావా...? ఏమో ఈ మగవాళ్లను ఎలా నమ్మేది. ఎవరి దగ్గర వారి మాటలు మాట్లాడుతారు..."

"అయ్యో రాకుమారీ... మీ పెదవులు ఆరినట్టుగా ఉన్నాయి. ఏదైనా పానీయం సేవించి దాహాన్ని తీర్చుకోండి..." మాట మార్చింది చరిత.

"స్వామి రాకుండానే..."

కొంచెం చిరాకు అనిపించింది చరితకు.

'ఏమిటి ఈమె ధోరణి. తినడం, తాగడం, చివరకు గాలి పీల్చడం లాంటివి కూడా భర్త కోసమే అన్నట్టు చేస్తోంది. ఆయనకేం మహారాజు. ఈ పాటికి ఏ రాణి మందిరంలోనో తిని ఆమెతో పడి దొర్లుతుంటాడు. ఇక్కడ ఈమెను చూస్తేనా... అణువణువు భర్త రాక కోసం ఎదురు చూస్తోంది... చరిత మనసు జాలితో నిండిపోయింది.

చిన్న పాత్రలో పండ్లరసం తెచ్చి బలవంతంగా లక్షణ చేత తాగించింది.

"అమ్మా చెలులకు ఎవరు ఏం చెయ్యాలో చెప్పాను. మరి నాకు సెలవు ఇప్పిస్తే..." చేతులు నులుముకుంటూ అడిగింది చరిత.

"వెళ్లు.. నీ కోసం ఎదురు చూసే భర్త లభించాడు. అదృష్టవంతురాలివి. నీకు కావాలసిన పదార్థాలు తీసుకెళ్లు..."

చరిత ముఖం విప్పారింది. తను లేకపోతే లక్షణ మరింత ఒంటరి అవుతుందని తెలుసు.

"పాపం రాకుమారీ..! అన్నీ ఉండి సుఖపడ్డానికి లేదు. ఇలా జీవితాంతం భర్త కోసం ఎదురు చూసుకుంటూ ఒంటరితనంతో ఎంత బాధపడాలో. పక్షానికి ఒక్కరోజు... అది కొన్ని ఘడియల పాటు దర్శనం దొరకడం దుర్లభమయింది. స్త్రీల మనస్సులను

ఈ మగవారు ఎప్పుడు అర్థం చేసుకుంటారో..."

* * *

అపూర్వమైన వెన్నెలరాత్రి... శరీరానికి ఆహ్లాదాన్ని కలిగించే చిరుపాటి చల్లని గాలి. ప్రపంచాన్నంతా చీకటిమయం చేసి కేవలం లక్షణ ఉద్యానవనంలోనే వెన్నెలను వర్షంలాగా కురిపిస్తున్నాడా అని ఆశ్చర్యపోయేంతగా వెలిగిపోతోంది తోటంతా. ఆకాశంలో నక్షత్ర రాశి దీపాల తోరణంగా వయ్యారాలు పోతోంది.

కాలం గడిచేకొద్ది లక్షణ ముఖంలోని వెలుగు మసకబారుతోంది. జడలోని పూలు వన్నె తగ్గి వాడిపోతాయేమోనని.. దుస్తులు నలిగిపోతాయేమోనని, అలంకారం చెదిరిపోతుందేమో అని లక్షణకు బెంగగా ఉంది.

"స్వామితో కలిసి వెన్నెల్లో భోజనం, నౌక విహారం చేయాలని అనుకోవడం తప్పా? స్వామి వేణునాదం వినాలని, స్వామికి నా గానం వినిపించాలని, వీణానాదంతో స్వామిని తన్మయున్ని చెయ్యాలనే ఇంతటి చిరు కోరికలు తీర్చుకొనడానికి ఇంతగా ఎదురు చూడాలా? ఇవి కోరరాని కోరికలు కాదే... ఒక స్త్రీగా భర్తతో రోజూ కాసేపు కలిసి ఉండాలని కోరుకోవడం అందని ద్రాక్షపండులాగా అయిపోతోంది. ఇంత పొద్దుపోయినా చేసే రాచకార్యాలు ఏముంటాయి? రోజూ అంతఃపురానికి వచ్చే మనిషి అయితే.. ఆ ఏముంది? ఇక్కడికి రాక ఇంకెక్కడికి పోతాడు అనే ధైర్యం ఉంటుంది. బతిమలాడి, వేడుకొని, పదిసార్లు గుర్తు చేస్తే తప్ప ఇటువైపు కన్నెత్తి చూడరు స్వామి. అది ఏ పది పద్దైదు రోజులకో. ఆయనేమో ప్రతి రోజు ఏదో వొక రాణి దగ్గరకు వెళ్తారు. ఒంటరితనం అనే ప్రసక్తి ఎంత మాత్రం ఉండదు. మరి తన భార్యల ఒంటరితనం గురించి స్వామి ఆలోచించరా? పదిరోజుల నుండి తన కోసం ఒక మనిషి ఎదురుచూస్తూ ఉంటుందని స్వామికి గుర్తుకు రాదా?...' ప్రవేశ ద్వారం వైపు చూపును స్థిరంగా ఉంచింది లక్షణ. నలుగురు భటులు కాపలా కాస్తూ ఉన్నారు. కొంతమంది భటులు గస్తీ తిరుగుతున్నారు. ఒక చిన్న మగ పురుగు కూడా లోనికి రాలేనంత కట్టుదిట్టంగా ఉంది కాపలా.

చెలికత్తెలు గడ్డిలో కూచోనే కునికిపాట్లు పడుతున్నారు. మరికొంతమంది దాగుడుమూతలు ఆడుకుంటున్నారు. కొందరేమో జంటలుగా 'గీజు గోల్ గెన్నెరగోల్' పాడుకుంటూ చేతులు పట్టుకొని చుట్టూ తిరుగుతున్నారు. వాళ్లతో కలిసి ఆడాలని లక్షణకు చాలా బలంగా అనిపించింది. కోరికను అదుపులో పెట్టుకుంది.

'బాలికలాగా వాళ్లతో పాటు కలసి ఆడుకోవాలంటే ఎలా కుదురుతుంది. ఇప్పుడు నేను శ్రీకృష్ణుని భార్యనయితిని...'

'అయ్యో లక్షణా... నువ్వు ఒక్కదానివే శ్రీకృష్ణునికి భార్యవా? ఆయన భార్యలలో ఒక్కదానివి. ఎనిమిదవ భార్యవు...' ఎవరో ఫక్కున నవ్వి గుసగుసలాడినట్టుగా అనిపించింది. కంగారుగా చుట్టూ చూసింది. దగ్గర ఎవ్వరూలేరు. కొంచెం దూరంలో చెలికత్తెల కోలాహలం తప్ప. 'నేను ఒక్క భార్యనే అయితే ఇంత వేదన, ఎదురు చూపులు ఎందుకుంటాయి? మొగవాడికి ఒకరి కన్న ఎక్కువ భార్యలు ఉంటే చిన్న భార్య మీద ప్రేమ, అనురాగం ఎక్కువ ఉంటాయి, అంటారు. నా విషయంలో ఇది ఎందుకు నిజం కాలేదు? ఎనిమిది మందిలోనూ ఎవరికన్న ఏం తక్కువ నాకు?...

సంగీత, సాహిత్య, నాట్యాలలో తమరికి సాటి రాగల యువతి ఈ చుట్టుపక్కల రాజ్యాలలో ఎవ్వరూ లేరు. అని మద్రరాజ్యం ప్రజలు ముక్తకంఠంతో అనేవాళ్లు... వెనకా ముందు ఎవ్వరూ లేని దాన్ని కాదు. పేదదాన్ని అసలే కాదు. మానవ మాత్రులు లెక్కించలేనంత కట్నకానుకలు శ్రీకృష్ణునికి సమర్పించారు నాన్నగారు. వేలకొద్ది దాసీలు, భటులు, వందల సంఖ్యలో రథాలు, ఏనుగులు, వేల సంఖ్యలో గుర్రాలు, మనువుల కొద్ది బంగారం, అత్యంత ఖరీదైన అపురూపమైన వజ్రవైఢూర్యాలు... అసలు స్వామితో పాటు ద్వారకకు వచ్చేటప్పుడు ముందు, వెనుక కంటికి ఆననంత మేర వ్యాపించిన దాసీలు, భటులు, రథాలు... స్వామికి ఉన్న అనంత సంపదకు మరింత తోడయింది. బ్రహ్మరథం పట్టారు ద్వారకకు రాగానే. అత్యంత విలాసవంతమైన అంతఃపురాన్ని ఏర్పాటు చేశారు. శ్రద్ధగా పెంచుకుంటున్న సుందర రమణీయ ఉద్యానవనం. ఏది తక్కువ లేదు... అన్నీ ఉన్నాయి. అసలయినదే లేదు...' దీర్ఘంగా నిట్టూర్చింది లక్షణ.

భోజనం వేళ ఎప్పుడో దాటిపోయింది. చంద్రుడు నడినెత్తి మీద ఉన్నాడు. లక్షణకు తిండి మీద ధ్యాస ఏమాత్రం లేదు. చెలికత్తెలు కూడా భోజనం చేయలేదని లక్షణకు తెలుసు. 'నేను తినకుండా వాళ్లు తినరు. స్వామి రాకముందే తింటే ఏం బాగుంటుంది? అందరు ఏమనుకుంటారు? అదొక అపవాదు. స్వామి మాత్రం ఈపాటికి ఏ రాణి అంతఃపురంలోనో భుజించి, తాంబూలం సేవించి సేద తీరుతుంటారు. ఎవరో ఆ అదృష్టవంతురాలు. ఇంకెవరూ... సత్యభామే అయ్యుంటుంది. అందులో సందేహం ఏం లేదు... ఆమె అంటే అంత మోజు ఎందుకో? అంత మోజు ఉన్నవాడు ఆమెను పెండ్లి చేసుకున్నాక ఐదు మందిని చేసుకున్నాడు. ఎందుకు ఇలా ఏడిపించడానికా? కాని వాగ్దానం చేశారు కదా! వస్తారేమో...' ఆశ, నిరాశల మధ్య లక్షణ మనస్సు ఊగిసలాడింది. 'రాజకార్యాలు పూర్తి కాలేదేమో? ఇంత పొద్దుపోయేవరకు పని ఒత్తిడి ఉంటే... ఏ భార్యకు న్యాయం చేయగలరు? ఒకరా? ఇద్దరా? ఎనిమిది మంది...! ఇంతమందిని ఎందుకు వివాహం చేసుకోవాలి...? 'చేసుకున్న వాళ్లకు చేసుకున్నంత... లోపల ఎవరో ఎత్తిపొడుపుగా అన్నట్టు అనిపించింది లక్షణకు.

కళ్లు మూసుకుంది బాధగా.

అవును ఇది చేతులారా చేసుకొన్నదే. కోరి శ్రీకృష్ణుని వరించాను కదా! అందుకే ఈ నిత్య నిరంతర ఏకాంత రోదన. సంగీతం మీద ఉన్న ఇష్టమే స్వామి మీద ప్రేమ కలిగించింది...'

లక్షణకు మెల్లిగా ఏదో అనుమానం మొదలయింది. జ్ఞాపకాలను తవ్వింది. వాటిని విశ్లేషించడానికి ప్రయత్నించింది. ఆలోచిస్తున్నకొద్దీ, లక్షణకు కొన్ని విషయాలు కొత్తగా

అర్థమవుతున్నాయి. తండ్రితో నారదుడు ఎంతో సేపు రహస్య చర్చలు చేశాక, తన మందిరానికి నారదుడు స్వయంగా రావడం లక్షణకు గుర్తుకు వచ్చింది.

'వచ్చి రావడంతోనే శ్రీకృష్ణుని గూర్చి పొగడ్డం మొదలు పెట్టాడు. నీ గానానికి సరిజోడి శ్రీకృష్ణుని వేణునాదమే రాకుమారి అంటూ ఎంత నమ్మకంగా పలికాడు. స్వామి వేణునాదం గురించి వింటుంటే వొళ్లు పులకరించిపోయింది. ఆ సమయంలో స్వామి వయస్సు కాని, అంతకు మునుపే ఆయన చేసుకున్న వివాహాల సంగతి కాని ఏదీ గుర్తుకు రానంత వివశతలో ఉంటిని... ఎందుకని? వశీకరణ మంత్రం ఏదైనా ప్రయోగించారా? ఏం ప్రయోజనం ఆశించి ఇలా చేసింటారు? ముందస్తు ప్రణాళిక ఏమయినా ఉందా? ఉండొచ్చు... అవును... ఇప్పుడనిపిస్తోంది. నేను ద్వారకకు బయలుదేరుతున్నప్పుడు నాన్నగారు ఏమన్నారు... గుర్తుకు తెచ్చుకుంది లక్షణ.

"శ్రీ కృష్ణుని లాంటి బలవంతుడు, రాజకీయ చతురుడు నాకు అల్లుడు కావడం నా అదృష్టం. ఇక ఏ శత్రురాజు కూడా మద్రరాజ్యంపై కన్నెత్తి చూడలేడు. శ్రీకృష్ణుని అండతో ఇక నేను, నా వారసులు నిశ్చింతగా రాజ్యపాలన చేసుకోవచ్చు... ఇంకా రాజ్య విస్తరణ కూడా చేసుకొనవచ్చు..."

లక్షణ హృదయం భగ్గున మండింది.

'హూ... వారి రాజ్యాన్ని కాపాడుకోవడం కోసం శ్రీకృష్ణునికి నన్ను అర్పించారు..' మామూలుగా ఉండలేకపోయింది లక్షణ. దుఃఖం పొంగుకొచ్చింది. ఆ దుఃఖంలో తల్లిని తలుచుకుంది.

'అమ్మ!... అవును అమ్మ వొక్కతే నా వైవాహిక జీవితాన్ని అంచనా వేయగలిగింది... వివాహం ముందు రోజు ఏమన్నది...'

"నువ్వు వివాహం చేసుకోబోయేవాడు మహా బలవంతుడు, అత్యంత సంపదపరుడు. ఇవి మాత్రమే స్త్రీని సంతోషపెట్టలేవు లక్షణా! సవతుల మధ్య నువ్వు ఎలా సుఖపడగలవు లక్షణా?" అమ్మ గొంతులో అంతులేని నిర్లిప్తత.

'ఆ సమయంలో నేను అవన్నీ ఆలోచించనా? అమ్మ మాటల్ని లెక్క చెయ్యలేదు... పైగా ఏమన్నాను...'

'అమ్మా!... నా సంగీత, నాట్య ప్రావీణ్యంతోనూ, సాహిత్య చర్చలతోనూ స్వామిని ఆకట్టుకుంటాను...'

'అబ్బ! అమ్మ కళ్లల్లో ఎంత జాలి ఆ రోజు. ఏమయింది ఈ రోజు ఆ ధీమా!'

'అయ్యో... ఇంత సంపద సామర్థ్యం ఉండి ఏం లాభం... రాజపుత్రిని కాకపోయుంటే సామాన్య స్త్రీలాగా ఎవరినో వివాహం చేసుకొని సుఖంగా ఉండేదాన్నేమో? జీవితాంతం ఇలా వొంటరిగా చకోర పక్షిలాగా ఎదురు చూసుకుంటూ కన్నీరు కార్చవలసిందేనా? ఎవరితో చెప్పుకోవాలి? చెప్పుకున్నా శ్రీకృష్ణునికి భార్యకావడం కంటే వేరే అదృష్టం ఏముంటుంది అంటారు... నా వయస్సుకంటే రెట్టింపు వయస్సు, సవతులతో సహవాసం, ఈర్ష్య అసూయలతో వారితో పోటీ.. ఇదా అదృష్టం! స్త్రీల ఇష్టాఇష్టాలతో పని ఏముంది?. జాంబవతి, సత్యభామ, మిత్రవింద, భద్రస్వామిని వరించలేదే... యుద్ధంలో గెలిచి వారిని భార్యలుగా చేసుకున్నారు. అవునులే కంటికి ఇంపుగా యువతులు, అనంత సంపదరాశి ఊరిస్తుంటే... ఒకరు, ఇద్దరు భార్యలతో ఎలా సరిపుచ్చుకుంటారు...?

వెన్నెలను, పరిసరాలను పట్టించుకునే ధ్యాసలో లేదు లక్షణ. శ్రీకృష్ణుని రాక గురించి కూడా ఆలోచించడం మానివేసింది. అందరూ ఈ రకమైన బాధతోనే గడుపుతుంటారు అని లక్షణకు అర్థమయింది.

'పాపం నాగ్నజితి... స్వామిని ప్రేమించి వివాహమాడింది. అంతులేని సంపదతో మెట్టింటికి వచ్చింది. పెళ్లి అయిన కొత్తలో కూడా ఆమెను నిర్లక్ష్యం చేసి సత్యభామ మందిరంలోనే ఉండేవాడని చెప్తుంటారు. స్త్రీల ఆశలు, ఆకాంక్షలు పట్టించుకునే వాళ్లు ఏరి?'

దెబ్బతిన్న మనసుతో, అవమానంతో లక్షణ ముఖంలో కళ తప్పింది. పక్కకు వొరిగి దిండు మీద తల పెట్టుకుంది. కన్నీటి చుక్కలు జల జల బుగ్గల మీదికి జారాయి.

"శ్రీకృష్ణుల వారు వేంచేస్తున్నారహో..." ద్వారం దగ్గర భటులు గట్టిగా అరచి చెప్పారు. వెంటనే రథం వస్తున్న శబ్దం వినబడింది. దిగ్గున లేచి కూర్చుంది లక్షణ. నలిగిన దుస్తులను, చెదిరిన అలంకారాన్ని సరిచేసుకునే సమయం కూడా లక్షణకు లేదు.

- - -

నిద్ర కళ్లతో శ్రీకృష్ణుడు అలసటగా కనిపించాడు. చల్లటి గాలి వీస్తున్నా కూడా లక్షణ స్వయంగా విసనకర్రతో విసురుతోంది. దానికి కట్టిన జాజి, మల్లెపూల సువాసన మరింత గాఢంగా గాలిలోకి వ్యాపిస్తోంది. నిండు పున్నమి వెన్నెల... చెట్ల మధ్య నుండి తొంగి చూస్తున్న చందమామ మనసును చల్లబరిచే ప్రశాంత వాతావరణం... పక్కన విరిసిన తాజా పువ్వులా ఉన్న లక్షణ. శ్రీకృష్ణునికి అలసటమాయమయింది. నిద్ర ఎగిరిపోయింది.

"స్వామి భోజనం వడ్డించమంటారా...?" తాంబూలంతో ఎర్రబడిన శ్రీకృష్ణుని పెదాలను గమనించే అడిగింది లక్షణ.

గతుక్కుమన్నాడు శ్రీ కృష్ణుడు. పైకి నవ్వుతూ

"రాక్షసుల మాదిరి ఇంత రాత్రప్పుడు భోజనం ఏమిటి దేవి! అయినా నా ముద్దుల భార్య ముచ్చటగా అడిగితే కాదనే సాహసం నాకు లేదు. నీ స్వహస్తములతో కొద్దిగా ఏదైనా సరే..."

* * *

"ఇంత ఆలస్యం చేశారేమీ స్వామీ..."

"రాచకార్యాలంటే మాటలా?... ఎంత యుక్తి, ఆలోచనలు, ప్రణాళికలు... వాటికి మించి సలహాలు, ఆదేశాలు, ఉక్కిరిబిక్కిరి అయిపోతాము."

"సాయంకాలం నుండి మీ రాక కోసం ఎదురుచూస్తున్నాను. పక్షం రోజుల కిందటే నాకు మాట ఇచ్చారు, ఈ వెన్నెల రాత్రి నాతో గడుపుతానని... మరిచిపోయారేమో అని నా భయం..."

"ఈ ప్రణయదేవతను మరవడం జరిగేపనేనా? నిరంతరం నా కళ్లల్లో మెదులుతూనే ఉంటావు..."

"మరి వారానికి ఒక్కసారి అయినా నాకు దర్శన భాగ్యం కలిగించొచ్చు కదా స్వామి..."

"ఎలా వీలవుతుంది లక్షణా! ఒక్కరా, ఇద్దరా... నన్ను నమ్మి నా దగ్గరకు వచ్చిన వాళ్లందరికి న్యాయం చేయాలి కదా! నీ లాగే మిగిలిన రాణులు నా దర్శన భాగ్యం కోసం తపించిపోతుంటారు..."

లక్షణ మనస్సు గాయపడింది.

"అవును అందరిని సంతృప్తి పరిచే ఒక బృహత్కర కార్యం మీ భుజస్కంధాల మీద మోపబడ్డది..."

"నన్ను అర్థం చేసుకునే భార్యలు దొరకడం నా అదృష్టం. మీ సహకారంతో నేను అందరిని సంతృప్తి పరుస్తాను."

"కాని స్వామి... ఈ వొంటరితనం నాకు శిక్షలా ఉంది.."

"నీకు వొంటరితనమా? ఆశ్చర్యంగా ఉంది దేవి...! ఇంత పెద్ద అంతఃపురం, ఐశ్వర్యం, అడుగడుగున చెలికత్తెలు.. వీటి మధ్యలో వొంటరితనానికి ఆస్కారం ఎక్కడ దేవి..."

"ఇవన్నీ భర్త ప్రేమ, అనురాగాలకు సరితూగ గలవా స్వామి.."

"నీకు నీ భర్త నుండి ప్రేమ, అనురాగం పుష్కలంగా లభించడం లేదా దేవి?..."

"మిగిలిన రాణులతో పాటు పంచుకుంటే నాకు దక్కుతున్నది ఏమాత్రం స్వామి?"

"అదేమిటి దేవి అలా అంటావు? భక్తులు భగవంతున్ని పూజిస్తున్నట్టు, స్త్రీలు భర్తను భగవంతుడనుకొని పూజించాలి. అదియే ధర్మం..."

"ధర్మాన్ని నేను ధిక్కరించడం లేదు స్వామి. భర్తను భగవంతుడనుకొనే పూజిస్తారు... కాని భర్తను చూడాలని, మాట్లాడాలని, అతనితో గడపాలని భార్య ఆశించకూడదా?..."

"భార్యకూడా భక్తుల మాదిరిగా నిస్వార్థంగా పూజించాలి..."

"నిజంగా భక్తులు ఏ స్వార్థం, ఏ కోరికలు లేకుండా భగవంతుల్ని పూజిస్తున్నారా స్వామీ..."

"భగవంతుని కరుణ కోసం ఎదురు చూడడమే భక్తులు చేయవలసినది...?"

"సృష్టిలో సహజంగా భగవంతుడు వొక్కడు... భక్తులు చాలా మంది. దీని నుండి భక్తులకు ఇబ్బంది ఉండదు. భక్తులలో స్త్రీ పురుషులు ఇరువురూ ఉంటారు. అయితే పురుషునిగా ఉన్న భర్తకు భార్యలు అనబడే స్త్రీకాని, స్త్రీలు గాని భక్తులుగా ఉన్నారు. ఆ భార్య కూడా ఒక మనిషి అనే విషయం మరచిపోతున్నారు. భక్తునిగా ఉన్న పురుషునికి ఉన్నట్టే భక్తురాలిగా ఉన్న భార్యకు కొన్ని కోరికలు, ఆశలు, ఆకాంక్షలు ఉండడం నేరమా స్వామీ...?"

లక్షణ ఏ విషయం కోరకు తర్కం చేస్తోందో శ్రీకృష్ణునికి అర్థం అయింది.

"కానీ స్త్రీల ఆశలు, ఆకాంక్షలు అన్నీ భర్త ఆశయాలకు, కోరికలకు అనుకూలంగా ఉండాలి. భర్త సుఖమే తన సుఖంగా, భర్త ఆనందమే తన ఆనందంగా భావించమని ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి. దానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం అంటే ధర్మశాస్త్రాలను ధిక్కరించడమే అవుతుంది..."

లక్షణ సంకోచాన్ని పూర్తిగా వదిలిపెట్టింది.

"ఇది ఏక పక్ష నిర్ణయం కాదా స్వామీ..."

"కాని నిర్ణయం తీసుకునే అధికారం కేవలం భర్తలకే ఉంటుంది అన్న విషయం నువ్వు మరిచిపోతున్నావు దేవి..." హెచ్చరికగా అంటూ "భార్యలకు ఏది మంచో ఏది చెడో భర్తలకన్నా ఎవరికి ఎక్కువ తెలుసు..."

ఒక్కక్షణం ఎందుకొచ్చిన వాదన ఆపేద్దాం అనుకుంది. కానీ ఈలాంటి సమయం, అవకాశం మళ్లీరాదు. మనసులోని మాటను బయటపెట్టడానికే నిర్ణయించుకుంది లక్షణ.

"నిరంతరం భార్య భర్త ఆకాంక్షలకు, కోరికలకు అనుకూలంగా ఉండాలి. నిస్వార్థంగా పూజించాలి. అంటే అది కేవలం సేవ చేయడం తప్ప ప్రేమ, అనురాగం, సహజీవనం మాటలకు అర్థం ఉండదు, స్వామీ! భక్తులకు భార్యలకు భేదం ఉంది స్వామీ. భక్తులు తమ భక్తిని ఇతర భక్తులతో కలసి ఆనందంగా, సమిష్టిగా పంచుకుంటారు. పైగా భగవంతుని పట్ల భక్తి పెంచుకొమ్మని ఉగ్గుపాలతో రంగరించి మరీ నేర్పిస్తారు. కాని భార్య భర్త ప్రేమను ఇతర సవతులతో పాటు పంచుకోవడం సాధ్యమా స్వామీ?..."

నీల మేఘశ్యాముని ముఖం మరింత నల్లబడింది. చక్కటి పలువరుస కనిపించేట్టుగా నవ్వుతూ లక్షణ గడ్డాన్ని పైకి ఎత్తాడు.

"కాలాన్ని ఇలా వృథా చేసి నన్ను వట్టి చేతులతో పంపుతావా దేవి" తన చుబుకాన్ని పట్టుకున్న శ్రీకృష్ణుని చేతిని సుతారంగా తీసివేస్తూ "నేను ఇలా మాట్లాడుతున్నానని మీకు కోపం వస్తోంది కదూ స్వామి... మీరు బలవంతులు, ఐశ్వర్యవంతులు... మీకు జడిసి రాజులు లొంగిపోయి మీకు కప్పం రూపంలో సంపదతో పాటు, తమ కూతుళ్లను కూడా సమర్పించుకున్నారు... లొంగని వాళ్లను మీరు ఓడించి వారి కూతుళ్లను పెండ్లి చేసుకున్నారు..."

లక్షణను మాట్లాడనివ్వకుండా ఆమె పెదాలపై ముద్దు పెట్టాడు శ్రీకృష్ణుడు.

"అబ్బా లక్షణా... ఇలాంటి వేళ యుద్ధం గురించి మాట్లాడ్డానికి నీకు మనసు ఎలా వచ్చింది...?"

"మిమ్మల్ని అందరూ భగవంతుని అవతారం అంటారు. కానీ..."

"ఊ... ఇక ఆపు నేను వినడానికి ఇక్కడకు రాలేదు..." లక్షణను కౌగిట్లో బంధించాడు శ్రీకృష్ణుడు. నిర్లిప్తంగా కళ్లు మూసుకుంది లక్షణ. మనసు, శరీరం రెండూ యాంత్రికంగా ఉన్నాయి.

"ఎంతో మంది స్త్రీలు ఈ కౌగిట్లో వొదిగింటారు... నా వల్ల కాదు. ఎంత భగవంతుని అవతారం అయితే మాత్రం... ఎలా భరించాలి. ఎలా ప్రేమించాలి. పూజించడం... సేవ చేయడం సాధ్యమేనా... నా మనస్సును అర్థం చేసుకునే వాళ్లు, ఎవరయినా స్వామిని భగవంతునిగా అంగీకరిస్తారా...?" మెడలోని హారం గుచ్చుకుంటుంటే ఇబ్బందిగా కదిలింది లక్షణ.



కథ

# తత్వతంత్రం

- బమ్మిడి జగదీశ్వరరావు

ఆ ఇంట్లో కాపలాకుక్కకు ఓ బుల్లి కుక్క పిల్ల పుట్టింది. అప్పుడే మోతలు మోసే గాడిదకూ ఓ బుజ్జి గాడిద పిల్ల పుట్టింది. అవి రెండూ తల్లిపాలు తాగుతూనే తల్లులు చెప్పే సుద్దులూ బుద్దులూ నేర్చుకోవడం మొదలుపెట్టాయి. అవి ఒకే ఈడువి కావడం వల్ల ఒకేచోట పెరగడం వల్ల వాటి మధ్య స్నేహం కుదిరింది.

"లోకం గురించి తెలుసుకుంటే చాలు, అంతకన్నా విద్యలేదు. ఆ విద్య పట్టుబడితే చాలు... బతికి బాగుపడిపోతారు.." అంటూ తల్లులు చెప్పిన మాటల్ని బుజ్జిగాడిదా బుల్లికుక్కా మర్చిపోలేదు. వాటికి బోలెడన్ని అనుమానాలొచ్చేవి. ఆ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు తెలుసుకోవడం కష్టమయ్యేది. తల్లులకా ఇంటి పనులతో తీరేది కాదు!.

"మన బతుకే మనకి పాఠం!" అని అమ్మ చెప్పిన మాటలు విని ఆ పాఠం ఏమిటో ఎలాగైనా తెలుసుకోవాలని అనుకున్నాయి ఆ నేస్తాలు.

"పాఠం పైకి చదవరా, నువ్వు చదువుతున్నావో లేదో తెలియడం లేదు" అని ఆ ఇంటిగలావిడ కొడుకుని కేకేస్తే - బుజ్జిగాడిదా బుల్లికుక్కా పాఠమన్నమాటకి చెవులు రిక్కించాయి. వినగా వినగా అది తమ గురించి... తమ తాతల తండ్రుల గురించి.. అని అర్థమైపోయింది.

ఇంట్లో దొంగలు పడితే - కాపలా ఉండాల్సిన కుక్క నిద్రపోతే కుక్క చేయ్యాల్సిన పని గాడిద చేస్తే - ఓండ్రపెట్టి అరిస్తే - నిద్రాభంగమయిన ఆ ఇంటి యజమాని వచ్చి కర్రతీసుకు గాడిదని బాదేస్తే - దానివల్ల 'కుక్క చెయ్యాల్సినపని కుక్కా.... గాడిద చెయ్యాల్సిన పని గాడిదా చెయ్యాలి - ఎవరి పని వారే చెయ్యాలి" - అని తల్లి పిల్లాడికి నీతిని బోధిస్తే...

బుజ్జిగాడిదా బుల్లికుక్కా ముఖాముఖాలు చూసుకొని తమతమ తల్లుల దగ్గరకు పరిగెత్తుకు వెళ్ళాయి.

'ఎవరు చేసిన పని వాళ్ళే చెయ్యాలా?' పిల్లలిద్దరిదీ ఒకే ప్రశ్న.

'ఔను, వాళ్ళే చెయ్యాలి!' తల్లులిద్దరిదీ ఒకే సమాధానం.

'ఎన్నాళ్ళు చెయ్యాలి?'

'ఎప్పటికీ చెయ్యాలా?'

'ఊఁ...' కొట్టారు తల్లులిద్దరూ!

'చేసిన పనే చెయ్యాలంటే ఆసక్తేముంటుంది?'

'... మొహం మొత్తుతుంది కదా?'

'........' ఆ తల్లుల దగ్గర సమాధానం లేదు.

'అలా అయితే కూలీల పిల్లలు కూలీలుగా - కాపలాదారుల పిల్లలు కాపలాదారులుగా - ఉజ్జోగుల పిల్లలు ఉజ్జోగులుగా - వ్యాపారస్తుల పిల్లలు వ్యాపారస్తులుగా... ఎవరి పిల్లలు వాళ్ళలాగే ఉండిపోతే - ఇంక తెలివెందుకు? తెగువెందుకు?'

పిల్లల చిన్నబుర్రల్లోని పెద్ద ఆలోచనలకు ఆందోళనగా ఆ తల్లులిద్దరూ ముఖాముఖాలు చూసుకున్నారు.

'నీతి మారలేదు' అంది బుజ్జిగాడిద.

'కథ మారలేదు' అంది బుల్లికుక్క.

కాలమయితే కరిగిపోయింది.

పిల్లలు రెండూ పెద్దవయినాయి. వాటి కథా మారలేదు. వంశపారంపర్యమే వచ్చింది. ఇంతవరకూ తల్లులు చేసేపని తామిప్పుడు చేస్తున్నాయి.

ఒకరోజు అచ్చం కథలో లాగే ఇంట్లో దొంగలు పడ్డారు. రోజూ చేసిన పనే చేసి విసుగొచ్చిందేమో కుక్క నిద్రపోతోంది. గాడిద చెప్పినా వినలేదు. పట్టించుకోలేదు. పైగా అసహనంతో అది పిచ్చివాగుడంతా వాగింది. ఈ లోపల దొంగలు ఇల్లంతా సర్దేసారు. ఒక్క వస్తూవూ వదల్లేదు.

గాడిద అరిచింది. ఓండ్రమంది. యజమాని నిద్రలేచి గాడిదను కర్ర తీసుకు చితక్కొట్టాడు. ఏమీ మారలేదు. విన్న కథే జరిగింది. అయితే ఆ కథని అలవాటుగా ఊహించుకుంది తల్లిగాడిద!

'గాడిద గుడ్డేం కాదూ...?' తల్లిని మూత్తో పొడిచింది పిల్లగాడిద.

తల్లిగాడిద పిల్లగాడిద ఒళ్ళంతా కంగారుగా తడిమి చూసుకుంది.

'అంతా నీ భ్రమ... అసలు నేను ఇంకా నోరువిప్పి అరవందే...' అంది గాడిద. తల్లిగాడిద తొంగి చూసింది. దొంగలు చక్కగా పూచిక పుల్ల వదలకుండా సర్దేసుకుంటున్నారు. ఇటు చూస్తే పిల్లగాడిద ఆవులింతలు తీస్తూ అడ్డగాడిదలా కుక్కకు పోటీగా ఒళ్ళు విరుస్తూరాని నిద్ర చేస్తోంది.

తెల్లారి లేచి చూస్తే - యజమానికి ఒంటి మీది బట్టలు తప్ప ఏమీ మిగల్లేదు. ఇల్లంతా బోడిగా ఉండడం చూసి బోరుమన్నాడు. దుడ్డు గర్ర తీసుకు కుక్కను కొడదామన్నా అదీ వదల్లేదు దొంగలు.

అతని భార్య మొగుడ్నీ కుక్కల్నీ తిడుతోంది, దొంగల్ని వదిలేసి. దాంతో ఆ ఇంటి యజమానికి చిర్రెత్తుకొచ్చింది. వాసాన ఉన్న వెదురు కర్రని సర్రున కిందికి లాగాడు. అప్పటికే తల్లి కుక్క హెచ్చరిస్తోంది. కుర్ర కుక్క లేస్తేనా? తల్లికుక్క పారిపోవడం... పిల్లకుక్క పట్టుకి దొరికిపోవడంతో వెదురు బద్దలయేలా విరగకొట్టేసాడు.

కుక్క కియ్యమని అనలేదు. ఊపిరిగాని వగ్గేసిందా?' అని

తల్లి కుక్క ఆత్రుతతో వచ్చింది. పిల్లకుక్క ఊపిరిని మూజాసింది. గుర్రుమని గుర్రుపెట్టి నిద్రపోతోంది. పిల్లకుక్క, కాదిప్పుడది కుర్రకుక్క!

తల్లికుక్క పిల్ల కుక్క ఒళ్ళంతా కంగారుగా తడిమి చూసుకుంది.

'అంతా నీ భ్రమ... అసలు నేను ఇంకా నోరు విప్పి... అరవందే...' అంది కుక్క. తల్లి కుక్క తొంగి చూసింది. దొంగలు శ్రద్ధగా సొంత సొత్తు అంత జాగ్రత్తగా సర్దేసుకుంటున్నారు.

పిల్లకుక్కా పిల్లగాడిదా రెండూ ఒకదాన్నొకటి చూసి నవ్వుకున్నాయి. వాటి ముసిముసి నవ్వులు చూస్తే తల్లులకి ముచ్చెమటలు పోసాయి.

'ఏం చూస్తున్నారు మీరు?' అడిగిందో తల్లి.

'మేమేం చూడడం లేదు, మాకేమీ కనిపించడం లేదు...' అనేసి కుర్ర కుక్కా గాడిదా తోడు దొంగల్లా తోకలు చాచేసి దర్జాగా పడుకున్నాయి.

'పనియే దైవం. మీ పని మీరు చేయండి..' అంది ఇంకో తల్లి.

'అరిస్తే యేం జరుగుతోందో తెలీదా? తెలీకపోతే వెళ్ళి పాఠం చదువుకో గుణపాఠం నేర్చుకో' అంది గాడిద. అది 'బుజ్జిగాడిద'గా ఉన్నప్పుడు విన్న పాఠం ఇంకా మర్చిపోలేదు మరి.

'మొరగడం నీ పని కదా... మొరుగు..' అంది తల్లి కుక్క.

'మొరిగే కుక్క కరవదని దొంగ అనుకుంటే..?' అంది కుక్క.

పరాచకాలకది సమయం కాదని తల్లికుక్క మొత్తుకుంది. అసలు కుక్కయి పుట్టి అరవకుండా ఉంటావా?' అని కూడా ఆ తల్లి నిలదీసింది. 'నేనూ అదే అడుగుతున్నా, మొరగని కుక్క ఎక్కడయినా ఉంటుందా? చప్పుడే అక్కర్లేదు, సడి అయినా అరుస్తామే, అలాంటిది కుక్క మొరగలేదని మన జాతినంతటిని ఈ మనుషులు అవమానిస్తారా? దీనికి నిరసనగా ఇదే నా మౌన పోరాటం' అంది కుక్క, నోటిమీద కాలు వేసుకొని.

పిల్లల ప్రయోజకత్వం చూసి ఏం చెయ్యాలో ఆ తల్లులిద్దరికీ తోచలేదు. ఏదో ఉపద్రవం ముంచుకొస్తోందని ఉగ్గబట్టుకు మూలన కూర్చున్నాయి.

దొంగలు ఇంటి గోడల్ని పై కప్పుని ఇంట్లో మనుషుల్ని మాత్రం వదిలేసారు. సమస్తాన్ని చుట్టి నెత్తినొకడూ భుజానొకడూ తలాకొంత మోసుకుపోతున్నారు. పోతూ పోతూ ఆగారు. ఆగి చూసారు. కదలకుండా ఉండడం చూసి మొదట బొమ్మలనుకున్నారు. బుజ్జిగాడిదా బుల్లికుక్క పెరిగిన సైజు చూసి నిజమైనవేనని నిర్ధారించుకున్నారు. అవి అలా నోరులేని జీవాల్లా ఉలుకు పలుకూ లేకుండా ఉండడం చూస్తే దొంగలకెంతో ముచ్చటేసింది. ఒకడయితే ముద్దెట్టుకున్నాడు కూడా!

మూలనవున్న ముసలితల్లులు గుడ్లు మిటుకరించి చూస్తున్నాయి.

వెళ్ళిపోయిన దొంగలు ఏదో మరిచిపోయినట్టు వెనక్కి వచ్చారు. వాళ్ళనుకున్నది నోరు దాటకముందే చేతలవరకూ వచ్చింది. ఫలితంగా కుర్రకుక్కనీ గాడిదనీ కలిపికట్టి తమతో తీసుకుపోయారు.

నోరు పెగలక నిజంగానే మూగజీవాలయ్యాయి తల్లులు.

ఇప్పుడు దొంగ సొత్తుని అనునిత్యం మోయలేక మోస్తోంది గాడిద. ఓండ్రపెడితే దొంగలతో పాటు తననీ ఎక్కడ కుమ్మేస్తారని భయమేసి ముందు జాగ్రత్తగా నాలుకని మింగేసింది.

ఎప్పుడూ దొంగల ఇళ్ళకు కాపలా కాస్తూనే ఉంటోంది కుక్క. 'దొరింట్లోనయినా దొంగింట్లోనయినా నేను కాపలాకుక్కనే' అని తలచుకుంటే దానికి ఒళ్ళు మండుతోంది. 'యెధవ మనుషులు.. 'ఛీఛీ...' అనుకుంది. అది 'భౌ భౌ...' మని వినిపించింది. విశ్వాసం గల కుక్కని నాలుగు బొమికలు తెచ్చి పడేసారు దొంగలు. గొప్ప విశ్వాసం గల జంతువని కితాబు కూడా ఇచ్చారు!

తల్లడిల్లిపోయింది తల్లికుక్క. వలవలమని కన్నీరు కార్చింది. తల్లి కలవరం చూసి తోకచాపుకు పడుకున్నదల్లా దిగ్గున లేచింది కుర్రకుక్క. 'ఏమీ మారదు... మారదుగాక మారదు..' పలవరిస్తోంది తల్లికుక్క. పిల్లకుక్క తల్లి చెవులు పట్టి నోటితో లాగింది.

'కుక్క బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు..' తల్లి తోకని తిన్నగా చేయబోయింది పిల్లకుక్క. వంకరగా మళ్ళీ చుట్టుకుపోయింది తోక. ఎక్కడిదాకో పోయిన తల్లికుక్క ఉన్న చోటుకి తిరిగి వచ్చింది.

'నిన్ను దొంగలెత్తుకెళ్ళలేదు కదా?' తల్లడిల్లిపోతూ అడిగింది తల్లికుక్క.

పిల్లకుక్క తల్లికుక్కని అయోమయంగా చూసి అటు చూడమన్నట్టు చూసింది. దొంగలు ఏదో పోటీ పెట్టినట్టు గబగబా సర్దేసుకుంటున్నారు. 'వాళ్ళెత్తు కెళ్ళాల్సిందే ఎత్తుకెళ్ళలేదు, ఇంక నన్నేమి ఎత్తుకెళ్తారు... హుం...' అని నవ్వింది.

'ఈ యింటి ఉప్పుకారం తిన్నావుగా... అరవ్వే... ఆరు...' అంది తల్లికుక్క. పిల్లకుక్క అరిచింది.

'భౌ.. భౌ..'

అరిచీ అరవకముందే దుడ్డుకర్రతో పణత పగలగొట్టేసాడు దొంగ. వాడప్పటికే సజ్జు చూసుకొని ఉన్నాడు.

దెబ్బకి కుక్క విలవిలా తన్నుకుంది. తల్లి కుక్క పిల్లని పట్టుకుంది.

'వదలవే తల్లి.. వదులు..' అరిచింది పిల్లకుక్క.

తల్లికుక్క తుళ్ళిపడి వదిలింది.

'మళ్ళీ ఏమయింది?' పిల్లకుక్క అడిగింది.

ఏమీ కాలేదన్నట్టు అడ్డంగా తలూపింది తల్లికుక్క. 'నువ్వు అరవకు గాక అరవకు...' పిల్లకుక్క నోరు గట్టిగా మూసి మరీ చెప్పింది.

'ఈ మనుషులు మనజాతిని అవమానించారు. దొంగలు పడితే మనం అరవలేదని కథల్లో చిత్రించారు. చరిత్రలో మచ్చఉండిపోతుంది. అందుకే మౌనదీక్షలో ఉన్నాను. అరవను... కరవను... నువ్వు నన్ను అర్థం చేసుకున్నావ్... అది చాలు...' అని అంటూ ఈసారి పిల్లకుక్క తల్లికుక్కని ఆత్మీయంగా దువ్వింది.

ఈ చోద్యం చూస్తున్న తల్లిగాడిదకూ పిల్లగాడిదకూ పిచ్చెత్తిపోయింది. ఈ కుక్కలకేదో కుక్క కరిచినట్టుందని తల్లీ బిడ్డా గుసగుసగా అనుకున్నాయి. అటు తలలు తిప్పి దొంగలవంక చూసాయి.

కథ

# అజిత - నేను ( 1960 - 2008)

- ఎస్. డి.

## అజిత - నేను - 1972

అజితకీ నాకూ ఒకే నెలలో అంటే ఆగస్టులోనే పుట్టినరోజు. కానీ తను నాకంటే ఒక ఏడాది నాలుగు రోజులు పెద్ద. తను మా పెదనాన్న కూతురు కనక నాకు అక్క అవుతుంది. కానీ దాన్ని ఎప్పుడూ అజ్జి అని పిలవడమే అలవాటు నాకు. అమ్మే ఎప్పుడైనా నోరారా అక్కా అని పిలవచ్చు కదరా అనేది. కానీ అజ్జికీ, నాకూ అవేం పట్టేవి కావు.

మా ఇద్దరికీ ఒకే నెలలో నాలుగు రోజుల తేడాతో పుట్టినరోజు కనకా, మా ఇద్దరి ఇండ్లకూ ఒక్క తడికే అడ్డం కనకా, మా ఇంట్లో వాళ్లు దాన్ని ఒకే రోజుకు మార్చేశారు. ఆ ఒకేరోజు అజ్జి పుట్టిన పదవ తారీకే కావడం నాకు ఇష్టం లేకుండింది. అప్పటివరకూ ఏమో గానీ 7వ క్లాసుకు వచ్చాను కదా, మా ఫ్రెండ్సంతా గొడవ చేస్తున్నారు మీ అక్క పుట్టినరోజున నీదెంట్రా, నీది నీకు లేదా అని. అయినా పుట్టినరోజంటే ఏం చేస్తారు గానీ..తలకి పోసి పాయసం చేసేవారు. నాకిష్టమని గారెలు - అంతే. ఆ సంవత్సరం మొదటినుండే అనుకున్నా అజ్జి పుట్టినరోజున కాక నా పుట్టినరోజు పద్నాలుగునే చేయాలని.

కానీ అమ్మేమో వద్దంటుంది. ఎందుకంటే పెద్దమ్మా, అజ్జీ బాధపడ్తారేమో అంటోంది. మరి నేను బాధపడనా? మేమిద్దరం గట్టిగా మాట్లాడ్తే తడికవతలకి వినిపిస్తుందని మెల్లగానే వాదించుకుంటున్నాం. ఇంతలో అజ్జి గెంతుకుంటూ రానే వచ్చింది. 'పిన్నీ, శీనుగాడ్ని తీసుకెళ్లనా ఆటకి' అంటూ. నేను మూతి బిగించుకు కూచున్నా. అజ్జి మొహం చిన్నబోయింది. 'ఏమైంది పిన్నీ' అంటూ వెంటబడి మొత్తానికి విషయం రాబట్టింది.

'అబ్బా, ఇంతేనా పిన్నీ, దాన్దేముంది నాదీ పద్నాలుగునే చేయండి, అసలైనా నాకేం పెద్ద చేసుకోవాలని లేదు, శీనుగాడిదే చేసుకుంటే సరి' అనేసింది తేలిగ్గా.

నాకు ఎక్కువేం ఆశ్చర్యం వేయలేదు. నిజానికి అమ్మకి

---

'ఇంకేం మరిచిపోలేదు కదా..' ఓ దొంగ అడిగాడు.

'మరిచిపోతే పొద్దున్నే వచ్చి అడిగి తీసుకెళ్లాంలే' అన్నాడు ఇంకో దొంగ.

దొంగలు కిసుక్కుమని నవ్వుకున్నారు. కట్టిన మూటలు ఎత్తుకున్నారు. నెమ్మదిగా ఒక్కో అడుగు పిల్లిలా వేసుకుంటూ ఇంట్లోంచి బయటకు వస్తున్నారు.

అది చూసిన కుర్రకుక్క 'వస్తే రానీ - పోతే పోనీ..., నాకేమిటి సంబంధం?' అని కాళ్ళ మీద కాళ్ళు వేసుకు ఆడించింది. తల్లి కుక్క ఏదో చిత్రం చూసినట్టు చూస్తోంది.

'తరతరాలుగా మనకిది తప్పడం లేదమ్మా' అన్నట్టుగా తల్లిగాడిద వంక పిల్లగాడిద ఓ చూపు చూసి 'ఓండ్ర' పెట్టింది.

'హాఁ... హి.... హ్హా...'

గాడిద అరుపులకు యజమానికి నిద్రాభంగమయింది. లేచి వచ్చాడు. అప్పటికే దొంగలు ఎక్కడి సామాన్లు అక్కడే వదిలేసి తుర్రుమన్నారు. ఇంటి యజమాని దుడ్డుకర్ర తీసుకొని వచ్చాడు.

తల్లి గాడిద 'చచ్చామురో' అంటూ గజ గజ వణుకుతూ కళ్ళు మూసుకుంది. యజమాని కర్ర విరిగేలా కొట్టడం కర్ణభేరి పగిలేంత శబ్దంతో వినిపిస్తోంది. ఆ దెబ్బలకు తాళలేక 'కుయ్.. కుయ్..' మన్న శబ్దం కూడా పోటీపడి వినిపిస్తోంది.

కళ్ళు తెరిచి చూసింది తల్లిగాడిద.

కుక్క - కుక్క దెబ్బలు తినేసింది.

తల్లికుక్క పిల్లకుక్క వంటి మీద గాయాల్ని నాకుతోంది.

కుయ్... కుయ్... కిర్రో మొర్రో మంటోంది కుక్కపిల్ల...

'గుగ్గిళ్ళు తీసుకురా...' యజమాని అరిచాడు.

'గుర్రమేది?' అంటూ గుగ్గిళ్ళు తీసుకువచ్చింది యజమానురాలు.

పిల్లగాడిద గడ్డము నిమురుతూ 'ఇది మామూలు గుర్రం కాదు, మేలు జాతి గుర్రం... అయినా జాతి వల్ల నీతి రాదు. నీతివల్లే జాతికి విలువొస్తుంది. అందువల్ల ఇది మేలు జాతిగుర్రం. పుట్టుకలో యేం లేదు, బుద్ధిలోనే అంతా ఉంది' అన్నాడు యజమాని. గుగ్గిళ్ళూ తినిపించాడు.

'నా జన్మ చరితార్థకమైంది' అని అనుకుంది తల్లిగాడిద.

అప్పటికే పిల్లకుక్కనీ దాని తల్లినీ రెంటినీ ఇంటికి దూరంగా తరిమేసారు.

యజమాని పనిమీద వెళ్ళిపోయాడు.

గాడిద గుగ్గిళ్ళు నమల్లేక నములుతోంది.

పిల్లకుక్క మళ్ళీ తిరిగి వచ్చింది. గాడిదను చూసి 'నీకింత కష్టమొస్తుందని అస్సలనుకోలేదు...' అని కుక్క బాధపడింది.

గాడిద అర్థం కానట్టు చూస్తే, దాని తల్లి 'తల మీద బలమైన దెబ్బ తగిలిపోయినట్టుంది...' అంది.

'నిజంగా బుద్ధిలేని గాడిదలే...' అంది కుక్క పిల్ల. 'అసూయపడి అనడం లేదు, రేపటి నుంచి నా పనీ నీ పనీ నువ్వే చెయ్యాలి. అదే పగలు మోతపని... రాత్రి కాపలా పని, అందుకే గుగ్గిళ్ళు పెడుతున్నాడు' అని కూడా అంది.

ఆ మాటతో గాడిద గుండెలో రాయి పడింది. గుగ్గిళ్ళు మింగలేకపోయింది.



చెప్పడంకంటే అజ్జికి చెప్తేనే ఇది సులభంగా అవుతుందని నాకు తెలుసు. అజ్జికేంటో మిగతా ఆడపిల్లల్లా చక్కగా ముస్తాబు అవ్వాలనీ, కొత్త కొత్త బట్టలేసుకోవాలనీ ఏం ఉండేది కాదు. నాకు మాత్రం ప్రత్యేకంగా గుర్తింపు ఉండాలనిపించేది. నన్ను అందరూ గొప్పగా చూడాలనిపించేది. నాకు చదువులో తప్ప ఇంకెందులోనూ తెలివి చూపించుకునే అవకాశం లేకపోయింది. దాంతో కష్టపడి చదివేవాడ్ని. అజ్జిని మొదటి ఆడపిల్ల అని గారాబం చేసి ఒక సంవత్సరం ఆలస్యంగా నాతోపాటే స్కూల్లో వేయడంతో ఒకటే క్లాసు. నేనే క్లాసు ఫస్ట్ రావాలని ఉండేది నాకు, కానీ మా అజ్జే నాకు పోటీ. అజ్జి పెద్దగా చదివినట్లు ఉండేది కాదు, పైగా ఆటలూ, నాటకాలూ అంటూ అన్నిట్లో ఉండేది. అందరికీ అజ్జి అంటే ఇష్టమే. నాక్కూడా ఇష్టమే, దానికీ నేనంటే చాలా అపేక్ష. కానీ తనని పై క్లాసులో వేయలేదని నాకు కోపంగా ఉండేది. నాకు రావాల్సినవి తను లాగేసుకుంటోందని ఉక్రోషంగా ఉండేది. తను ఫస్ట్ వచ్చినప్పుడు నేను అలిగితే బుజ్జగించాలని చూసేది నన్నే. అలాంటప్పుడు 'పావం' అనిపించినా మళ్లా నేను సాధించుకోవాల్సినవి ఉంటే మాత్రం తను ఏం ఫీలవుతుందా అని ఆలోచించకుండా లాగేసుకునేవాడిని.

అజ్జికి నేనంటే అనే కాదు ఎవరన్నా జాలే. ఆఖరికి కుక్కన్నా, పిల్లి అన్నా కూడా. ఎవర్నీ నొప్పించడం చాతకాదు. నాలా మొండికేసేది కాదు, అలిగేది కాదు. నాకు తను ఏమైనా ఇచ్చేసినప్పుడు బాగానే ఉండేది కానీ ఊళ్లో వాళ్లందరికీ అడిగిందే తడవుగా ఏదైనా ఇచ్చేస్తుంటే మాత్రం గొడవ పెట్టుకునేవాడ్ని. కానీ అజ్జి ఇలాంటప్పుడు అచ్చం 'అక్క'లా చేసేది. 'పోరా, నీది కాదు కదా, నేను కదా ఇచ్చేది' అనేసేది. పెద్దమ్మకో, అమ్మకో చెబ్దామన్నా 'దాని మనసు బంగారంరా, చూసి నేర్చుకో' అని నాకే చెప్తారు.

మొత్తానికి 1972 సంవత్సరంలో ఆగస్టు 14ననే నా పుట్టినరోజును నేను మొదటిసారిగా జరుపుకున్నాను. అంటే నాకర్థమైనదేంటంటే నేను ఒక 'వ్యక్తి'గా నన్ను నేను ఆ రోజునుండి గుర్తించుకోవడం మొదలైందన్నమాట. ఆ తర్వాత నేను జీవితంలో యాంబిషియస్‌గా దూసుకుపోడానికి పునాది ఆ రోజే పడిందని ఆ తర్వాత నా కెరీర్ ఊపందుకున్నాక నేను ఉపన్యాసాల్లో చెప్పేవాడ్ని.

అజ్జి మాత్రం తన పుట్టినరోజును నాకు కోల్పోయినందుకు ఏ మాత్రం దిగులుపడినట్లు అనిపించలేదు - ఆ రోజు గానీ, ఆ తర్వాత గానీ. నా కోసం ఒక పిసరు ఎక్కువ సంతోషంగా కూడా ఉందా అని నాకు సందేహం వచ్చింది.

## అజిత - నేను - 1976

పదవ తరగతి పరీక్షలు అజ్జీ, నేనూ బాగా చదివి రాశాం. నాన్న మంచాన బడి మూడు సంవత్సరాలు అవుతోంది. చెడు తిరుగుళ్లు తిరిగే ఆయన అలా అయ్యారని నాకు అప్పుడప్పుడే అర్థమవుతుండింది. దాంతో ఒకలాంటి అసహ్యం ఆయనంటే. అజ్జి అయినా ఆయన పన్లు కొన్ని చేసేది గానీ నేనాయన ఛాయలకే వెళ్లకపోయేవాడిని. ఉన్న కొద్ది ఆస్తీ ఆయన తిరుగుళ్లకీ, పేకాటకీ ఆరిపోయింది. అందుకే అమ్మ నన్నూ, చెల్లినీ పెంచడానికి చాలా కష్టపడేది. అజ్జి వాళ్ల నాన్న, మా నాన్న అన్నదమ్ములు. ఎరువుల వ్యాపారంలో పెదనాన్నదే ప్రధాన వాటా అయింది ఈన అంతా తగలేయడంతో. అమ్మకి ఇక ఏదైనా దక్కాలనేదాంతో ఇందులో 20 శాతం వాటా పెట్టి ఇచ్చేవారు. అమ్మ దాంతోనే గుట్టుగా సంసారం నడుపుకొచ్చేది. పూతరేకులు చాలా బాగా చేసేది అమ్మ. నడుములు విరగ్గొట్టుకుని చేస్తూ ఉండేది. పెదనాన్నే తెనాలిలోనూ సప్లయి చేసేలా కుదిర్చారు. దాంతో మా పరిస్థితి కొంత మెరుగయింది.

పదవ తరగతి శెలవల్లోనే నాన్న పోయారు. ఆయన పోయినందువల్ల మాకు పెద్దగా కలిగిన దు:ఖం ఏం లేదు గానీ అజ్జీ, నేనూ జీవితంలో మొదటిసారి భౌతికంగా విడిపోవడానికి అది కారణం అయింది. మావయ్య మమ్మల్ని గుంటూరు తీసుకెళిపోతానన్నాడు. తనకి అక్కడ స్వంత ఇల్లు ఉంది, అందులోనే ఒక వాటాలో ఉంటూ పిల్లల్ని చదివించుకో అని చెప్పాడు అమ్మకి. దాంతో నాన్న వాటా ఇల్లూ, వ్యాపారంలో వాటా అమ్మేసి వెళ్లాల్సి వచ్చింది. పెదనాన్నకే అమ్మాలి కదా. కానీ అప్పుడు పెదనాన్న దగ్గర అన్ని డబ్బులు లేక ఇబ్బంది పడ్డారు. చివరికి మావయ్య పట్టుబట్టడంతో వడ్డీకి తెచ్చి ఇచ్చారు. ఇది పెదనాన్న, పెద్దమ్మల మనసులో ఉండిపోయింది. అలాగని మా మీద ప్రేమలు తగ్గాయని కాదు గానీ 'నిలబెట్టి వసూలు చేసుకున్నావు కదమ్మా' అని మాత్రం అనకుండా ఉండలేకపోయారు. అమ్మ కన్నీళ్లు పెట్టుకుంటే వాళ్లూ ఏడ్చారు. అజ్జి సరేసరి.

'రెండు గంటల దూరమే కదరా, శెలవున్నపుడల్లా నువ్వన్నా రా, నేనైనా వస్తా' అంది. తలూపాను.

కానీ ఎప్పుడైనా తనే వచ్చేది అవీ, ఇవీ తినడానికి పట్టుకుని, నేను వెళ్లింది తక్కువే. మా రెండు కుటుంబాలూ ఇంకా సఖ్యంగా ఉన్నాయంటే దానికి ప్రధాన కారణం అజ్జే అని చెప్పవచ్చు. దానికసలు కక్షలూ, ముఖాలు ముడుచుకోడాలూ రావు, అందర్నీ ప్రేమించడం తప్ప. అలా ఉండకు, అందరూ నిన్ను మోసం చేస్తారు అనేవాడ్ని. 'పోరా, ఆ మాత్రం తెలివి నాకుందిలే' అనేది. అదీ నిజమే అనిపించేది. ఎందుకంటే ఎవరైనా వెధవ్వేషాలు వేస్తే చెప్పు తీసుకుని తన్నేది. అజ్జి ఉందంటే ఎవడూ ఆడపిల్లల కేసి కన్నెత్తి చూసేవాడు కాడు. దేనికీ భయపడేది కాదు. ఊళ్లో ఆడపిల్లలందరికీ అదో హీరోయిన్.

## అజిత - నేను - 1981

గుంటూరుకొచ్చాక నాకు ఒకే ఒక లక్ష్యం ఉండేది - మంచి ఉద్యోగం తెచ్చుకోవాలి, డబ్బులకు ఏ మాత్రం ఇబ్బంది లేకుండా అమ్మనీ, చెల్లినీ చూసుకోవాలి. డబ్బుంటేనే ఈ సమాజంలో గౌరవం కనక బోలెడు డబ్బు సంపాదించాలి అయితే సాధ్యమైనంత నిజాయితీగానే. ఉద్యోగం చుట్టూనే ఉండేవి నా ఆలోచనలన్నీ. అజ్జికి మొదటినుండీ తను టీచర్ కావాలనే విషయంలో సందేహాలు లేవు. నా బతుకు నేను బతకాలి, చేసే పని నలుగురికీ ఉపయోగపడితే ఇంకా సంతోషం, అందుకే టీచరవ్వాలనుకుంటున్నా

అనేది. నలుగురికీ ఉపయోగపడాలి అనేది నా ఎజెండాలో లేదు. నలుగుర్నీ నాకెలా ఉపయోగించుకోవాలా అనుకునేవాణ్ని.

మా కులం ఆయనే మెదక్ జిల్లాలో ఫ్యాక్టరీ పెట్టాడనీ, కులం కాబట్టీ, బ్రిలియంట్‌ని కాబట్టీ ప్రయత్నించమని చెప్పడంతో వెళ్లాను. డిగ్రీ రిజల్ట్ రాకుండానే ఉద్యోగం వచ్చింది క్లర్క్‌గా. అమ్మ, చెల్లీ గుంటూరులోనే ఉండిపోయారు. నేను ఒక్కడ్నీ వెళ్లాను. అజ్జి ఉత్తరాలు రాస్తుండేది. నాకు రాయడానికేముండేది కాదు. కానీ అజ్జికి మాత్రం ఏవో విషయాలు ఉండేవి. టీచర్ ట్రెయినింగ్‌లో తన అనుభవాలూ, తన స్నేహితులూ, పిల్లలకి అసలు ఎలా చెప్తే మంచిది అని ఏవేవో రాసేది గాల్లో మాటలు. అక్కడా సమాజ సేవకురాల్లాగా వాళ్లకి సహాయం చేయడం, వీళ్లకి సహాయం చేయడం. మనిషన్నాక కొంచెమన్నా స్వార్థం ఉండాలి. అబ్బే!

స్వార్థం లేకపోతే ప్రపంచం ఇంతగా అభివృద్ధి చెందేదే కాదు అని వాదించేవాణ్ని గుంటూరు వెళ్లినప్పుడు కలిస్తే. 'పోరా, అంతా తలకిందులుగా చెప్తావు, సైంటిస్టులు నిస్వార్థంగా అంకితమై కొత్త విజ్ఞానాన్ని కనిపెట్టకపోయి ఉంటే మనం ఎక్కడ ఉండేవాళ్లం' అని తను వాదించేది. తను లూయీ పాశ్చర్, డార్విన్, ఐన్‌స్టీన్, రామానుజం లాంటి వాళ్ల గురించి చెప్తే నేను హెన్రీ ఫోర్డు, టాటా, బిర్లా వంటి వాళ్ల గురించి చెప్పేవాణ్ని. వాదన తెగేది కాదు. నేను చెప్పేవి తనకి నచ్చకపోయినా ఆపేక్షలో మాత్రం ఏం తేడా ఉండేది కాదు. కానీ నాకు మాత్రం తనతో వాదించాక దూరం పెరిగినట్లు అనిపించేది. తన ప్రయత్నం లేకపోతే అప్పుడే దూరాలు పెరిగేవి.

**అజిత - నేను - 1985**

అజితకి హైదరాబాద్‌లో ఉద్యోగం వచ్చింది. తర్వాత తన స్కూల్లో టీచర్‌తోనే ప్రేమవివాహం. ఆయన మా కులమే కావడంతో ఎవరికీ అభ్యంతరం లేకపోయింది. 'అజ్జిలా తెలివిగా మన కులం ఆయన్నే ప్రేమించి కట్నాలు లేకుండా పెళ్లిళ్లు చేసుకోండే' అని పెద్దవాళ్లు జోకులేసేవారు పెళ్లికెదిగిన ఆడపిల్లల్తో, పెళ్లిళ్లపై తమ పెత్తనం పోతోందనే బాధని దాని వెనక కప్పెట్టి. 'ఛీ, కులం చూసి ప్రేమించలేదు మొర్రో' అని అజ్జి. తెగ ఏడిపించి వదిలిపెట్టాం ఇద్దర్నీ పెళ్లిలో. రెండు గంటలు ప్రయాణం చేస్తే వాళ్లింట్లో ఉండేవాణ్ని. దాంతో కొన్ని నెలలపాటు ప్రతి ఆదివారం వాళ్లింట్లోనే. రాకుంటే ఇద్దరూ ఒప్పుకునేవారు కారు. సినిమాలకు కూడా ముగ్గురం వెళ్లేవాళ్లం. మీ మధ్య నేనెందుకు అంటే వినేవాళ్లు కారు. ఇంతకీ బావగారూ అజ్జిలాంటి ఆయనే. ఇంకో రెండాకులు ఎక్కువే చదివాడు. యాంబిషన్ లేదు, కెరీర్ మీద ఇంట్రెస్ట్ లేదు, ప్రభుత్వోద్యోగం చాలనుకుంటాడు. యూనియన్‌లో చిన్నపాటి లీడర్.

తర్వాత రోజుల్లో అసలాయన మా కులంలోనే పుట్టాడా లేక ఏ దొమ్మరింట్లోనో పుట్టాడా అని సందేహం వచ్చేది. ఎప్పుడూ ఆ హరిజన పిల్లల్నేసుకుని వాళ్లకి ఫ్రీగా ట్యూషన్లు చెప్పడం, ఆడించడం, పాడించడం ఇదే గోల. మొదట్లో మన కులం పరువు పోగొట్టద్దు అని చెప్పేవాడిని. మొండిఘటం అని అర్థమయ్యాక వదిలేశా. అయినా నాతో మాత్రం ఇద్దరూ ప్రేమగానే ఉండేవారు. ఆ హరిజన పిల్లలు ఇంట్లో స్వేచ్ఛగా తిరుగుతూ అన్నీ ముట్టుకుంటూ ఉంటే నాకు చిరాగ్గా ఉండేది. వాళ్లిల్లు వాళ్లిష్టం అని ఎలాగో భరించేవాడిని. అజ్జి వంటలు పెద్ద ఆకర్షణే అయినా ఆ పిల్లలతో వాళ్లు అంత రాసుకు పూసుకు ఉంటుంటే క్రమంగా వెళ్లడం తగ్గించాను. వాళ్లకీ ఏమర్థమైందో బలవంతం పెట్టేవాళ్లు కారు. అలాగని ఆహ్వానించకుండా ఉన్నట్లు ఎప్పుడూ లేరు. వాళ్లు నా పట్ల అలా ఉంటే కులం, బంధుత్వం అన్నిటివల్ల అది నా హక్కుగా అనిపించేది, కానీ వాళ్లు అందరి పట్లా అలా ఉంటే కంపరంగా ఉండేది. ఏం మనుషులు వీళ్లు అనిపించేది. నేను మాత్రం క్రమం తప్పకుండా మా కుల సమ్మేళనాలు ఎక్కడ జరిగినా హాజరు కావడం, ఆ పత్రిక తెప్పించుకోవడం చేసేవాడిని. ఈ విషయంలో మాత్రం మొదటిసారిగా వాళ్లిద్దరిలో నా పట్ల తిరస్కార భావం కనిపించింది. వాళ్లు రాకపోగా నన్నేదో పురాతన మానవుడిలా చూస్తుంటే నాకు చిర్రెత్తుకొచ్చేది. వీపి సింగ్ లాంటి వాళ్లే హాజరు కాగా లేనిది నేను వెళ్తేనే తప్పా?

అరే, అన్ని కులాల వాళ్లూ తమ తమ కులాల అభివృద్ధి కోసం నానా గడ్డీ కరుస్తూ ఎలాగైనా గానీ 'మనవాణ్ని' కీలక స్థానాల్లో ఇరికించాలని నానా పాట్లూ పడుతుంటే వీళ్లేంటి బోడి...వెధవ ఆదర్శాలూ వీళ్లూ. ఏమన్నా అంటే అంబేద్కర్, పూలే అంటూ మొదలు. ఈ మధ్య కొత్తగా మార్క్స్ అంటూ ఇంకొకడ్ని తగులుకున్నారు. ఇంట్లో ఎటు చూసినా ఆ పుస్తకాలే అన్నిటికీ అడ్డంగా. ఆ డబ్బుల్తో ఎంత ఫర్నీచర్ వచ్చి ఉండేదో.

**అజిత - నేను - 1986**

నేనిప్పుడు మంచి ఫ్లాట్ అద్దెకు తీసుకుని నా భార్య శ్రీరంజనితో కాపురం పెట్టాను. అకౌంట్స్ డిపార్ట్‌మెంట్‌లో మంచి స్థానంలో ఉన్నాను. రంజనికి గవర్నమెంట్ ఉద్యోగం. రంజనిని చూడడానికి వెళ్లేటప్పుడు అజ్జినే రమ్మన్నాను. పెళ్లిచూపుల కెళ్లేటప్పుడే నేను పెట్టిన షరతు ఒకటే, తను ఉద్యోగం చేసేదై ఉండాలని. పెళ్లిచూపులేంట్రా, చక్కగా ఆమెని ఆఫీసు దగ్గరే కలిసి మాట్లాడు అంది. సరే అని ఇద్దరం వెళ్లాం. మమ్మల్ని ఇద్దర్నీ మాట్లాడుకోమని అజ్జి తనకి తెలిసిన ఫ్రెండ్ దగ్గరకి వెళ్లి వచ్చింది. అజ్జీ కాస్సేపు మాట్లాడింది తనతో. 'మనుషులంటే అంత ఆపేక్షగా ఉండేట్లు లేదురా, పిన్నినీ, రమనీ ఆదరించకపోతే ఇబ్బంది పడతావు' అంది. రంజని నాకు మొదటి చూపులోనే నచ్చలేదు, నచ్చలేదనీ చెప్పలేను. కానీ తనకి మంచి జాబ్ ఉంది, చూడ్డానికి బానే ఉంటుంది, మా కులం, సిటీలో ఉద్యోగం కనక నా కెరీర్ యాంబిషన్స్‌కి ఇబ్బంది లేదు, ఇలా అన్నీ చూస్తే కాదనడానికి ఏం కనిపించలేదు. నేను కెరీర్ కోసం తిరుగుతూ ఉంటే తనని పట్టించుకోవట్లేదని సణిగేవాళ్లు మాత్రం వద్దనుకున్నా. రంజని ఇంకా ప్రోత్సహిస్తుందే తప్ప కాదనదు అని అర్థమైంది. ఇంకోటి రేపు పిల్లలకి ఏం కావాలన్నా వెతుక్కోకుండా ఉండాలంటే, ఏ అమెరికాకో చదువుకు పంపించాలంటే ఇద్దరికీ ఉద్యోగాలు అవసరం కదా. అమ్మ, రమల విషయంలో మరీ అంత ఇబ్బందికరంగా ఉంటుందనిపించలేదు నేను మాట్లాడినంతవరకు. పెళ్లయిపోయింది.

కానీ ఆ తర్వాత అజ్జి అన్నదే వాస్తవమని తేలింది. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లయ్యింది. ఇకంతే జీవితాంతం భరించక తప్పలేదు. ఎందుకంటే తను నాకంటే రెండాకులు ఎక్కువే చదివింది. నేను నా కుటుంబం, దగ్గరి బంధువుల వరకు, మహా అయితే కులం పరిధినుంచుకుని ఆలోచిస్తే తను కేవలం తననీ, నన్నూ, పుట్టబోయే మా పిల్లల్నీ మాత్రమే ఆ పరిధిలోకి రానిస్తానన్నట్లు ఉండేది. అమ్మను దగ్గర ఉంచుకోవాలనుకున్నా కుదరనిది అందుకే. చెల్లి పెళ్లయ్యాక అమ్మని తీసుకొస్తే రెండు నెలలు కూడా భరించలేకపోయింది రంజని. ఇక అజ్జి దగ్గరకు పరిగెట్టాను. 'అమ్మనుంచుకుంటావా? బావగార్ని అడిగి చెప్పు' అంటే నవ్వింది.

'ఇప్పటికింకా అలాంటి అవసరం మా ఇద్దరికీ రాలేదులే. వస్తుందనీ అనుకోను. నా స్థానంలో ఆయన ఉన్నా సరే అనే అనేవారు' అంది. మొదటిసారిగా అమ్మని కూడా నాతో ఉంచుకోలేని నా స్థితిపై అసహ్యం కలిగింది. ఎంత సంపాదించినా అమ్మని సుఖపెట్టలేకపోయానని బాధపడ్తుంటే అజ్జే నచ్చచెప్పింది. పిన్ని అయినా, అమ్మ అయినా తనకొకటే అనీ పిన్ని ఉంటే తనకీ, పిన్నికీ కూడా ఎంతో బాగుంటుందనీ, అసలు నేను అడగకపోయినా కొన్ని రోజుల కోసమైనా పిన్నిని ఎలాగూ తెచ్చుకునేదాన్ననీ, ఇలా ఏవేవో చెప్పి నా మనసులోంచి ఆ నెప్పిని కొంత తొలగించింది.

**అజిత - నేను - 1990**

పెళ్లి అయి నాలుగయిదు ఏళ్లు కూడా కాకుండానే అటు చెల్లి జీవితమూ నాశనం అయ్యింది. వాడొట్టి వెధవ అని తేలింది. మోసపోయాం. ఒక పిల్లాడిని కన్నాక ఇక చెల్లి వాడిని భరించలేక ఇంట్లోంచి వెళ్ళిపోయింది. చనిపోయిందా ఎటైనా పోయిందా అని తెలీక తల్లడిల్లి పోయాం. చెల్లి కనిపించడం లేదని ఫోన్ వచ్చిన రోజు నాకు పిచ్చెక్కిపోయింది. తను వెళ్ళిపోవడం ఒక బాధ, కులం వాళ్లలో పరువు పోయిందనీ బాధ. ఉన్న ఒక్క అమ్మనీ, చెల్లినీ కూడా సరిగా చూసుకోలేకపోయానే అని కుమిలిపోయాను. రంజని తనకేం పట్టనట్టు ఉంది. తన భయం అంతా ఆ పిల్లాడ్ని నేనైతే నెత్తికెత్తుకోను కదా అనేదే.

తెలియడంతోనే అజ్జి స్కూలు వదిలిపెట్టి వచ్చేసింది. అజ్జిని చూడగానే పట్టుకుని బావురుమన్నాను. తనూ ఏడుస్తూనే ఉంది. చెల్లంటే దానికీ ప్రాణం. అప్పుడే అది 'ఊర్లో సంబంధం వద్దురా, అంతా జూదగాళ్లు, పేకాటరాయుళ్లు, మంచి పిల్లాడ్ని చూసి చేద్దాం, అసలు మన కులంలోనే అని ఆలోచించకుంటే మంచి పిల్లాడు దొరకుతాడు' అంటే నేనే వినలేదు. మా సమ్మేళనంలో కొందరు మంచి సంబంధం అని చెప్పడంతో వాళ్లనే నమ్మాను. ఇలా తగలడింది. సమ్మేళనాల్లో కుదిరిన సంబంధాలన్నీ అలాగేం కాలేదు కదా మా ఖర్మ కాలి అలా అయింది గానీ అని సమర్థించుకున్నా. చివరికి అజ్జీ, నేనూ ఆలోచించి రమ పిల్లాడ్ని తీసుకొచ్చేసి అమ్మతోపాటు ఉంచుదామనుకున్నాం. అజ్జి వాళ్లింటి దగ్గరే ఒక వాటా తీసుకుని ఉంచాం. అప్పటివరకూ అమ్మ అజ్జి దగ్గరే ప్రశాంతంగా బతికింది. అమ్మ కోసం మళ్లీ అజిత వాళ్లింటికి నేను వెళ్లి రావడం ఉండేది, రంజని రావడం తక్కువే.

కుటుంబపరంగా అజ్జి సహాయం తీసుకోవడం నాకు బాగానే అనిపించినా ఒకసారి నేను అమ్మను కలవడానికి వెళ్లినప్పుడు జరిగిన విషయం నన్ను మళ్లీ అజ్జికి దూరం జరిగేలా చేసింది. అజ్జి గురించీ భయపడ్డాను ఎటు పోతుందో ఏమౌతుందో అని. వాళ్లకే కాదు వాళ్లకి దగ్గరగా ఉంటే మాక్కూడా ప్రమాదమేమో అని బెరుకు పుట్టింది.

ఆ రోజు అమ్మని కలవడానికి వెళ్లా. అమ్మ టీ పెట్టడానికి వంటింట్లోకి వెళితే నేను ఎప్పట్లాగే పడక గది తలుపు తెరుచుకుని లోపలకు వెళ్లబోయా. ఎవరో ముగ్గురు మగవాళ్లు కాయితాలూ, పుస్తకాలూ ముందేసుకుని కూచుని ఉన్నారు. బనీన్, లుంగీల మీదున్నారు. నేను 'సారీ' అని తలుపు వేసేసి వాళ్లెవరు అని అమ్మని అడిగాను. అజ్జి వాళ్లాయనకు బాగా తెలిసిన వాళ్లనీ, చాలా మంచి వాళ్లనీ, సమాజసేవ చేస్తుంటారనీ, తమ సంస్థ పనులు చేసుకోవాలని అప్పుడప్పుడు వస్తుంటారనీ చెప్పుకొచ్చింది, తర్వాత బావగారు పరిచయం చేశాడు వాళ్లని, అంతా తెలంగాణ వాళ్లు. నాకెందుకో అనుమానం వచ్చి అజ్జిని విడిగా పట్టుకుని అడిగేశా తర్వాత. నా అనుమానం నిజమే. బుద్ధుందా, ఇద్దరు చంటిపిల్లల్ని పెట్టుకుని ఇవేం పనులు అని కేకలేశా. తనూ అంతే స్థాయిలో తాము ఆ రాజకీయాల్ని నమ్మే దగ్గరైనామనీ, వాటిని వదులుకోమనీ గట్టిగా చెప్పింది. ఎవరికీ చెప్పద్దంది. నేనెవరికి చెప్తా గానీ దాని పిల్లలిద్దరి మొహాలు చూసైనా మానుకోమని బతిమాలా. వాళ్లు ఇలా అయితేనే మంచిగా పెరుగుతారు అని వితండవాదం చేసింది. దాంతో ఇక అజ్జితో ఎక్కువ సంబంధాలు పెట్టుకోకూడదని మనసులో అనేసుకున్నా. రమ పిల్లాడ్ని తెచ్చాక విడి ఇంట్లో అమ్మ ఉండడంతో అజ్జి ఇంటికి వెళ్లి తీరాల్సిన అవసరం తప్పింది. పావుగంట దూరంలోనే ఉండేది కనక అజ్జి, అమ్మ ఎప్పట్లాగే కలిసి మెలిసి ఉండేవాళ్లు. నిజానికి నేను డబ్బు ఒకటీ ఇచ్చానన్న మాటే గానీ మిగతా ఏ సాయమైనా అమ్మకీ, పిల్లాడికీ చేసింది అజ్జి వాళ్లే.

నేను మా దగ్గరి బంధువులందరికీ నా శాయశక్తులా సిటీలో వచ్చి సెటిల్ కావడానికి సహాయం చేస్తూనే ఉన్నాను. అలా మా ఊర్లో అంతా నాకు మంచి పేరు వచ్చింది. ఇప్పటికీ అజ్జి పాపులారిటీ దానికి వున్నా నాకున్న డబ్బు, హోదా, నేను చూపించగలిగే ఉద్యోగాలో ఇప్పించగల ప్లాట్లో నన్ను చాలా పాపులర్ చేశాయి. కానీ ఎవరొచ్చినా ఉండాలంటే మాత్రం నా పెద్ద అపార్ట్‌మెంట్‌లో కాక అజ్జి వాళ్ల చిన్న అద్దెకొంపలో వుండాల్సిందే. ఇందులో మాత్రం నేను దానితో పోటీపడలేను ఇక. 'ఇల్లు కాదురా పెద్దగా ఉండాల్సింది, మనసు' అనేది అజ్జి ఎప్పుడన్నా ఇబ్బందా అని అడిగితే.

**అజిత - నేను - 1999**

నేనిప్పుడు క్లర్కు ఉద్యోగంలో లేను. మా బాస్ ఐటి రంగంలోకి ప్రవేశించాడు. నాలాగా పైకి రావాలనుకునే మా కులం వాళ్లందరినీ ఆయన ప్రోత్సహించి తన కంప్యూటర్స్ సంస్థలోకి తీసేసుకున్నారు. ఫ్యాక్టరీలో లాభాలు లేవు. పైపెచ్చు అసలే మెదక్

జిల్లా కావడంతో మిలిటెంట్ల బెడద, సమ్మెలూ, అప్పటికి వాళ్లదే రాజ్యంలా ఉండేది. ఐటీ రంగంలోకి రావడంతో ఆ లంపటం అంతా వదిలింది. నేనిప్పుడు మంచి అపార్ట్‌మెంట్ కొనుక్కున్నా. అజితకిప్పటికీ స్వంత ఇల్లు ఏర్పడలేదు. మా బాస్ మా కులం వాళ్లందరికీ పైకి రావడానికి ఏదో రూపంలో దోహదం చేస్తూనే ఉంటాడు. ఒకసారి ప్రస్తావిస్తే ఖయ్యిమంది. బురదలోనే ఉండాలనుకునేవాళ్లను ఎంతకని పైకి లేపుతాం? ఈ మధ్య ఈ తెలంగాణ గొడవ ఒకటి వచ్చి పడింది. అప్పటినుంచీ అజ్జి మా వైపు వాళ్లు ఎలా సిటీలో ప్రాంతాలకు ప్రాంతాలను ఆక్రమించుకుంటున్నారో విసుర్లు విసుర్తోందని మా బంధువుల్లో చర్చ అయింది. దాంతో మా ఊర్లో దానికున్న గుడ్‌విల్ కొంత తగ్గిపోయింది. 'ఆ, మరీ బడాయి, హైదరాబాద్ తెలంగాణ వాళ్ల అబ్బ సొత్తా ఏంటి, అయినా దీనికేం పుట్టింది, ఇక్కడ పుట్టి పెరిగిన పిల్ల కాదూ, దీన్ని కూడా ఉద్యోగం నుండి తరిమేస్తే తెలుస్తుంది' కొందరు ఈ స్థాయిలో కూడా తిట్టుకున్నారు. కానీ అది బెదిరినట్లు లేదు. అయినా అవసరాలుంటే వచ్చి అజ్జి ఇంట్లో తిష్ట వేయడంలో ఏం ఢోకా లేదు. ఇంతగా కాకున్నా తిట్టుకుంటారు అని అజ్జికి తెలుసు గానీ దాని ఆదరణలో మార్పు ఉండేది కాదు. ఎంతమంది ఆసుపత్రి పనులకోసం అజ్జి దగ్గర ఉండి, పని చేసుకుని వెళ్లారో లెక్కలేదు. ఊరికే ఉండడం కాదు కదా పేషెంట్ల తిండ్లూ అవీ ఎంత చాకిరీ, తెలీని ఖర్చూ. రంజని అందుకే ముందే చెక్ పెట్టేసింది. నాకు మరీ రంజని లాగ అంటీ ముట్టనట్టు ఉండడం కష్టమే అయినా అజ్జంత చేసే అది కూడా లేదు, చెప్పకేం. ఈ కాలమంతా దాదాపు అజ్జిని పెద్దగా కలిసింది లేదు. ఏదన్నా ఫంక్షన్‌లలో కలవడం తప్ప.

నేనిప్పుడు మా చిన్న బాస్‌కి ఆర్థిక లావాదేవీలన్నింట్లో నమ్మినబంటులా పని చేస్తున్నా. పెద్ద బాస్‌తో అంత పరిచయం లేకపోయినా ఈనకి మాత్రం నేను లేకుండా పని కాదు. పెద్ద బాస్‌కి నా గురించి అన్నీ రికమెండ్ చేసేదీ ఈనే. చాలాకాలం ఫ్లైట్‌లలో విదేశాలకు వెళ్లి రావడంతోనే సరిపోతోంది. ఐటి రంగానికి రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన బూస్ట్ మామూలుది కాదు. మా పెద్ద బాస్‌కి ప్రపంచవ్యాప్త ఐటీ బూం బాగా కలిసొచ్చింది. ఎక్కడ ఏ మీట నొక్కాలో ఆయనకి బాగా తెలుసు. మరో వైపు రియల్ ఎస్టేట్ బూంతో ఇక మాకు పట్టపగ్గాలు లేకుండా పోయాయి. ఈ అన్నిట్లో నేను వాళ్లకి కుడిభుజంలా పని చేస్తున్నా. భారతదేశంలోనే పేరున్న ఐటీ కంపెనీల్లో ఒకటిగా మాది ఎదిగింది. బోలెడు అవార్డులూ, సన్మానాలూ, ప్రపంచవ్యాప్తంగా మారుమోగిపోతున్నాం. మా పెద్ద బాస్ అంటే నాకు వల్లమాలిన అభిమానం. ఆయనను చూస్తుంటే నేను చిన్నప్పటినుండి ఆరాధించిన హీరోలకే హీరోలాగ అనిపించే ఆయన. ఆయన ఫొటో ముందు గదిలోనే వేలడదీశా. మా కంపెనీ అభివృద్ధికి ఇల్లూ, ఒళ్లూ చూసుకోకుండా కష్టపడ్డున్నా.

'ఏరా, నిజాయితీగా సంపాదిస్తానని అనేవాడివి, ఏం చేస్తున్నావో అర్థమౌతోందా' అని ఒకసారి బంధువుల పెళ్లి ఫంక్షన్‌లో నన్ను విడిగా దొరికించుకుని అజ్జి దులిపింది. సంపాదించుకునే తెలివి లేకపోవడాన్నే నిజాయితీ అంటారన్నాను. రియల్ ఎస్టేట్‌లో అప్పనంగా వచ్చి పడ్తుంటే ఎందుకు వదలాలి? అయినా ఎవరి నెత్తిన చేయి పెట్టాను, అవే వస్తున్నాయి అంటే రైతులు నష్టపోతున్నారంటుంది. ఇక ఐటీరంగంలో ఇచ్చినన్ని జీతాలు ఎవరికీ లేవు, ఇదేమీ ఫ్యాక్టరీలోలా 'దోపిడీ' చేస్తున్నది కాదు కదా అంటే అమెరికాలో జీతాలెంతో తెలుసా అని పోలుస్తుంది. అమెరికా జీతాలతో పోలిక ఎందుకు, ఇండియా ప్రమాణాలకి చాలా చాలా ఎక్కువ అని నేను. దేశం అంతా, కాదు, ప్రపంచమంతా ఆంధ్రప్రదేశ్ ని పొగుడుతుంటే సన్నాయి నొక్కులు నొక్కుతూ కూచుంది ఈవిడగారు. బావిలో కప్ప నిజంగా.

**అజిత - నేను - 2004**

కులప్రేమ చూపించడానికి మా బాస్ ద్వారా చాలా అవకాశాలే వచ్చాయి. మా కులానికి చెందిన పాలేల్లో ముసలివాళ్లకి డబ్బులివ్వడం, అంబులెన్స్‌లు పెట్టడం వంటివాటితో ఆయన చాలా పాప్యులర్ అయ్యాడు. ఈ చారిటీ పనుల వెనక మర్మం అందరికీ తెలిసిందే. మా కులంలో ఆయన తిరుగులేని వ్యక్తి అయిపోయారు. ఊఁనా, చినజీయర్ స్వామి తర్వాతే ఎవరినైనా చూస్తారు వాళ్లంతా. ఇలాంటివాటిలో పాలుపంచుకోడంతో ఇంగువ కట్టిన గుడ్డలా నాకూ ఆ పాప్యులారిటీ అంటుకుంది. కానీ అజ్జి ఎప్పుడు ఊరు వెళ్లినా పండ్లు అవీ తీసుకుని ముసలివాళ్ల ఆశ్రమంలో తప్పక వాళ్లతో గడిపి వచ్చేది. డబ్బులిచ్చినందుకు మా బాస్‌ని పొగిడినా అజ్జంత ఆప్యాయంగా తమ దగ్గర కూచుని ఎవరూ అంత సమయం గడపరని వాళ్లు చెప్పుకుని అదయ్యేవారు. అజ్జికి చిన్నపిల్లలన్నా, ముసలివాళ్లన్నా ఎక్కడలేని ఓపిక, ఆనందం. వాళ్లతో తప్ప అంత ఆనందంగా అజ్జిని ఎక్కడా చూడం. ఇలాంటప్పుడు అజ్జిని చూడ్డం నాకు ఇష్టంగా ఉండేది. కానీ తన పిల్లల్ని మాత్రం అది అన్యాయం చేయడం నేను సహించలేకపోయాను.

మావాడు పబ్లిక్ స్కూల్లో చదువుకుంటుంటే అజ్జి పిల్లలిద్దరూ గవర్నమెంటు కాలేజీల్లోనే చదువుకుంటున్నారు. మంచి మార్కులు తెచ్చుకుని సీట్లు తెచ్చుకుని చదువుకోండి, డొనేషన్లు కట్టి మాత్రం చదివించేది లేదని ఖచ్చితంగా చెప్పేశారట. ఏంటర్రా చదువులు అని కదిపితే పిల్లలే చెప్పారు. నేను అజ్జిని కోప్పడ్డాను. ఆ రోజుల్లో పిల్లల చదువుల కోసం ఆస్తులు కూడా అమ్మేసుకుంటున్నారు. ఐటి బూం వచ్చాక పిల్లల్ని చూసే పద్ధతే మారిపోయింది. అజ్జీ, బావగారు మాత్రం పాత రాతియుగంలోనే ఉంటామంటున్నారు. ఉంటే వాళ్లని ఉండనీ, పిల్లలేం పాపం చేశారు. డొనేషన్లే లంచంలా ఫీలవుతే ఇక మేం చేసే పనుల్నేమంటుందో అజ్జమ్మ! మురళిని నేను చదివిస్తానన్నాను. మా సమ్మేళనాల్లో ఇలా చక్కగా చదువుకునే 'మావాళ్ల' పిల్లల్ని ఎవరో ఒకరు స్పాన్సర్ చేస్తూనే ఉంటారు. అజ్జి పిల్లాడ్ని చదివించడం ఇంకా సంతోషమేగా. వాడు బ్రిలియంట్ పాపకంటే. పాపనైనా వీళ్లే చెడగొట్టారు. ఆ హరిజన మగపిల్లలతో డ్యాన్సులనీ, పాటలనీ తిప్పుతున్నారు, కులనిర్మూలన చేస్తారట. వీళ్ల బాబు తరమా? దాని బతుకు ఇలాగే

తగలబడిపోతుంది. ఏ డప్పుకొట్టేవాడ్నో రేపు ప్రేమించానంటుంది, అప్పుడుగానీ సరదా తీరదు. అయినా అజ్జికి దీనికీ అభ్యంతరం ఉండదేమో, తలెత్తుకుని తిరగలేకపోయేది మేం కదా. ఇప్పటికే చెల్లి ఎవరో మహమ్మదీయుడితో ఉంటోందని గాలి వార్తలు వస్తే నేనూ, బావగారూ వెళ్లి వెతికేసి వచ్చాం. అక్కడ లేదు గానీ అది గాలివార్త కాదేమోనని మాత్రం అనిపించింది అక్కడ తెలిసిన వివరాల్తో. ఇంతకీ మురళిని నేను చదివించడానికి అజ్జి ఒప్పుకోలేదు. పిల్లాడి బతుకు బండలు చేయకండి అంటే స్వంతంగా ఏం చదవగలిగితే, మేం ఏం చదివించగల్గితే అదే చదువుతాడు, నీ కార్పొరేట్ ప్రపంచంలోకి వాణ్ని లాగకు, అలా అయితేనే బండలవుతుందనుకుంటున్నాం అనేసింది. నాకు చాలా కోపం వచ్చేసింది. ఇక చచ్చినా బంధుప్రేమ దీని విషయంలో మాత్రం చూపించకోడదనుకున్నా.

కానీ మాకు పూర్తిగా చెడింది మాత్రం ఎన్నికలపై చర్చ తర్వాతనే. మా బాస్ తొమ్మిదేళ్లుగా సన్నిహితంగా ఉన్న పార్టీ, బోలెడు డబ్బులు పోసి గుప్పిట్లో పెట్టుకున్న మంత్రులూ మళ్లీ అధికారంలోకి వస్తారో రారో అని అంతటా చర్చోపచర్చలు. అందులోనూ నావైపా, నక్సలైట్ల వైపా అని ప్రచారంతో మరీ వేడెక్కిపోయి ఉంది వాతావరణం అంతా. పెద్దమ్మా, పెదనాన్నా ఊర్నించి వచ్చి నన్నూ చూస్తానంటే సరే అని వెళ్లా. వాళ్ల ముందే భయంకరంగా వాదన అయ్యింది. ఇతగాడు ఖచ్చితంగా ఓడిపోతాడు, ప్రజల్లో ఎంత కసి ఉందో, ఎంతమందిని ఎన్‌కౌంటర్ల పేరుతో పొట్టన పెట్టుకున్నాడో, రైతులెంతమంది ఆత్మహత్యలు చేసుకున్నారో అంటూ ఆవేశపడింది. నేనేమో మా బాస్‌లాంటి వాళ్లు బోల్డు పైసలు గుమ్మరించి అయినా గెలిపిస్తారు అని వాదించా ఉక్రోషంగా. మొత్తానికి 'ప్రజాస్వామ్యం' నీకు బాగా వంటబట్టిందిరా అంది వ్యంగ్యంగా. నాకు చాలా కోపం వచ్చేసింది. కానీ పెద్దవాళ్లు మమ్మల్ని బిక్కచచ్చిపోయి చూస్తూ ఉంటే ఇక ఊరుకున్నా.

కానీ చివరికి అజ్జి అన్నదే నిజమయింది. నాకెందుకో ఇక అజ్జిని కలవాలనిపించలేదు. నన్ను హేళన చేస్తుందేమో అనిపించింది. నిజంగానే అప్పటినుండి అజ్జిని కలవలేదిక. అంతే కాదు ఫ్లైట్లలో తిరుగుతూ, స్టార్ హోటళ్లలో దిగుతున్న నాకు అజ్జి వాళ్ల ఇరుకు కొంపలో ఊపిరాడనట్టు అన్పించింది. ముళ్ల మీద కూర్చున్నట్లు కూచుని వచ్చేశాను. అజ్జి కూడా నా ఇబ్బంది గమనించిందనే అనిపించింది. పెద్దమ్మా వాళ్లు ఒక్కరోజన్నా ఉండిపోరా అని చాలాసార్లు అంటుంటే వదిలేయమ్మా వాడికి కుదరదులే అనేసింది నాకేసి అదోలా చూసి నవ్వుతూ. నేను వెంటనే లేచి వచ్చేశా.

అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం చర్చలంటూ నక్సలైట్లని పిలిచింది. అప్పుడు వాళ్లు బయటపెట్టిన భూముల వివరాల్లో మా బాస్‌కి సంబంధించినవి కూడా ఉండడంతో మేమంతా భయపడ్డాం. కానీ మా బాస్ మాత్రం తొణకలేదు. కొత్త ప్రభుత్వంలోనూ ఏ మీట ఎక్కడ నొక్కాలో ఆయనకి తెలీకపోతే కదా. చర్చలు విఫలం కావడంతో మా భూములకూ, వ్యాపారాలకూ ఏం ఢోకా లేకుండా పోయింది. అయినా ఇంతమందికి ఉపాధి కల్పిస్తున్న మా బాస్‌లాంటి వాళ్లని వాళ్లు ఎందుకు సహించరు? వీళ్లేమన్నా నిరుద్యోగ సమస్యని తీరుస్తారా? ఉద్యోగం బాబూ అంటే తుపాకీ ఇచ్చి ఈ ఉద్యోగం చేయి అంటారేమో. వాళ్లు బతకరు, మిగతావారిని బతకనివ్వరు.

## అజిత - నేను - 2008

నా ప్రపంచం ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. నా ఉద్యోగం, నా కంపెనీ, నా బాస్, నేనూ అంతా ఒకేసారి సంక్షోభంలోకి వెళిపోయాం. మా బాస్ పెద్ద ఫ్రాడ్‌గాడని లోకానికి తెలిసిపోయింది. నా బాస్ నాతో చేయించిన కొన్ని పనులు అక్రమాలు అని తెలుసు కానీ వాటి స్థాయి ఇంత పెద్ద ఎత్తున అని నాకూ తెలీదు. ఒక్కసారిగా బయటపడ్డంతో అంతా అల్లకల్లోలంగా ఉంది. నేనే కాదు ఇంకా ఎవరూ ఆ దిగ్భ్రాంతినుండి తేరుకోలేదు. ఎలాగైనా బాస్‌నీ, మా కంపెనీనీ కాపాడాలని నానా ప్రయత్నాలు చేస్తున్నారు. రోజూ టీవీలనిండా, పేపర్లనిండా ఇవే హెడ్‌లైన్స్. ఒకప్పుడు ఈ కంపెనీ వాళ్లమంటే బోరవిరుచుకుని నడిచేవాళ్లం, ఇప్పుడు చెప్పుకోడానికే సందేహిస్తున్నాం. ఇళ్ల మీద దాడులూ, మమ్మల్ని ప్రశ్నించడాలూ, పోలీసులూ, సిఐడీలూ, మీడియాతో వేగలేని స్థితి వచ్చేసింది. ఎంత త్వరగా ఇది అయిపోతే ఉద్యోగం వదిలేసి బతుకుజీవుడా అనుకోవాలని ఉంది, కానీ అది సాగలాగుతోంది. ఆ సాలెగూడునుండి ఎలా తప్పించుకుంటానో తెలీడం లేదు. నాకు విపరీతంగా డిప్రెషన్ వచ్చేసింది. నన్ను ఇక ఆసుపత్రిలో వేశారు. రంజని నా పరిస్థితి చూసి తట్టుకోలేక ఏడుస్తోంది. తను ఏడవగా నేను చూడడం ఇదే మొదటిసారి. మావాడు, 'నాన్నగారూ, ఎలా ఉన్నారు, నేను రానా' అని అమెరికానుండి ఫోన్లోనే ఏడుపు. అక్కడ అంతకంటే అధ్వాన్నంగా ఉందంట పరిస్థితి. వీడింకా చదువుకుంటున్నాడు కానీ వాడి గురించిన నా అమెరికన్ కలలు కూడా కల్లలవుతాయా అని అదో వైపు పీకులాట. మరోవైపు తెలుగు వాళ్లని హత్యలు చేస్తున్న వార్తలతో రంజనికి ఆందోళన పట్టుకుంది. వాడు ఫోన్ చేసినప్పుడల్లా వంద జాగ్రత్తలు చెప్పినవే చెప్తూ విసిగిస్తూ ఉంటుంది. అమ్మ బతికి ఉంటే ఈ స్థితిలో నన్ను చూసి ఎంత క్షోభించేదో. అమ్మ పోయాక రమ కొడుకుని హాస్టల్లో వేశాం. నేనిలా అయ్యాక ఇప్పుడు అన్నిటికీ వాడే తిరుగుతున్నాడు.

బెల్లం చుట్టూ మూగిన ఈగల్లాంటి బంధువులూ, స్నేహితులూ జారుకున్నారు. నేను బినామీగా చాలామంది మా బంధువుల పేర్లమీద భూములు మా చిన్న బాస్ ఉంచమంటే ఉంచాను. ఇప్పుడు వాళ్లందరికీ భయంగా ఉంది. వాళ్లకేం కాదని చెప్పినా వాళ్ల భయం వాళ్లది. అసలే రియల్ ఎస్టేట్ సంక్షోభం రాకముందే భూములు అమ్మకోలేదని ఏడుస్తున్నారు. ఇప్పుడిక మేం ఇరుక్కోడంతో భయపడిపోయి కొంతమంది- మాకొద్దు బాబూ, నువ్వే ఏం చేసుకుంటావో అని ఇచ్చేసి పోతున్నారు. కొంతమంది అసలు పలకరించడం లేదు. నాకిదంతా ఇంకా పిచ్చెక్కిస్తోంది. బిపి కూడా పెరిగిపోతోంది. రంజని ఇక అర్థం

చేసుకుని అపరకాళిలా మంచుని వాళ్లెవర్నీ నా ఆసుపత్రి గదిలోకి రాకుండా చేసేసింది. చాలారోజుల తర్వాత ఆ రాత్రి కాస్సేపు నిద్రపోగలిగాను.

**అజిత - నేను - వర్తమానం**

నేను ఆసుపత్రి పడక మీద దిళ్లకి ఆనుకుని పేపరు తిరగేస్తుండగా 'అజ్జి వచ్చింది, కలుస్తారా? కలవలేరని చెప్పేయనా?' అని అడిగింది రంజని గదిలోపలకొస్తూ. నాకు ఏమనాలో తోచలేదు. నిజానికి రంజనికే అదే సందేహం వచ్చి ఉంటుంది. మిగతా ఎవర్నీ నన్ను అడగకుండానే తరిమేస్తోంది. అజ్జి నన్ను ఎగతాళి చేయడానికొస్తే భరించలేను, సానుభూతి చూపిస్తే అంతకంటే భరించలేను. పోనీ వెళ్లిపొమ్మని చెప్పాలన్నా చెప్పాలనిపించడం లేదు. నాలుగేళ్లవుతోంది తనని చూడక. 'సరే రమ్మను' అన్నా ఇంకా తేల్చుకోకుండానే.

పండ్లూ అవీ తీసుకుని లోపలకొచ్చింది అజ్జి. ఇంతకీ మామూలుగానే పలకరించి మాట్లాడింది, ఎగతాళీ లేదు, సానుభూతీ లేదు. అజ్జి అజ్జిలాగ ఉందంతే. నా ఆరోగ్యం గురించి కనుక్కునేటప్పుడు అదే అపేక్ష. బావగారూ, పిల్లలూ ఎలా ఉన్నారని అడిగాను. అలాగే ఉన్నారు, బావున్నారు అంది. రంజని బాత్రూంకి వెళ్లినప్పుడు 'ఇంకా అలాగేనా' అన్నా తనకర్థమయ్యేటట్టు. నవ్వి 'అడగక్కరలేదురా, మేం మా మొత్తం జీవితం కోసం ఎంచుకున్నాం ఆ రాజకీయాల్ని, నాలుగు రోజుల కోసం కాదు' అంది. వాళ్ల పార్టీ ఆంధ్రప్రదేశ్‌లో తుడిచిపెట్టుకుపోయింది అనే వార్తలు రోజూ చూస్తూనే ఉన్న నాకు ఆశ్చర్యం వేసింది. కనీసం ఇప్పుడన్నా బుద్ధి తెచ్చుకుని వాళ్ల బతుకేదో వాళ్లు బతుకుతారనుకున్నా.

మా సంస్థ కుప్పకూలగానే నేను ఇంత డిప్రెషన్‌లో పడిపోయా, కానీ వీళ్లకి మాత్రం వాళ్ల పార్టీ అంతగా నష్టపోయినా ఆ ఆత్మవిశ్వాసం పోలేదు, ఎందుకో?

ఆ మధ్య బావగారికి ఫోన్లలో చంపేస్తామంటూ బెదిరింపులూ అవీ వచ్చాయని తెలిసినా నేను వాళ్లని పలకరించలేదు. ఎక్కడ వాళ్లని కదిలిస్తే నాకు చుట్టుకుంటుందో అన్నట్లు కనీసం ఫోన్ కూడా చేయలేదు. కానీ నాకు బాలేదని తెలీగానే అజ్జి పరిగెత్తుకు రావడం చూసి 'మళ్లీ నన్ను ఓడించావుగా అజ్జీ' అనుకున్నా. చాలా సిగ్గనిపించింది తనతో మాట్లాడడానికి.

రంజని డబ్బు మనిషనీ, కటువుగా మాట్లాడ్తుందనీ మా బంధువుల్లో ఎవరికీ తనంటే పడేది కాదు. నా కోసమో, మర్యాద కోసమో పైకి పలకరించినా వెనక తనని ఎవరూ ఖాతరు చేయరని నాకు తెలుసు. అజ్జిని ఏమన్నా అంటే నేను సహించనని నేరుగా ఏం అనకపోయినా తన హోదాని గుర్తుచేస్తున్నట్టుగా ఉండేది అజ్జితో తన ప్రవర్తన. కానీ ఇప్పుడు రంజనిని ఓదార్చగలిగింది అజ్జి ఒక్కతే అయింది. నాకు కూడా మా సంక్షోభం బద్దలయ్యాక ఇంత ఊరటగా తోచింది అజ్జి కలిశాకే. ఏం మంత్రం ఉంటుందో తన దగ్గర అర్థం కాదు. చిన్నప్పుడూ అర్థం కాలేదు, ఇప్పటికీ అంతే. ఒక మనిషికి తోటి మనిషి పట్ల ఉండాల్సిన విధానమేదో తన దగ్గర పుష్కలంగా ఉందేమో. అది నాకెప్పుడూ పట్టుబడలేదు.

తను వచ్చి కలుస్తూనే ఉంటాననీ, అయినా ఈ లోపు ఎప్పుడు కలవాలనిపించినా ఫోన్ చేస్తే వస్తాననీ అజ్జి అనునయంగా చెప్తూ ఉంటే ఏడ్చేశాం నేనూ, రంజనీ.

'నువ్వింకా పూర్తిగా చెడిపోలేదనే అనుకుంటున్నా, ఇప్పటికయినా ఆ ఊబినుండి బయటపడు' అంది ఓదార్చుతూ. ఎంత త్వరగా ఈ లంపటంనుండి బయటపడ్డామా అనే నేనూ చూస్తున్నాను అని చెప్పాను.

శెలవు తీసుకుని వెళ్లబోతూ ఏదో గుర్తొచ్చినట్టు వెనక్కి తిరిగి హ్యాండ్‌బ్యాగ్‌లోంచి ఒక పుస్తకం తీసి ఇస్తూ, 'గతంలో పుస్తకాలు చదవమని ఇస్తే ఇంట్లో ఏదో మూలన పడేసేవాడివి. ఇప్పుడు బాగా అర్థమవుతుండచ్చు ఇది, వీలు చూసుకుని చదువు' అంది.

రంజని దాన్ని అందుకుంది. అజ్జి వెళిపోయింది. అజ్జి రాకతో తేలికైన మనసుతో అలాగే పైకప్పుకేసి చూస్తూ పడుకున్నా.

'ఒక దళారీ పశ్చాత్తాపమా, ఇదేం పేరు' అంది రంజని ఆ పుస్తకాన్ని చూసి అక్కడే పడేసి కుర్చీలో వెనక్కి వాలుతూ.

(ఆంధ్రప్రదేశ్ అంతటా నిర్బంధాన్నే కాక కార్పొరేట్ సంస్కృతిని కూడా ఎదిరిస్తూ నిలుస్తున్న విప్లవ సానుభూతిపరులందరికీ వినమ్రంగా...అబ్బురంగా)



కథ

# పెద్ది

- విద్యాభూషణ్

"ఔరా! మీసాలోడా! పట్నం నుంచి అన్న ఎవురో వొచ్చినారట కదరా! ఈ రోజు రాత్రికి మా ఇంటికి పంపాలే..." వీధిలోంచి ఓ ముదుసలి కేక.

"ఓసోసి! ఇదేటి... అన్న ఇప్పుడిలాగా వొచ్చినాడో లేదో అప్పుడే నీకెలాగ తెలిసిపోనాదే పెద్ది? నీ వి పాఁవు సెవుల్లాగున్నాయే..." అంటూ అప్పలస్వామి వీధిలోకి నవ్వుతూ వచ్చాడు.

"పాఁవు సెవులో... పిల్లి సెవులో తెలీదు కానీ... మళ్లీ అన్న ఎలిపోనాడని తేలేసెత్తావని... తెలీగానే ఎలిపోచ్చీసాను... అన్న ఉన్నాడా?..." అంటూ ఇంట్లోకి వచ్చింది పెద్ది...

"ఉన్నాడు లేయే... సానం సెత్తాన్నారు... ముసల్ది వొచ్చిందంటే ఒకటే గడ-బిడ" అంటూ పొయ్యి దగ్గర్నుంచి పరాచికమాడింది మహాలక్ష్మి... ఆమె అప్పలస్వామి భార్య.

"ఓస్... ఏటాలాగ నొరెట్టుకు పడిపోత్తన్నావే... కోడలు పిల్లా! నీకు మహాపరాసికమైనపోనానే... ఔనుగానీ ఏటి తెల్లారిసరికి వొంటకం సేత్తన్నావు" అంటూ మహాలక్ష్మికి దాపుగా చేరుకుంది పెద్ది.

"వొంటకాలా పాడా? అన్న వొచ్చారని ఉప్మా సేత్తన్నాను... కాసింత ఆగు తినెల్దువు గాని" - మహాలక్ష్మి. "సరే లే! మాకీ టిపినీలు అవీ ఆగవు గాని... ఇంటికెల్లి సల్లంది తినాల" పెద్ది.

"ఓలే పెద్ది... అన్న నీరోజే పంపాలేటే... రెండు రోజులుండే పనుంది అన్నకి. రేపుగాని పంపనేటి?" - అప్పలస్వామి.

"రేపొద్దుర నాయనా! ఇయ్యాల రేపు పనిలేదు. గాబుతీద కెల్లిన గుత్త డబ్బులందినాయి. యియ్యాలే పంపితే అన్నకి అన్నం ఎట్టగల్ను" - పెద్ది నిర్లిప్తంగా.

"పోనీ అలాగే లేయే" అప్పలస్వామి.

స్నానం చేసి పెరట్లోంచి వస్తున్న నాకు పొయ్యి దగ్గర ముగ్గురూ కనిపించారు.

"అన్నా! పెద్ది అని మా వూరికి మోతుబరి. నిన్ను యియ్యాల దానింటికి తిండికి పిలవడానికొచ్చింది" అప్పలస్వామి పరిచయం - హాస్యంగా.

"ఎందుకమ్మా నీకు శ్రమ. తిండిదే ముందిలే... ఎక్కడో... ఏదో తింటా" అన్నా పెద్దితో.

"అయితే ఏట్రా! నీకు తిండి దొరకదని నేనెడతాననుకున్నావేటి? ఏదో నా తుప్తి (తృప్తి) అంటూ లేచి 'ఎల్తానే కోడలా! బయలు దేరబోయింది పెద్ది.

"ఓసెటాలాగా! గుండా పిండయిపోతన్నావు ఆగె! టిపిని తిందువుగాని" - మహాలక్ష్మి చెయ్యి పట్టుకుని ఆపింది. నే తల దువ్వుకుని, షర్టు వేసుకొచ్చేసరికి మూడు కంచాల్లో 'అన్నం' మాదిరిగా టిఫిన్ రడీ చేసింది మహాలక్ష్మి. "లక్ష్మి! ఓ ఖాళీ కంచం పట్రా అని చెప్పి టిఫిన్ సగం తీసేసి పెద్దికి అందించా.

"తిన్రా నాయనా! నువ్వు తిన్రా... నేను సల్లంది (సద్దెన్నం) తింటాను గదా! ఎప్పుడు తిని బయలెల్లినావో ఏటో తిన్నాయన్నా తిను!! - పెద్ది.

"ఏం కాదు పెద్ది. నాకు నేను మానుకుని నీకు పెట్టడం లేదు. ఎక్కువయిందని పెడుతున్నా... తిను"

నలుగురం ఉప్మా తినేసరికి టీ చేసి ఇచ్చింది మహాలక్ష్మి. టీ తాగి రాత్రికి రావాలని మరీ మరీ చెప్పి వెళ్ళింది పెద్ది.

పెద్ది వెళ్ళిం తరువాత... "అప్పలస్వామీ! అసలీ పెద్ది ఏవరు? ఏంటి సంగతి?" అనడిగా.

అప్పలస్వామిలో మౌనం... ఓ రెండు నిముషాలనంతరం దీర్ఘమైన నిట్టూర్పు...

మనకి కాంటాక్టు మధ్యాహ్నం రెండింటికి కదా! భోంచేసే వరకూ ఖాళీయే. పెద్ది సంగతి చెప్పు - అంటూ నా ఒత్తిడి. "అలాగే అన్నా" - అప్పలస్వామి.

* * *

తామాడ, పాణిగ్రాహి ఎన్‌కౌంటర్ తర్వాత మన మాస్టారి కోసం సి.ఆర్.పి. వోళ్ళు జల్లెడ పట్టి గాలించేత్తాన్నారు ఉద్దానం ని. అప్పటి వరకూ మాస్టారికి షెల్టర్ పెద్ది వాళ్ళిల్లే. మొత్తం పెద్ది కుటుంబం అంతా పార్టీ సభ్యులే. పెద్ది - పెదనాయనా! యిద్దరు కొడుకులూను. మొత్తం ఉద్దానం అంతా రాత్రీ పగలూ తేడా లేకుండా ఎప్పుడూ చూసినా ఆకు కదలని నిశ్శబ్దం. మనుషులే కాదు - పిట్టలూ - పక్షులక్కూడా కదలిక లేని నైరాశ్యం. ఊళ్ళో కుక్కలు కూడా కన్పించేవి కాదు. పాడిపశువులకు మేత లేదు. మేతకు ఇప్పడం కూడా లేదు ఆ రోజుల్లో... ఎవర్ని చూసినా... ఉలుకూ పలుకూ లేని గాంభీర్యం. ఎవరి పని వారిది. ఎవరి దారి వారిది. కదిలించేందుకు కూడా భయమేసే ఉత్కంఠ.

ఆ రోజు!

అంతకు ముందు రెండు రోజుల్నుంచి ఊళ్ళో సి.ఆర్.పి.ల హడావిడి లేదు. పెనుప్రళయం ముందున్నటువంటి ప్రశాంతత. చుట్టుపట్ల గ్రామాల్లో కూడా... మాస్టారు కూడా 'ఎత్తుగడ'గా తమ షెల్టరును వేరే ప్రాంతానికి మార్చేసుకున్నారు. ఎవర్ని, ఎన్ని విధాలుగా ప్రలోభపెట్టినా పెదవి విప్పరాదని ఊళ్ళల్లో చిన్నా - పెద్దా అందరికీ ఓ కట్టుబాటు. దాంతో ఒకరితో ఒకరు పెదవి విప్పడం లేదు. అత్యవసరమైతే, కళ్ళతోనే మాటలు. కుడి చేత్తో

చేస్తున్న పనిని, ఎడమ చేతికి తెలియనీయరాదన్నంతటి కట్టడి. స్మశాన ప్రశాంతత బైట. పీనుగెళ్ళిన తీరు ప్రతీ ఇంట.

తెల్లారేసరికి ఊరు ఊరంతా గగ్గోలు.. పెద్ది కుటుంబాన్ని పోలీసులు రాత్రికి రాత్రే తీసుకెళ్ళి పోనారని.. మహేంద్ర తనయ అడవుల్లోకి - అదే ఎర్ర కంచెమ్మ కొండల్లోకి...

తల్లి నలుగుర్నీ చేతులు వెనకి విరిచి కట్టేసి, సమాచారం కోసం చెప్పుకోలేని రీతిలో ఇంటరాగేషన్. ఎవ్వరూ పెదవి విప్పడం లేదు.. సహనం కోల్పోయిన పోలీసులు తమలో తాము సమావేశమై... పెద్ది కళ్ళముందే భర్తా, కొడుకుల్ని కాల్చేస్తే, బెంబేలు పడి విషయాన్ని కక్కేస్తుందని ఓ అంచనా కొచ్చారు. అప్పటికి పెద్ది వయసు 35 - 40 సంవత్సరాల మధ్య ఉండొచ్చు. పెద్ది కూడా ఆజానుబాహురాలు. మగాడితో సరిసమంగా పొలం పనులు చేసేది. కలుపు తీయడం - నాట్లేయడమే కాదు - పొలం దున్నడం. నొల్ల తోలడం వంటి మగపనులు సైతం ఒంటిచేత్తో చేసేసిది. నాకు బాగా ఎరికన్న పార్టీ మాంచి ఊపులో ఉన్నప్పుడు భోజనాలను, మంచినీళ్ళను కావిడలా కట్టుకుని జీడితోటల్లోని నాయకులకు అందజేసి వచ్చేసిది. అటువంటి 'పెద్ది'ని పెద్ద పోలీసు సమీకపించి..." చెప్పు! మీ మాస్టారు ఎక్కడ?" "నాకు తెల్దు! అయినా ఆడదాన్ని నాకేటి తెలుస్తాది. మేస్త్రు ఎవరో? ఏటో? షూట్ ద ఫస్ట్..." పెద్ద పోలీసు గావుకేక...

పెద్ది వాళ్ళాయన గుండెల్లో బులెట్టు - నేలకొరిగాడు. ప్రాణాలు ఉగ్గబట్టుకుని తల్లీ-కొడుకులు కళ్ళముందే ఇంటాయన నేలకొరిగినా... దిటవు తగ్గని మనస్థైర్యం దుఃఖం పెల్లుబుకుతున్నా నేటితో సరి మన జీవితాలు అన్న ధీర స్థైర్యం - మొండి తెగింపు.

ఒకర్నొకరు చూసుకుని కళ్ళతోనే ఊరడింపు. కట్టడిని గుర్తెరగమని హెచ్చరింపు...

మళ్ళీ పోలీసు పెద్దాయన పెద్దిని సమీపించి. ఇప్పటికైనా పెదవి విప్పకుంటే నీ కొడుకులకు అదే గతి. చెప్పావనుకో... గవర్నమెంటు నుంచి రివార్డు, నీ కొడుకులకు ఉద్యోగాలు, అని పోలీసు పెద్దాయన అంటుండగా, కాండ్రించి ఉమ్మేసిందట పెద్ది. దాంతో రెచ్చిపోయిన పోలీసాయన తన రివాల్వర్‌తోనే పెద్ది కొడుకులిద్దర్నీ టపాటపా కాల్చేసి... ఆ ఊపున అట్నుంచి అటే పరిగెత్తుకుంటూ వచ్చి, ఎగిరి పెద్ది గుండెలపై తన్నాడట...

"సచ్చాన్రో గండడా! అని పెనుకేక వేసి నిలువునా పడిపోయిందట పెద్ది... ఇంతలో ఓ మూలగా మనుషులు పరిగెడుతున్న పెనుసవ్వడి... అన్నలు వచ్చేస్తున్నారేమో నన్న భయంతో పోలీసులు అక్కడి నుంచి అటే పలాయనం చిత్తగించేశారట. తీరా సూస్తే దరిదాపుల్లో ఎలుగ్గొడ్డుల అలికిడి అది. స్పృహలోకి వచ్చిన పెద్ది తనని తాను నిభాయించుకుని సమీప గ్రామానికి చేరుకుంది.

ఈసారి నిగ్రహించుకోవడం నా వంతయింది. ఇంతటి దారుణాన్ని ఆమె ఎలా భరించగలిగింది. కళ్ళముందే భర్తా, ఇద్దరు కొడుకులు చనిపోయినా (చంపేయబడ్డా) ఎల్లా తట్టుకోగలిగింది. పార్టీ కట్టుబాటు కోసం ఎంతటి గరళాన్ని దిగమింగింది. ఎంతటి ఆత్మ విశ్వాసం. ఎంతటి ధీరత్వం!! హిమాలయమంతటి ఎత్తున కన్పించింది ఆ క్షణం నుంచి ఈ మా 'పెద్ది'.

సాయంత్రం పని ముగించుకుని వచ్చేసిన క్షణం నుంచి ఎంతటి 'పెద్ది' చేతి ముద్ద తిందామా అన్నంత ఆరాటం... ఆమెతో కొద్దిసేపు గడపాలనే కాంక్ష. పొరపాటున కూడా గతంలోకి ఆమెను తీసుకుపోరాదని ఓ స్థిర నిర్ణయం... స్నానం చేసుకుని బట్టలు వేసుకోబోతుంటే, పేంటెండుకన్నా - ఎనక యీదిలోనే పెద్ది ఇల్లు. లుంగీతో ఎల్లి భోంచేసి వొచ్చేయి. లచ్చిమి సూపిత్తాది పెద్దిల్లు - అప్పలస్వామి సూచన..

పెద్దిల్లు దూరాన్నుంచి చూపించేసి లక్ష్మి వెనుతిరిగింది. దూరాన్నుంచే చూసిన పెద్ది "దారా నాయనా దా.." అన్న నిండు ఆహ్వానం. నన్ను నిలవనీయడం లేదు... కురిసేందుకు సిద్ధమైపోతున్న కళ్ళను కట్టుదిట్టం చేస్తూ "ఏం చేస్తున్నావమ్మా!" అంటూ లోనకడుగెట్టాను. "ఏ తల్లి గన్నదో గదరా! నన్ను "అమ్మా" అని నోరార పిలుస్తున్నావురా కొడుకా!" అని బుగ్గలు నిమిరింది... ఇల్లంతా కలయచూద్దును కదా! చిన్న వరండా.. ఒకే ఒక గదితో చిన్నపురిల్లు. ఇంటా-బైటా పేడతో అలికి... నీటుగా ఉంది. వసారాలో ఓ మూల చిన్న పొయ్యి వంట పాత్రలు. గదిలో ఓ మూల నులక మంచం... దుప్పటి పరిచి ఉంది. గదిలో గూటిలో కొమ్ము దువ్వెన, అద్దం. ఓ మూల బిందెతో మంచినీళ్ళు. మరోమూల వండుకున్న వంట సర్దేసి ఉన్నాయి.

"దారా నాయనా! సేతులు కడుక్కో..." బిందెలో నీళ్ళు చెంబుతో తీసి అందించింది. కడుక్కుని వచ్చాను. "మంచం మీద కుసోరా కొడుకా!" - పెద్ది. "వద్దమ్మా! నీ దగ్గరే కూర్చుంటా!" పెద్ది పక్కన కూర్చున్నా. చుట్టూ పరికిస్తున్న నా కళ్ళు ఓ చోట ఆగిపోయాయి. అద్దం ఉన్న గూటికిపైన ఓ ఫోటో ఫ్రేములో మూడు శవాల ఫోటోలు... అలానే చూస్తూ ఫోటో దగ్గరగా పోయి చూడకుండా ఉండలేక పోయాను. దీపం తీసుకువచ్చి... పోలీసు గంథలు సంపేసిన నా మొగుడు, నా కొడుకులూన్నా. బతికున్నప్పటి ఫోటోలు లేక పోయె. సచ్చిన తర్వాత పార్టీవోలు తీయించిన ఫోటోయే మిగిలిందిరా. అని పేరు పేరునా తడుముతూ చూపించింది. ఆగని నా కన్నీటిని చూసి నేనెప్పుడో ఏడ్డం మానేసిన్ను. అయినా ఆళ్ళు దొంగతనం, రంకుతనం సేసి సచ్చిపోన్రేటి. పెజల కోసం సచ్చిపోన్రు. ఆ తుప్తి సాల్దురా ఈ జన్మకి.. ఎంత సంపాదించేస్తే ఎవురేటి మోసుకుపోతాన్డా. అందరు సేరేది అక్కడికే కాదూ!" ఆమె మనస్థైర్యానికి జోహార్లర్పించకుండా ఉండలేక పోయాను.

"రారా... తిందువు గాని" అని ఆమె పిలుపుతో ఈ లోకంలోకి వచ్చా! శుభ్రమైన సిల్వర్ పళ్ళెంలో అన్నం - గుడ్డు కూర... కాల్చిన అప్పడం, చారు. చెంబుతో నీళ్ళు పెట్టింది.

"నువ్వు తినవా అమ్మా".

"నువ్వు తిను నాయనా... తర్వాతనే తింటా" పెద్ది.

"అలా కాదు ఇద్దరం కలిసే తిందాం."

"అలాగే లే! అని తనూ పెట్టుకుంది. తింటూ ఉండగా ఎండుచేప వాసన వచ్చింది.

వ్యాసం

# మాయింట్లో పతంజలి

- బజరా

సాహిత్య వారసత్వమున్న కుటుంబం కాదు మాది, కనీసం పాఠక వారసత్వం కూడా లేదు. కాని చాలా కాలం క్రితం వరకూ మా అమ్మ నా తొలి పాఠకురాలు. అంటే ఆమెకు ఆమె చదువుకొనేది కాదు, నేను చదివి వినిపించేవాణ్ని. పాఠకశ్రోతన్నమాట. చిన్నప్పుడంతా నేనామెకు శ్రోతని, బోలెడన్ని కథలు చెప్పేది. ఇప్పుడామె నాకు శ్రోత. నేను రాసిన వాటికే కాదు, వేటికైనా. చివరకు నూకో బెల్లమో తెచ్చిన పేపరైనా అప్పటికవే. ఇప్పటిలోలా ప్లాస్టిక్ కవర్లు లేవు. బతికిపోయాం. అలా దేన్నీ వదిలేవాళ్ళం కాదు. విక్రమార్కుడి కథలు, సాలభంజికలు చెప్పిన కథలు, చిలకమ్మ చెప్పిన కథలు... ఇలా రైల్లో దొరికిన పుస్తకాలు ఒకటికి ముప్పైసార్లు చదివించుకొనేది. మా అమ్మ చెప్పిన జానపద కథలే నాకు బాగా నచ్చేవి!

మా అమ్మకు చదవడం రాయడం కొద్దిగా వచ్చు. అయితే ఆమె ఓ పెళ్ళికి వెళ్ళి కూరలు కోస్తూ ఉండగా కడుతూ ఉన్న పందిరి (సర్వే) కర్ర వచ్చి తల మీద పడింది. చూపు తగ్గింది. దాంతో నేను చదవడం పెరిగింది. పైగా అంతకుముందు ఆవిడ ఇంటి పనుల్లో ఉండడం వల్లనే చదవాల్సి వొచ్చేది. దాంతో నాకు అక్షర దోషాల్ని సరిచేసేనుకు చదవడమూ అబ్బింది, అక్షరదోషాల్లేకుండా రాయడమూ వచ్చింది.

అన్ని కథలూ అమ్మ ముందు చదవలేమని, మనకి మనము చదువుకోవాల్సినవి ఉంటాయని తర్వాత తర్వాత బోధపడింది. ఆ బోధకు ముందు బాధ ఉంది. అమ్మ ముందు అప్పటికప్పుడు సెన్సార్ / ఎడిట్ చేసుకొని చదివి... చదవలేక చెంబుపట్టుకు పరిగెత్తేవాణ్ని. కడుపు నఘస్తుందేమోనని అమ్మ అనుకుంది. జింజారు తాగమనేది. ఆ తర్వాత కథలోని 'కథ'ని గ్రహించి 'ఆ తర్త ఏటయింది?' అనిగాని 'చదవరా' అనిగాని అనలేదు. అర్థం చేసుకుంది. అవున్లే, అన్ని కథలూ ఒకేలా ఉండవు!

అవును, పాఠకులందరు కూడా ఒక్కలా ఉండరు. అలా ఉండని వాళ్ళలో ఒకడు మా అన్నయ్య. మా అన్నయ్య సోకాల్డ్ పాపులర్ ఫిక్షన్.. ముఖ్యంగా నవలలు చదువుతాడు. ఓ మంచి పుస్తకం ఇస్తే - రెండోసారికే - 'వద్దురా, మనసు పాడైపోతుంది' అన్నాడు. చదివితే మామూలుగా ఉండలేననీ అన్నాడు. అందుకే తను 'సీరియస్' లిటరేచర్ వద్దురా బాబూ' అంటుంటాడు. జోలికి రాడు. పేపర్లో క్రైమ్ పేజీ న్యూస్ చదివి ఆస్పత్రి పాలైన పేసెంటువాడు.

ఇప్పుడు మా అమ్మ కూడా చదివి వినిపిస్తానంటే వద్దనదు, కాని 'మంచి పుస్తకం చదవరా' అని మునిపటిలా అడగదు. ఆసక్తి చూపించదు. సమయం దొరికితే టీవీ సీరియళ్లలో పడిపోతుంది. ఆ కుట్రలూ కుతంత్రాలకు బాగా రియాక్టవుతుంది. తిడుతుంది. కన్నీరవుతుంది. ఆవేశపడుతుంది. బీపీ 180ని దాటి 220 వరకూ రీచ్ చేస్తూ ఉంటుంది. టాబ్లెట్లు మింగుతూ ఉంటుంది. 'నీకెందుకింత ఆందోళన?' అని డాక్టరు జబ్బుకు కారణం చెపుతాడు. ప్రశాంతంగా ఉండమంటాడు. సీరియళ్ళు ప్రశాంతంగా ఉంటాయా? ఉండనిస్తాయా? వయసూ అనుభవమూ పెరిగినా వదులుకోవాల్సినవి అమ్మ వదులుకోదు సరికదా తాను నేర్పిన విలువలే చేతకానివీ, పద్దుకు మాలినవీ అయిపోయావి. ముఖ్యంగా మనుషుల్ని నమ్మదు. ఊరంతా ఏరనే అమ్మ. ఏరంతా పానకమనే అమ్మ. ఇందమ్మంటే అందమ్మనే అమ్మ. తల్లే కాదు, పిల్లే కాదు, పెనిమిటే కాదు, ఆ బగమంతుడే కాదు యెవల్నీ నమ్మడానికి లేదంటుంది. లోకం తెల్లమిగిలిపోయిందనీ అంటుంది. టి.వి. సీరియళ్ళలో ఎవరెవరికి యెలా కళ్ళు మూసి జెల్లకొట్టేసినారో చెపుతుంది.

'టి.వి. సీరియళ్ళు చూడకమ్మా, విషం తాగినట్టే.. వద్దు..' అంటాను, మా తమ్ముళ్ళిద్దరూ కోరస్ పలుకుతారు. '..లేరా, మనం సూడ్డం మానిస్తే అందరూ మానేస్తారా ఏటి? ఇసమని నువ్వు రాయికపోతే సీరియల్లు ఆగిపోయినాయా? పెద్ద పెద్దోలు సినిమాల నుండి సీరియల్లకి దిగిపోతుంతే? అంతేనికి దాసరోడాలు కూడా దిగిపోయినారు, ఏదో బతుకు తెరువుండాల... ఏ ఆదరవూ లేకపోతే

---

"పెద్దీ! నువ్వేదో స్పెషల్ కూర తింటునట్టున్నావ్. ఏంటదీ".

"ఏమీ లేదురా! కాల్చిన ఎండు పరిగి"

"నాకు పెట్టవా? నాకు చాలా యిష్టం"

"నువ్వు తిన్లేవురా నాయనా! వోద్దు"

"నాకో ముక్కయియ్యి! అని గుడ్డులో సగం పెద్దికిచ్చాను. భోజనం ముగిసాక...

"నా ఒంటరితనం నా దరికి సేరకూడదాని... పార్టీ పని మీదా వచ్చిన వాళ్ళంతా ఓ పూట నా ఇంట తినాలన్న నియమం పెట్టుకున్నాన్రా." నవ్వుతూ పెద్ది.

"ఎందుకూ?" అర్థం కాని నేను.

"పార్టీ కోసం పనిచేస్తున్న మీరంతా నా కొడుకులు కారేట్రా" నా కొడుకుల్ని మీలో సూసుకోన్రా".

"ఓహ్! ఎంతటి గుండె దిటవు. ఎంతటి మహోన్నత! హేట్సాఫ్ పెద్ది... హేట్సాఫ్. విలువలకు భాష్యంగా పెద్ది ఈనాటికీ!



యెలగ?'ని చింతంతా నా మీదకు మల్లుతుంది.

అదిగో అలాంటి ఓ సందర్భంలో పతంజలిగారి 'రాజుగోరు-వీరబొబ్బిలి' ప్రారంభించి ఇలా చదువుకెళ్తున్నానో లేదో మా అమ్మ నోటినిండా నవ్వుతోంది. ఆ నవ్వుని అంటిపెట్టుకొని మరోనవ్వు... అమ్మ నవ్వుతో కలగలసిపోయిన నాన్న నవ్వు. తలతిప్పి చూసాను. కళ్ళనిండా నీళ్ళు నిండిన నవ్వు. అది మునపటిలాంటి వెటకారపు నవ్వుకాదు, వెక్కిరింత నవ్వు కాదు, మనస్ఫూర్తిగా నవ్విన నవ్వు. ఈడియమ్మా(...' నోటిలోంచి మాటరావడం లేదు. కుండ తొణుకుతున్నట్టు గుండె తొణుకుతున్ననవ్వది. నేను మా నాన్నని అలా చూసిన సందర్భాలు తక్కువ. అలా ఆయన మళ్ళీ ఎప్పుడూ నవ్వలేదు, 'గోపాత్రుడి' అప్పుడు తప్ప. పగలూ రాత్రీ నిద్రలోనూ మెలకువలోనూ పాటలు వినడమే ముచ్చట. ఘంటసాలలోనే ఆయనుండేది... కథలూ నవల్లూ పనిలేని వాళ్ళ పత్రాకులని ఆయన అభిప్రాయం. నడిపి కొడుకు మంచోడేగాని బతుకలాగే చెడగొట్టుకున్నాడని నిష్ఠురపడి నిందించి 'రచైత'లట అని వొత్తి పలికిన మనిషి. ఆ మనిషే 'ఎవుడు రాసాడోగాని బాగా రాసాడు' అని రచయితల్ని గౌరవంగా ప్రేమగా చూడడం 'పతంజలి'తోనే మొదలయింది. ఎదురుగా నన్ను తిట్టి వెనకెట్టి నన్ను చదవడంలో బహుశా యెంతో కొంత పతంజలిగారే సాయపడ్డారేమో? పునాదే సారేమో? మా అమ్మలాగే మా నాన్న కూడా పక్కన కూర్చొని వినడం మాకందరికీ వింతల్లోకెల్లా పెద్ద వింత. ఆ సమ్మోహన శక్తి పతంజలిదే. పతంజలి చుట్టూ మా అమ్మా నాన్నా నేనూ నా భార్యా మా బాబుతో పాటు అన్నయ్యగారి పిల్లలూ కూర్చొని ఒకటే నవ్వడం... ఆపుకోలేని నవ్వులు.. నవ్వులకి వినిపించకపోతే 'నవ్వాపండ్రా' అంటూ అమ్మ నవ్వడం. నడకరాని వాడూ నవ్వుతూ ఉంటే 'నీకేటర్థమయిందిరా' అని అమ్మ మనవడ్ని ముద్దులాడ్డం.. టీవీ బందయిపోవడం... ఉరుకులూ పరుగులూ ఆ పూటకి ఆగిపోవడం... నిశ్చింతంగా కిలకిలలాడుతూ కళకళలాడుతూ నవ్వులు పూసిన ఇల్లు...

పతంజలి బావో యెక్కడున్నావయ్యా... ఎక్కడో ఉండి ఇక్కడందర్నీ ఇలాగ కట్టిపడేసినావు కదా? అమ్మ చూడు యాభై అరవై ఏళ్ళ వెనక్కి జ్ఞాపకాల్లోకి వెళ్ళిపోయి... 'అప్పుడు మాయప్ప (అమ్మ వాళ్ళ నాన్నకి అ(ప్ప)క్క) కతలు సెప్పితే ఇలాగే అందరం కూకుండీ వోలిమి...' నెమరు వేసుకు అమ్మ కన్నీళ్ళు కార్చింది... అప్పలేని అమ్మకీ మాకూ ఇప్పుడు పతంజలిగోరే అప్ప! కథలు చెప్పే మాయప్ప!

అలా ఎప్పటికప్పుడు మనసు బాగోలేనప్పుడు, మనుషులం బాగోలేనప్పుడు, నిస్సారంగా బతుకు ఈడుస్తున్నప్పుడు కాలం కదలనని మొరాయిస్తున్నప్పుడు 'నాకు దేని మీదా లేదురా' అని అమ్మ అన్నప్పుడు వైరాగ్యం భూతంలా ఆక్రమించినప్పుడు స్వాములూ బాబాలూ దేవుళ్ళూ తమ చుట్టూ తిప్పించుకున్నప్పుడు... అప్పుడు అప్పుడు పతంజలి అక్షరాలే అన్న పరమాణ్ణం మాత్రమే కాదు అమృతం కూడా!

అమృతాన్ని కడవల కొద్దీ అందించిన పతంజల్ని అమ్మ 'ఆ రాజు గోరి కతల్ని చదువురా' అనీది. చదివిందే చదివే వాడిని. ఊరెళ్ళినా - అమ్మా నాన్న ఊర్నుంచి వచ్చినా పతంజలి చుట్టూ చేరాల్సిందే, "పతంజలి తలపులు" కవరు మీదున్నట్టు ఆయన చుట్టూ పాత్రలతో పాటు పాఠకులూ కూర్చోవలసిందే!

'ఏటీ... రాజుగోరు సచ్చిపోయినారా?...' గలగలా మాట్లాడే అమ్మ మూగదయింది. ఉలుకూ పలుకూ లేదు. ఆమెకు సాహిత్యకారులూ రచయితలూ తెలీదు. 'ఎంత మాటరా, యేటయిందీ... చొచ్చొచ్చో...' నొచ్చుకుంది. ఇంట్లో మనిషిపోయినట్టూ ఇంతవరకూ చూడని మనిషి మరి కనబడనట్టున్నూ!

"... ఈ కనాకష్టపు నికృష్ట మానవ ప్రపంచం నుంచి పతంజలి మరణాన్ని హృదయపూర్వకంగా... సంతోషంగా... స్వాగతిస్తున్నాను...' అని డాక్టర్ లెనిన్ ధనిశెట్టి ఏడ్చేవాళ్ళని ఎక్కిరిస్తున్నాడు. '..పోన్లే చచ్చిపోనాడు, బాదలీడేరి పోనాయ'ని మాయమ్మగాని మేమెవరంగాని అనుకోలేదు. ఎప్పుడూ వచ్చినట్టుగా అమ్మనోట 'ఈ బూమ్మీద నూకలు సెల్లిపోనాయి' అన్న మాటా రాలేదు. ఎందుకంటే ఈ ప్రపంచం కనాకష్టంగా నికృష్టంగా ఉంది కాబట్టి పతంజలిలాంటోళ్ళు నిండా ఆవుసు పోసుకొని ఉండాలి. భూమి బల్లపరపుగా ఎంచక్కా ఎగుడు దిగుడులతో ఎంత బాగుందో కళ్ళ ముందు డేరా కట్టినోడి తోటి పని ఇంకా ఉంది. మనదెంత యెదవ బతుకో మనమెంత యెదవలమో గుడ్డలూడదీసి ఇదిరా నీ అందం..' అని అనీ వోడు వొకడుండాలి. వొకడు కాదు వందమంది ఉండాలి. మన అందం ఆర్భాటం, సంస్కారం, విలువలూ అన్నీ విప్పేసి మనల్నీ, మన మనోవికారాల్నీ బయట పెట్టీవోడు ఉండొద్దా? అసలు ఈ రొచ్చు జీవితాల్ని కడిగి కాలేసేవాడొకడు ఉండొద్దా? పరమ కుల్లు కంపు కొడుతూ సిగ్గూ ఎగ్గూ సీమూ నెత్తురూ లేని మన రాజకీయ నాయకుల్నీ వాళ్ళు నడిపే ప్రభుత్వాల్నీ వెక్కిరించి ముఖాన, కేంద్రించి ఉమ్మేవాడుండొద్దా? కనాకష్టమూ పరమ నికృష్టమూ అయిపోయిందనీసి రొచ్చు కంపయిపోయిందనీసి ఆ తోవంటెళ్ళకుండా పైకెళ్ళిపోవడమే పరమపద సోపానమని ఎలాగనుకుంటాం? కతల్తోటి కళల్తోటి మరమ్మత్తు చేసే వోళ్ళకి ఇక్కడ సేనా పని ఉంది. అటువంటి పనిమంతుడు ఎళ్ళిపోతే '... ఎక్కడికేటి?' అని అడక్కుండా ఆపకుండా 'నువ్వయినా సుఖపడు' అని వొగ్గిగలమా? ఎవులయినా సచ్చి సుఖపడీది ఏటుంటాది?

ఈ గోసని పక్కని పెడితే - 'మహారచయిత కె.ఎన్.వై. పతంజలి ద్వితీయ వర్ధంతి సభ' (13 మార్చి 2011 హైదరాబాద్)లో ఆయన మిత్రులూ విమర్శకులూ ఆయన్ని ప్రేమించే వాళ్ళే ఆయన ఎత్తు కొలవడానికి ప్రయత్నిస్తూ 'పతంజలి రచనలు పాపులర్ కాలేద'ని బాధపడ్డారు. ఆ మాట నాకు మరీ బాధ పెట్టింది. ఆయనెంత ప్రసిద్ధుడో... ఆయన మామూలు మనుషుల్లోకి లోలోపల్లోకి ఎంతగా వెళ్ళిపోయాడో ఇంకిపోయాడో ఇళ్ళలో మరెంతగా తిష్టవేసాడో బోలెడు అనుభవాలున్నాయి. అందుకని ఆ మాటలు జీర్ణం కాకనే మచ్చుకి వొకటి అది సొంతగొడవలా

ఉన్నా తప్పక ఆ అనుభవాల్ని చెప్పుకోవలసి వచ్చింది.

మరోమాట పౌరకుల అజ్ఞాన జ్ఞానం గురించి.. స్థాయీ భేదం గురించి వెరసి పతంజల్ని అర్థం చేసుకోవడం గురించిన చర్చ కరపత్రాల్లో కదలాడి సభలో బయటపడింది. ఇప్పుడే కాదు, ఎప్పట్నుంచో ఇలాంటి వాదనలూ వేదనలూ వినిపిస్తూ ఉన్నాయి!

రావిశాస్త్రి ఇండియాలో కాకుండా ఇంగ్లాండులో పుట్టుంటే... పతంజలి తెలుగు వాడిగా కాకుండా తెల్లవాళ్ళలో పుట్టుంటే... ఇలా ఎందరెందర్నో తెలుగు నాట పుట్టినందుకూ తెలుగు రచయిత అయినందుకు బాధపడుతుంటాం. మన మాక్సిమమ్ గోర్కి నామిన్ని నెమరవేసుకుంటాం. బతకడానికి పడ్డ అతని అతి తెలివి తేటలు అటుంచి, అవమానాలు చూస్తే - బాల్యం చూస్తే అతను గోర్కీయే!

పాశ్చాత్య రచయితలంతా ఎల్లలు దాటి దేశాలు దాటి మన తలుపులు తెరుచుకొని మన ఇళ్ళలోకి వచ్చారు. మనవాళ్ళకి మన గడపదాటే దారే లేదు. ఇక్కడ ఇంటింటికి వెళ్ళే తోవే లేదు. పుస్తకాలు చదివే సాంప్రదాయం మనకి తక్కువ. బతుకు పుస్తకం బరువెక్కువ. ఇక చదువరులందరూ అందుకోగల వాళ్ళుకారు. ఆక్సిజన్ అందరికీ అందదు. ఎందుకంటే మన జ్ఞానమే మన అజ్ఞానం. మనం మన జ్ఞానాన్ని బయట పెట్టుకొన్న కొద్దీ దాన్ని అంటిపెట్టుకొని ఉన్న అజ్ఞానమూ బయటపడుతుంది, వెలుగుని అంటుపెట్టుకొని ఉన్న చీకటిలా! జ్ఞానం కన్నా అజ్ఞానానికి ఆయువెక్కువ. అభివృద్ధి ఎక్కువ. అందం ఎక్కువ. అన్నీ ఎక్కువ గనుకనే 'పాపులర్ ఫిక్షన్' కాలేవు. కావు.

చేవచచ్చిన సర్కారూ - జీవం చచ్చిన చదువూ - రూకలు మెచ్చిన బతుకూ ఇవే గదా అజ్ఞానాన్ని జ్ఞానంగా చేసేవి?

'ప్రభుత్వమంటే ఏటి? ప్రభుత్వమంటే ఎవులు?' అన్నాడు ఆ మధ్య బొత్స. అడిగిన తానే సమాధానమూ ఇచ్చాడు. 'ప్రభుత్వమంటే నేనే కాదు, నువ్వూ ప్రభుత్వమే. ఈడూ (పక్కనున్న వాడ్ని చూపించి). ఇతనూ ప్రభుత్వమే. అల్లాడు. అతనూ ప్రభుత్వమే. మీరు (మీడియాని చూపించి) కాదేటి ప్రభుత్వం? అందరూ ప్రభుత్వమే. ప్రభుత్వమనేది వేరేగా - ఎక్కడో ఉండదు...' అని తన జ్ఞానాన్ని బయటపెట్టి అందరినీ అజ్ఞానంలో ఉంచేసారు. 'ప్రజలంటే ప్రభుత్వం... ప్రభుత్వమంటే ప్రజలు' అని అవి రెండూ ఒకదానికొకటి పర్యాయపదాలైనట్టు మన పాలకులతో పాటు మన చదువులు మభ్యపెడుతున్నాయే.

మన గాలిని మనం పీల్చకూడదని - మన నీరు మనం తాగకూడదని - మన నేల మీద మనం నివసించకూడదని ఊళ్ళ మీద అడవుల మీద పడి మన సహజ సంపదలను దోచిపెట్టే దళారీ రాక్షస పాలకుల అభివృద్ధిని కాదంటే అజ్ఞానమే - డెవలప్‌మెంటొక్కటే జ్ఞానం...

'అమ్మనీ తియ్యనీ దెబ్బ.. ఎంత ముద్దుగా ఉన్నదోయబ్బా..'' పాటకు శ్రీదేవి చిరంజీవి స్టెప్పులేసారు కదా? అది ఏ సినిమాలోది? - ఇది టీవి క్విజ్. ఇది తెలియకపోవడమూ అజ్ఞానమే కాదు అవమానం కూడా!

'తాజ్‌మహల్ ఎక్కడ ఉంది?', 1. ఢిల్లీ, 2. హైదరాబాద్, సెల్‌లో ఎస్.ఎం.ఎ, కాంటెస్ట్. ఇవీ మన పోటీలు. నాలెడ్జ్ పరీక్షలు.

'లెఫ్ట్ ఫ్యాన్‌ని పూర్తిగా డిలిట్ చేసెయ్యండి, రైట్ ఫ్యాన్‌తో రాస్తే రైట్! రియల్‌గా ఎన్ని నెగటివ్ షేడ్స్ ఉన్నా ప్రభుత్వ పథకాలని పాజిటివ్‌గా ప్రజెంట్ చేస్తేనే మార్కులు స్కోరు చేస్తారు. నెగటివ్ థింకింగ్ వద్దు, నెగటివ్ మార్కులు వస్తాయి...' స్టడీ సర్కిళ్ళలో ఎక్స్‌పర్ట్స్ చెప్పిన మాటలివే. ఫాలో అయిన వాళ్ళే రాంకర్లు... సివిల్స్ అయినా, గ్రూప్ వన్నయినా టూ అయినా ఎన్నయినా... అదే జ్ఞానం! ఆ జ్ఞానవంతులే మన ఆఫీసర్లు...

'చదువు' అంటే నేర్చుకొనేది... నెమరు వేసుకొనేది కాదు, బట్టీ పట్టేది... పరీక్షలు అలా అవగానే ఇలా వదిలేసేది... ఇదే మన విద్యార్థుల వి'జ్ఞానం'...

'జావా' తప్ప 'జావ' యెలా కాస్తారో తెలియని ఇన్నోసెంటు క్లవర్లు మనవాళ్ళు.

'టెక్నిక్' తప్ప 'కంటెంట్' తెలియని మహా కళాకారులున్నారు. హన్నా... 'అన్నా హజారే' యెవరు?... హన్నన్నా -

ఎటువంటి ఆచ్ఛాదనలున్నా తీసేసి ఎలా ఉన్నామో అలానే నగ్నత్వంతో మొక్కితే దేవుడూ నగ్నంగా కనిపిస్తే అది బూతు... హుస్సేన్ మీద ఒట్టు...

'నవరసాలు' అంటే అదేదో నూజివీడు మామిడి పళ్ళ రసాలు అనుకొని... 'నవ' అంటే 'కొత్త' ... సో... 'కొత్త రసాలూ?' ఫేస్‌లో క్వశ్చన్ మార్క్. 'నవ రంధ్రాలు' అంటూ 'క్లూ' ఇచ్చేసినా పట్టుచీర పట్టలేకపోయిన దురదృష్టవంతులున్న నేలమనది...

'ఎత్తు' అంటే హైటని మాత్రమే తెలిసి 'వెయిట్' కూడా అని తెలీక, 'వైశాల్యం' అని సమానార్థంతో రిప్లేసు చేసిన సాహితీపరులున్నారు. 'వీసమెత్తు'లో 'వీసె' అంటే తెలీదు. 'ఎత్తు' అంటే తెలీదు. 'మనిషి జీవితం ఏడు సముద్రాల ఎత్తు'... అని రాస్తే - లోతుని ఎత్తుగా యెలా కొలుస్తారని... అది పొయిటిక్ ఎక్స్‌ప్రెషన్ అని అయినా అనుకోకుండా అందరికీ అర్థం కాదని (?) 'వైశాల్యం'గా వాడేసారన్నమాట....

అంతెందుకు? నేను 'ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరిశ్రమల అభివృద్ధి సంస్థ'లో పనిచేసిన రోజుల్లో 'అది ప్రైవేటుదా? గవర్నమెంటుదా?' అని అడిగిన వాళ్ళున్నట్టే - (కొన్నాళ్ళు) ఆంధ్రజ్యోతి'లో పని చేసిన రోజుల్లో 'అది గవర్నమెంటుదా? (ప్రైవేటుదా?' అని అడిగిన వాళ్ళూ ఉన్నారు. వాళ్ళేం ఎర్ర బస్సు ఎక్కొచ్చిన వాళ్ళు కారు. మా శ్రీకాకుళం వాళ్ళూ కారు. హైదరాబాద్‌లో వాళ్ళే, వచ్చి స్థిరపడిన వాళ్ళే. డిగ్రీ హోల్డర్లే. ఇది పచ్చి అనుభవం... పచ్చి వెలక్కాయ గొంతులో దిగబడ్డాసరే -

'... ఈయన చాలా కథలు రాసారు, రైటరు...' అని పరిచయం చేస్తే - 'ఎక్కడ?' అని అడిగిన వాళ్ళున్నారు. ఎక్కడేమిటి?' అని నెత్తి గోక్కుంటే, 'రైటరంటే పోలీస్టేషన్లో ఉంటారు.. అదే కదా?' అని అడిగిన వాళ్ళూ లేకపోలేదు. రైటరంటే కంప్లైంట్లు రాసేవాడని మాత్రమే తెలిసిన చోట 'రైటింగ్స్' ఏం చదువుతారు? చదివిందేమని అర్థం చేసుకుంటారు?

లేఖ

# విప్లవ కవిత్వంపై ఒక పాఠకుడి సంభాషణ

- కలంధారి

ఎడిటర్ గారికి...!

అరుణతారలో పాణి కవిత్వం గురించి మీరేమనుకుంటున్నారు? మీరూ... విరసం పెద్దలు, విప్లవ సాహిత్య విమర్శకులైన వివిసారు, వేణు, చెంచయ్య, చలసాని తదితరులు ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలని ఉంది. విరసం మీద కొంత అలక ( ఇది సబ్జెక్టివ్ కావచ్చేమో) ఉన్నా విరసం వాళ్లు విప్లవ కవిత్వం ఎలా రాస్తున్నారో, ఎప్పుడెప్పుడు ఏం మార్పులు వస్తున్నాయో గమనించకుండా ఉండలేను. ఎందుకంటే నావంటి వారికి కవిత్వం గురించి, జీవితం గురించి విరసమే నేర్పించింది. అందువల్లే పాణి కవిత్వాన్ని ఈ మధ్య అరుణతారలో చాలా శ్రద్ధగా, ఇష్టంగా చదువుతున్నాను. నావంటి వారికి ఇచ్చి చదివిస్తున్నాను.

మళ్ళీ అదే ప్రశ్నండీ. పాణి ఇటీవల రాస్తున్న కవిత్వం గురించి మీరేమనుకుంటున్నారు. మీ నాయకుడు కాబట్టి అచ్చేస్తున్నారా? లేక ఏమైనా మీకు, సంస్థ పెద్దలకు అంచనాలున్నాయా? ఎందుకు ఇంత సూటిగా అడుగుతున్నానంటే... ఆ రోజుల్లో మాలాంటి వాళ్లం విప్తవ కవిత్వంలో ఇలాంటి పోకడలు పోతే కొన్ని విమర్శలు వచ్చేవి. వ్యతిరేకించారని అననుగాని, 1970లనాటి విప్లవ కవిత్వం కంటే భిన్నంగా ఉన్నందు వల్ల కొంచెం ఇబ్బందిపడే వాతవరణం ఉండేది. దీనికి విరసమే కారణమనీ నేనను. ఆనాటి కవిత్వ ప్రపంచమే అందునా విప్లవ, ప్రగతిశీల కవిత్వ ప్రపంచ అట్లా ఉండేదేమో. దాంతో తంటా వచ్చేది. కానీ ఇప్పుడు ఒక విరసం నాయకుడు, విప్లవ కార్యకర్త చేతిలో విప్లవ కవిత్వం కొత్త పోకడలు పోతున్నందుకు సంతోషంగా ఉంది. వివిసారు, విమల, కౌముది, నాగరాజు, వడ్డెబోయిన శ్రీనివాస్ ఇంకా చాలా మంది అరుణతారలో రాస్తున్న కవులు విప్లవ కవిత్వంలో ఈ పదేళ్లలో చాలా కొత్తదనాన్ని తెస్తున్నారు. చప్పున పేర్లు ఉటంకించలేనుగాని కొందరు అజ్ఞాత కవులు ఎలిజీలను కూడా చాలా బాగా రాస్తున్నారు.

ఇదంతా సరే. పాణి కవిత్వంలో మంచి తాత్వికత ఉంది. జీవితం గురించి కొన్ని లోతైన, గాఢమైన భావనలు వెలిబుచ్చడాన్ని కవిత్వంలో తాత్వికత అంటుంటారు. ఇతడి కవిత్వంలో వ్యక్తికీ సమూహానికీ మధ్య వెతుకులాట ఉంది. అతడి కవిత్వంలో ఎక్కువగా దుఃఖం ఉంది. ఏమిటిది? గతంలో అయితే విప్లవ కవిత్వంలో దుఃఖ మేమిటని ఒప్పుకోకపోవచ్చు. ఇది వ్యక్తిగత దుఃఖాన్ని సామాజిక దృష్టితో అనుభవించడం. సామాజిక దుఃఖాన్ని సొంతంగా భావించడం. తన గురించి, తనలాంటి మనుషుల గురించి దుఃఖిస్తూ దానికి సామాజిక పార్శ్వాన్ని ఎత్తి చూపడం. ఇట్లాంటి దాన్ని ఇంత వరకు విప్లవ కవిత్వంలోకి రానివ్వలేదనే నా కంప్లైంట్. అలాంటి మూడ్ స్వీయాత్మకమని గతంలో కొట్టి పారేయ్యలేదా? ఒంటరి ఏడుపని తీసి పారేయలేదా? ఒంటరి ఏడుపును నేను అస్సలే ఒప్పుకోను. కానీ ఉద్యమజీవి అయిన కవికి కూడా ఈ లోకంలో దుఃఖం ఉంటుంది. విప్లవోద్యమం ఎదుర్కొంటున్న నిర్బంధం వల్ల, ఎదురుదెబ్బల వల్ల అతడిలో

---

ఇలా తలమీద తట్టెడు అనుభవాలు తలా ఒకరికి కాదు, అందరికీ ఉన్నాయ్... ఉంటాయ్... ఇలా ఎన్నో ప్రాథమిక విషయాల్లోనే తోవ తప్పిపోయాం.

అంచేత... పాఠకులు పతంజలి స్థాయిని అందుకోలేక పోవడం పతంజలి తప్పు. అతగాడు చేసుకున్న నేరం. అంచేత పతంజలే అన్నట్టు 'మన అజ్ఞానం వల్లనే మనకెలాంటి నష్టం లేనప్పుడు ఎదుటివాడి అజ్ఞానం వల్ల మనకొచ్చే నష్టం ఏముంది?' అని సరిపెట్టుకోవలసిందే -

మరి సృజనాత్మక సాహిత్యంలో చెప్పినవాటికన్నా చెప్పకుండా ఉండి గ్రహించవలసినవి ఉంటాయి. ఆ ఖాళీలు ఎవరికి వాళ్ళే పూరించుకోవాలి, నిజమే. కానీ ఆ ఖాళీలు పూరించని వాళ్ళతో పాటు తప్పుగా తమకు తోచిన విధంగా పూరించిన వాళ్ళూ ఉంటారు. నువ్వు తప్పుగా పూరించావంటే - నీకు తప్పు నాకు ఒప్పు ఇట్నుంచి నీకు కుడి అట్నుంచి నాకు ఎడమ అని తర్కశాస్త్రాన్ని తవ్వి తలపోసిన వారూ ఉంటారు. ఎవరి అజ్ఞానమే వారి జ్ఞానం!

అయితే, మెదడు కొందరికి తలలో ఉంటే మరికొందరికి మోకాళ్ళో ఉంటుంది. ఇంకొందరికి పాదాల్లో ఉంటుంది. అన్నీ చలవశీలమైన చోట మెదడు మాత్రం చలనశీలిగా ఎందుకు ఉండకూడదు? ఎటొచ్చీ మన మెదడు మన దగ్గర ఉంటే చాలు. అప్పుడూ సొంత మెదడుకు పరాయి వాళ్ళు ఎలా ఆలోచించాలో తర్ఫీదిచ్చి వికాసమిస్తారు. ఆ వికాసపు వెలుగులో కళ్ళు బైర్లు కమ్మి తోవకనిపించదు, చీకట్లో కనిపించనట్టే. జ్ఞానం వెలుగైనా అజ్ఞానం చీకటైనా ఒక్కలాగే ఉంటాయి! అందువల్ల మేలిమి జాతేదో నాసిరకం జాతేదో తెలీకుండా తేలకుండా ఒక్కలాగే ఉంటాయి! ఇంకా చెప్పాలంటే పత్రికలూ టీవీలూ ఇచ్చిన కలర్‌తో కలర్ ఫుల్ ప్యాక్‌తో ఈ తరానికి రావిశాస్త్రి తెలీక పోవచ్చుగాని యండమూరి తెలుస్తాడు. పిజ్జా బర్గర్‌లు తెలుస్తాయి గాని పరమాణ్ణం తెలుస్తుందా? పతంజలి తెలుస్తాడా?

ఇందుకు కారణాలు తెలుసుకోవడం కలాలకెత్తడం అక్షర కూలీలైన రచయితల పనే!



వైయుక్తికంగా కలిగిన దుఃఖం కవిత్వమవుతోందని నాకనిపిస్తోంది. సాహసం, తెగింపు, మొక్కవోని విశ్వాసం మొదలైనవి విప్లవ కవిత్వంలో బాగా ఉంటాయి. అవి ఎలా రాసినా అంగీకరిస్తారు. దుఃఖాన్ని చప్పున అంగీకరించలేరని నేనంటాను. అందువల్ల విప్లవ కవిత్వం కొంత మొనాటనీకి గురైంది. కానీ ఉద్యమాల వల్ల విషాదం, దుఃఖం కలిగే సన్నివేశం కూడా ఉంటుంది. పాణి కవిత్వానికి ఉన్న సామాజిక, ఉద్యమ సందర్భం ఇది. ఇందులో కూడా విశ్వాసాలు వదులుకోకుండా ఇట్లాంటి కవిత్వం రాయవచ్చు. ఇది సుగుణం.

భావుకులైన వాళ్లు అనేక కారణాల వల్ల ఉద్యమాల్లోకి, నిర్మాణాల్లోకి వస్తారు. కచ్చితంగా ఎందుకు వస్తారో చెప్పలేం. ఎందుకు దూరమవుతారో చెప్పలేం. ఈ కవిత్వంలో దీని గుర్చి కూడా ఉంది. సమాజంలో మార్పు అనే పెద్ద వ్యవహారం గురించి బోలెడు సిద్ధాంతాలు తెలిసినా చాలా చిన్న కారణాలకే ఉద్యమాల నుంచి, నిర్మాణాల నుంచి వెళ్ళిపోతారు. విప్లవ కవిత్వం ఇంత వరకు పెద్దగా పట్టించుకోని విషయమిది. పాణి దాన్ని అడ్రెస్ చేస్తున్నాడు. అందువల్ల విప్లవ కవిత్వంలో చాలా కొత్తదనం తెచ్చాడని నా అభిప్రాయం.

ఉద్యమాలకు దూరం కావడం రెండు రకాలు. శత్రువు చేతిలో హతులు కావడం, నిర్మాణాలకు దూరం కావడం. నిర్మాణాల్లో లేకుండా ఉద్యమాల్లో ఉన్నామని, ఉండగలమని నాలాగా తెలివైనవాళ్ళు గట్టిగా నమ్ముతూ కూడా ఉండొచ్చు. ( మాలాంటి వాళ్ళ కార్యకలాపాల వల్ల ఏదో మేలు జరుగుతూ ఉంటుందిగాని, అది సరిపోతుందని చెప్పడానికి నాకు ఇప్పటికీ నోరు రావడం లేదు.) అదే నిజమైతే ఉద్యమాలను అట్లాగే నిర్వహించవచ్చుగదా? నిర్మాణాల్లో ఉండాలంటే చాలా హింస పడాల్సి ఉంటుందని తెలిసినా సమాజంలోని హింసను పోగొట్టడానికి అందరూ కలిసి పనిచేస్తే కాని పరిష్కారం దొరకదు. దానికి పార్టీలు, సంఘాలు కావల్సిందే. పైన చెప్పినట్లు రెండో రకంగా దూరం కావడం గురించి విప్లవ కవిత్వం రాయాలి. అది వెళ్ళిపోయేవాళ్ళకు, నిర్మాణాలకు కూడా ఆలోచన పెంచుతుంది. పాణి కవిత్వంలోని ఈ ఎలిమెంట్ నాకు బాగా నచ్చింది. అది దుఃఖంగా, విమర్శగా, విశ్వాసంగా... ఇవన్నీ కలిసిన ఒక రకమైన తాత్విక స్థాయిలో వ్యక్తం కావడం విప్లవ కవిత్వానికి లైఫ్‌ను ఇచ్చింది.

పాణి కవిత్వంలో ఉద్యమాల్లోని అవలక్షణాల మీద విమర్శ చూసి మరింత ఆనందం కలిగింది. బాలగోపాల్ ఆ రోజుల్లో ఎక్కడో వ్యక్తుల వ్యక్తిత్వాలు, ఉద్యమ వ్యక్తిత్వం కలగలవడం గురించి చాలా బాగా రాసాడు. ఆయన చెప్పిన మాట మంచికి వర్తించినట్టే చెడుకు కూడా వర్తిస్తుంది. ఉద్యమ వ్యక్తిత్వంలోని లోపాలు అందులో ఉండే వ్యక్తుల్లో కూడా కనిపిస్తాయి. ఈ సమాజం వల్లా, వ్యక్తిత్వ నిర్మాణంలోని లోటుపాట్ల వల్లా వ్యక్తుల్లో ఉండే లోపాలు ఉద్యమ వ్యక్తిత్వంలోకి చొరబడతాయి. పాణి కవిత్వం వీటిని ఫోకస్ చేస్తుందని నాకనిపించింది. ఎగిరి గంతేయడం, ఎడతెరపిలేకుండా కుంగిపోవడం అనే దుర్లక్షణాల గురించి చాలా బాగా రాసాడని నేను మిత్రులతో పంచుకున్నాను. తను అన్నట్లు కాసింత మౌనం సాధన చేస్తేకానీ ప్రతి వాళ్ళకు ఇది అర్థం కాదు. ఉద్యమాల మీద విమర్శ రాయడమంటే వ్యతిరేకంగా రాయడమే అని చాలా మంది పూర్వ తీవ్రవాదులు నిరూపించారు. ఉద్యమాలకు, నిర్మాణాలకు దూరమైన వాళ్ళ గొడవగా దీన్ని ఉద్యమాల్లో కొనసాగుతున్నవాళ్ళూ తేల్చేశారు. కానీ ఉద్యమ కార్యకర్త కూడా అయిన ఈ కవి ఉద్యమ విశ్వాసాలనూ, క్రమశిక్షణనూ పోగొట్టుకోకుండా విమర్శనాత్మకంగా రాయడం చాలా బాగుంది. ఉద్యమాల మీద బైటి నుంచి వద్దన్నా విమర్శ వస్తూనే ఉంటుంది. అందులో కొంత మంచి ఉంటుంది. మంచి ఉద్యమాలైతే వాటిని స్వీకరిస్తాయి. విప్లవోద్యమం తనను తాను విమర్శించుకోవడం చాలా అవసరం. ఆ పని పాణి కవిత్వం చేస్తోంది. తన కవిత్వం చదివితే - ఉద్యమాల్లోని క్రియాశీలత అవలక్షణంగా కూడా మారే అవకాశం ఉందా? అనిపించింది. క్రియాశూన్యమైన నీతి బోధ మాదిరి ఇది కూడా చాలా నష్టం చేస్తుంది. పాణి కవిత్వాన్ని విమర్శనాత్మక విప్లవ కవిత్వం అనవచ్చు. విప్లవ ప్రచార కవిత్వం నుంచి, వివిసారు లాంటి వాళ్ళు ఎక్కువగా రాసే రాజకీయ విమర్శ కవిత్వం నుంచి విమర్శనాత్మక విప్లవ కవిత్వంగా ఇప్పుడు ఎదిగింది. విప్లవ కవిత్వంలో మొదటి నుంచి తాత్వికత తక్కువగా ఉండేది. ఇప్పుడది భర్తీ అయిందని నా అంచనా. అట్లా చెప్పాలంటే పాణి కవిత్వాన్ని విమర్శనాత్మక తాత్విక కవిత్వం అంటే ఇంకా సరిగా ఉంటుందేమో. ఇంతకూ మీరూ, విరసం పెద్దలూ ఏమంటారో వినాలని ఉంది.



## రచయితలకు విజ్ఞప్తి !

అరుణతారకు రచనలు పంపండి. కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి. అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి. మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ -

- సం

పుస్తకపరిచయం

# గతితార్కిక భౌతికవాదం

- ఐరా గొలోబిన్

స్వేచ్ఛానువాదం: కొడవటిగంటి రోహిణీప్రసాద్

(గత సంచిక తరువాయి...)

## 2

### ఉపోద్ఘాతం

ఈ ఉపోద్ఘాతాన్నీ, కార్మికులూ, వైజ్ఞానిక తత్వశాస్త్రం, తాత్విక వికాసంలోని ముఖ్యదశలు అనే మొదటి రెండు అధ్యాయాలనూ కలిపి, గతితార్కిక భౌతికవాదానికి పరిచయంగా భావించాలి. తత్వశాస్త్రం జటిలమైన విషయం కనక సుదీర్ఘమైన ఈ పరిచయం వల్ల కొన్ని ప్రాథమిక సమస్యలు తొలగవచ్చు. దీనివల్ల చరిత్రానుసారంగా చేసిన విశదీకరణ సమంజసంగా అనిపిస్తుంది. అంతేకాక గతితార్కిక భౌతికవాదాన్ని విపులీకరించే ముందు దానికి కొంత స్పష్టత ఏర్పడుతుంది.

### ఆనాటి, ఈనాటి తత్వవేత్తలూ, తత్వశాస్త్రాల గురించిన ప్రజాభిప్రాయాలు

తత్వవేత్తల గురించిన ప్రజాభిప్రాయాలు రకరకాలుగా కనిపిస్తాయి. చాలాకాలంగా కన్ఫ్యూషియస్, గౌతమబుద్ధుడు, సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్ తదితరులందరినీ భయభక్తులతో, ఎంతో గౌరవనీయులుగా, జ్ఞానానికీ, ఉత్తమ సంస్కారానికీ ప్రతీకలుగా ఆరాధించడం జరుగుతోంది. తత్వచింతనకై ప్రాణాలర్పించినవాడుగా సోక్రటీస్ బోధనలను ఉదహరిస్తారు. ఆయన తన సాటి నాగరికులను మందలిస్తూ, ప్రేరేపిస్తూ, చెవినిల్లు కట్టుకుని పోరుతూ, వారే కనక తొందరపడి తనవంటివాణ్ణి కోల్పోతే ఆ స్థానాన్ని మరెవరూ భర్తీ చెయ్యలేరని వారిని హెచ్చరిస్తూ ఉండేవాడు.[1]

మరొకవంక తత్వవేత్తలను (అందులోనూ వృత్తిరీత్యా తత్వచింతన చేసేవారిని) ఈసడించే ధోరణి కూడా ఒకటుంది. అలాంటివారిని లోకజ్ఞానం లేనటువంటి అయోమయపు జీవులనడానికి నక్షత్రాలను లెక్కపెడుతూ బావిలోకి జారిపడ్డ థేలీజ్ ఒక ఉదాహరణ. కొందరు దొంగస్వాములూ, అన్నీ తెలిసినట్టు బుకాయించేవారూను. మౌనముద్ర దాలిస్తే తత్వవేత్త. జుట్టు పెంచుకుని, శాలువ కప్పుకుంటే వేదాంతి అని రోమన్లు వెటకారం చేసేవారట.[2] (పదహారో శతాబ్దానికల్లా తత్వవేత్తలకు అపకీర్తి పెరిగింది. ఎవరినైనా తత్వవేత్త అంటే అతనొక కపటసన్యాసి అనో, ఎందుకూ కొరగాడనో, వదరుబోతు అనో, మోసగాడనో, ఆటపట్టించదగిన దిష్టిబొమ్మ అనో అర్థం ఏర్పడిపోయింది జియొర్డానో బ్రూనో రాసిన Cause, Principle and Unity నుండి, పుట 6364) తత్వవేత్తలు భౌతికశాస్త్ర పరిజ్ఞానం లేని దద్దమ్మలనే అభిప్రాయం కూడా ఉంది. అందుకే ప్రముఖ భౌతిక శాస్త్రజ్ఞుడైన లార్డ్ రూథర్‌ఫర్డ్ ఇంగ్లిష్ తత్వవేత్త సామ్యూల్ అలెగ్జాండర్‌తో "మీరు ఎల్లకాలమూ చెపుతూ వస్తున్నదేమిటి? వట్టి ఊకదంపుడేగా?" అన్నాడట.[3] మరికొందరికి తత్వవేత్తల ధోరణి శుష్క వేదాంతంలా అనిపిస్తుంది. తాను సామ్యూల్ జాన్సన్‌తో సరితూగలేనని ఒప్పుకుంటూ ఆలివర్ ఎడ్వర్డ్స్ "జాన్సన్‌గారూ, మీరొక తత్వవేత్త. మీలా ఉండడానికి నేనూ లోగడ ప్రయత్నించానుగాని నా ఉల్లాస ధోరణి మధ్యలో తన్నుకొస్తూ ఉంటుంది, ఏం చెయ్యను?" అన్నాడట.[4] జర్మన్ కవి హైన (----) తత్వవేత్తలను వాజమ్మలంటూ వెక్కిరించాడు

"నెత్తినొక కుళ్ళాయీ, ఒంటిన చిరుగుల చొక్కా
లోకరీతిని గురించి ఉండదేమీ లెక్కా డొక్కా"[5]

మూడు దశాబ్దాలుగా సోక్రటీస్ ఒరవడిలో ఆరితేరిన ఎం.ఆర్ కోహెన్ "వ్యవహారదక్షుడైనవాడు సృజనాత్మక సాంస్కృతిక జీవితాన్ని కించపరుస్తాడనీ, వాటికై పాటుపడేవారి లక్షణమల్లా లేనిపోని భేషజమో, పటుత్వం లేకపోవడమో" అనీ అంటాడు.[6]

తత్వవేత్తలపట్ల ఉండే ఇటువంటి నిరసన యావత్తూ తత్వశాస్త్రం యదార్థ జీవితాన్ని పట్టించుకోదనే భావనతో ముడిపడినది. హెగెల్ చెప్పినట్టుగా "తత్వజ్ఞానశాస్త్రమంతా నైరూప్య భావనలూ, నేల విడిచిన సామువంటి సామాన్యసూత్రాలేనన్న ఈసడింపు సహజంగా అందరికీ ఉంటుంది. ఇంద్రియాల ద్వారా మనం పొందే అనుభవాలూ, స్పృహా, సహజాతమూ, రోజువారీ జీవితానుభవాలూ వగైరాలన్నీ మాత్రం నిశ్చితమైనవిగా, ఖచ్చితంగా అనిపిస్తాయి".[7]

వ్యంగ్య రచయిత అంబ్రోస్ బియర్స్ లెక్కన "తత్వశాస్త్రమంటే ఎక్కణ్నుంచీ బయల్దేరని, ఎక్కడికీ చేరని అగమ్యప్రస్థానం".[8] అలాగే మరొకరు తత్వశాస్త్ర ధోరణిని వెక్కిరిస్తూ "తత్వశాస్త్రం ఆదిలోనే మొదలై ఎవరో ఒకరి ఆలోచనలలో అంతమౌతుంది" అన్నారు. బెర్ట్రండ్ రసెల్ తత్వశాస్త్రాన్ని భ్రాంతితో అపరిపక్వమైనదిగా పేర్కొన్నాడు. "తత్వశాస్త్రమంటే స్పష్టంగా ఆలోచించడానికి చేసే మొండి ప్రయత్నం అంటారు. నా లెక్కన అది మిథ్యాభాసంతో ఆలోచించేందుకు మహా తెలివైన ప్రయత్నం... బుద్ధి వికాస క్రమంలో తత్వశాస్త్రం ఒకానొక దశ మాత్రమే. మానసిక పరిపక్వతతో దానికి సరిపడదు".[9]

తత్వశాస్త్రమంటే ఇలాంటి తక్కువ అభిప్రాయం ఉండడానికి కారణం సామాన్య ప్రజల స్పష్టమైన అవగాహనే. వారి అజ్ఞానం కాదు. తత్వశాస్త్రంలో ఎక్కువగా కనబడేవి పడికట్టురాళ్ళవంటి భావనలూ, స్తనశల్య పరీక్షలూ, పదాడంబరమూ, వికృతభావాలూ మొదలైన అవలక్షణాలే. వీటిని గురించి పట్టించుకునే కొద్దిమంది అమెరికన్లలో తత్వశాస్త్రమంటే ఈ "అవలక్షణాలే"నన్న అభిప్రాయం బలపడింది. ఆసక్తి ఉన్న అతి కొద్దిమందికి కూడా తత్వశాస్త్రం ఒక విజ్ఞానశాస్త్రమనే సంగతి తెలియదు. శాస్త్రీయమైన

గతితార్కిక భౌతికవాదం గురించిగాని, దాని జ్ఞానసంపద గురించిగాని ఖచ్చితమైన, సమగ్రమైన అవగాహన మరింత తక్కువమందికి ఉంటుంది. యూ.ఎస్.ఎస్.ఆర్.లోనూ, పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనాలోనూ జరిగిన పరిణామాలు దానికి సంబంధించినవేననీ వారికి తెలియదు.

## వైజ్ఞానిక తత్వశాస్త్రం

"విజ్ఞానంలోని సత్యం అన్నిటినీ ప్రకాశవంతం చేసి ఆనందం చేకూర్చగలిగిన కాంతిపుంజం. దాని వెచ్చదనంలో అన్నీ ఒకేసారిగా వికాసం చెందుతాయి. జీవితపు లోతుల్లోని విస్తృత అంశాలన్నీ విశదం అవుతాయి" అన్నాడు హెగెల్.[10] వైజ్ఞానిక తత్వశాస్త్రం అంటే గతితార్కిక భౌతికవాదం అని ఖచ్చితంగా చెప్పవచ్చు. అది ప్రకృతిలోనూ, సమాజంలోనూ, ఊహల్లోనూ ఉండే సామాన్య అంశాల సమాహారం. ఈ సార్వజనీనతే దాని పరిధీ, ప్రత్యేకతా కూడా. దానికీ ఇతర శాస్త్రాలకూ ఉన్న తేడా కూడా అదే. తక్కినవన్నీ ప్రత్యేక శాస్త్రాలు కనక వాటి పరిధి కాస్త తక్కువగా ఉంటుంది.

గతితార్కిక భౌతికవాదమే వైజ్ఞానికతత్వశాస్త్రం అని నొక్కిచెప్పే మార్క్సిస్ట్ లెనినిస్ట్‌లవంటివారు దాన్ని నిరంతరమూ పరిష్కృతం చెందుతూ ఉండే శాస్త్రంగా ఉపయోగించుకుంటారు. గుడ్డి నమ్మకాలను ఎన్నడూ అనుసరించరు. "మనం విజ్ఞానాన్ని తప్ప దేన్నీ నమ్మరాదు. దేని మీదా గుడ్డి నమ్మకాలు పెట్టుకోకూడదు"[11] అన్నాడు లెనిన్. ఆయనింకా ఇలా అన్నాడు "కళ్ళు మూసుకుని దేన్నీ విశ్వసించమని అడగం. ప్రతివారూ తమ బుద్ధి నుపయోగించుకుని ప్రతిదానికీ సాక్ష్యముందని స్వయంగా నిర్ధారించుకోవాలి".[12]

జంతువుల, మనుషుల శరీరాల్లో రక్తప్రసరణం జరుగుతుందని తెలియజెప్పినవారిలో ముఖ్యుడు విలియం హార్వే. అతను శాస్త్ర అధ్యయనానికి తన పుస్తకాన్ని అంకితమిస్తూ వైజ్ఞానిక దృక్పథం కలిగిన తత్వవేత్తలందరికీ ఎల్లప్పుడూ సమతౌల్యంతో కూడిన విశాలభావాలుండాలని అన్నాడు. "సత్యాన్వేషణకై తహతహలాడే నిజమైన తత్వవేత్తలు తమకన్నీ తెలుసునని ఒక్కనాటికీ అనుకోరు. ఎవరినుంచైనా, ఎక్కణ్ణుంచయినా సరే కొత్త సమాచారం లభిస్తే స్వీకరిస్తారు. ప్రాచీనులనుంచి అందివస్తున్న కళలూ, విజ్ఞానమూ అన్నీ పరిపూర్ణమైనవనుకునేంత సంకుచిత దృక్పథం వారి కుండదు. ఆ విషయాల్లో ఇతరులు కూడా కృషి చేసి, తమ నైపుణ్యం చూపగలరనే నమ్మకం వారికి ఉంటుంది. అంతేకాదు. వారిలో చాలామందికి ప్రస్తుతం మనకు తెలిసినదాని కంటే తెలుసుకోవలసినదే చాలా ఎక్కువని అనిపిస్తుంది. తత్వవేత్తలెప్పుడూ ఇతరులు చెప్పినదే నమ్ముతూ, తాము తెలుసుకుంటున్న విషయాలపై తమ నమ్మకాన్నే కోల్పోయేంత అస్వతంత్రులుగా ప్రవర్తించరు".[13]

వైజ్ఞానిక తత్వశాస్త్రం ఎంతో రూపరహితమైనదీ, సామాన్యతలతో కూడినదీ అయినప్పటికీ దాన్ని గూఢంగానూ, అర్థంకానిదిగానూ వర్ణించకూడదు. "తత్వశాస్త్ర రచయిత ఏదో నిగూఢమైన, గంభీరమైన శైలిలో రాస్తూ పోతే అదంతా అర్థం లేనిదిగా తయారవుతుంది".[14] గాంభీర్యం ఉన్నంత మాత్రాన స్పష్టత లోపించాలనిలేదు. అసలు తేటదనం కలిగినదే నిజంగా గంభీరమైన శైలి. "చదవనేర్చిన పాఠకులందరికీ బోధపడని తత్వరచనలు ఎందుకూ కొరగానివని మా ఉద్దేశం. రచయిత తాను సరిగ్గా అర్థం చేసుకున్న విషయాలను డొంక తిరుగుడుగా కాకుండా సరిగ్గా వివరించడం అసాధ్యంకాదు. తమ పాండిత్య ప్రకర్షతో తత్వశాస్త్రాన్ని వక్రీకరించేవారు రాస్తున్నప్పుడు వివరణ కన్నా గందరగోళమే హెచ్చుగా ఉంటుంది".[15]

తేలిక శైలిలో రాస్తున్నంత మాత్రాన విషయం వెంటనే అర్థమౌతుందనీ అనలేం. జటిలమూ, నైరూప్యమూ అయిన విషయాలను ఎంత సులభశైలిలో రాసినప్పటికీ ఒకటి రెండుసార్లు చదవవలసిరావచ్చు. వాటిని ఆచరణలో పెడితే తప్ప పూర్తిగా అర్థం కాకపోవచ్చు కూడా.

గతితార్కిక భౌతికవాదం గురించిన రచన భౌతికవాద, గతితార్కిక లక్షణాలు కలిగినదై ఉంటుంది. దాని మూలాలు చారిత్రక భౌతికవాదంలో ఉంటాయి. అది రాయబడ్డ దేశంతో దానికి కొంత ప్రత్యేక సంబంధం ఉంటుంది. ఎందుకంటే మొత్తం విషయంలో అదొక సమగ్రమైన భాగం. ఒక సాంస్కృతిక రంగపు చరిత్ర. అదొక ఉత్తేజకరమైన, ఆసక్తికరమైన గాథ. కళాత్మకంగా పరిపూర్ణమైన, వైజ్ఞానిక సాహిత్యరచన. (హెగెల్ రాసిన "తర్కం" అనే గ్రంథాన్ని ఎంగెల్స్ "గతితార్కిక కవిత"గా అభివర్ణించాడు Dialectics of Nature, పుట 224) అందులో తర్కమూ, ఆవేశమూ ఉంటాయి. వైజ్ఞానిక ధోరణి ఉంటుంది. ప్రస్తుత వర్గ సమాజపు చివరి దశల్లో సోషలిజం కోసమని పోరాడుతున్నవారితో ప్రత్యేకమైన ప్రమేయం ఉంటుంది. ఈ లక్షణాలన్నీ ఉన్నట్టయితే గతితార్కిక భౌతికవాదం గురించిన రచన "అరుణోదయంలాగానూ, అడవిలో రివ్వుమని ఎగిరే బాణంలాగానూ, చలికాలం ముగిశాక విచ్చుకునే మొగ్గలాగానూ అనిపిస్తుంది".[16]

References:

1. Plato, *Apology*, 30/31, in *The Trial and Death of Socrates*, p. 100
2. Oates, *The Stoic and Epicurean Philosophers*, p. 441
3. Hutchins, "The Scientist's Morality", *Minority of One*, Nov. 1963, p. 26
4. Dunham, *Man Against Myth*, p. 3
5. Heinrich Heine, quoted in Sigmund Freud, "A Philosophy of Life", in Peterson, *Essays in Philosophy*, p. 341
6. Cohen, *American Thought: A Critical Sketch*, p. 37
7. Hegel, *Lectures on the History of Philosophy*, Vol.1, p. 24
8. Bierce, *The Devil's Dictionary*, p.139
9. Russell, *Unpopular Essays*, pp. 45, 55
10. Quoted in Kauffman, *Hegel*, p. 453
11. Mao, "On the Draft Constitution of the People's Republic of China", *Selected Works*, Vol. 5, p.146
12. Quoted in Lewis, *Marxism and the Open Mind*, p. xvii
13. William Harvey, *An Anatomical Disquisition on the Motion of the Heart and Blood in Animals*, quoted in Bunge, *Metascientific Queries*, p. 209
14. Whitehead, *An Introduction to Mathematics*, p. 170
15. Engels, *Dialectics of Nature*, p. 335
16. Lu Hsun, "A preface to Pai Meng's 'The Children's Pagoda'", *Selected Works*, Vol. 4, p. 252



(ఇంకా ఉంది)

పుస్తక పరిచయం

# పడుపుగత్తెల వేదనపై కురిసిన కన్నీటి ధార
# అలెక్సాండ్ర్ కుప్రీన్ నవల 'యమకూపం'

- ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు

(గత సంచిక తరువాయి...)

2

క్రమంగా విటులతో హాలంతా నిండిపోయింది. ఇంతలో మంగలి వాళ్ల గుంపు వచ్చి డాన్సు పార్టీ పెట్టమని ఆర్డరిచ్చారు. సానిపిల్లలంతా పర్షియన్ పద్ధతిలో డాన్సు చేయగానే, మళ్లా వస్తామని వెళ్లిపోయారు. అంతకు ముందే 'రోలీ-పోలీ' అనే వృద్ధ పారెస్టుగార్డు వచ్చాడు. రాత్రింబగళ్లూ క్లబ్బుల్లో, సారా అంగళ్లల్లో, సానికొంపల్లో గడుపుతుంటాడు. ఎప్పుడు సగం మత్తులో ఉంటూ అందరితో పరిహాసాలాడుతుంటాడు. ప్రియులకీ ప్రియురాళ్లకీ మధ్య ఉత్తరాలు చేరేస్తాడు. ఏ పని చెప్పిన చేస్తాడు. రాగానే అందరికీ మిలటరీ శాల్యూట్ చేసి ఓ పక్క కూలబడ్డాడు. ఇంతలో గవర్నమెంట్ గుమస్తాలు, తర్వాత విద్యార్థులు, కొందరు ఆఫీసర్లు వచ్చారు. 'సోంకా' అనే పిల్ల కోసం తరచుగా వచ్చే విటుడున్నాడు. యూదీయులైన ఇద్దరూ ప్రేమించుకున్నా, దారిద్ర్యంవల్ల పెళ్లాడలేకపోయారు. ఆమె తల్లి దారిద్ర్యంతో సాని కొంపకు అమ్మగా, చివరికి అన్నా ఇంట్లో తేలింది. మందుల షాపులో పనిచేసే అతడు ఓ రూబులు మిగిల్చి ఆమెను గదిలోకి తీసుకుపోయి ముద్దులాడి కౌగిలించుకుని విడిచిపెట్టేస్తాడు. విటులు అతని కళ్లముందే సోంకాను తీసుకుపోతే అసూయపడేవాడుగాని, ఆమెను ద్వేషించేవాడుకాదు. దాదాపు రోజూ వస్తాడతను.

దుకాణాల్లో పనిచేసే గుమాస్తాల గుంపు వచ్చింది. సానులతో డాన్సు చేసింది. శంకా వచ్చి టమారాను గదిలోకి తీసుకుపోయాడు. క్రమంగా అర్ధ రాత్రయింది. యామాలో చాలా దారుణాలు జరిగాయి. చాలా కొంపల్లో కొట్లాటలు జరిగాయి. చిన్న వీధిలో సైనికులు కొందరికి, నావికులకూ దొమ్మీ జరిగింది. అప్పుడో విచిత్రం జరిగింది. ఏడుగురు విద్యార్థులూ, ఒక ప్రొఫెసర్, ఓ పత్రికా రిపోర్టర్‌ని వెంటబెట్టుకుని 'అన్నా మార్కోవేనా' ఇంటికి వచ్చారు.

ఆ రోజు మే దినోత్సవం అవడం వల్ల ఉదయం నుంచే ఉత్సవాలు మొదలయ్యాయి. చాలా మంది విద్యార్థులు తమ స్నేహితురాళ్లతో సాయంకాలం దాకా 'సీపర్' నదికి ఆవల షికార్లు చేసి వన భోజనాలు చేసుకొని చివరికి ఆ యువతుల్ని ఇళ్ల దగ్గర వదిలేసి ఏదో కోల్పోయినట్లు బాధపడ్డారు. అప్పటి దాకా యువతులతో కలిసి మెలిసి తిరగడం వల్ల వారిలో కామవాంఛ రేకెత్తింది. మొత్తం ఏడుగురు విద్యార్థులు తమ ప్రొఫెసర్‌తో రాత్రి రెండింటి దాక ఒక హోటల్లో కులాసాగా గడిపి, ఇక ఇంటికి పోతే బాగుండదనుకుని, యామాకు పోదామనుకున్నారు. అలా ప్రతిపాదించినవాడు మొదట 'లిఖోనిన్' అనే విద్యార్థి జూదంలో బాగా సంపాదించి, దాన్నెలా ఖర్చు చేద్దామా అన్న ఉబలాటంతో ఉన్నాడు. ప్రొఫెసర్ యార్చెంకో ఒప్పుకోలేదు. ఇలా మనం వ్యభిచారం చెయ్యడం స్త్రీ జీతికే ద్రోహం చేసినట్లన్నాడాయన. దాంతో బోరిస్ "మగవాడి వాంఛలు ఏం కావాలి? ఎవరి ఒ(గి)కో వెడితే తిట్లూ దెబ్బలూ తప్పవు. అదే వేశ్యల దగ్గరకు యథేచ్ఛగా వెళ్లవచ్చు" అని వాదించాడు. విద్యార్థులంతా ప్రొఫెసర్‌ని బలవంతంగా ఒప్పించారు. ఆ విధంగా వారంతా యామాలోని 'అన్నా' ఇంటికెళ్లారు. వచ్చేటప్పుడు 'ప్లాటోనావ్' అనే రిపోర్టర్‌ని కూడా మధ్యలో తమతో కలుపుకున్నారు.

అలా విటులు, అందునా విద్యార్థులు గుంపుగా రావడం సిమన్‌కు నచ్చదు. అయితే ప్రొఫెసర్ ఉండడం చేత వారిని గౌరవంగా లోపలికి తీసుకెళ్లాడు. విద్యార్థులంతా ఒక ప్రత్యేక గదిలోకి చేరే సరికి, వేశ్యలంతా అలవాటు ప్రకారం వారిమీద వలపులు కురిపించసాగారు. అయితే ఆ వేశ్యలు, సేవకులు కూడా రిపోర్టర్‌ని గౌరవించడం విద్యార్థులకు నచ్చలేదు. ఇది గమనించిన రిపోర్టర్ తానక్కడ నాలుగు నెల్లుగా ఉంటూ అక్కడి కుటుంబ సభ్యుడిలా ఉంటున్నానని, వారితోటే తన భోజనం కూడానని చెప్పేసరికి, ప్రొఫెసర్‌కి ఆశ్చర్యం కలిగింది. తాను అన్నా కూతురికి చదువు చెబుతున్నందున, జీతం కింద అక్కడే భోజనం చేస్తున్నట్లు రిపోర్టర్ వివరణ ఇస్తూ, తనకు సానివాడ అంతా ఓ విచిత్ర ప్రపంచంలా అనిపించినందువల్ల వీరి మధ్య కొంతకాలం జీవించాలనే కుతూహలం కలిగినట్లు కూడా చెప్పాడు. "అయితే రిపోర్టర్‌గారు త్వరలోనే ఓ ఉద్గ్రంథం రాయబోతున్నారన్నమాట" అని ప్రొ॥ యార్చెంకో అనగానే "అందులో పడుపుకత్తెల విషాద జీవితం వర్ణిస్తారు కాబోలు" అంటూ 'బోరిస్' అనే విద్యార్థి వ్యంగ్యంగా అన్నాడు. విద్యార్థుల తీరు గమనించిన టమారా వారిని వారించడానికి ప్రయత్నించేసరికి బోరిస్ మరింత రెచ్చిపోయాడు. అతన్ని ఆపేందుకు ప్రొఫెసర్‌తో పాటు లిఖోనిన్ కూడా ప్రయత్నించాడు. తనే పుస్తకం రాయబోవడం లేదని రిపోర్టర్ ప్రశాంతంగా చెప్పాడు. వేశ్యల జీవితాల పట్ల అతనిలో జాలి వెల్లువలా ప్రవహించి చెప్పుకుపోయాడు : ఈ సానుల బతుకులో ఏదో పరమ సత్యం దాగుంది. దాన్ని తెలుసుకొంటున్నప్పుడు తీరని భయంతో మన గుండె బరువెక్కిపోతుంది. వీరంతా తమ జీవితాల్ని తివాచీల పరిస్తే, వాటి మీద వేలాది పురుషులు స్వేచ్ఛగా నడుస్తూ ఆనందాన్ననుభవిస్తున్నారు. ఇదొక అనంత యాత్ర ఎప్పుడు మొదలై

ఎప్పుడంతమవుతుందో ఎవరికీ తెలియదు. మానని, మందులేని ఈ పుండును వేలాది హస్తాలు కెలుకుతున్నాయి. ఎంత భయంకరం! ఇదొక వ్యాపారమయింది. చూశారా ఆడవాళ్ల సంత అంగడి! అప్పుడప్పుడూ పత్రికల్లో వీరి గురించి భయంకరమైన వార్తలు వస్తుంటాయి. వాటిలో ఏమీ అసత్యం లేదు. వీరి రక్తాన్ని పీల్చే జలగల్లో నీచుడైన సిమన్ ఒకడు. స్త్రీలను బలాత్కారంగా ఈ మురికి కూపంలోకి తెస్తాడు. వారిని దారుణంగా కొడుతుంటాడు. వారి కష్టాన్ని దోచుకుంటాడు. అవసరమైతే ఖూనీలు చేస్తాడు. అయినా ఈ నీచుడు మతాన్ని గురించి, దేవుణ్ణి గురించి చర్చిస్తాడు. బైబిల్ గీతాలు పాడతాడు. ఎంతటి వైరుధ్యమో చూడండి...

వారి సంభాషణల్లో కలగజేసుకున్న న్యూరా, ఓ రోజు 'నైనా' అనే పిల్ల ఒక నీచుడైన వృద్ధుడితో వెళ్లడానికి నిరాకరించినప్పుడు సిమన్ హింసించే సరికి, రిపోర్టర్ ఆమెనెలా విడిపించి చెప్పింది. అప్పుడు రిపోర్టర్ అన్నా గురించి చెబుతూ, "ఆమె రక్తం తాగే రాక్షసి. అయినా ఇదంతా తన ముద్దుల కూతురి కోసం చేస్తోంది. ఆ పిల్ల కోసం, తన కూతుళ్ల వంటి ఆడపిల్లల్ని కొనుక్కుని, వాళ్ల శీలాన్ని వేలం వేస్తోంది. ఎంత గమ్మత్తో చూశారా?" అన్నాడు "ఈ విషయాలు మీరు తరచి చూశారాల్లే ఉంది. ఇంకా వివరాలు చెప్పండి" లిఖోనిన్ ఆసక్తి కనబరిచాడు.

"వీరి జీవితాల్లో ఎన్నో విచిత్రాలు గమనించాను. ఈ యువతులు పడకగదుల్లో పసిపిల్లల్లా, బొమ్మరిళ్లల్లో బొమ్మల్లా వెర్రిగా, మూర్ఖంగా ఉంటారు. వీరి మనసులు వికసించి లేవు. పరిపూర్ణ జీవితానుభవాలు వీరికి లేవు. వారు చేసేదేమిటో వారికి తెలీదు. కానీ, పతనమై, వ్యాధిగ్రస్తమై, వికలమైన వీరి హృదయాల్లో అసహాయత, జాలి, మానవులు పొందే వేదన, మనుషులకుండాల్సిన ప్రేమ... ఇవి మాత్రం అంతరించలేదు" అన్నాడు రిపోర్టర్. "మరి మీరే ఒక గ్రంథంగా ఎందుకు రాయకుడదు?" అడిగాడు ప్రొఫెసర్. "ప్రయత్నించాను గానీ, లాభం లేకపోయింది" అన్నాడు రిపోర్టర్.

ఇంతలో అక్కడికి కళ్లు చెదిరే దుస్తుల్ని ధరించి జెన్నీ వచ్చింది. అంతకు ముందామె రోజా తనకోసం వచ్చే కళ్లజోళ్ల షాపు గుమాస్తాతో గడిపింది. ఆ తర్వాత మంకా పాషాలతో గడిపినా తృప్తిపడని జర్మన్ టీచర్‌తో గడిపి, ఇలా వచ్చింది. ఆ జర్మన్ టీచర్ జెన్నీకోసం గుంటకాడ నక్కలా అప్పటికే ఎదురు చూశాడు. ఆమెను చూసి అక్కడి విద్యార్థులు డంగైపోయారు. ఆమె బుగ్గ మీద గాట్లు చూసి, రిపోర్టర్ ప్లాటోనోవ్, "ఏమన్నా కష్టం కలిగిందా?" అని అడిగాడు. అదేంలేదంటూ జెన్నీ పాషా గురించి అక్కడి సానులకు అలవాటయిన అపభ్రంశపు భాషలో టమారాతో చెప్పింది. ఆ రాత్రి పాషా కోసం విటులు క్యూ కట్టి, పదిసార్లకన్నా ఎక్కువే గదిలోకి తీసుకెళ్లారు. దాంతో ఆ పిల్లకు ఫిట్సు వచ్చి పడిపోయింది. ఎమ్మా ఆ పిల్లకు మందిచ్చి ఆ పిల్ల కాస్త తేరుకోగానే, మళ్లీ ఆ పిల్లను విటుల కోసం పంపింది. ఇది సహించలేని జెన్నీ ఎమ్మాను ఎదిరించింది. ఎమ్మా జెన్నీని తిట్టి బెదిరించింది. అదీ సంగతి! రిపోర్టర్‌కి ఆ భాష తెలిసి, ఉండబట్టలేక పాషాను తీసుకొచ్చి సోఫాలో పడుకోబెట్టాడు. అవసరమైతే ఆ డబ్బు ఎమ్మా మొహాన కొడతానన్నాడు. పాషా పరిస్థితి ఘోరంగా ఉంది. పెదాలు చీలిపోయాయి. కాళ్లు మెలికలు తిరిగిపోతూ శరీరం చలవకమ్మింది.

ఇదంతా చూసిన బోరిస్‌కు ఒళ్లుమండి, "ఆ పిల్లనీ ఉంపుడుగత్తా?" అంటూ అసహ్యంగా మాట్లాడేసరికి, 'ఒళ్ళు జాగ్రత్త' అన్నట్లు ప్లాటోనోవ్ అతన్ని హెచ్చరించాడు. అక్కడి వాతావరణం తనకు వ్యతిరేకంగా ఉండడం చూసి, మొదట బోరిస్ అతని వెనుక పెట్రో వస్కీలు వెళ్లిపోయారు. అయితే వాళ్లు వెళ్లింది హాల్లోకే. వారిద్దరికీ జెన్నీని చూసినప్పట్నుంచీ పిచ్చెక్కినట్లయి, పనిమనిషి ద్వారా జెన్నీని, న్యూరాను పిలిపించుకుని గదుల్లోకి చేరారు. అంతా క్రమంగా అలాగే జారుకున్నాక, చివరికి లిఖోనిన్, రిపోర్టర్‌లు ఇద్దరే మిగిలారక్కడ...

తనకు వ్యభిచారం మీద ఆసక్తి లేదని, తాగుడు జూదం ఉంటే చాలుననీ అన్నాడు లిఖోనిన్. ఇప్పటిదాకా తనూ స్త్రీ సౌఖ్యం పొందలేదని రిపోర్టర్ అనేసరికి, లిఖోనిన్ నమ్మలేకపోయాడు. ఇదంతా తనకు హాస్యమని ఈ వేశ్యల హృదయాలు కరుడుగట్టుకుపోయాయని, ఈ యాంత్రికమైన వృత్తిలో వారికి చురుక్కుమనిపించే ప్రేమ కావాలని, అందుకే వారు విచిత్రమైన విటుల్ని, ఉదాహరణకు దొంగలు, ఖూనీకోర్లు, పచ్చి రక్తం తాగే విటులంటే పడి చస్తారని రిపోర్టర్ చెప్పాడు. వారంటే ఇష్టం లేనప్పుడు అక్కడే ఉండడం దేనికన్న లిఖోనిన్ ప్రశ్నకు, వారి జీవితాల్లోని భయంకరమైన నగ్న సత్యం తననాకర్షించిందనీ, మోసం, డంబాచారం, అబద్ధం అక్కడుండవనీ చెప్పాడు రిపోర్టర్. ఏమో వీరంతా పచ్చి అబద్ధాలకోరులు ఎవరినైనా మొదట నిన్ను చెరిచిందెవరంటే ఎన్నో కల్లబొల్లి కథలు చెబుతారన్నాడు లిఖోనిన్.

"అవును, వారి జీవిత రహస్యాలతో మీకేం పని? వాటి గురించి అడిగితే అబద్ధాలే చెబుతారు. మనతోనే వారు అబద్ధాలు చెబుతారు. వారిలో వారు అబద్ధాలు చెప్పుకోరు. మనతో చెప్పేవి కూడా, మనం అలా కోరుకో బట్టే" అన్నాడు రిపోర్టర్ "అదెలా?" అని లిఖోనిన్ అనే సరికి, రిపోర్టర్ ఇలా అన్నాడు: "వారు తమ మొహాలకు రంగు పూసుకునేది మన కోసమే. ఆ రంగులు వారి మొహాన్ని పాడు చేస్తాయి. అయినా మన కోసం ఆమె అలా చేస్తుంది. వారి దగ్గరొచ్చే వారికి ఆమె స్వచ్ఛమైన ప్రేమ కాక, కామవాంఛ తీర్చాలి. ఈ నీచులందరికీ ఒకే అందం, ఒక తళుకు, కులుకు కావాలి. అందుచేత వేశ్య తళుకులీనే రంగులద్దుకుంటుంది. ఇక రెండోది వచ్చిన విటుడికి అందంతో పాటు ప్రేమ కావాలి. ఆమె తన మాటలతో, చేష్టలతో ప్రేమ ఒలకపోస్తుంది. ఆ రసికుడికి ఇదంతా తెలిసినా, తనని తాను మోసం చేసుకుంటాడు. ఇక మూడోది ఆ విటుడికి ఆమె రహస్యాలు కావాలి. నిన్నెవరు చెరిచారు? ఇక్కడికెలా వచ్చావు? మొదటిసారి నీకెలావుంది? ఇలాంటి దుర్మార్గమైన ప్రశ్నలతో వేధిస్తాడు. అలా అడగడానికి తనకేం హక్కుంది. పాపం ఆమె అతని చెల్లి గురించో, అక్క గురించో, భార్య గురించో అడగదు కదా! తనామెకు డబ్బిస్తున్నాననే కదా అతని హజం! ఇంతకీ అతని వెనకే పోలీసులు, ప్రభుత్వం,

డాక్టర్లు, తార్పుడుగాళ్ల సంఘం అంతా అండగా ఉన్నారు". ఇదంతా చెప్పాక రిపోర్టర్ తనక్కడ ఉండడానికి కారణం చెప్పాడు. "నా జీవితమే విచిత్రమైంది. జీవితంపై ఉన్న వెర్రి ప్రేమే అనేక విషయాలపై నా మనసును ఉసిగొలిపింది. నేను చేయని పని లేదు. అవన్నీ తిండి కోసం కాదు. ప్రతి జీవినీ పరిశీలించి, వాటి బాహ్య జీవితాన్ని తెలుసుకోవాలన్న ఆరాటం! ఇప్పుడే సానివాడలోని జీవితాన్ని చూస్తున్న కొద్దీ నాలో కల్లోలం ఎక్కువైంది. కొద్ది రోజుల్లోనే ఓ స్నేహితుడి దగ్గరకెడతాను. ఒక మిల్లులో నాకతడు పని ఇప్పిస్తాడు" అన్నాడు.

"ఇవ్వాళ మీరు వేశ్యల గురించి చాలా చెప్పారు. దీనికి అంతమెప్పుడు?" లిఖోనిన్ ప్రశ్నించాడు.

"అదెప్పుడు నశిస్తుందో ఎవరూ చెప్పలేరు. సోషలిస్టు కమ్యూనిస్టులు అద్భుతమైన కలలు కంటున్నారు. వారి కలలు నిజమైనప్పుడో, లేదా ప్రజలంతా సమూహంగా ఉన్నప్పుడో, విశ్వ మానవకోటి ఏక కుటుంబంగా మనగలిగినప్పుడో అంతం కావచ్చు" అన్నాడు ప్లాటోనోవ్. "అప్పటి దాకా చేతులు ముడుచుకుని మనం కూర్చోవలసిందేనా?" అని లిఖోనిన్ అడిగేసరికి, "మనం చేయగలిగిందేమీ లేదు" అన్నాడు ప్లాటోనోవ్. "స్వంత ఆస్తులు ఉన్నంత వరకు దారిద్ర్యం కూడా ఉంటుంది. వివాహ వ్యవస్థ ఉన్నంత వరకూ వ్యభిచారం కూడా ఉంటుంది. ఈ దురన్యాయాన్ని పోషించేది పెద్ద మనుషులే. మర్యాదస్తులైన సంసారులు, కుటుంబ పెద్దలు, తండ్రులు, కొడుకులు, భర్తలు! వీరంతా దొంగచాటుగా నిలబడి ఈ వృత్తిని పోషిస్తున్నారు. వీరిలా చేయకపోతే పడుపువృత్తి వీరి పడగ్గదుల్లోకి ప్రవేశించి, ఇల్లాంతా దుర్గంధం అలుముకుంటుంది" అన్నాడు ప్లాటోనోవ్. "ఈ అవినీతినెలా అరికట్టడం?" అన్న లిఖోనిన్ ప్రశ్నకు, "ఒక మనిషి వల్ల అయ్యే పని కాదిది. ఈ బడబాగ్నిపై దోసెడు నీళ్లు పోస్తే చల్లారుతుందా?" అన్నాడు ప్లాటోనోవ్. "కానీ ఒక నిప్పుకణికైనా చల్లారవచ్చు కదా! అలాగే నేనొక పతితురాలి బతుకునైనా బాగు చేస్తాను. నన్ను నిరుత్సాహ పరచకండి!" లిఖోనిన్ ఉద్రేకంగా అనేసరికి, "అయితే నువ్వొక అమ్మాయిని తీసుకెళ్లి రక్షిస్తానంటావు. అయితే ఆ అమ్మాయి ఈ మురికి కూపంలోకి తిరిగి రావలసుంటుంది" అన్నాడు ప్లాటోనోవ్ నిర్మొహమాటంగా. మధ్యలో వచ్చిన జెన్నీ ఈ మాటలు విని "తప్పక వచ్చి తీరుతుంది" అంది దృఢంగా.

అతను గభాల్న జెన్నీ దగ్గర కెళ్లి, బతిమిలాడుతు తనతో రమ్మని, సోదరిలా చూసుకుంటానని అన్నాడు. జెన్నీ కోపంతో అతని చేతుల్ని విదిలించికొట్టింది. "మొదట సోదరి... తర్వాత ఉంపుడు గత్తె, పనిమనిషి, ఇలాంటి పిచ్చివాగుడు వాగకు" అంది చీదరింపుగా. "మీ అభిప్రాయం తప్పు" అంటూ లిఖోనిన్ పక్కనున్న ల్యూబా'ని రమ్మని ప్రాధేయపడ్డాడు. "నువ్వింకా విద్యార్థివే కదా!" అని ఆమె అంటే, "నేన్నకు సహాయం చేస్తాను. ఒక హోటల్ పెడదాం. విద్యార్థులంతా అక్కడే భోజనం చేస్తారు. ఇద్దరం హాయిగా ఉండొచ్చు" అంటూ దేవుడిపై ప్రమాణం చేసేసరికి, ల్యూబా జెన్నీ సలహా అడిగింది. అప్పటికి అతన్ని నమ్మిన జెన్నీ, ల్యూబాను వెళ్లమని చెప్పింది. కొద్ది సేపట్లోనే వాళ్లిద్దరు బండి మీద వెళ్ళిపోతూంటే జెన్నీ కన్నీరు కార్చింది. అది చూసి, తన సహాయం ఏమన్నా కావాలా అని రిపోర్టర్ అడిగితే, "అవసరమైతే ఉత్తరం రాస్తాను" అందామె. 'ఎకో' పత్రిక అడ్రసు రాయమన్నాడతను.

'గోరిజాంట్' అనేవాడు వేశ్యలను అమ్మడం, కొనడంలోను, విటుల అభిరుచులకు అనుగుణమైన వేశ్యలను సప్లై చెయ్యడంలోనూ దక్షిణ రష్యాలోనే పేరొందాడు. ఇక్కణ్ణుంచి విదేశాలకూ, విదేశాలనుండి ఇక్కడికి సానులను ఎగుమతి దిగుమతి చేస్తుంటాడు. అంత మాత్రమే కాదు. ప్రేమ పేరుతో దాదాపు 15 మంది అందమైన అమ్మాయిలకు వలవేసి, పెళ్లి చేసుకుని, సాని కొంపలకు అమ్మేశాడు. అలాంటి ఘనుడు యామాలో కాలుమోపి ట్రెప్పెల్స్‌లోని వేశ్యలను అన్నా ఇంటికి, అక్కడి వారిని తక్కువ రకం కొంపల్లోకి మార్చడంలో బ్రోకరుగా వ్యవహరించి ఒక్కో సానికి 5 నుంచి 500 రూబుల్స్ దాకా సంపాదించాడు.

యామాలో ఇలాంటి మార్పులు జరిగిన రోజుల్లో నగరంలోని ప్రసిద్ధ గాయని 'ఎల్లెనారోవిన్‌స్కాయా', ఓ రోజు మనసు బాగోక, ఏదైనా కొత్త విషయంపైకి బుద్ధిని మళ్లిద్దామనుకుని, యామా గురించి అనేక కథలు విన్నందున తన స్నేహితుల్ని వెంట బెట్టుకొని మొదట ట్రెప్పెల్స్‌లోకి ప్రవేశించింది. ఆమె వెంట ఆమె స్నేహితులు 'వాన్ టెప్లింగ్' అనే ఆమె, 'రియాసనోవ్' అనే ప్రసిద్ధ లాయరు, ఎల్లెనా ప్రేమికుడు 'ఒలోద్యా' ఉన్నారు. మొదట వారొక గదిలో కూర్చునేసరికి, 4 గురు వేశ్యలు అక్కడికి వచ్చారు. అంతా జర్మన్ యువతులు. ఎల్లెనా ఒక యువతిని పలకరిస్తూ "ఈ వృత్తిలోకి ఎందుకు ప్రవేశించావు? ఇది మంచి పని కాదే?" అని ప్రశ్నించింది. తనకొక ప్రేమికుడున్నాడని, ఇద్దరం పేదవారవడం వల్ల ఇద్దరమూ పనిచేసుకుని సంపాదించుకుంటున్నామని, 10 వేల రూబుల్స్ కాగానే పెళ్లాడి, బీరు షాపు పెట్టుకుంటామని ఆ యువతి చెప్పింది. తనకక్కడ హాయిగా ఉందనీ, డాక్టర్ విటుల్ని పరీక్షించిగానీ తమ దగ్గరకు పంపించడనీ అన్నది. ఆ మాటలు విన్న ఎలెనాకు చిరాకేసి, అక్కణ్ణుంచి తన బృందంతో సహా బయటపడి, తదుపరి అన్నా ఇంటికెళ్లింది.

కాపలా వాడైన సిమ్మన్స్ వారి దగ్గర బంగారు నాణాలు వసూలు చేసిగానీ, వారిని లోపలికి వదల లేదు. తమ దగ్గరకు ఒక్కసారిగా గుంపుగా వచ్చిన సానులను చూసి, ఒక పాట పాడమని ఎల్లెనా కోరింది. తమకొచ్చినట్టు వారు పాడారు. ఇంతలో తాగిన మైకంతో ఉన్న చిన్నమంకా నేల మీద పడుకుని పగలబడి నవ్వుతూ తమ పట్ల అసభ్యంగా మాట్లాడేసరికి, టెప్లింగ్ కోపంగా "మేమెవ్వరి మనుకున్నావ్. నేను పతితులైన స్త్రీల మఠానికి పోషకురాలిని!" అంది. ఈ మాటలకు మండిపడ్డ జెన్నీ "నీ మఠం జైలుకంటే అన్యాయం. నీ మఠంలో పెత్తనం చేసే ఆడాళ్లు కాపలా వాళ్లతో వ్యభిచరిస్తారు. మీరంతా మఠంలోని పిల్లల్ని క్రూరంగా హింసిస్తారు. మీ భర్తలు, తండ్రులు, సోదరులు మా దగ్గరకొచ్చి పొర్లాడుతూ రోగాలు తగిలించుకుని, వాటిని మీ కంటిస్తారు" అంటూ విరుచుకుపడింది. వెంటనే టమారా కల్పించుకుని, "మీ ఇళ్లల్లోని ఆడాళ్లకన్నా మేం చెడిపోయామా? ఆ వచ్చేవాడు నా దగ్గరకు పల్లీగ్గా

వస్తాడు. నేను వ్యభిచారినని అందరికీ తెలుసు. కానీ పెళ్లి చేసుకుని కాపురం చేస్తున్న మీ ఆడాళ్లలో ఎంతో మంది కామంతో పడుచుకుర్రాడితో పడుకోవడమో, లేదా డబ్బుకోసం ముసలాడితో ఉండడమో చేస్తారు. మేం మాత్రం పతివ్రతలం. అబద్దాలాడం. బహిరంగా తప్పు చేస్తాం. మీరు పచ్చి అబద్దాలు చెబుతారు. ఇప్పుడు చెప్పండి. ఎవరు ఉత్తమ స్త్రీలో?" అంది.

ఈ మాటలు వింటున్న ఎలెనాకు వారి మాటల వెనుక దాగున్న వారి హృదయాల్లోని ఆవేదన అర్థమై, ఆమె కళ్ల వెంబడి కన్నీళ్లు వర్షించాయి. తాము ఇక వెడతామని, తన కోసం వారు పాటపాడినందున, ఇప్పుడు తాను వారికోసం ఒక పాట పాడతానని చెప్పి, ఒక మంచి ప్రేమగీతం పాడి అక్కడి వేశ్యలందరినీ ఆనందంలో ఓలలాడించింది. అంతా ఆ పాటను నిశ్శేష్టులై విన్నారు. జెన్నీ మాత్రం అంత గొప్ప విద్వాంసురాలివట్ల అవమానకరంగా ప్రవర్తించినందుకు పశ్చాత్తాపపడి, ఆమె చేతిని ముద్దాడి ఆమె చెవిలో ఏదో గుసగుసలాడింది. కొద్ది నెలలపాటు మందు పుచ్చుకుంటే తగ్గిపోతుందని ఎలెనా ఓదార్చింది. వస్తూ వస్తూ లాయర్ 'రియాసనోవా' జెన్నీ దగ్గరకెళ్లి, తన అడ్రస్ కార్డు ఆమెకిచ్చి, అవసరమైతే తనకు కబురు చెయ్యమని, ఏ సాయం కావలసినా చేస్తానని అన్నాడు.

కొన్ని రోజులుగా జెన్నీ వింత ప్రవర్తన స్నేహితురాళ్లను తీవ్రంగా బాధించింది. ఆమె సన్నిహితురాలు టమారా పట్టుబట్టి జెన్నీని బతిమిలాడేసరికి, ఆమె అసలు విషయాన్ని బయటపెట్టింది. ఆమెకు 'కొరుకుసవాయి' రోగాన్ని ఎవరో తగిలించారు. ప్రొఫెసర్‌తో విద్యార్థులు వచ్చిన రోజే ఆమె ఆ విషయాన్ని గ్రహించింది. అప్పట్నుంచీ ఆమె స్నేహితురాండ్రకు దూరంగా ఉంటుంది. అయితే మగాళ్లపై ఆమె కసి మాత్రం పెరిగిపోతుంది. "వీళ్లంతా ఈ జబ్బు మూట కట్టుకపోయి తమ పెళ్లాలకు, ఉంపుడు కత్తెలకూ తగిలించి, ఈ రోగంతో కుళ్లి కుళ్లి చావనీ" అంది టమారాతో. ఆ తర్వాత సానులంతా ఒకచోట చేరి వింతగా భయంకరంగా ప్రవర్తించే విటులతో తమ అనుభవాలను ఒకరికొకరు చెప్పుకున్నారు. ఓ విటుడు రొమ్ములను గుండు సూదులతో గుచ్చి ఆనందించేవాడు. ఓ మత గురువు వేశ్యను చచ్చినట్లుగా నటింపజేసి అప్పుడు అనుభవించేవాడు. ఓ ముసలాడు పిచ్చిదానిలా నటించమనీ, అరవమని, ఏడవమని చెప్పి అప్పుడు పనికానిచ్చేవాడు. ఓ టీచరు మగాడిలా నటించమని తాను ఆడదానిలా ప్రవర్తించి తనని బలాత్కరించమనేవాడు... ఇలా అంతా తమ తమ అనుభవాలు చెప్పుకుంటూ ఆపై తమను మొదటిసారి ఎవరు చెరిచారో, ఎలా సానికొంపలకు రావలసి వచ్చిందో చెప్పుకున్నారు. ఇంతలో గుమ్మంలో 'ల్యూబా'ను చూసి, జెన్నీ "ఏం జరిగిందే పాపిష్టిదానా?" అడిగింది గద్దదికంగా. ఆ విద్యార్థి తనను వెళ్లగొట్టిన సంగతి చెప్పింది ల్యూబా. అన్నాతో మాట్లాడి ఆ వేశ్య గృహంలో తనని చేర్చుకునేట్లు చెయ్యమని జెన్నీని ప్రాధేయపడింది ల్యూబా. ఆ పిల్ల ఆ రోజంతా అన్నం తిన్నట్టులేదు. తింటానికి ఏమైనా పట్రమ్మని ఇతరులకు పురమాయించి, మంచుతో తడిసిన ఆ పిల్లను సేదదీర్చడానికి ఉపక్రమించి, జరిగింది చెప్పమని అడిగింది జెన్నీ.

ల్యూబాను తీసుకెళ్లిన విద్యార్థి లిఖోనిన్, ఆమెను సోదరిలా చూసుకుంటానని చెప్పాడు. కానీ ఆమెకదేమీ అర్థం కాలేదు. తననుద్ధరించడానికొచ్చిన మహానుభావుడతను అని అనుకొందామె. అతనిపై ఆమెకు ప్రేమ ఉప్పొంగి, అతన్ని కౌగిలించుకొని ముద్దుపెట్టుకొనే సరికి, అతడు కామానికి లొంగిపోయాడు. ఇద్దరు మిత్రులతో కలిసి ఆమెను భోజనానికి హోటల్‌కి తీసుకెళ్లాడు. తను అందరికీ తెలిసినందువల్ల అలా బహిరంగంగా రావడానికి మొదట సంకోచించిందామె. ఆ పిల్లకు పట్టిన దుర్గతి గురించి ఆమె ముందే వారు చర్చిస్తుంటే మిన్నకుండిపోయింది. భోజనశాల పెడితే విద్యార్థులకు సౌకర్యంగా ఉంటుందని లిఖోనిన్ అంటే, ఒకడు మర్నాడే దివాళా తీస్తుందన్నాడు. పనిపిల్లగా కుదిరిస్తే మంచిదని ఒకరంటే, దాంతో ఆమె మళ్లీ సానికొంపకే చేరుతుందని ఇంకోరన్నారు. చివరికామెకు చదువు నేర్పి విజ్ఞానవంతురాల్ని చెయ్యాలని అంతా నిర్ణయించారు. ఆమెకోసం ఒక అద్దె ఇల్లు మాట్లాడి, ఇంట్లోకి కావలసిన సరంజామా కొన్నాడు. అతనికోసం ల్యూబా తన శరీరం, ఆత్మ, హృదయం అన్నీ అప్పగించింది. అక్కడికి అతని స్నేహితులు వచ్చేవారు. అంతా ఆమె చదువు విషయంలో శ్రద్ధ తీసుకున్నారు. వారితో ఆమె చనువుగా ఉండడం చూసి సహించలేకపోయాడు. కొద్దిరోజుల్లోనే పేకాడి సంపాదించిన డబ్బు అయిపోయేసరికి, చివరికి ఆమెనెలా వదిలించుకుందామా అని అనుకున్నాడు. అతని స్నేహితులు ఆమెకు చదువు చెప్పే నెపం మీద సరసాలు సాగిస్తే, వారిని రానివ్వ వద్దని ఆమె అతనికి మొరపెట్టుకొంది. చివరికి ఆమెతో కలిసి జీవించడం విసుగనిపించి, తను మూర్ఖపు పనిచేశానని, తన అభివృద్ధికి ఆమె ఆటంకమని గ్రహించి సమయం కోసం ఎదురుచూశాడు. ఒకరోజు సిమనోవస్కీ అనే స్నేహితుడు అతను లేని సమయంలో వచ్చి ఆమెను బలవంతం చెయ్యబోతే ఆమె అతణ్ణి విదిలించుకుంది. అదే సమయంలో లిఖోనిన్ వచ్చి వారిద్దర్నీ సుఖంగా ఉండమని చెప్పి ఓ యాభై రూబుళ్లు అక్కడ పడేసి వెళ్లిపోయాడు. అతడు వెళ్లిపోయాక సిమనోవస్కీ తిరిగి బలవంతం చెయ్యబోతే ఆమె ప్రతిఘటించి కేకలు పెట్టేసరికి, యజమాని నిర్దాక్షిణ్యంగా ఆమెను బయటకు గెంటేశాడు. ఆమె పిచ్చిదానిలా వీధులు పట్టుకు తిరిగి ఓ చౌకబారు హోటల్లో గది అద్దెకు తీసుకుంది. ఏదన్నా పని చేద్దామన్నా కుదరలేదు. ఆమె దీన స్థితిని ఆసరాగా చేసుకుని ఎందరో ఆమెను మోసం చేశారు. ఏ దారీ లేక చివరికి మళ్లీ యామాకు చేరింది. ఇదీ కథ! ఎమ్మా ఆమెను చేర్చుకోవడానికి నిరాకరించి, కొట్టి బయటకు గెంటింది. జెన్నీకి కోపం వచ్చి ఎమ్మాను ఎదిరించింది. సానిపిల్లలంతా జుట్టు పట్టుకుని దెబ్బలాడారు చివరికి సిమన్ కొందరు ఇతర రౌడీల సహాయంతో అంతా సర్దుబాటు చేశాడు. జెన్నీని తీవ్రంగా శిక్షించారు. విటులు వచ్చే వేళకు ఆ దెబ్బలు కనిపించకుండా మేకప్ చేసుకుందామే.

ఆ రోజు జెన్నీ కోసం 'కోల్యా' అనే యువకుడు తన స్నేహితుడితో సహా సంబరం జరుపుకోవడానికి వచ్చాడు. సంపన్న వర్గాలకు చెందిన అతడు తన కుటుంబ సభ్యుల అక్రమ సంబంధాలు చూసి చిన్నప్పుడే సానికొంపలకు అలవాటు పడ్డాడు.

మగాళ్ల పట్ల ఎంతో కక్షతో ఉన్న జెన్నీ, ఎంతో ఉజ్వల భవిష్యత్తు గల అతనిపై తన కసిని చూపించలేక పోయింది. తొలిసారిగా మగాడిపై జాలి కలిగి తన రోగం సంగతి అతనికి చెప్పింది. ఆ జబ్బు వచ్చిన మనిషి బతికినంత కాలం పీక్కుని పీక్కుని మురికి చావు చస్తాడు. ఆ సంగతులు విన్న 'కోల్యా' భయంతో వణికిపోయి, జెన్నీకి క్షమాపణ చెప్పి వెళ్లిపోయాడు.

రిపోర్టర్‌గా పనిచేసే ప్లాటోనోవ్ ఇప్పుడా పని మానేసి, ఓడరేవులో ముఠా కార్మికునిగా పనిచేస్తున్నాడు. అతన్ని కలుసుకునేందుకు జెన్నీ వచ్చి, తన జబ్బు గురించి చెప్పింది. విద్యార్థులతో కలిసి అతనొచ్చిన రోజే తాను ఆ జబ్బు వచ్చినట్లు తెలుసుకున్నానన్నది. ఆ జబ్బుతో వారిలో ఇద్దరు విద్యార్థులు చనిపోయిన విషయం చెప్పాడు ప్లాటోనోవ్. వారిలో మొదటివాడు బోరిస్. తలపొగరు జాస్తిగలవాడవడం వల్ల, వాడు చనిపోయినందుకు విచారం లేదనీ, అయితే ఆ రెండో వాడు 'రాంసెస్' అనే వాడి గురించే తన విచారమనీ, తనకా రోగం వచ్చిందని తెలుసుకుని, కాల్చుకుని చనిపోతూ రాంసెస్ ఓ చీటీ రాసిపెట్టాడనీ, ఆ చీటిలో క్షణిక సుఖానికి బానిసై, ప్రేమ అనేది లేకుండా ఒక స్త్రీ శరీరాన్ని కొనుక్కున్నందుకు ఈ శిక్ష తను అనుభవించాల్సిందేనని, సౌందర్యం, సన్మార్గం, సచ్ఛీలత, బుద్ధికుశలత ఇవే జీవితానికి సుఖాన్నిస్తాయని, ఈ వ్యాధి వచ్చినందుకు తను ఒక మనిషి కాక, శవాన్నని అందులో రాసి పెట్టాడనీ చెబుతూ రిపోర్టర్ చాలా బాధ పడ్డాడు. ఈ విషయం విన్న జెన్నీ మాత్రం అందుకు తనకేమీ విచారం లేదన్నది. "నీవు పొరబడుతున్నావు. అతనో అసాధారణ మేధావి" అని ప్లాటోనోవ్ అంటే, తనకెవరైనా ఒకటేనందామె. "నా వైపు చూడండి. నేను పది మంది ఉమ్మేయడానికి పెట్టిన పాత్రను, మురుగుదొడ్డిని. వందల కొద్దీ మగాళ్లు నన్ను నిలిపి, తొక్కేసి, నా రక్తాన్నీ పీల్చిపోయారు. నిజంగా నా చేతుల్లో అధికారం ఉంటే వీరందర్నీ చిత్రవధ చేసేదాన్ని" అంది. "నీకు చాలా గర్వం ఉంది. నువ్వు అతి కఠినురాలివి" నిందించాడు ప్లాటోనోవ్. "ఇప్పుడే ఇలా అయ్యాను" అంటూ, "నన్ను పదేళ్ళపుడే నా తల్లి నన్ను లోకానికి అమ్మింది. అప్పట్నుంచీ ఒక్కరూ నన్ను మనిషిగా చూడలేదు. వారందరి దృష్టిలో నేను అనాథకంటే, బిచ్చగత్తెకంటే, హంతకి కంటే హీనమైనదాన్ని. నేనో పబ్లిక్ భోగందాన్ని. 'పబ్లిక్' అనే భయంకరమైన మాట మీకు తెలీదు. దానర్థం నేనందరికీ చెందినదాన్నని. ఏ ఒక్కరి సొత్తూ కాదు. ఒక తల్లికి గాని, ఒక తండ్రికి గాని, ఈ దేశానికిగానీ చెందిన దాన్ని కాదు. ఈ విశాల విశ్వంలో అందరికీ నా మీద హక్కుంది. నేనొక మనిషిని కాదు. ఓ మొద్దును. తుక్కుగడ్డిని. నాలాంటి వారు వేలాది మంది... లక్షలాది మంది! ఎంత ఘోరమో ఆలోచించండి" అన్నదామె. ల్యూబా సంగతి ఏమైందీ చెప్పింది. అంతా విన్న అతడు, "నువ్వు చెప్పింది నిజం" అన్నాడు. "మీ ఒక్కరి పట్లనే విశ్వాసం ఉంది. ఎంత గొప్పవారైనా, మీ దగ్గర నాకు చనువుంది. అంచేత వచ్చానందామె. ఏ సాయం కావాలో చెప్పమన్నాడతను. "రోగం తగిలిందని తెలియగానే కోపంతో నాకు పిచ్చెక్కిపోయింది. నా బాధకు నష్టపరిహారం రాదా? నిజమైన ప్రేమ, సంసార సుఖం అనుభవించే యోగ్యత నాకు లేదా? ఈ భయంకర రోగాన్ని కృతజ్ఞతతో స్వీకరించాల్సిందేనా? అంచేత నా వ్యాధిని అందరికీ పంచి నా కసి తీర్చుకుంటున్నాను" అన్నదామె. ఆమె చేసింది న్యాయమేనని అనుకున్నాడతను. "అయితే నిన్న ఒక కుర్రాడి మీద జాలి కలిగింది. ఆలోచిస్తే ఈ ప్రపంచాన్ని నాశనం చెయ్యాలనుకోవడం మూర్ఖతగా భావించాను. ఇప్పుడు నాకో మార్గం చూపండి" అన్నది తిరిగీ. "నాకు తెలీదు" అన్నాడతను. చనిపోవడమే మార్గమంటే, ఒద్దన్నాడు. రోగం త్వరలో నయం కావచ్చుననీ, ఆమె అమిత సౌందర్యవతి గనుక దూరంగా వెళ్లిపోయి జనాలపై పెత్తనం చేసి, హింసించమని సలహా ఇచ్చాడు. అది తనకిష్టం లేదంటూ అక్కణ్నుంచి ఆమె వెళ్లిపోయింది.

శనివారం ఆ రోజు డాక్టరొచ్చి వేశ్యలందర్నీ పరీక్ష చేసి, రోగం తగిలిన వారిని హాస్పిటల్‌కు పంపిస్తాడు. వేశ్యలంతా ఆందోళనతో పరీక్ష చేయించుకున్నారు. న్యూరాకు గనేరియా తగిలింది. జెన్నీ మాత్రం పరీక్ష చేయించుకోవడం కోసం అక్కడికి రాకపోయేసరికి, అంతా ఆమె కోసం వెదికారు. స్నానాల గదిలో ఉరేసుకున్నది జెన్నీ. వారు చూసే సరికే చనిపోయింది. అనాథ ప్రేతంలా ఆమెను తీసుకుపోయారు మునిసిపాలిటీవారు. టమారా యజమానురాలిపై తిరగబడి, మిగిలిన వేశ్యలందరినీ ఒప్పించి జెన్నీకి మత విధులతో అంత్యక్రియలు ఘనంగా జరిపించింది. ఇందుకు 'ఎల్లెనా' సాయంతో పాటు, లాయర్ 'రియాసనోవ్' సాయాన్నీ తీసుకుంది. తాను దాచుకున్న డబ్బంతా అందుకోసం ఖర్చు పెట్టింది.

ఇది జరిగింతర్వాత అన్నా ఇంట్లో ఎన్నో సంఘటనలు జరిగాయి. పాషాను పిచ్చాసుపత్రికి పంపితే, అక్కడే ఆమె చనిపోయింది. టమారా ఆ ఇంటి నుండి పారిపోయి, తన ప్రియుడు శంకాతో కలిసి ఒక ధనికుడైన లాయర్ ఇంట్లో దొంగతనం చేసి, ఆ తర్వాత దొరికిపోయి జైలు పాలయింది. అన్నా అంతకుముందే ఆ ఇంటిని 'ఎమ్మా'కు మంచి లాభానికి అమ్మేసింది. అమ్మిన కొద్దిరోజుల్లోనే అన్నా గుండె ఆగి సుఖ మరణం పొందింది. ఎమ్మాతో పాటు, పోలీస్ అధికారి కెర్బిష్ కూడా యాజమాన్యంలో భాగస్వామి అయ్యాడు, ఒక్క రూబులు కూడా పెట్టుబడి పెట్టకుండా.

ఇదీ నవలాసారాంశం. తెలుగులోకి అలెక్సాండ్ర్ కుప్రీన్ కథలు కొన్ని అనువదింపబడ్డాయని మొదటే చెప్పుకున్నారు. ఆ కథా సంపుటి పేరు "రాళ్లవంకీ" అందులోని రాళ్లవంకీ కథనే కొందరు "కెంపులకంఠం" అనే పేరుతో అనువదించారు. ఇక 'యామా' నవల 'యమకూపం' పేరుతో అనువదించబడడం తెలిసిందే. మిగిలిన ఆయన రచనలు, కనీసం 'ద్వంద్వ యుద్ధం' లాంటి ప్రసిద్ధ కథలైనా తెలుగులోకి రావలిసిన అవసరం ఉంది. అలాగే ఇప్పటికే ప్రచురించబడి, నేడు అందుబాటులో లేని పై రెండు రచనలకు కూడా పునర్ముద్రణ జరుగుతుందని ఆశిద్దాం!

(ముగిసింది)



# -: స్వీకారం :-

ప్రజా తెలంగాణ - విరసం వ్యాసాలు
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 60/-
పేజీలు : 160

తెలంగాణ విరసం కవిత్వం
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 30/-
పేజీలు : 108

అసమ్మతి తయారీ ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ఉద్యమాలను పోషిస్తున్న కార్పోరేట్ ఉన్నత వర్గాలు
మైఖేల్ చోసుదోవస్కీ
అనువాదం : ప్రొ॥ ఎస్. శేషయ్య
ప్రచురణ : చార్వాక ప్రచురణలు
వెల : రు. 5/-
పేజీలు : 19

జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు - మావోయిస్టు దృక్పథం
ప్రచురణ : దిక్సూచి ప్రచురణలు
వెల : రు. 50/-
పేజీలు : 177

సృష్టికర్తలు - కథలు
రచయిత : అల్లం రాజయ్య
ప్రచురణ : పర్‌స్పెక్టివ్స్
వెల : రు. 150/-
పేజీలు : 368

చైతన్య కెరటాలు
రచయిత : వి. జయరాములు
ప్రచురణ : సంజీత
వెల : రు. 150/-
పేజీలు : 261

మాకు కలలున్నాయి
రచయిత : ఎం. రాఘవాచారి
ప్రచురణ : పాలమూరు అధ్యయన వేదిక
వెల : రు. 60/-
పేజీలు : 164

తెలంగాణ ఉద్యమాలు - పాట సాహిత్య వ్యాసాలు
రచయిత : డా. సి. కాశీం
ప్రచురణ : సహచర
వెల : రు. 30/-
పేజీలు : 67

జంగ్
రచయిత : దానక్క ఉదయ్‌భాను
ప్రచురణ : తెలంగాణ విద్యార్థి వేదిక
వెల : రు. 40/-
పేజీలు : 41

కామ్రేడ్ ఆజాద్‌పై సిపిఐ (మావోయిస్టు) విడుదల చేసిన లేఖ
ప్రచురణ : సిపిఐ (మావోయిస్టు)
వెల : లేదు
పేజీలు : 24

క్షుద్ర రాజకీయాలే అర్జున్ చావుకు కారణం
ప్రచురణ : దిక్సూచి
వెల : లేదు
పేజీలు : 24

స్మృతి శకలాలు
రచయిత : ఆలూరి భుజంగరావు
ప్రచురణ : చైతన్య వేదిక
వెల : రు. 30/-
పేజీలు : 140

ఉత్తరాంధ్ర ప్రజా సమస్యలు - పోరాటాలు - 2 - ఏడు వ్యాసాలు
ప్రచురణ : వంశధార
వెల : రు. 10/-
పేజీలు : 47

చిలకలు వాలిన చెట్టు కథలు
రచయిత : జి. వెంకట కృష్ణ
ప్రచురణ : స్ఫూర్తి
వెల : రు. 50/-
పేజీలు : 171

సేద్యం
రచయిత : ఇక్బాల్ కవిత్వం
ప్రచురణ : పాలమూరు అధ్యయన వేదిక
వెల : రు. 100/-
పేజీలు : 190



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M155 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| సంస్థితి | good |